శ్రీరామాయనమః.

ఆంధ్రతాత్పర్య విశేషవివరణ యుతంబయిన

# ముహూర్తరత్నావళి





బ్రహ్మశ్రీ సిద్ధాంతి - శివశంకరశాస్త్రిలవారి పుత్రుఁడైన

శ్రీ - సుబ్రహ్మణ్యశర్మచే సంగ్రహింపంబడినది.

ఇది

మొదటికూర్పు

బ్రహ్మశ్రీ యం. జి. సుబ్రాయ శాస్త్రులచే

మదరాస్,

"ఎంప్రెస్ ఆఫ్ ఇండియా" ముద్రాక్షరశాలలో

ముద్రించి ప్రకటింపంబడియె.

1911.





# పీఠిక

ప్రాజ్ఞులకు • సవినయవిజ్ఞాపనము. వంశానుక్రమమున వచ్చిన జ్యోతిశ్శాస్త్రంబును నాకు ననుగ్రహించుచు వచ్చిన మత్తాతపాదులవారు నాకు ముహూర్తగ్రంథములను పాఠము చెప్పుటలో, "సర్వజనసులభంబుగను ఋషివచనసంమతితోఁడు నుండునట్లును గ్రంథమొకటి యుండిన బాగుగానుండును." అని చేసినమనవికి సంమతించి; నాకు వచనజాతంబు నేర్పరచియిచ్చి పాఠముఁ జెప్పిరి. నేనుచదివిగ్రహించిన అర్థవిచారంబును వ్రాయుచువచ్చితిని, అదియే లోకోపకారకంబగు ఈ "ముహూర్తరత్నావళి" యనుగ్రంథముగా నేర్పడినది. ఇట్టి పాఠప్రవచనలో పడినందుననే ఈ గ్రంథము ౮-౯ సంవత్సరములనాఁడే వెలువడక యింతయాలస్యముగా ప్రకటింపఁబడియె. దీని సర్వస్వాతంత్ర్యమునువహించి, చక్కని యక్షరంబులతో మంచికాగదంబులలో ముద్రించి ప్రకటించి, మౌహూర్తికజనులకు

మిక్కిలి ప్రయోజనమును కలుగించిన బ్రహ్మశ్రీ॥ యం. జి. సుబ్రాయశాస్త్రులవారు ప్రశంసనీయులై యున్నారు. పితృభక్తి గల్గి పెద్దలు చెప్పెడు సద్విషయంబులను సంగ్రహించుట శ్రేయస్కరంబని యీ గ్రంథమును లిఖించుటచే లోకులకుఁ దెలుపుచు; నాకు "కోగురురధిగతతత్త్వశ్శిష్య హితాయోద్యతస్సతతం" అను ప్రశ్నోత్తరరత్నమాలికా సదుక్త్యనుసారము, నన్ను సదుపదేశంబులనిచ్చుచు సంరక్షించుచుండెడు తీర్థరూపులవారి చరణారవిందంబులకు వందించి, కింకరుండై యుండు వాఁడను. మహాత్ములు బాలకుని ప్రామాదిక దోషంబులను దయచే మన్నింతురుగాక.

విరోధికృద్వత్సర
శ్రీశంకర జయంతీ



ఇట్లు,
సుజనవిధేయుఁడై విన్నవించుచుండెడు
సిద్ధాంతి. సుబ్రహ్మణ్యశర్మ.

# ముహూర్త రత్నావళియొక్క

## విషయ సూచిక.

(దీనిలో ౪౮౦ విషయంబులు నిరూపింపబడియున్నది.)


| సంఖ్య | విషయములు. | పుట | సంఖ్య | విషయములు. | పుట |
|---|---|---|---|---|---|
| ౧ | మంగళాదికము. | ౧ | ౧౦ | దగ్ధయోగము | ౬ |
| ౨ | గ్రంథ ప్రయోజనము. | ౨ | ౧౧ | విషయోగము | ౭ |
| | (౧. శుభాశుభ ప్రకరణము.) | | ౧౨ | హుతాశనయోగము | ... |
| | | | ౧౩ | యమఘంటకయోగము | ... |
| | | | ౧౪ | మాసశూన్యతిథులు | ౮ |
| ౩ | తిథ్యర్ధపతులు | ౨ | ౧౫ | తిథినక్షత్ర యోగవిశేషము | ౯ |
| ౪ | తిథిసంజ్ఞా ఫలములు | ౩ | ౧౬ | చైత్రాదుల శూన్యతారలు | ... |
| ౫ | నందాదియోగ ఫలములు | ... | ౧౭ | చైత్రాదుల శూన్యరాసులు | ౧౦ |
| ౬ | వారనిషిద్ధతిథులు | ౪ | ౧౮ | తిథిగతదగ్ధలగ్నంబులు | ౧౧ |
| ౭ | వారనిషిద్ధనక్షత్రములు | ... | ౧౯ | ఆనందాది యోగంబులు | ౧౨ |
| ౮ | క్రకచాది యోగములు | ౫ | ౨౦ | హాలాహల యోగఫలము | ౧౩ |
| ౯ | కృత్యావిశేష నిషిద్ధతిథులు | ... | | | |

| సం | విషయములు. | పు |
|---|---|---|
| ౨౧ | దుర్యోగహర రవియోగము | ౧౪ |
| ౨౨ | పైయోగంబులకు దేశవ్యవస్థ | ౧౪ |
| ౨౩ | శుభకర్మ వర్జ్యావస్తువులు. | ... |
| ౨౪ | కులికాదిదుర్ము...ర్తములు. | ౧౯ |
| ౨౫ | హోలాష్టకనిషేధము | ౨౦ |
| ౨౬ | భద్రాపవాదము | ౨౧ |
| ౨౭ | మలమాసత్యాజ్యములు | ౨౨ |
| ౨౮ | గురుశుక్రాస్తాదిదోషము | ౨౩ |
| ౨౯ | సింహమకర గుర్వపవాదము | ౨౪ |
| ౩౦ | గురుశుక్ర సమసప్తకదోషము | ... |
| ౩౧ | వారప్రవృత్తి ఫలము | ... |
| ౩౨ | ప్రశ్నకాలిక హోరాఫలము | ౨౫ |
| ౩౩ | ఇష్టైననక్షత్రంబులలోను. | ౨౬ |
| ౩౪ | శుభకర్మవర్జ్యదినములు | ... |
| ౩౫ | యుగాదులు. | ౨౭ |
| ౩౬ | మన్వాదులు | ... |

| సం | విషయములు. | పు |
|---|---|---|
| | (౨ నక్షత్ర ప్రకరణము.) | |
| ౩౭ | నక్షత్రేశ కృత్యములు | ౨౮ |
| ౩౮ | ధ్రువనక్షత్ర కృత్యములు | ౩౬ |
| ౩౯ | చరనక్షత్ర కృత్యములు | ... |
| ౪౦ | ఉగ్రనక్షత్రకృత్యములు | ౩౭ |
| ౪౧ | మిశ్రనక్షత్ర కృత్యములు | ౩౮ |
| ౪౨ | లఘునక్షత్ర కృత్యములు | ... |
| ౪౩ | మృదునక్షత్ర కృత్యములు | ౩౯ |
| ౪౪ | తీక్ష్ణ నక్షత్ర కృత్యములు | ౪౦ |
| ౪౫ | అధోముఖర్క్ష కృత్యములు | ... |
| ౪౬ | ఊర్ధ్వ ముఖర్క్ష కృత్యములు | ౪౧ |
| ౪౭ | తిర్యఙ్ముఖర్క్ష కృత్యములు | ... |
| ౪౮ | నవ వస్త్ర ధారణకు | ౪౨ |
| ౪౯ | ప్రవాళ వలయాది ధారణకు | ౪౩ |
| ౫౦ | రత్నాభరణ ధారణకు | ... |
| ౫౧ | స్త్రీలకు వీట్లలో విశేషము | ౪౪ |
| ౫౨ | స్త్రీశతభిషక్ స్నాననిషేధము | ... |

ముహూర్త రత్నావళియొక్క విషయసూచిక.


| సం | విషయములు | పు | సం | విషయములు. | పు |
|---|---|---|---|---|---|
| ౫౩ | అకస్మిక దగ్ధ వస్త్రఫలము | ౪౫ | ౭౦ | ఖడ్గాది ధారణకు | ౫౫ |
| ౫౪ | నింద్యకాలనవ వస్త్రధారణము | ౪౬ | ౭౧ | శయ్యాది గ్రహణమునకు | ... |
| ౫౫ | వృక్షలతాద్యారోపణకు | ౪౭ | ౭౨ | అంధకాది నక్షత్రంబులు | ౫౬ |
| ౫౬ | గోక్రయ విక్రయమునకు | ... | ౭౩ | అంధాది నక్షత్రంబులు | ... |
| ౫౭ | భైషజ్య ముహూర్తము | ... | ౭౪ | ధనప్రయోగ నిషిద్ధ తారలు | ౫౭ |
| ౫౮ | ఆయుష్కర యోగంబులు | ౪౮ | ౭౫ | జలాశయారంభమునకు, | ... |
| ౫౯ | వైద్యమున జన్మర్క్షనిషేధము | ... | ౭౬ | సంగీత నృత్తాదులకు | ౫౮ |
| ౬౦ | సూచీకర్మ ముహూర్తము | ... | ౭౭ | సేవకాదానముహూర్తము | ౫౯ |
| ౬౧ | క్రయ విక్రయ మునకు | ౪౯ | ౭౮ | ఋణదానాదానమునకు | ౬౦ |
| ౬౨ | అశ్వ విషయ ముహూర్తము | ౫౦ | ౭౯ | దున్నుటకు ముహూర్తము | ౬౧ |
| ౬౩ | హస్తి కార్యమునకు | ౫౧ | ౮౦ | బీజావాపమునకు | ౬౨ |
| ౬౪ | సొమ్ములుచేయించుటకు | ౫౨ | ౮౧ | బీజావాప ఫణిచక్రము | ... |
| ౬౫ | రత్నాభరణంబులకు | ౫౨ | ౮౨ | బీజావాప లగ్నశుద్ధి | ౬౩ |
| ౬౬ | ముక్తావజ్రాది భూషణాంబులకు | ౫౩ | ౮౩ | హలచక్రము | ... |
| ౬౭ | వెండి బంగారు పాత్రలకు | ... | ౮౪ | వస్తి విరేచనాదులకు | ౬౪ |
| ౬౮ | ముద్రాపాతనమునకు | ... | ౮౫ | శాంతికపౌష్టిక కర్మలకు | ౬౪ |
| ౬౯ | నూతన వస్త్రక్షాళనకు | ౫౪ | ౮౬ | ధాన్యచ్ఛేద మునకు | ... |

| సం | విషయములు. | పు | సం | విషయములు. | పు |
|---|---|---|---|---|---|
| ౮౭ | ధాన్యమర్దన మునకు | ౬౫ | ౧౦౪ | సామాన్య లగ్నశుద్ధి | ౭౬ |
| ౮౮ | సస్య రోపణ మునకు | ... | ౧౦౫ | జ్వరోత్పత్తి నక్షత్రఫలము | ౭౭ |
| ౮౯ | ధాన్యస్థాపన మునకు | ... | ౧౦౬ | రోగిమాన యోగములు | ౭౮ |
| ౯౦ | ధాన్య వృద్ధికి | ౬౭ | ౧౦౭ | ప్రేతదాహ ముహూర్తము | ౭౯ |
| ౯౧ | శాంతిక పౌష్టికాదికమునకు | ... | ౧౦౮ | త్రిపుష్కర యోగంబులు | ౮౦ |
| ౯౨ | హోమాహుతి శుద్ధికి | ౬౮ | ౧౦౯ | శవదాహ నిషిద్ధ కాలములు | ౮౧ |
| ౯౩ | తన్ముహూర్త దోషశాంతి | ౭౦ | ౧౧౦ | అభుక్తమూల స్వరూపము | ౮౨ |
| ౯౪ | హోమకాల విశేషము | ... | ౧౧౧ | మూలాశ్లేషజనన ఫలం | ౮౩ |
| ౯౫ | వార్షికనవాన్న భక్షణము | ౭౧ | ౧౧౨ | జ్యేష్ఠా జనన ఫలము | ౮౪ |
| ౯౬ | నౌకాఘటనమునకు | ౭౨ | ౧౧౩ | విశేష సూచన | ... |
| ౯౭ | నౌకాచలన మునకు | ... | ౧౧౪ | జలాశయారామ దేవప్రతిష్ఠకు | ౮౫ |
| ౯౮ | నౌకా యాత్రకు | ౭౩ | ౧౧౫ | ప్రతిష్ఠావిశేషము | ౮౬ |
| ౯౯ | అభిచారిక మునకు | ... | ౧౧౬ | వైనాశక నక్షత్రంబులు | ౮౭ |
| ౧౦౦ | ఆరోగ్య స్నానమునకు | ... | ౧౧౭ | దక్షిణాయన దేవ ప్రతిష్ఠ | ౮౮ |
| ౧౦౧ | శిల్ప విద్యాముహూర్తము | ౭౪ | ౧౧౮ | ప్రతిష్ఠావార ఫలములు | ... |
| ౧౦౨ | సంధాన ముహూర్తము | ౭౫ | ౧౧౯ | ప్రతిష్ఠా లగ్నశుద్ధి | ౮౯ |
| ౧౦౩ | పరీక్షాముహూర్తము | ... | ౧౨౦ | దేవోచితలగ్న నక్షత్రములు | ౯౧ |

# ముహూర్త రత్నావళియొక్క విషయసూచిక.


| సం | విషయములు. | పు |
|---|---|---|
| | (౩ సంక్రాంతి ప్రకరణం) | |
| ౧౨౧ | సంక్రాంతి నామఫలంబులు | ౯౨ |
| ౧౨౨ | సంక్రమణ కాలఫలంబులు | ౯౩ |
| ౧౨౩ | జన్మర్క్ష సంక్రాంతిఫలము | ౯౪ |
| ౧౨౪ | చంద్రాది సంక్రమణంబులు | ... |
| ౧౨౫ | సంక్రాంతి శుభాశుభంబులు | ౯౬ |
| ౧౨౬ | సంక్రమణ బలానుగుణ ఫలము | ౯౭ |
| ౧౨౭ | తారాబలముపై చంద్ర శుభము | ౯౮ |
| ౧౨౮ | చంద్రునితోచేరినగ్రహఫలములు | ౯౯ |
| ౧౨౯ | మలమాసవర్జ్యావర్జ్య విచారము | ౧౦౦ |
| | (౪ గోచర ప్రకరణము) | |
| ౧౩౦ | రవిగోచర విచారము | ౧౦౨ |
| ౧౩౧ | చంద్రగోచర విచారము | ౧౦౩ |
| ౧౩౨ | కుజగోచర విచారము | ... |
| ౧౩౩ | బుధగోచర విచారము | ౧౦౪ |
| ౧౩౪ | గురుగోచర విచారము | ... |
| ౧౩౫ | శుక్రగోచర విచారము | ౧౦౫ |

| సం | విషయములు. | పు |
|---|---|---|
| ౧౩౬ | వేధావిచార ప్రయోజనము | ... |
| ౧౩౭ | రవి భావసంచార ఫలము | ౧౦౬ |
| ౧౩౮ | చంద్ర భావసంచార ఫలము. | ౧౦౭ |
| ౧౩౯ | కుజ ౧౨ భావచార ఫలము | ౧౦౮ |
| ౧౪౦ | బుధ ౧౨ భావచార ఫలము | ౧౦౯ |
| ౧౪౧ | గురు ౧౨ భావచార ఫలము | ... |
| ౧౪౨ | శుక్ర ౧౨ భావచార ఫలము | ౧౧౦ |
| ౧౪౩ | శని ౧౨ భావచార ఫలము | ౧౧౧ |
| ౧౪౪ | రాహు ౧౨ భావచార ఫలము | ౧౧౨ |
| ౧౪౫ | గ్రహఫలపరిపాకము. | ... |
| ౧౪౬ | గోచరబలములేనిచో వర్జ్యము | ౧౧౩ |
| ౧౪౭ | అపుడు శాంతిముఖ్యము | ... |
| ౧౪౮ | శాంత్యనావశ్యక సూచనలు | ౧౧౪ |
| ౧౪౯ | రాహు గోచరవిశేషము | ... |
| ౧౫౦ | చంద్రబలమున విశేషము. | ౧౧౭ |
| ౧౫౧ | పక్షానుసారచంద్ర ఫలము | ... |
| ౧౫౨ | పీడానివారక రత్నధారణము. | ౧౧౮ |

| సం | విషయములు. | పు | సం | విషయములు. | పు |
|---|---|---|---|---|---|
| ౧౫౩ | చంద్ర తారాబల విచారము. | ... | ౧౬౯ | ప్రథమర్తుశుభ ఫలాపవాదము | ౧౩౧ |
| ౧౫౪ | ఉత్తమాధమ తారలు | ౧౧౯ | ౧౭౦ | ప్రథమర్తు కాలఫలము | ... |
| ౧౫౫ | చంద్రతారాబల తారతమ్యము | ... | ౧౭౧ | ప్రథమర్తు నక్షత్రఫలము | ౧౩౨ |
| ౫౧౬ | దుష్టతారకు శాంతి | ౧౨౦ | ౧౭౨ | ప్రథమర్తు వస్త్రఫలము | ౧౩౩ |
| ౧౫౭ | తారాంశాది విచారము | ... | ౧౭౩ | ఆర్తవబిందు ఫలము | ... |
| ౧౫౮ | చంద్రుని ద్వాదశావస్థలు | ౧౨౧ | ౧౭౪ | ప్రథమర్తు సమయఫలము | ౧౩౪ |
| ౧౫౯ | దుర్దోష పరిహారక శాంతి | ౧౨౨ | ౧౭౫ | నింద్యరజోదర్శనము | ... |
| ౧౬౦ | ఫలకారి గ్రహకాలము | ... | ౧౭౬ | ఆర్తవస్థల విశేష ఫలము | ౧౩౫ |
| ౧౬౧ | పంచాంగదోష శాంతి | ౧౨౪ | ౧౭౭ | ఆర్తవస్థల విశేషఫలము | ౧౩౫ |
| ౧౬౨ | గోచరఫల పరిపాకము | ౧౨౫ | ౧౭౮ | రజోదర్శనా స్పృశ్యత్వము | ... |
| | (౫ సంస్కార ప్రకరణం) | | ౧౭౯ | తత్కారణ నిరూపణము | ౧౩౬ |
| ౧౬౩ | సంస్కార విచారము | ౧౨౬ | ౧౮౦ | రజోవతికి కర్మాధికారము | ... |
| ౧౬౪ | సంతాన మహిమ | ౧౨౭ | ౧౮౧ | స్త్రీలకు ఋతుకాలావధి | ... |
| ౧౬౫ | గర్భాధాన కాలనిషేధము | ౧౨౮ | ౧౮౨ | ప్రథమార్తవ స్నానమునకు | ౧౩౭ |
| ౧౬౬ | ప్రథమార్తవ పక్షఫలము | ౧౨౯ | ౧౮౩ | దుష్టరజోదర్శనశాంతి | ... |
| ౧౬౭ | ప్రథమర్తు వారఫలము | ౧౩౦ | ౧౮౪ | గర్భాదాననిషేధకాలము | ౧౩౮ |
| ౧౬౮ | ప్రథమర్తు లగ్నఫలము | ... | ౧౮౫ | గర్భాధాన లగ్నవిచారము | ౧౩౯ |

| సం | విషయములు. | పు | సం | విషయములు. | పు |
|---|---|---|---|---|---|
| ౧౮౬ | మధ్యమన క్షత్రగ్రాహ్యత | ౧౪౧ | ౨౦౩ | ప్రసూతా స్నానము | ౧౫౪ |
| ౧౮౭ | సీమంత సంస్కారమునకు | ... | ౨౦౪ | తన్నిషిద్ధ నక్షత్రంబులు | ... |
| ౧౮౮ | దీనికి శుక్రాస్తాదులు లేవు | ౧౪౪ | ౨౦౫ | స్తన్యపాన ముహూర్తము | ౧౫౫ |
| ౧౮౯ | గర్భిణీదశమాసాధీశ్వరులు | ... | ౨౦౬ | దంతజనన ఫలవిచారము | ... |
| ౧౯౦ | పుంసవన ముహూర్తము | ౧౪౫ | ౨౦౭ | డోలా చక్రము | ౧౫౬ |
| ౧౯౧ | పుంసవన వారఫలంబులు | ... | ౨౦౮ | డోలా ముహూర్తము | ౧౫౭ |
| ౧౯౨ | తద్ద్రేక్కాణాంశ ఫలము | ౧౪౬ | ౨౦౯ | నిష్క్రమణ మునకు | ౧౫౮ |
| ౧౯౩ | తన్నక్షత్ర విశేష ఫలము | ... | ౨౧౦ | శిశువునకురవి చంద్రదర్శనము | ౧౫౯ |
| ౧౯౪ | గర్భరక్షార్థ విష్ణుపూజ | ౧౪౭ | ౨౧౧ | సూతికా జలపూజ | ... |
| ౧౯౫ | తత్పూజావిధి | ౧౪౮ | ౨౧౨ | అన్నప్రాశన కాలము | ౧౬౦ |
| ౧౯౬ | జాతకర్మ విధానకాలము | ౧౪౯ | ౨౧౩ | తన్ముహూర్తము | ... |
| ౧౯౭ | జాతకర్మ ప్రయోజనము | ౧౫౦ | ౨౧౪ | జన్మనక్షత్ర ప్రాశస్త్యము | ౧౬౧ |
| ౧౯౮ | నామకరణ విధానము | ... | ౨౧౫ | లగ్నగ్రహస్థితి ఫలములు | ౧౬౨ |
| ౧౯౯ | నామకర్మ విశేషము | ౧౫౧ | ౨౧౬ | పూర్ణచంద్ర లక్షణము | ౧౬౩ |
| ౨౦౦ | నామకరణ ప్రయోజనము | ౧౫౧ | ౨౧౭ | భూమ్యుపవేశనమునకు | ... |
| ౨౦౧ | ఇదిజన్మనక్షత్రానుగుణము. | ౧౫౨ | ౨౧౮ | జీవికా పరీక్షణము | ౧౬౪ |
| ౨౦౨ | మాసనామ కరణంబు | ౧౫౩ | ౨౧౯ | శిశువునకు తాంబూల భక్షణము | ౧౬౫ |

| సం | విషయములు. | పు | సం | విషయములు. | పు |
|---|---|---|---|---|---|
| ౨౨౦ | కర్ణవేధ ముహూర్తము | ౧౬౬ | ౨౩౭ | జ్యేష్ఠాదులు తగవు | ౧౭౮ |
| ౨౨౧ | కర్ణవేధలో విశేషము | ౧౬౭ | ౨౩౮ | సామాన్య క్షౌరమునకు | ... |
| ౨౨౨ | అబ్దపూర్తి విచారము | ... | ౨౩౯ | క్షౌరవార ఫలములు | ... |
| ౨౨౩ | చౌలకర్మ విచారము | ౧౬౯ | ౨౪౦ | నిషేధక్షౌర మలక్ష్మీకరము | ౧౭౯ |
| ౨౨౪ | ధూమకేతూదయము తగదు | ... | ౨౪౧ | క్షౌరవర్జ్య కాలములు | ౧౮౦ |
| ౨౨౫ | కేతులక్షణంబులు | ౧౭౦ | ౨౪౨ | ప్రాయశ్చిత్త క్షౌరము | ... |
| ౨౨౬ | గురుశుక్రాస్తములు తగవు. | ౧౭౧ | ౨౪౩ | గర్భిణీపతికి తగదు | ౧౮౧ |
| ౨౨౭ | చంద్రబాల్య వృద్ధనిర్ణయం | ౧౭౨ | ౨౪౪ | ముఖక్షౌర విధి | ... |
| ౨౨౮ | చౌల ముహూర్తము | ౧౭౩ | ౨౪౫ | తీర్థక్షౌరము | ౧౮౨ |
| ౨౨౯ | చౌలవారాపవాదము | ... | ౨౪౬ | హోరాప్రాశస్త్యము | ... |
| ౨౩౦ | చౌలలగ్న నిర్ణయము | ౧౭౪ | ౨౪౭ | క్షౌరమున మృతిసూచన | ... |
| ౨౩౧ | చౌలతారాబలము ముఖ్యము. | ౧౭౫ | ౨౪౮ | అక్షరాభ్యాసమునకు | ౧౮౩ |
| ౨౩౨ | చౌల ప్రయోజనము | ... | ౨౪౯ | విద్యారంభమునకు | ౧౮౪. |
| ౨౩౩ | క్షౌరచౌల భేదము | ౧౭౬ | ౨౫౦ | దీనికి గ్రహబలము | ౧౮౫ |
| ౨౩౪ | చౌలము తగని కాలము | ... | ౨౫౧ | అంకురార్పణవిచారము | ... |
| ౨౩౫ | దుష్టతారాపవాదము | ౧౭౭ | ౨౫౨ | అంకురార్పణ విధానము | ౧౮౬ |
| ౨౩౬ | చౌలకాల విశేషము | ... | ౨౫౩ | అంకురార్పణ ముహూర్తము | ౧౮౭ |

| సం | విషయములు. | పు | సం | విషయములు. | పు |
|---|---|---|---|---|---|
| ౨౫౪ | ఉపనయన విచారము | ... | ౨౭౧ | గ్రహబలములలో విశేషము | ౨౦౦ |
| ౨౫౫ | తత్కర్తవ్యకాలము | ౧౮౯ | ౨౭౨ | త్రైవర్ణికులకు గ్రహబలము | ౨౦౧ |
| ౨౫౬ | ఉపనయన నక్షత్రములు | ౧౯౦ | ౨౭౩ | శాఖేశుల కర్తదోషము | ... |
| ౨౫౭ | శాఖాభేద నక్షత్రములు | ౧౯౧ | ౨౭౪ | జ్యేష్ఠపుత్రునికి విశేషము | ... |
| ౨౫౮ | నక్షత్ర వేధతెగదు. | ... | ౨౭౫ | అబ్దబల ముఖ్యత | ౨౦౨ |
| ౨౫౯ | పంచశలాకావేధ | ౧౯౨ | ౨౭౬ | అష్టకవర్గశుద్ధి ముఖ్యత | ... |
| ౨౬౦ | ఉపనయన వారములు | ౧౯౩ | ౨౭౭ | వర్జ్యతిథులు | ... |
| ౨౬౧ | శాఖాధిప వారములు | ... | ౩౭౮ | రవ్యాద్యంశఫలము | ౨౦౩ |
| ౨౬౨ | ఉపనయన తిథిఫలము | ... | ౨౭౯ | తదంశస్థ చంద్రఫలము | ... |
| ౨౬౩ | గళగ్రహ తిథులు | ౧౯౫ | ౨౮౦ | కేంద్రపాప నిషేధము | ౨౦౪ |
| ౨౬౪ | ఉపనయనదిన సమయము | ... | ౨౮౧ | గుణాధిక్య గ్రహణము | ౨౦౫ |
| ౨౬౫ | తల్లగ్న ఫలవిచారము | ... | ౨౮౨ | దోష దౌష్ట్యము | ౨౦౬ |
| ౨౬౬ | లగ్నగ్రహ బలవిచారము | ౧౯౭ | ౨౮౩ | మాతృ రజోదోషము | ... |
| ౨౬౭ | చంద్రలగ్న శుభయోగము | ౧౯౮ | ౨౮౪ | తత్సమయ కర్తవ్యము | ౨౦౭ |
| ౨౬౮ | లగ్నచంద్రవిశేషము | ౧౯౯ | ౨౮౫ | ఛురికాబంధనము | ౨౦౮ |
| ౨౬౯ | శాఖాధీశ బలంబు | ... | ౨౮౬ | సమావర్తనమునకు | ౨౦౯ |
| ౨౭౦ | తద్బలానుసారఫలంబు | ... | ౨౮౭ | మరల వివాహ కాలము | ... |

| సం | విషయములు. | పు |
|---|---|---|
| | ప్రథమభాగ పూర్తి. | |
| | ద్వితీయ భాగమున | |
| | ౬ వివాహప్రకరణం. | |
| ౧ | లగ్నశుద్ధి ప్రాముఖ్యము | ౨౧౦ |
| ౨ | అష్టవిధ వివాహములు | ... |
| ౩ | ఉక్తకాలమే గ్రాహ్యము | ౨౧౨ |
| ౪ | వివాహప్రశ్న | ... |
| ౫ | కుజదోష విచారము | ౨౧౪ |
| ౬ | వైధవ్యపరిహారోపాయము | ౨౧౬ |
| ౭ | వరనిశ్చయనిమిత్తములు | ౨౧౭ |
| ౮ | ఉపశ్రుతి విచారము | ౨౧౮ |
| ౯ | కన్యావరణ ముహూర్తము | ౨౧౯ |
| ౧౦ | వరణ ముహూర్తము | ... |
| ౧౧ | కన్యాదాన కాలము | ౨౨౦ |
| ౧౨ | వివాహవయఃఫలము | ౨౨౧ |
| ౧౩ | గురుశుద్ధి ముఖ్యము | ... |

| సం | విషయములు. | పు |
|---|---|---|
| ౧౪ | వివాహోచిత మాసములు | ౨౨౨ |
| ౧౫ | జన్మమాసాదుల నిషేధము | ౨౨౩ |
| ౧౬ | జ్యేష్ఠత్రయ నిషేధము | ౨౨౪ |
| ౧౭ | ప్రవేశ నిర్గమ విచారము | ౨౨౫ |
| ౧౮ | మంగళమునసమంగళనిషేధము | ౧౨౮ |
| ౧౯ | అబ్దభేదము ముఖ్యము | ౧౨౯ |
| ౨౦ | మూలాశ్లేషాజకన్యావిచారము | ౨౩౦ |
| ౨ | విశాఖజ్యేష్ఠాకన్యావిచారము | ... |
| ౨౨ | దశకూట ఘటితార్థము | ౨౩౧ |
| ౨౩ | ౧౮ కూటములు | ... |
| ౨౪ | ౮ కూటముల గుణసంఖ్య | ౨౩౨ |
| ౨౫ | వర్ణకూటవిచారము | ౨౩౩ |
| ౨౬ | వశ్యకూటవిచారము | ౨౩౪ |
| ౨౭ | దినకూట విచారము | ౨౩౫ |
| ౨౮ | యోనికూట విచారము | ... |
| ౨౯ | గ్రహమైత్రీ విచారము | ౨౩౭ |
| ౩౦ | గణకూట విచారము | ౨౩౯ |

| సం | విషయములు. | పు | సం | విషయములు. | పు |
|---|---|---|---|---|---|
| ౩౧ | గణకూటాపవాదము | ౨౪౧ | ౪౮ | నక్షత్రైక్య రాశ్యైక్యములు | ౧౫౫ |
| ౩౨ | ఏకాధిపత్య ముఖ్యత | ... | ౪౯ | ఏకవింశన్మహా దోషంబులు | ౧౫౬ |
| ౩౩ | రాశికూట విచారము | ౧౪౧ | ౫౦ | తత్కాల ఫలవిశేషము | ౧౫౭ |
| ౩౪ | నాడీకూట విచారము | ౧౪౪ | ౫౧ | దశదోషంబులు | ౧౫౮ |
| ౩౫ | నాడులకు దేశభేదవ్యవస్థ | ౧౪౫ | ౫౨ | షడ్వర్గ దోషవిచారము | ౧౫౯ |
| ౩౬ | నాడీకూటాపవాదము | ౧౪౬ | ౫౩ | యోగినీ నక్షత్రంబులు. | ౨౬౨ |
| ౩౭ | నాడీకూట వేధ | ౧౪౭ | ౫౪ | గండాంత దోషము | ౨౬౩ |
| ౩౮ | నాడీదోషశాంతి | ౧౪౮ | ౫౫ | తద్దోషపరిహారము | ౨౬౫ |
| ౩౯ | మాహేంద్రకూటము | ౨౪౯ | ౫౬ | కర్తరీదోష విచారము | ౨౬౬ |
| ౪౦ | రజ్జుకూట విచారము | ... | ౫౭ | క్రూరసౌమ్య గ్రహములు | ౨౬౭ |
| ౪౧ | రజ్జుకూటాపవాదము | ౨౫౦ | ౫౮ | సంగ్రహ దోషవిచారము | ... |
| ౪౨ | వేధాకూట విచారము | ... | ౫౯ | అష్టమ లగ్నదోషము | ౨౬౯ |
| ౪౩ | స్త్రీ దీర్ఘము | ౧౫౧ | ౬౦ | తత్షాద్దోషవాదము | ... |
| ౪౪ | మాహేంద్రాదుల వ్యవస్థ | ... | ౬౧ | ద్వాదశ లగ్నదోషము | ౨౭౦ |
| ౪౫ | గుణపరిజ్ఞానము | ౧౫౧ | ౬౨ | విషఘటీదోషము | ... |
| ౪౬ | వర్ణకూట విచారము | ౧౫౩ | ౬౩ | తిథులలో విషఘటికలు | ౨౭౧ |
| ౪౭ | నామనక్షత్ర గ్రహణము | ౧౫౪ | ౬౪ | వారవిషదోషములు | ... |

| సం | విషయములు. | పు | సం | విషయములు | పు |
|---|---|---|---|---|---|
| ౬౫ | తద్దోష సాపవాదము | ౨౭౩ | ౮౨ | జామిత్ర దోషవిచారము | ౨౯౧ |
| ౬౬ | దుర్ముహూర్త దోషము | ౨౭౪ | ౮౩ | తద్దోషాపవాదము | ౨౯౨ |
| ౬౭ | వేధదోష విచారము | ౨౭౫ | ౮౪ | దశయోగ చక్రదోషము | ౨౯౩ |
| ౬౮ | అభిజిన్నక్షత్ర విచారము. | ... | ౮౫ | తద్దోషాపవాదము | ౨౯౪ |
| ౬౯ | పంచశలాకాచక్రము | ౨౭౬. | ౮౬ | బాణదోష విచారము | ౨౯౭ |
| ౭౦ | గ్రహవేధలకు ఫలములు | ౨౭౭ | ౮౭ | పంచకదోషాపవాదము | ... |
| ౭౧ | తద్విశేష సూచనలు | ౨౭౮ | ౮౮ | గ్రహదృష్టి విచారము. | ౩౦౦ |
| ౭౨ | సప్తశలాకావేధ | ౨౭౯ | ౮౯ | ఉదయాస్త లగ్నశుద్ధి | ౩౦౨ |
| ౭౩ | క్రూరాక్రాంత దోషము | ౨౮౨ | ౯౦ | వజ్రయోగ విచారము | ౩౦౪ |
| ౭౪ | లత్తాదోష విచారము | ౨౮౩ | ౯౧ | సంక్రాంతి దోషవిచారము | ౩౦౫ |
| ౭౫ | పాతదోష విచారము | ౨౮౪ | ౯౨ | సంక్రాంతి ఫలవిశేషము. | ౩౦౬ |
| ౭౬ | ఖర్జూర దోషము. | ౨౮౫ | ౯౩ | నవాంశలగ్న దోషము | ... |
| ౭౭ | ఏకార్గళ దోషము | ౨౮౬ | ౯౪ | వర్గోత్తమాంశ విచారము | ౩౦౯ |
| ౭౮ | ఉగ్రగ్రహ దోషము | ౨౮౭ | ౯౫ | పంగ్వాదిలగ్న దోషములు | ... |
| ౭౯ | ఉపగ్రహ దోషము | ౨౮౮ | ౯౬ | లగ్నభంగ యోగములు | ౩౧౦ |
| ౮౦ | వారదుర్ముహూర్తము | ౨౮౯ | ౯౭ | ౩-౧౧-౮-౬ రవిగుణము | ౩౧౧ |
| ౮౧ | పంచాంగదోష విశేషము | ... | ౯౮ | ౩-౧౧-౮-౬ శనిగుణము | ౩౧౩ |

| సం | విషయములు. | పు | సం | విషయములు. | పు |
|---|---|---|---|---|---|
| ౯౯ | కే-౧౧-౬ కుజ౬గురుఫలము. | ౩౧౪ | ౧౧౬ | శ్వశురాదివిభాగజ్ఞానము | ౩౨౪ |
| ౨౦౦ | ద్వాదశభావరవి ఫలము | ... | ౧౧౭ | సంకీర్ణజాతి వివాహము | ౩౨౫ |
| ౩౦౧ | అస్తే చంద్రఫలము | ౩౧౫ | ౧౧౮ | ప్రాక్కర్మకు దినశుద్ధి | ౩౨౬ |
| ౨౦౨ | అస్తే కుజఫలము | ... | ౧౧౯ | వేదికాదినియమము | ... |
| ౨౦౩ | అస్తే బుధఫలము | ౩౧౬ | ౧౨౦ | గోధూళిలగ్న విచారము | ౩౨౭ |
| ౨౦౪ | అస్తే గురుఫలము | ... | ౧౨౧ | వివాహలగ్న సాధనము | ౩౨౯ |
| ౨౦౫ | అస్తే శుక్రఫలము | ౩౧౭ | ౧౨౨ | వివాహముహూర్తము | ౩౩౧ |
| ౨౦౬ | అస్తే శనిరాహుకేతు ఫలము | ౩౧౮ | | | |
| ౨౦౭ | కర్తరీదోషాపవాదము | ... | | ౭. వధూప్రవేశ ప్రకరణం | |
| ౨౦౮ | భృగుషట్కదోషాపవాదము | ... | | | |
| ౨౦౯ | కుజాష్టమదోషాపవాదము | ౩౧౦ | ౧౨౩ | వధూప్రవేశ కాలనియమం | ౩౩౧ |
| ౨౧౦ | చంద్రదోషాపవాదము | ... | ౧౨౪ | ప్రవేశోచిత తిథ్యాదులు | ౩౩౪ |
| ౨౧౧ | అనేకదోషాపవాదము | ... | ౧౨౫ | పిత్రాదిగృహాని వేళఫలము | ౩౩౪ |
| ౧౧౨ | దోషపహార శుభబలము | ౩౨౧ | ౧౨౬ | ద్విరాగమ విచారము | ౩౩౫ |
| ౧౧౩ | లగ్నపతి బలప్రధానత | ౩౨౩ | ౧౨౭ | వధూప్రవేశలగ్న శుద్ధి | ౩౩౬ |
| ౧౧౪ | బుధగురు శుక్రబలాధిక్యత | ... | ౧౨౮ | గురుశుక్రాస్తాదిదోషము | ... |
| ౧౧౫ | వింశోపకయోగ విచారము | ... | ౧౨౯ | ప్రతిశుక్రదోషాపవాదము | ౩౩౭ |

| సం | విషయములు. | పు | సం | విషయములు. | పు |
|---|---|---|---|---|---|
| | ౮. అగ్న్యాధానప్రకరణం | | ౧౪౩ | ప్రబలయాత్రా విశేషము | ... |
| ౧౩౦ | అగ్న్యాధానావతారిక | ౩౩౮ | ౧౪౪ | జాతకానుగుణముహూర్తము | ౩౫౦ |
| ౧౩౧ | ఉత్తరాయణ ప్రశస్తి | ౩౩౯ | ౧౪౫ | రవిస్థితిచే యాత్ర | ౩౫౧ |
| ౧౩౨ | అగ్న్యాధాన నక్షత్రములు | ... | ౧౪౬ | పృష్ఠగార్క నిర్ణయము | ... |
| ౧౩౩ | వర్జ్య దోషము | ౩౪౦ | ౧౪౭ | వసిష్ఠోక్త తిథిఫలం | ౩౫౨ |
| ౧౩౪ | ఆధాన లగ్నశుద్ధి | ౩౪౦ | ౧౪౮ | ఉత్తమాధమ తారలు | ౩౫౪ |
| ౧౩౫ | దానిచేయాగ యోగము | ౩౪౧ | ౧౪౯ | వారశూలలు | ... |
| | ౯. రాజాభిషేకప్రకరణము | | ౧౫౦ | నక్షత్రశూలలు | ౩౫౫ |
| ౧౩౬ | అభిషేకోచిత సమయము- | ౩౪౨ | ౧౫౧ | శూల ఫలములు | ... |
| ౧౩౭ | శగ్రహస్థితి విచారం | ౩౪౩ | ౧౫౨ | శూలపరిహారము | ౩౫౬ |
| ౧౩౮ | తదుచిత నక్షత్రంబులు | ౩౪౫ | ౧౫౩ | నక్షత్రకాల విశేషము | ... |
| ౧౩౯ | దోషగ్రహస్థితి ఫలం | ... | ౧౫౪ | నక్షత్రవర్జ్య ఘటికలు | ౩౫౭ |
| ౧౪౦ | సంపద్యోగములు | ౩౪౬ | ౧౫౫ | మృతజీవ పక్షఫలము | ౩౫౮ |
| | ౧౦ యాత్రా ప్రకరణం. | | ౧౫౬ | అకులాది చక్రము | ౩౫౯ |
| ౧౪౧ | యాత్రా స్వరూపము | ౩౪౭ | ౧౫౭ | పథిరాహు చక్రము | ౩౬౦ |
| ౧౪౨ | రాజప్రయాణ ముఖ్యత | ౩౪౮ | ౧౫౮ | ప్రయాణతిథి చక్రము | ౩౬౨ |
| | | | ౧౫౯ | సర్వాంక జ్ఞానము | ౩౬౪ |

| సం | విషయములు. | పు | సం | విషయములు. | పు |
|---|---|---|---|---|---|
| ౧౬౦ | అడల భ్రమణము | ౩౬౫ | ౧౭౮ | అయన శుద్ధిముఖ్యము | ౩౭౮ |
| ౧౬౧ | యాత్రాలలాటము | ౩౬౬ | ౧౭౯ | సంముఖ శుక్రదోషము. | ... |
| ౧౬౨ | యాత్రా ఫణిచక్రము | ౩౬౮ | ౧౮౦ | శుక్రమూఢ సంముఖఫలము. | .... |
| ౧౬౩ | చంద్ర గర్భఫలము | ... | ౧౮౧ | ప్రయాణ లగ్నశుద్ధి | ౩౭౯ |
| ౧౬౪ | చంద్రగర్భ విశేషము | ౩౬౯ | ౧౮౨ | యాత్రా సమయబలము | ౩౮౦ |
| ౧౬౫ | ఖాతచంద్ర విచారము | ౩౭౦ | ౧౮౩ | యాత్రాభిజిన్ముఖ్యత | ౩౮౧ |
| ౧౬౬ | ఘాతతిథి విచారము | ౩౭౧ | ౧౮౪ | లగ్నగ్రహ బలములు | ... |
| ౧౬౭ | ఘాత వారంబులు | ... | ౧౮౫ | ద్వాదశభావ గ్రహ ఫలము | ... |
| ౧౬౮ | ఘాత నక్షత్రంబులు | ౩౭౨ | ౧౮౬ | నవమీయాత్ర యనిషేధము | ౩౮౮ |
| ౧౬౯ | యోగినీ విచారము | ... | ౧౮౭ | నక్షత్ర దోహదము | ... |
| ౧౭౦ | వారయోగినీఫలంబు | ౩౭౪ | ౧౮౮ | వారదోహదము | ౩౮౯ |
| ౧౭౧ | కాలపాశ యోగము | ... | ౧౮౯ | దిగ్దోహదము | .. |
| ౧౭౨ | పరిఘాదండ చక్రము | ౩౭౫ | ౧౯౦ | తిథిదోహదము | ... |
| ౧౭౩ | విదిగ్గమనవిధి | ౩౭౬ | ౧౯౧ | శుభశకునములు | ౩౯౦ |
| ౧౭౪ | సర్వదిఙ్నక్షత్రంబులు | ... | ౧౯౨ | అశుభ శకునములు | ౩౯౧ |
| ౧౭౫ | యాత్రైకార్గళాది దోషము | ౩౭౭ | ౧౯౩ | కార్య నిర్ణయాను. మంగళం. | ౩౯౨ |
| ౧౭౬ | గ్రహావక్రత్వదోషము | ... | ౨౮౭ | ఇట్టి విషయ సూచిక | |
| ౧౭౭ | బలవద్వార వర్గలు శుభము | ... | ౪౮౦ | సమాప్తము. | |



శ్రీమహాగణపతయేనమః

శ్లో॥ ఆదిత్యాయచ సోమాయ మంగళాయ బుధాయచ।
గురుశుక్రశనిభ్యశ్చ రాహవే కేతవే నమః ॥



# ఆంధ్రతాత్పర్యవివరణసమేతంబయిన.

# ముహూర్తరత్నావళి.



## ౧. మంగళాదికము.

శ్లో॥ శ్రీవాగ్దేవీం నమస్కృత్య సంహితాకర్తృకాన్మునీన్॥
ముహూర్తరత్నావళీతి కృతిరత్రవిధీయతే ॥ ౧ ॥

తా॥ శ్రీవాగ్దేవిని సంహితాకర్తలైన మునీంద్రులను మ్రొక్కి యిచ్చట ముహూర్తరత్నావళియనెడు జ్యోతిర్నిబంధనగ్రంథము విధింపబడుచున్నది. (చెప్పెడు విషయంబులన్నియును సప్రమాణంబులయిన ఋషివచనంబుల నాశ్రయించినవి యనుసంగతిని సంహితాకర్తలైన మునులప్రార్థన చేనూహించునది.)

## ముహూర్త రత్నావళియందు.

### ౨. గ్రంథప్రయోజనము.

శ్లో॥ జ్యోతిశ్చక్రేతు లోకస్య సర్వస్యోక్తం శుభాశుభం।
జ్యోతిర్జ్ఞానంచయోవేద సయాతి పరమాంగతిం ॥ ౨ ॥

తా॥ సూర్యాదిగ్రహమండలమున సమస్తలోకముయొక్క శుభాశుభ ఫలపరిపాక సూచనంబు చెప్పంబడి యుండుటచేత నట్టిజ్యోతిర్విజ్ఞానంబునం దినవాఁడు ఉత్తమగతి నందుచుండునని గర్గమహర్షి వచనముగాన; జ్యోతిషశాస్త్రోక్తమైన పద్ధతిని శుభాశుభకాలపరిణామంబు నెఱింగిశుభసమయ సదాచారసంపత్తిచేత నిహపరసుఖంబులనందుటయే ప్రయోజనమని భావము.

## (౧ శుభాశుభ ప్రకరణం.)

అవతారిక—అంతట కాలవిచారమున సామాన్యముగా మంచిచెడ్డలను సూచించువిషయంబులన్నియును ఈమొదటిప్రకరణమున వివరింపంబడుచున్నయవి. అందు మొదటిది తిథిగావున నాతిథ్యధిపతులు మొదలగునవి వరుసగాచెప్పంబడును.

### 3. తిథ్యధిపతులు.

శ్లో॥ వహ్ని ర్విధాతా ద్రిసుతా గణేశః। సర్పో విశాఖో
దితిజో మహేశః। దుర్గా యమో విశ్వహరిశ్చ కామః।
శర్వో నిశేశశ్చ పురాణదృష్టాః ॥ 3 ॥

తా॥ ౧ అగ్ని; ౨ బ్రహ్మ; 3 గౌరి; ౪ గణపతి; ౫ నాగుఁడు; ౬ కుమారస్వామి; ౭ సూర్యుడు; ౮ శివుఁడు; ౯ దుర్గ; ౧౦ యముఁడు; ౧౧ విశ్వేదేవతలు; ౧౨ విష్ణు; ౧3 కాముఁడు; ౧౪ శివుఁడు; ౧౫ చంద్రుఁడు;—ఇట్లు వరుసగా పాడ్యమిమొదలు పున్నమవరకు తిథుల కధిదేవతలుగా నుందురు. అని వసిష్ఠ వచనము.

## ౪. తిథిసంజ్ఞాఫలము.

శ్లో॥ నందాభద్రాజయారిక్తాపూర్ణాస్స్యుస్తిథయఃపునః ।
పర్యాయత్వేనవిజ్ఞేయా నేష్టమధ్యేష్టదాస్సితే ।
కృష్ణపక్షేపీష్టమధ్యనేష్టదాఃక్రమశస్స్మృతాః ॥ ౪ ॥

తా॥ ఆ ౧౫ తిథులలో ౧-౬-౧౧ నందతిథులు; ౨-౭-౧౨ భద్రతిథులు; 3-౮-౧3 జయతిథులు; ౪-౯-౧౪ రిక్తతిథులు; ౫-౧౦-౧౫ పూర్ణతిథులు; ఇవి తమనామానుగుణ ఫలదంబులు. మఱి వీటిలో శుక్లపక్షమున ౧-౨-3-౪-౫ అధమము, ౬-౭-౮-౯-౧౦ మధ్యమము, ౧౧-౧౨-౧3-౧౪-౧౫ ఉత్తమము. కృష్ణపక్షమున ౧ ౨-3-౪-౫ ఉత్తమము, ౬-౭-౮-౯-౧౦ మధ్యమము, ౧౧-౧౨-౧3,౧౪,3౦ అధమము అని నారద సంహితావచనము.

## ౫ నందాది సిద్ధయోగఫలము.

శ్లో॥ శుక్రజ్ఞకుజమందేజ్యా వారా నందాదిషుక్రమాత్ ।
సిద్ధాఃతిథిస్సిద్ధిదాస్స్యుః తత్సర్వకార్యేషు సర్వదా ॥ ౫ ॥

| శుక్రవారము. | బుధవారము. | మంగళవారం | శనివారము. | గురువారము. |
|---|---|---|---|---|
| ప్రతిపత్తు. | ద్వితీయ | తృతీయ | చతుర్థి. | పంచమి. |
| షష్ఠి. | సప్తమి. | అష్టమి | నవమి | దశమి. |
| ఏకాదశి. | ద్వాదశి. | త్రయోదశి. | చతుర్దశి. | పూర్ణిమ |
| నందాతిథి. | భద్రాతిథి. | జయాతిథి. | రిక్తాతిథి | పూర్ణాతిథి. |

ఈ వారములతో చేరిన ఈతిథులు సిద్ధతిథులనంబడును. సర్వకార్యంబులలో నివి సిద్ధికరంబులని వసిష్ఠవచనంబు గలదు.

## ౬. వారయుక్తనిషిద్ధతిథులు.

శ్లో॥ ఆదిత్యభౌమయోర్నందాభద్రాశుక్రశశాంకయోః ।
జయాసౌమ్యే గురౌరిక్తాశనౌపూర్ణా మృతిప్రదా ॥౬॥

తా॥ రవిమంగళ వారంబులలో నందాతిథులును; సోమశుక్ర వారంబులలో భద్రాతిథులును; బుధవారమున జయతిథులును; గురువారమున రిక్తాతిథులును; శనివారమున పూర్ణాతిథులును; చేరిన వైననాతిథులు మృతసంజ్ఞగలవిగాన మంచివికావని నారదవచనము.

## ౭. వారయుక్త నిషిద్ధనక్షత్రములు.

శ్లో॥ యమర్క్షమర్క వారేజ్యే చిత్రా భౌమేతువిశ్వభం ।
బుధేశ్రవిష్ఠార్యమర్క్షం గురౌజ్యేష్ఠాభృగోర్దినే ॥
రేవతీశనివారేతు దగ్ధయోగాభవంత్యమీ ॥ ౭ ॥

తా॥ఆదిత్యవారమున భరణి, సోమవారమున చిత్ర, మంగళవారమున ఉత్తరాషాఢ, బుధవారమున ధనిష్ఠ, గురువారమున ఉత్తరఫల్గుని, శుక్రవారమున జ్యేష్ఠ, శనివారమున రేవతి—ఇవిచేరిన దగ్ధసంజ్ఞగలవిగాన మంచిదికాదని నారదవచనము.

## ౮. క్రకచాదినింద్య యోగములు.

శ్లో॥ త్రయోదశేస్యుర్మిలనే సంఖ్యాయా స్తిథివారయోః ।
క్రకచోనామ యోగోఽయం మంగళేష్వతిగర్హితః ॥ ౯ ॥
సప్తమ్యామర్కవారశ్చే త్ప్రతిపత్సౌమ్యవాసరే ।
సంవర్తయోగోవిజ్ఞేయ శ్శుభకర్మవినాశకృత్ ॥ ౧౦ ॥

తా॥ తిథిసంఖ్యను వారసంఖ్యతో కలిపిన ౧౩ అగునేని యది క్రకచయోగం బనంబడును. అనగా ౬శని, ౭శుక్ర, ౮గురు, ౯బుధ, ౧౦మంగళ, ౧౧సోమ, ౧౨రవి, యోగము సర్వశుభంబులకును నింద్యంబులైన క్రకచయోగతిథులు. మఱియు, సప్తమీ రవివారంబును, ప్రతిపత్సౌమ్యవారంబును సంవర్తసంజ్ఞగలదిగాన శుభకర్మ వినాశకరంబు. అనినారద వచనంబులుగలవు.

## ౯. కృత్యవిశేషంబులలో నిషిద్ధతిథులు.

శ్లో॥ షష్ఠ్యాంతైలం తథాష్టమ్యాం మాంసంక్షౌరం తిథౌకలేః।
పూర్ణిమాదర్శయోర్నారీ సేవనం పరివర్జయేత్ ॥౧౧॥

తా॥ షష్ఠినాడు అభ్యంగనము, అష్టమినాడు మాంససేవనము, చతుర్దశినాడు క్షౌరము, పున్నమనాడు నమావాస్యనాడును సంభోగము తగదని నారదవచనము.

శ్లో॥ షష్ఠ్యాందర్శప్రతిపది ద్వాదశ్యాంచదినక్షయే ।
కుర్యాదామలకస్నానం దశమ్యాంమూఢదీర్నరః ।౧౨॥
పుత్రనాశోభవేత్తస్య త్రయోదశ్యాంధనక్షయః ।
సంపత్పుత్రక్షయ స్తస్య ద్వితీయాయామసంశయం ॥౧౩॥
సప్తమ్యాంచనవమ్యాంచ అమాయాంకులనాశనం ॥
(ఇతికశ్యపవచనాని) ,, —— ॥ ౧౪ ॥

తా॥ పాడ్యమి, షష్ఠి, ద్వాదశి, అవమతిథి, దశమి, వీట్లలో మూఢుడైనవాడు ఆమలకాభ్యంగముం జేయును. అట్లుచేసిన నతనికి పుత్రనాశము త్రయోదశియందు ధనక్షయము, విదియనాడు సంపత్సంతాననష్టము, సప్తమీనవమీ దర్శలలో కులనాశనంబు.

## ౧౦. దగ్ధయోగము.

శ్లో॥ ద్వాదశ్యేకాదశీనాగ గౌరీస్కందవసుష్వపి ।
నవమ్యాందగ్ధయోగాఖ్యా భానువారాదితః క్రమాత్ ॥

తా॥ ౧౨ ఆదిత్యవారము. ౧౧ సోమవారము, ౫ మంగళవారము 3 బుధవారము, ౬ గురువారము, ౮ శుక్రవారము, ౯ శనివారము, ఈతిథివారయోగము దగ్ధయోగంబని వసిష్ఠవచనము.

## ౧౧. విషయోగము.

శ్లో॥ షష్ఠీశశాంకేనవమీచశుక్రే బుధేద్వితీయాతపనేచతుర్థీ।
జీవేష్టమీసౌరికుజేఽహ్ని సప్తమీయోగావిషాఖ్యాః
కులనాశనాఃస్యుః ॥ ౧౬ ॥

తా॥ సోమవారమున షష్ఠియును, శుక్రవారమున నవమియును, బుధవారమున విదియయును, ఆదిత్యవారమున చవితియును, గురువారమున అష్టమియును, మంగళశనివారంబులలో సప్తమియును, విషసంజ్ఞగలది గావునవర్జ్యంబులని బృహస్పతివచనము.

## ౧౨. హుతాశనయోగము.

శ్లో॥ షష్ఠ్యాదితిథయస్సప్త చంద్రవారాదిభిర్యుతాః।
క్రమాత్పక్షద్వయేపిస్యుఃస ప్తయోగాహుతాశనాః॥౧౭॥

తా॥ రెండుపక్షంబులలోను - రవిద్వాదశియును, సోమషష్ఠియును, భౌమసప్తమియును, బుధాష్టమియును, గురునవమియును, శుక్రదశమియును, శన్యేకాదశియును హుతాశనసంజ్ఞగలదిగావున శుభకర్మలలో వర్జ్య యోగమనిగురువచనము.

## ౧౩. యమఘంటక యోగము.

శ్లో॥ సూర్యాదివారేతిథయోహిపిత్ర్య ద్వీశేశమూలాగ్నివిరంచిహస్తాః। భవంతిసూర్యాద్యమఘంటకాశ్చ శుభేవివర్జ్యాగమనేత్వవశ్యం ॥ ౧౮ ॥

తా॥ ఆదిత్యవారమున మఖయును, సోమవిశాఖయును, మంగళవారాద్రియును, బుధమూలయును, గురుకృత్తికయును, శుక్రరోహిణియును, శనిహస్తయును, యమఘంటక సంజ్ఞగలది గావున శుభకర్మలయందు త్యాజ్యంబులు, ప్రయాణమునకు తగనివి,యని గర్గవచనము.

## ౧౪. మాసశూన్య తిథులు.

శ్లో॥ అష్టమీనవమీచైత్రే పక్షయోరుభయోరపి।
మాఘ వేద్వాదశీత్యాజ్యాపక్షయోరుభయోరపి ॥ ౧౯ ॥
జ్యేష్ఠేత్రయోదశీనింద్యా సితేకృష్ణేచతుర్దశీ ।
ఆషాఢేకృష్ణపక్షస్య షష్ఠీశుక్లేతుసప్తమీ ॥ ౨౦ ॥
ద్వితీయాచతృతీయాచ శ్రావణేసితకృష్ణయోః ।
ప్రథమాచద్వితీయాచ నభస్యేమాసినిందితే ॥ ౨౧ ॥
దశమ్యేకాదశీనింద్యా మాసీషేశుక్లకృష్ణయోః ।
ఊర్జేచతుర్దశీశుక్లే కృష్ణపక్షేతుపంచమీ ॥ ౨౨ ॥
సప్తమీచాష్టమీసౌమ్యే పక్షయోరుభయోరపి।
పౌషీపక్షద్వయేచైవ చతుర్థీపంచమీతథా ॥ ౨౩ ॥
మాఘేతుపంచమీషష్ఠీ కృష్ణేశుక్లేయథాక్రమం ।
తృతీయాచచతుర్థీచ ఫాల్గునేసితకృష్ణయోః ॥ ౨౪ ॥
తిథయోమాసశూన్యాఖ్యా వంశవిత్తవినాశదాః ।
అమశ్రాద్ధంప్రకుర్వీతనైవమంగళమాచరేత్ ॥ ౨౫ ॥

| మాస | చై | వై | జ్యే | ఆషా | శ్రా | భా | ఆశ్వ | కా | మా | పు | మఖ | ఫాల్గు |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| శుక్ల | ౮-౯ | ౧౨ | ౧౩ | ౬ | ౨ | ౧ | ౧౦ | ౧౪ | ౭-౮ | ౪-౫ | ౬ | ౩ |
| కృష్ణ | ౮-౯ | ౧౨ | ౧౪ | ౭ | ౩ | ౨ | ౧౧ | ౫ | ౭-౮ | ౪-౫ | ౫ | ౪ |

ఇవి మాసశూన్య తిథులనంబడుచున్నయవి యని వసిష్ఠముని వచనము.

వీట్లలోనే శుభకర్మయును తగదు. శ్రాద్ధంబులను చేయవచ్చును.

## ౧౫. తిథినక్షత్ర యోగవిశేషము.

శ్లో॥ ప్రతిపద్యుత్తరాషాఢా నవమ్యాంకృత్తికాయది ।
పూర్వభాద్రపదాష్టమ్యా మేకాదశ్యాంచరోహిణీ ॥
ద్వాదశ్యాంచయదాశ్లేషా త్రయోదశ్యాంమఖాయది ।
ద్వితీయయాచానురాధా త్ర్యుత్తరాశ్చతృతీయయా ॥
పంచమీంచమఖాయుక్తా చిత్రాస్వాత్యాత్రయోదశీ ।
ఏషుకార్యంకృతంచేత్స్యాత్షణ్మాసాన్మరణంధ్రువం ॥-౨౮

తా॥ ౧ ఉత్తరాషాఢ; ౯ కృత్తిక; ౮ పూర్వాభాద్ర; ౧౧ రోహిణి; ౧౨ ఆశ్రేష; ౧౩ మఖ; ౨ అనూరాధ; ౩ ఉత్తరఫల్గుని, ఉత్తరాషాఢ, ఉత్తరాభాద్రలు; ౫ మఖ; ౧౩ చిత్త, స్వాతియును — చేరిన నీతిథి వార యోగము శుభకర్మలయందు కర్తను ౬ మాసములలోన నష్టముజేయునని లల్లాచార్య వచనము.

## ౧౬. చైత్రాదులలో శూన్యనక్షత్రంబులు.

శ్లో॥ అశ్వినీరోహిణీచైత్రే శూన్యభేపరికీర్తితే ।

చిత్రాస్వాతీచవైశాఖే జ్యేష్ఠేవిశ్వేజ్యతారకే ॥ ౨౯ ॥
భగవాసవమాషాఢే శ్రావణేహరివిశ్వభే ।
నాభస్యేవారుణాంత్యర్క్షే మజపాదశ్వయుజ్యపి ॥ 30 ॥
కార్తికేపిత్రువహ్న్యృక్షే సౌమ్యేచిత్రాద్విదైవతే ।
పౌషేదస్రకరార్ద్రాస్స్యు మాఘేమూలంచవిష్ణుభం॥
తపస్యేశక్రభరణీ శూన్యభాన్యాహురగ్రజాః ।
ఏషుయత్తుకృతంకర్మ ధనైస్సహావినశ్యతి ॥ 3౧ ॥

తా॥ చైత్రమున అశ్వనీరోహిణులు; వైశాఖమున చిత్రాస్వాతులు; జ్యేష్ఠమున పుష్యమ్యుత్తరాషాఢలు; ఆషాఢమున పూర్వఫల్గునీధనిష్ఠలు; శ్రావణమున ఉత్తరాషాఢా శ్రవణములు; భాద్రపదమున శతభిషగ్రేవతులు; ఆశ్వయుజమున పూర్వాభాద్ర; కార్తికమున కృత్తికామఖలు; మార్గశిరమున చిత్రావిశాఖలు; పుష్యమాసమున అశ్విని ఆర్ద్రహస్త; మాఘమున మూలా శ్రవణంబులు; ఫాల్గునంబున భరణీజ్యేష్ఠలు-శూన్యనక్షత్రంబు లనంబడును. వీట్లలో చేసిన కర్మధన సహితంబుగా నశించిపోవును. అని వసిష్ఠసంహితావచనంబు.

౧౭. చైత్రాదులలో శూన్యరాసులు.

శ్లో॥ ఘటమత్స్యవృషాయుగ్మ మేషకన్యాస్సవృశ్చికాః ।
తులాచాపకుళీరాఖ్యమృగసింహాశ్చరాశయః ॥ 33 ॥

చైత్రాదామాసశూన్యాఖ్యా వంశవిత్తవినాశదాః ।
తస్మాత్తాన్సంపరిత్యజ్య శోభనంకారయేత్సుధీః ॥౩౮॥

తా॥ చైత్రమున కుంభము, వైశాఖమున మీనము, జ్యేష్ఠమున వృషభము, ఆషాఢమున మిథునము, శ్రావణమున మేషము, భాద్రపదమున కన్య, ఆశ్వయుజమున వృశ్చికము, కార్తికమున తుల, మార్గశిరమున ధనుస్సు, పుష్యమున కర్కాటకము, మాఘమున మకరము, ఫాల్గునంబున సింహము. ఈరాసులు ఆయానెలలలో శూన్యరాసులనంబడును. ఇవి వంశవిత్త నాశకంబులు గాన వాటినివిడిచి, శుభకార్యంబుల నాచరించ తగును.

౧౮. తిథిగతదగ్ధ లగ్నంబులు.

శ్లో॥ మృగసింహౌతృతీయాయాంప్రథమాయాంతులామృగౌ
పంచమ్యాంబుధరాశీద్వౌ పంచమ్యాంచాపచంద్రభే ॥
నవమ్యాంసింహకీటాఖ్యా వేకాదశ్యాంగురోర్గృహే ।
వృషమీనౌత్రయోదశ్యాం దగ్ధసంజ్ఞాస్త్వమీగృహాః।
దగ్ధసద్మనియత్కర్మ కృతంసర్వంవినశ్యతి ।
తస్మాద్దగ్ధగృహాస్త్యాజ్యాః శోభనేష్వఖిలేష్వపి ॥ ౩౯ ॥

తా॥ తదియనాడు మకరసింహములు, పాడ్యమిని తులామకరములు, పంచమిలోమిథునకన్యలు, సప్తమిలోధనుః కర్కాటకంబులు, నవమిలో సింహవృశ్చికములు, ఏకాదశిలో ధనుర్మీనములు, త్రయోదశిలో వృషభమీనంబులు;—ఇవిదగ్ధరాసులనంబడును. కావున నీరాసులను ఆతిథులలో

వదలిపెట్టి శుభకర్మల నాచరించదగును. ఆచరించిననవి నిష్ఫలంబులగునని వసిష్ఠసంహితా వచనము.

## ౧౯. ఆనందాది యోగంబులు.

శ్లో॥ రవివారక్రమాదేతే దాస్రభాదిందుభాద్విధా।
సార్పాద్బాద్బుధే హస్తాన్మైత్రభాద్దేవమంత్రిణి ॥౩౮॥
వైశ్వదేవాద్భృగుసుతే వారుణాద్భాస్కరాత్మజే।
ఆనందః కాలదండోథ ధూమ్రోధాతా శుభాహ్వయః ॥౩౯॥
ధ్వాంక్షో ధ్వజాఖ్యశ్శ్రీవత్స వజ్రముద్గరఛత్రకాః ।
మిత్రమానసపద్మాఖ్య లంబకోత్పాతమృత్యవః ॥ ౪౦ ॥
కాణస్సిద్ధిశ్శుభామృత ముసలాంతకకుంజరాః ।
రాక్షసాఖ్యశ్చరస్థైర్య వర్ధమానాః క్రమాదమీ ॥ ౪౧ ॥
యోగాస్స్వసంజ్ఞాఫల దాస్త్వష్టావింశతిసంఖ్యకాః।
అభిజిదృక్షసహితైస్సప్తవింశతితారకైః ॥ ౪౨ ॥

తా॥ ఆదిత్యవారమున అశ్వినినుండి, సోమవారమున మృగశిరనుండి, మంగళవారమున ఆశ్లేషనుండి. బుధవారమున హస్తనుండి, గురువారమున అనూరాధనుండి, శుక్రవారమున ఉత్తరాషాఢనుండి, శనివారమున శతతారనుండియును; వరుసగా అభిజిత్సహితంబుగా అశ్విన్యాది ౨౮ నక్షత్రంబులను చేర్చి చూచిన—ఆనందము, కాలదండము, ధూమ్రము, ధాత, శుభ

ఖము, ధ్వాంక్షము, ధ్వజము, శ్రీవత్సము, వజ్రము, ముద్గరము, ఛత్రము, మిత్రము, మానసము, పద్మము, లంబకము, ఉత్పాతము, మృత్యు, కాణము, సిద్ధము, శుభము, అమృతము, ముసలము, అంతకము, కుంజరము, రాక్షసము, చరము, స్థిరము, వర్ధమానము; అని ౨౮ యోగములు నామానుగుణఫలదంబులుగా నుండునని నారదసంహితా వచనంబులుగలవు.

౨౦ హాలాహాల యోగంబును తత్ఫలంబును.

శ్లో॥ అర్కవారేగ్ని పంచమ్యాసోమేచిత్రాద్వితీయయా।
కుజేపూర్ణేందురోహిణ్యాః సప్తమీయామ్యయోర్బుధే॥
గురామిత్రత్రయోదశ్యోఃషష్ఠీశ్రవణయోస్సితే।
పౌష్ణాష్టమ్యాశ్శనావేతే యోగాహాలాహలాహ్వయాః॥
ఏషుయోగేషుకర్తవ్యం శత్రూచ్చాటనమారణం।
వివాహాదిషుకార్యేషునియతం నిధనప్రదం ॥ ౨౫ ॥

తా॥ ఆదిత్యవారమున కృత్తికయును పంచమియును; సోమవారమున చిత్రయును ద్వితీయయును; మంగళవారమున రోహిణియును పున్నమయును; బుధవారమున భరణియును సప్తమియును; గురువారమున అనూరాధయును త్రయోదశియును; శుక్రవారమున శ్రవణంబును షష్ఠియును; శనివారమున రేవతియును అష్టమియును; చేరినచో నదిహాలాహల యోగంబనంబడును. ఇట్టియోగముగల కాలమును శత్రుమారణ శత్రూచ్చాటనాదుల కుపయోగించదగును. వివాహాది శుభకార్యంబులలో నుపయోగించికొనిన తప్పకహానిఁజేయునని వసిష్ఠవచనంబులు.

## ౨౧. దుర్యోగవిధ్వంసక రవియోగంబులు.

శ్లో॥ సూర్యాచ్చతుర్థే దశమేచషష్ఠే విశ్వర్క్షకేవింశతి
భేనవర్క్షే । భవంతిషడ్భాను మహర్క్షయోగాః
కుయోగవిధ్వంసకరాశ్చభేషు ॥ ౪౬ ॥

తా॥ సూర్యుడు ఏనక్షత్రమునగలడో దానినుండి చంద్రుడున్ననక్షత్రము దిననక్షత్రం బనంబడును. అది ౪-౧౦-౬-౧౩-౨౦-౯వ-నక్షత్రంబుగానుండిన, నాడుపైచెప్పిన దుర్యోగంబులలో నేదియున్నను అదోషంబు పరిహారంబై శుభకరంబుగా నుండునని వసిష్ఠవచనము గలదుగావున నీయారు మహర్క్షయోగంబులను దుర్యోగాప వాదంబులని యెఱుంగనగును.

## ౨౨. తిథివారర్క్ష యోగంబులకు దేశవ్యవస్థ.

శ్లో॥ తిథివారోద్భవానేష్టా యోగావారర్క్షసంభవాః ।
హూణవంగఖశేభ్యోన్యదేశేష్వేతే శుభప్రదాః ॥౪౭॥

తా॥ తిథివారయోగము చేతనైనను, వారనక్షత్రయోగముచేతనైనను తిథివారనక్షత్ర యోగముచేతనైనను గలుగునట్టి దుర్యోగంబులన్నియును హూణ వంగ ఖశ దేశంబులకేగాని, తక్కిన దేశంబులలో శుభప్రదంబులని నారదవచనంబు.

## ౨౩. శుభకర్మలయందంతట వర్జ్యపదార్థంబులు,

శ్లో॥ సూర్యభౌమశని రాహుకేతవః । పాపసంజ్ఞి ఖచరాః

క్షయిచంద్రః । పూర్ణచంద్రగురుశుక్ర సోమజాః ।
సర్వకర్మసుహితాః సౌమ్య ఖచరాః ॥ ౪౮ ॥

తా॥ సమస్త కర్మలయందును రవి కుజ శని రాహు కేతువులు పాపసంజ్ఞ. గలవారనియును; పూర్ణచంద్ర బుధ గురు శుక్రులు శుభులనియును; తెలియుట వసిష్ఠవచనార్థము.

శ్లో॥ చంద్రసూర్యోపరాగేషు త్ర్యహం ప్రాగశుభం భవేత్ ।
సప్తాహమశుభం పశ్చాత్స్మృతం గ్రహణశూలకం ॥ ౪౯ ॥

తా॥ సూర్యచంద్రుల గ్రహణకాలములు సంభవించినపుడు గ్రహణమునకు మునుపు మూడుదినంబులును, గ్రహణానంతరము ౭ దినంబులును గ్రహణశూలకంబనుటచే నాపదిదినంబులలోను శుభకార్యంబులు కూడదని గర్గవచనము.

శ్లో॥ సర్వగ్రాసే దినాన్యష్టౌ సర్వకార్యేషు వర్జయేత్ ।
షడ్దినాని త్రిభాగోనే అర్ధగ్రాసే చతుర్దినం ॥
చతుర్థాంశే త్రిరాత్రం స్యాద్గ్రహణే చంద్రసూర్యయోః ॥ ౫౦ ॥

తా॥ సూర్యచంద్ర గ్రహణంబులలో పాదగ్రాసమైన ౩ దినంబులనియును, అర్ధగ్రాసమైన ౪ దినంబులనియును, త్రిపాదగ్రాసమైన ౬ దినంబులనియును, సంపూర్ణగ్రాసంబున ౮ దినంబులు వర్జ్యంబులనియును వసిష్ఠవచనము.

# ముహూర్త రత్నావళియందు.

శ్లో॥ నిత్యైనైమిత్తికేకామ్యే జప హోమక్రియాసుచ ।
ఉపాకర్మణిచోత్సర్గే గ్రహవేధో నవిద్యతే ॥ ౫౧ ॥

తా॥ సంధ్యోపాసనాది నిత్యకర్మలకును, నామకరణాదినైమిత్తికకర్మలకును, కృత్యాప్రయోగాది కామ్యకర్మలకును, మంత్రజపంబులకును హోమక్రియలకును, ఉపాకర్మకును, ఉత్సర్జనంబునకును గ్రహణవేధలేదు. అనిగురువచనము.

శ్లో॥ స్వజన్మమాసర్క్షతిథిక్షణేషు। వైనాశ కాద్యశ్రుతగణేషు
భేషు। నోద్వాహమాత్మాభ్యుదయాభిలాషీ। నైవాద్య
గర్భద్వితయంకదాచిత్ ॥ ౫౨ ॥

తా॥ తాను పుట్టిన నెలలోను దినమున నక్షత్రమునను క్షణమునను వైనాశకాది యోగదినంబులయందును వివాహము ఆద్యగర్భము తగదని వసిష్ఠవచనము.

శ్లో॥ నకుర్యాన్మంగళంవిష్ట్యాంజీవితార్థీ కదాచన ।
కుర్వన్నజ్ఞస్తదాక్షిప్రంతత్సర్వంనాశతాంవ్రజేత్ ॥ ౫౩॥

తా॥ శుభకార్యంబులను విష్టియనగా భద్రయని పంచాంగమున వ్రాయంబడుకరణమున చేయరాదు. తెలియక చేసిననది నాశనంబగునని వసిష్ఠవచనము.

శ్లో॥ సవైధృతో యోవ్యతిపాతయోగః । సర్వోప్యనిష్టః పరి
ఘార్ధమాద్యం ॥ సదైవదశేపిత్రుకర్మచైవ ।
నాన్యద్విధేయం శుభపాష్టికాద్యం ॥ ౫౪ ॥

తా॥ అమావాస్యనాడు అంతయును, వైధృతివ్యతీపాతయోగంబులయందు అంతయును, పరిఘుయోగమున మొదటి అర్ధభాగంబును, సర్వశుభకర్మలకు వర్జ్యంబని వసిష్ఠవచనము.

శ్లో॥ అవమాఖ్యం తిథేర్దోషం కేంద్రగో దేవపూజితః ।
హంతియద్వత్పాపచయంవ్రతం ద్వైవార్షికంయథా ॥
త్రిద్యుస్పృగాహ్వయం దోషం సౌమ్యః కేంద్రగత స్తదా ।
హంతియద్వత్పాపచయ మశూన్యశయనవ్రతం ॥ ౫౫ ॥

తా॥ పంచాంగగతమైన అవమతిథి శుభకర్మలకుపనికిరాదు. విధిలేక దానినాచరించవలసిన నప్పుడు లగ్నమునకు కేంద్రమున గురుడుండిన చో నాదోషమును ద్వైవార్షికవ్రతము పాపములనుపరిహరించినట్లు గురుడు పరిహరించును. త్రిద్యుస్పృగనిన మూడుదినములలో సంబంధించినతిథి శుభకర్మకుతగదు, విధిలేక చేసికొనిన నాటిలగ్నమునకు కేంద్రమున బుధుడున్న చో నాబుధుడు అశూన్యశయనవ్రతము పాపములను పరిహరించునట్లు దోషమును పరిహరించునని వసిష్ఠవచనంబులు.

శ్లో॥ యస్మిన్దినేమహాపాత స్తద్దినంవర్జయేచ్ఛుభే ।
అపిసర్వగుణోపేతం దంపత్యోర్మరణప్రదం ॥ ౫౬ ॥

తా॥ పంచాంగములలో వ్యప, వైప, అని వ్రాయబడినదినము మహావ్యతీపాత దినమనబడును. ఆదినము సర్వమంగళగుణంబులతో నిండియున్నను వర్జించవలయును. అట్లువర్జించక శుభకర్మనాచరించిన నా దంపతులకు హానియని నారదవచనంబు.

గీ॥ ముహూర్త రత్నావళియందు.

శ్లో॥ విష్కంభవజ్రయోస్తిస్రః షట్చగండాతిగండయోః ।
వ్యాఘాతే నవశూలేతు పంచనాడ్యస్తుగర్హితాః ॥౫౭॥

తా॥ విష్కంభము వజ్రము ఈయోగంబులలో మొదట ౩గడియలును, వ్యాఘాత యోగమున ౯ గడియలును, శూలయోగమున ౫ గడియలును, నింద్యములుగావున నాసమయంబున శుభకర్మలుతగదని కశ్యప వచనము.

శ్లో॥ చతుర్దశీ చతుర్థీచ అష్టమీ నవమీతథా ॥
షష్ఠీచద్వాదశీచైవ పక్షచ్ఛిద్రాహ్వయా ఇమాః ॥౫౮ ॥
క్రమాదేతాసు తిథిషు వర్జనీయాశ్చనాడికాః ।
భూతాష్టమనుతత్త్వాంక దశశేషాస్తుశోభనాః ॥ ౫౯॥
దోషనాడీషుయత్కర్మ శుభంసర్వంవినశ్యతి ।
వివాహేవిధవానారీ వ్రాత్యస్స్యాచ్చోపనాయనే॥ ౬౦॥
సీమంతేగర్భనాశస్స్యాత్ ప్రాశనేమరణంధ్రువం ।
అగ్నినాదహ్యతేక్షిప్రం గృహారంభేవిశేషతః ॥ ౬౧ ॥
రాజరాష్ట్రవినాశస్స్యాత్ ప్రతిష్ఠాయాంవిశేషతః ।
కిమత్రబహునోక్తేన కృతంకర్మవినశ్యతి ॥ ౬౨ ॥

తా॥ చతుర్దశిలో మొదటి ౫ గడియలును, చవితిలో మొదటి౮ గడియలును, అష్టమిలో మొదటి ౧౪ గడియలు, నవమిలో మొదటి ౨౫ గడి

యులు, షష్ఠిలో౯ గడియలు, ద్వాదశిలో మొదటి ౧౦ గడియలును, అతి ఘులు పక్షచ్ఛిద్రతిథులు గావున వర్జ్యంబు లనబడినవి. తక్కినఘటికలు శుభకరంబులు. ఆవర్జ్యకాలమున వివాహము చేసిన వధువు విధవయగును. ఉపనయము చేసిన వటువు భ్రష్టుండగును. సీమంతమునాచరించిన గర్భనాశన మగును. అన్నప్రాశనము మరణమునిచ్చును. ఇల్లుకట్టిన కాలిపోవును. దేవ ప్రతిష్ఠం జేసిన రాజునకును రాష్ట్రమునకును హానిఁ జేయును. ఎక్కువ చెప్పవ లసిన దేమి సకలశుభకర్మలకును తగదని వసిష్ఠవచనంబులుఁగలవు.

## ౨౪. కులికాదిదుర్ముహూర్తములు.

శ్లో॥ శైలాక్షవేదాస్త్రర్త్వబ్ధి నాగాః పంచాగ్నిబాహవః ।
వేదాక్షిబాణాలోకైకే భాస్త్వక్షిగిరివహ్నయః ॥౬౩॥
చంద్రర్తుతర్క్యాః కులిక యమఘంటార్ధయామకాః ।
ప్రహరార్ధప్రమాణాస్తే భానువారాదితఃక్రమాత్ ॥

తా॥ పగటినాలుగు జాములను రెట్టించిన ౮ అరజాములగును. వీట్లలో; రవివారమున ౭-౫-౪; సోమవారమున ౬-౪-౭; మంగళవారమున ౫-౩-౨; బుధవారమున ౪-౨-౫; గురువారమున ౩-౧-౮; శుక్రవారమున ౨-౭-౩; శనివారమున ౧-౬-౬; వరుసగా నుండు అరజాములు కులిక యమఘంట అర్ధయామంబనిన కాలవేలయును దుర్ముహూర్తంబు లనంబడును. అనికశ్యపవచనము. ఇవి వార దుర్ముహూర్తంబులని చెప్పంబడుచున్న యవి.

 ముహూర్తరత్నావళియందు.

శ్లో॥ నిధనం ప్రహరార్ధే తు నిస్స్వం యమఘంటకే ।
కులికే సర్వనాశస్స్యాద్రాత్రావేతే న దోషదాః ॥౬౪॥

తా॥ ప్రహరార్ధమను కాలవేలాదుర్ముహూర్తము దెబ్బనిచ్చును. యమఘంటయను దుర్ముహూర్తము దారిద్ర్యమునిచ్చును. కులికమను దుర్ముహూర్తము సర్వమును నాశముఁజేయును. వీటిదోషము రాత్రికాలమునలేదని వసిష్ఠవచనము.

శ్లో॥ వింధ్యస్యోత్తరకూలే తు యావదాతుహిమాచలం ।
యమకంటకదోషోస్తి నాన్యదేశేషు విద్యతే ॥ ౬౬ ॥
మత్స్యాంగమగధాంధ్రేషు యమఘంటస్తు దోషకృత్ ।
కాశ్మీరే కులికం దుష్టమర్ధయామస్తు సర్వతః ॥ ౬౭ ॥

తా॥ వింధ్యనుండి హిమవంతమువరకు యమకంటకదోషంబనియును, మత్స్యాంగమగధాంధ్ర దేశంబులలో యమఘంట దోషంబుగలదనియును, కాశ్మీరంబున కులికంబు దోషమనియును, అర్థయామంబను కాలవేలాదోషము అంతట నన్నిదేశంబులలోను వర్తించుచుండునని గర్గవచనముగలదు. కావున దేశభేదముల ననుసరించియాచారంబులు భిన్నంబులయ్యె.

౨౫ హోలాష్టకనిషేధము.

శ్లో॥ శుక్లాష్టమీం సమారభ్య ఫాల్గునస్య దినాష్టకం ।
పూర్ణిమావధికం త్యాజ్యం హోలాష్టకమిదం శుభే ॥౬౮॥

తా—ఫాల్గునమాసమున శుక్లాష్టమి మొదలు పూర్ణిమాంతమువరకు ఆ దినములను శుభకర్మలకు వదలవలయును. అనిశీఘ్రబోధమున చెప్పంబడియున్నది. అచ్చటనే;—

శ్లో॥ శుతుద్ర్యాంచవిపాశాయా మిరావత్యాం త్రిపుష్కరే
హోలాష్టకం వివాహాదౌ త్యాజ్యమన్యత్రశోభనం ॥

తా॥ శుతుద్రానది, విపాశానది, ఇరావతి, ఈనదీతీరములవారికిని త్రిపుష్కర దేశము వారికిని ఈహోలికాష్టకము అశుభకరము. వివాహాదుల లోతక్కిన వారికిశుభదము.

## ౨౮. భద్రాపవాదము.

శ్లో॥ కన్యాతులా మకరధన్విషు నాగలోకే ।
మేషాళివైణికవృషేషు సురాలయేస్యాత్ ।
పాఠీనసింహఘట కర్కటకేషుమర్త్యే ।
చంద్రేవదంతిమునయ స్త్రివిధాంహివిష్టిం ॥ ౨౦ ॥

తా॥ కన్యా తులా, మకర, ధనూ రాసులలో చంద్రు డుండునపుడు నాగలోకంబులోను; మేషము, వృశ్చికము, మిథునము, వృషభము ఈ రాసులలో చంద్రుడుండిన స్వర్గలోకమునను; మీన, సింహ, కుంభము, కర్కాటకము, వీట్లలో చంద్రుడుండినపుడు మర్త్యలోకమునను విష్టియను భద్రాకరణముండుననిన దానిశుభాశుభంబులు ఆచ్చటి వారికని యెఱుంగవలయునని భూపాలవల్లభీయగ్రంథమున చెప్పంబడినది.

౨౨ ముహూర్త రత్నావళియందు.

శ్లో॥ వధబంధవిషాగ్న్యస్త్ర చ్ఛేదనోచ్చాటనాదియత్ ।
తురంగమహిషోష్ట్రాది కర్మ విష్ట్యాంతుసిద్ధ్యతి ॥ ౭౧ ॥
నకుర్యాన్మంగళం విష్ట్యాం జీవితార్థీ కదాచన ।
కుర్వన్నజ్ఞస్తదాక్షిప్రం తత్సర్వంనాశతాంవ్రజేత్ ॥౭౨॥

తా॥ హింస బంధనము, విషప్రయోగము, అగ్నికృత్యము, ఛేదము. వెళ్లగొట్టుట, వీట్లు మొదలగువాటిలోను; గుఱ్ఱములు, ఎనుములు, ఒంటెలు, వీటిపనులలోను,విష్టియత్యంతశుభకరము. బ్రతుకవలయునను నాశగలవాండు తక్కినశుభకర్మలలో నీవిష్టినివదలవలయును. తెలియకచేసినచో సర్వము నాశనమగును. అని వసిష్ఠవచనంబులుగలవు.

## ౨౭. మలమాస త్యాజ్యము.

శ్లో॥ అగ్న్యాధానం ప్రతిష్ఠాంచయజ్ఞదాన వ్రతానిచ ।
వేదవ్రతవృషోత్సర్గ చూడాకరణంమేఖలాః ॥ ౭౩ ॥
మాంగల్యమభిషేకంచ మలమాసేవివర్జయేత్ ।
గ్రహప్రవేశగోదాన స్థానాశ్రమమహోత్సవం ॥ ౭౪ ॥

తా॥ అసంక్రాంతిమాసము అధికమాసంబనబడును. అదియేమలమాసము. దానిలో ఆధానము, దేవప్రతిష్ఠ,గ్రహప్రవేశము, ఉత్సవంబులు, వివాహము, ఉపనయనము, చౌలము, వ్రతాదులు, పట్టాభిషేకము, ఇంకనితర మంగళకృత్యములు,వీట్లనాచరించతగదు. ఇట్లే ద్విసంక్రాంతి మాసము క్ష

యమాసంబనబడును. అది బహుసంవత్సరములకు గల్గునది గావున నావిచారము ఇచ్చట వ్రాయంబడలేదు.

౮౮. గురుశుక్రాస్తాది దోషము.

శ్లో॥ బాలేశుక్రేవృద్ధేజీవే వృద్ధేశుక్రేజీవేబాలే ।
జీవేసింహేసింహాదిత్యే జీవాదిత్యేనక్రేజీవే ॥ ౭౫ ॥

తా॥ గురుశుక్రులు అస్తంగతులైనపుడును, వారు అస్తమగుటకు మునుపు ౭ రోజులు వృద్ధులనంబడియుండు నపుడును, ఉదయమైనతరువాత ౭ రోజులుబాలురని బడియుండునపుడును, గురువుసింహమునందుండు నపుడును, ఒకరాసిలో రవిగురుపులుండు నపుడును, గురుమకరంబుననుండు నపుడును, వివాహాది శుభకార్యంబులు తగవని యెఱుంగవలయును. ఈవచనము సామాన్యముగా సంగ్రహమైనవచనము, దీనికిమునివచనంబులేవియనిన.

శ్లో॥ ఏకరాసిగతౌసూర్య జీవౌస్యాతాంయదాపునః ।
వ్రతబంధవివాహాది శుభకర్మాఖిలంత్యజేత్ ॥ ౭౬ ॥

అనిశౌనకవచనంబు.

గురుక్షేత్రగతోభానుః భానుక్షేత్రగతోగురుః ।
గుర్వాదిత్యస్సువిజ్ఞేయః గర్హితస్సర్వకర్మసు ॥ ౭౭ ॥

అనిగురుసి వచనంబు.

బాలేవాయదివావృద్ధే శుక్రేవాస్తంగతేగురౌ ।
మలమాసఇవైతాని వర్జయేద్దేవదర్శనం ॥ ౭౮ ॥

అని వృద్ధగర్గవచనము.

## ౨౯. సింహామకరగుర్వపవాదము.

శ్లో॥ భాగీరథ్యుత్తరేకూలే గౌతమ్యాదక్షిణేతటే ।
విహాహోవ్రతబంధోవా సింహస్థేజ్యేనదుష్యతి ॥ ౨౯ ॥

తా॥ గంగకుత్తరమున గోదావరికి దక్షిణమున సింహగురు దోషము లేదని వసిష్ఠవచనము.

శ్లో॥ మాగధేగౌడదేశేచ సింధుదేశేచకొంకణే ।
వ్రతంచూడాంవివాహంచ నర్జయేన్మకరేగురౌ ॥ ౩౦ ॥

తా॥ మగధదేశమునందు, సింధుదేశమునందు, కొంకణదేశమున, గౌడదేశమున, మకరగురుదోషము ముఖ్యము. తక్కినచోట్లలోలేదు. అని దైవజ్ఞమనోహర గ్రంథమున నుదాహృతవచనము.

## ౩౦ గురుశుక్రసమసప్తక దోషము.

శ్లో॥ సమసప్తకయోర్జీవ శుక్రయోశ్చపరస్పరం ।
తదామూఢసమోదోషః శుభకార్యవినాశదః ॥ ౩౧ ॥

తా॥ గురుశుక్రులు సమసప్తకమున నుండునపుడు అది మూఢదోషమువంటిదిగావున నాకాలమున శుభకార్యంబులనాచరించ రాదని వసిష్ఠవచనంబుగలదు.

## ౩౧. వారప్రవృత్తి తత్ప్రయోజనంబును.

శ్లో॥ వారప్రవృత్తిగఽదితా దినేశాత్కాలాఖ్య హోరాఽపత

యః క్రమేణ । సార్ధేననాడీ ద్వితయే నషష్ఠః షష్ఠశ్చ
షష్ఠశ్చపునః పునః స్యాత్ ॥ ౮౨ ॥

తా॥ సూర్యునినుండి వారప్రవృత్తి చెప్పంబడినది. ౨౹గడియచొప్పున ననగా నిక్కాలపుగంటా ప్రమాణము క్రమముగా రవి చంద్ర కుజ బుధ గురు శుక్రశనులలో మరలమరల వారిలో నారవవారు వరుసగా హోరాధిపతులగుచుందురు. అనగా నర్క శుక్ర బుధ చంద్ర మంద జీవ కుజహోరలు ఆదిత్యవారమునాడు వరుసగా నిట్లే ౨౪ గంటలకు త్రిప్పుచుపోయిన ౨౫వది సోమహోర యగుచున్నదిగాన సోమవారంబైయె. అదిమొదలు అనగా చంద్రహోరనుండి త్రిప్పిన ౨౫ వ-హోర మంగళవారము, దానికి ౨౫వది బుధవారము, దానికి౨౫వది గురువారము, దానికి ౨౫వది శుక్రవారము, దానికి ౨౫వది శనివారము. ఇట్లువారప్రవృత్తి హోరననుసరించివచ్చినదియని భావము ఇదివసిష్ఠవచనము దీనిప్రయోజనంబేమనిన :—

శ్లో॥ యస్యఖేటస్య యత్కర్మ వారే ప్రోక్తం విధీయతే।
గ్రహస్యక్షణవారేపి తస్యతత్కర్మ సర్వదా ॥ ౮౩ ॥

తా॥ ఏగ్రహోద్దేశముగా నేకర్మచెప్పంబడునో, మఱియునేకర్మ ఏవారంబున విధింపంబడునో, దానిని ఆవారంబున నాగ్రహహోరలో జరుపుట శుభకరంబని నారదవచనము.

౩౨. ప్రశ్నకాలికహోరా ప్రయోజనము

శ్లో॥ భానుహోరాప్రవృత్తింకుర్యాచ్చంద్రహోరాస్థిరాసనం।
కారాబంధంభౌమహోరా బుధహోరాచపుత్రదా।౮౪

వస్త్రాలంకారదాజీవహోరా శౌక్రీవివాహదా।
జడత్వంశనిహోరాయాం సప్తహోరాఫలంత్విదం॥౨౫॥
ప్రశ్నకాలేయదా హోరాతదాఫల మవాప్నుయాత్॥
తాత్కాలికగ్రహస్థిత్యా సంయోజ్య ఫలమాదిశేత్ ।

తా॥ ప్రశ్నకాలమున నేహోరయో దానినెఱింగి, రవిహోరయైన చో మృతిని, చం-స్థిరతను, కు-కారాగారమును, బు-పుత్రప్రదము, గు-వస్త్రాలంకారమును, శు-వివాహమును, శ-జడత్వమును, హోరాఫలమును మిశ్రముచేసికొని తత్కాలగ్రహస్థితిఫలముతో ప్రశ్నజెప్పవలయును.

౩౩. ఇష్టేనక్షత్రంబులందును ఫలప్రయోజనము.

శ్లో॥ యస్మిన్ఋక్షేతు యత్కర్మనిఖిలం కథితంచయత్।
తద్దైవత్యేతన్ముహూర్తే కార్యాంయాత్రాదికంతథా ॥

తా॥ ఏనక్షత్రంబుననే కర్మవిధింపబడునో తద్దేవతాకంబైన తన్ముహూర్తమున ప్రయాణాది తత్కర్మ చేయబడవలయునని నారదవచనము.

౩౪. శుభకర్మ వర్జదినములు.

శ్లో॥ అయనేవిషువేచైవ శయనేబోధనేహరేః।
అనధ్యాయంప్రకుర్వీత మన్వాదిషుయుగాదిషు ॥ ౨౭ ॥

తా॥ దక్షిణాయనము ఉత్తరాయనము అను పర్వదినములయందును ఆషాఢశుక్లైకాదశీ కార్తికశుక్లైకాదశీ దినములయందును, మన్వాదులలో,

ను, యుగాదులలోను, అనధ్యయనమనిన వేదపాఠంబును తదుపలక్షకంబగు శుభకర్మలను వదలవలయును, అనియౌశనసస్మృతి వచనము ఇవి స్నానదానవ్రతతర్పణ శ్రాద్ధయోగ్యంబులుగానున్నవి యెట్లనిన ;—

## ౩౫. యుగాదులు.

శ్లో॥ కార్తికేశుక్లనవమీచాదిః కృతయుగస్యసా।
త్రేతాదిర్మాఘవేశుక్లాతృతీయాపుణ్యసంమితా॥౯౯॥
కృష్ణాపంచదశీమాఘేద్వాపరాదిరుదీరితా॥
కల్యాదిస్స్యాత్కృష్ణపక్షేనభస్యేచత్రయోదశీ ॥౧౦౦॥

తా॥ కార్తిక శు౯కృతయుగాది; వైశాఖ శుక్ల ౩ త్రేతాయుగాది; మాఘకృ ౩౦ద్వాపరాది ; భాద్రపదకృష్ణ ౧౩కలియుగాది ; అనినారదవచనంబు. ఇవిశుభములకుతగవు.

## ౩౬. మన్వాదులు.

శ్లో॥ ఆశ్వయుక్శుక్లనవమీ కార్తికే ద్వాదశీతథా.
తృతీయాచైత్రమాసస్య తథాభాద్రపదస్యచ ॥ ౧౦౧ ॥
శ్రావణస్యత్వమావాస్యా పౌషస్యైకాదశీతథా।
ఆషాఢస్యాపిదశమీ మాఘమాసస్యసప్తమీ ॥ ౧౦౨ ॥
శ్రావణస్యాష్టమీకృష్ణా ఆషాఢస్యాపిపూర్ణిమా।
కార్తికే ఫాల్గునే చైత్రే జ్యేష్ఠే పంచదశీ సితా ॥౧౦౩॥

మన్వంతరాదయశ్చైత్రాదత్తస్యాక్షయకారికాః॥౯౪॥

తా॥ ఆశ్వయుజశుక్ల ౯; కార్తికశుక్ల ౧౨; చైత్రశుక్ల ౩; భాద్రపదశు ౩; శ్రావణకృ ౩౦; పుష్యకృ ౧౧; ఆషాఢ కృ ౧౦; మాఘశుక్ల ౭; శ్రావణకృ ౮; ఆషాఢశు ౧౫; కార్తికశు ౧౫; ఫాల్గునశుక్ల ౧౫; చైత్రశుక్ల ౧౫; జ్యేష్ఠశుక్ల ౧౫;—ఇవి ౧౪ను మన్వంతరంబులనంబడును. ఈదినములలో చేయుదానధర్మంబులును అక్షయఫలదంబులని మత్స్యపురాణ వచనంబులు.

ఇట్లు సామాన్యశుభాశుభ ప్రకరణంబు.

---

# ముహూర్తరత్నావళి.

ఆంధ్రతాత్పర్య సమేతంబయినది.

---

# (౨) నక్షత్రప్రకరణము.

---

## ౩౭. అశ్విన్యాదినక్షత్రాధిపతులు, తన్నక్షత్రకృత్యములును.

అవతారిక॥ నక్షత్రప్రకరణమున మొదట నిచ్చట నక్షత్రాధిపతులను వాటికృత్యంబులను తెలుపునట్టి నారదవచనంబులు చెప్పంబడుచున్నవి. ఎట్లనిన:—

# నక్షత్ర ప్రకరణము.

శ్లో॥ నక్షత్రేశాంక్రమాద్దస్ర యమవహ్నిపితామహాః ॥౯౫॥
చంద్రేశాదితిజీవాహీ పితరోభగసంజ్ఞితాః ।
అర్యమార్క త్వష్ట్రమరుచ్ఛక్రాగ్నిమిత్రవాసవాః ॥౯౬॥
నిరృత్యుదకవిశ్వేఽజ గోవిందో వసవోంబుపః ।
తతోజపాదహిర్బుధ్న్యః పూషాచేతి ప్రకీర్తితాః ॥౯౭॥

తా॥ వరుసగా నశ్విన్యాది నక్షత్రంబులకు అశ్వినీదేవతలే మొదలు గాగలవారు అధిపతులుగా నుందురు. వీటి యర్థమననుసరించియే చెప్ప బోవు శ్లోకంబులకు తాత్పర్యము వ్రాయంబడు చుండును.

శ్లో॥ వస్త్రోపనయనక్షౌర సీమంతాభరణక్రియా ।
స్థాపనాశ్వేభయానస్త్రీ కృషివిద్యాదయోశ్విభే ॥౯౮॥

తా॥ అశ్వినీదేవతలే అధిపతులుగాగల యశ్వినీనక్షత్రమున, నూతన వస్త్రధారణము, ఉపనయనము, క్షౌరము, సీమంతము, అలంకారము, దేవప్రతిష్ఠ, గజారోహణము, స్త్రీసుఖము, వ్యవసాయము, విద్యాభ్యాసము మొదలగువాటికి ప్రశస్తంబు.

శ్లో॥ వాపీకూప తటాకాది విషశస్త్రోగ్రదారుణాః ।
బిలప్రవేశగణిత నిక్షేపాయామ్యభేశుభాః ॥౯౯॥

తా॥ బావులుతోడుట, తటాకప్రతిష్ఠ, సరోవరనిర్మాణము, విషకృత్యము, శస్త్రకృత్యము, క్రూరకార్యములు, హింసాదులు, గవిజొచ్చుట, గణితము, నిధినెత్తుట, మొదలగువాటికి యమదేవతాకంబైన భరణీ నక్షత్రము శుభకరంబు.

శ్లో॥ అగ్న్యాధానాస్త్రశస్త్రోగ్ర సంధివిగ్రహదారుణాః ।
సంగ్రామౌషధవాదిత్ర క్రియాశ్చాస్త్రాశ్చవహ్నిభే॥ ౧౦౦॥

తా- అగ్నిదేవతాకమైన కృత్తికానక్షత్రము, అగ్న్యాధానము, అస్త్రవిద్య, శస్త్రాభ్యాసము, క్రూరకృత్యములు, మాధ్యస్థ్యము, యుద్ధము, హింస, జగడము, ఔషధసేవనము. సంగీతము, మొదలగు క్రియలను శాంచిది,

శ్లో॥ సీమంతోన్నయనోద్వాహ వస్త్రభూషా స్థిరక్రియా ॥
హయహస్త్యభిషేకాశ్చ ప్రతిష్ఠాబ్రహ్మభేశుభాః॥౧౦౧॥

తా॥ బ్రహ్మదేవతాకమైన రోహిణియందు- సీమంతము, ఉపనయనము, వివాహము, వస్త్రాలంకారములు, స్థిరమైనపనులు, అశ్వ గజ పట్టాభిషేకములు, దేవప్రతిష్ఠ, మొదలగువాటికి ప్రశస్తంబులు.

శ్లో॥ ప్రతిష్ఠాభూషణోద్వాహ సీమంతోన్నయనక్రియాః ।
క్షౌరవాస్తుగజోష్ట్రాశ్చ యాత్రాశ్చాస్త్రాశ్చచంద్రభే ॥

తా॥ చంద్రదేవతాకంబైన మృగశిరయందు- దేవప్రతిష్ఠ, భూషణములు, పెండ్లి, సీమంతము, ఉపనయనము, క్షౌరము, వాస్తుకృత్యములు, గజములు, ఒంటెలు, ప్రయాణము, వీట్లకు ప్రశస్తముగా నుండును.

శ్లో॥ ధ్వజతోరణసంగ్రామ ప్రాకారాస్త్రక్రియాశ్శుభాః ।
సంధివిగ్రహవైరాణి రసాద్యాశ్శర్వభే శుభాః ॥౧౦౩॥

తా॥ రుద్ర దేవతాకంబైన ఆర్ద్రయందు- ధ్వజతోరణా రోపణా దులు, యుద్ధము, గ్రామక్రియ, కోటలపని, ఆయుధక్రియలు, సంధివిగ్రహంబులు, శత్రుత్వము, రసవర్గపు పనులు, వీట్లనుత్తమంబు.

శ్లో॥ ప్రతిష్ఠాయానసీమంత వస్త్రవాస్తూపనాయనం ।
క్షౌరాశ్వకర్మాదితిభే విధేయంధాన్యభూషణం ॥౧౮౪॥

తా॥ అదితి దేవతాకంబైన పునర్వసువునందు దేవప్రతిష్ఠ, ప్రయాణము, సీమంతము, వస్త్రధారణము, వాస్తుకృత్యము. ఉపనయనము, క్షౌరము, అశ్వకర్మ, మొదలగువాటికి ప్రశస్తము.

శ్లో॥ యాత్రాప్రతిష్ఠాసీమంత వ్రతబంధప్రవేశనం ।
కరగ్రహంవినాసర్వం కర్మదేవేజ్యభేశుభం ॥ ౧౦౫ ॥

తా॥ ప్రయాణము, దేవప్రతిష్ఠ, సీమంతము, గృహప్రవేశము, వేదవ్రతాదులు, ఉపనయనము, వివాహముతప్ప తకిలిన శుభక్రియల కంతటికిని గురుదేవతాకంబైన పుష్యమి ప్రశస్తంబైనది.

శ్లో॥ అనృతంవ్యసనంద్యూతం ధాతువాదౌషధాదికం ।
వివాదరసవాణిజ్యం కర్మ కద్రుజభే శుభం ॥ ౧౦౬ ॥

తా॥ అనృతము, వ్యసనములు, ద్యూతము, ధాతువాదము, ఔషధసేవనాదులు, వివాదము, రసవర్గవ్యాపారము, వర్తకము, మొదలగువాటికి సర్పదేవతాకంబైన ఆశ్లేషానక్షత్రము ప్రశస్తమైనది.

శ్లో॥ కృషివాణిజ్యగోధాన్య రణోపకరణాదికం ।
విహానృత్తగీతాద్యం నిఖిలంకర్మపైతృభే ॥ ౧౦౭ ॥

తా॥ పితృదేవతాకంబైన మఖానక్షత్రమునందు;—వివాహము, నృత్తము, గీతము, వాద్యంబులు, కృషి, వర్తకము, గోధాన్య సంగ్రహము, యుద్ధసామగ్రుల సంగ్రహము, మొదలగు పనులకంతటికిని మంచిది.

శ్లో॥ వివాదవిషశస్త్రాగ్ని దారుణోగ్రాహవాదికం ।
పూర్వాత్రయేఖిలంకర్మ కర్తవ్యంమాంసవిక్రయః॥౧౦౮

తా॥ భగదేవతాకంబైన పూర్వఫల్గునియందును; జలదేవతాకంబైన పూర్వాషాఢయందును; అజైకపాద్దేవతాకంబైన పూర్వాభాద్రయందును;— వివాదము, విషశస్త్రవహ్ని కృత్యంబులు, హింసాకృత్యములు, క్రూరకృత్యము, యుద్ధము, మాంసవిక్రయము, మొదలగువాటికి మంచిది.

శ్లో॥ ప్రతిష్ఠోద్వాహసీమంతా భిషేకవ్రతబంధనం ।
ప్రవేశస్థాపనాశ్వే భవాస్తుకర్మోత్తరాత్రయే ॥౧౦౯॥

తా॥ అర్యమదేవతాకంబైన ఉత్తరఫల్గునియందును; విశ్వేదేవదేవతాకంబైన ఉత్తరాషాఢయందును; అహిర్బుధ్న్యదేవతాకంబైన ఉత్తరాభాద్ర యందును;— దేవప్రతిష్ఠ, వివాహము, సీమంతము, పట్టాభిషేకము, ఉపనయనము, గృహప్రవేశము, కలశస్థాపనము, వాస్తుకృత్యము, గజాశ్వ కృత్యములు మొదలగువాటికి మంచిది.

శ్లో॥ ప్రతిష్ఠోద్వాహసీమంత యానవస్త్రోపనాయనం ।
క్షౌరవాస్త్వభిషేకాశ్చ భూషణంకర్మభానుభే ॥౧౧౦॥

తా॥ సూర్యదేవతాకంబైన హస్తనక్షత్రమునందు:— దేవప్రతిష్ఠ, వివాహము, సీమంతము, ప్రయాణము, వస్త్రధారణము, ఉపనయనము, క్షౌరము, వాస్తుకృత్యములు, పట్టాభిషేకము, అలంకారము మొదలగు వాటికి ప్రశస్తంబు.

శ్లో॥ ప్రవేశవస్త్రసీమంత ప్రతిష్ఠావ్రతబంధనం ।
త్వాష్ట్రేభేవాస్తువిద్యాశ్చక్షౌరభూషణకర్మయత్ ॥౧౧౨

తా॥ త్వష్ట్ర దేవతాకంబైన చిత్రనక్షత్రమునందు;— గృహప్రవేశము, వస్త్రధారణము, సీమంతము, దేవప్రతిష్ఠ, ఉపనయనము, వాస్తుకృత్యము, విద్యాభ్యాసము, క్షౌరము, అలంకారాది కర్మలకును మంచిది.

శ్లో॥ ప్రతిష్ఠోపనయోద్వాహ వస్త్రసీమంతభూషణం ।
వివాదశ్చేభకృష్యాది క్షౌరకర్మసమీరభే ॥ ౧౧౩ ॥

తా॥ వాయుదేవతాకంబైన స్వాతీ నక్షత్రమునందు:— దేవప్రతిష్ఠ, ఉపనయనము, వివాహము, వస్త్రధారణము, సీమంతము, ఆభరణములు, వివాదము, కృషి, గజవాజి వాణిజ్యములు, క్షౌరము మొదలగువాటికి మేలుగా నుండును.

శ్లో॥ వస్త్రభూషణవాణిజ్య రసధాన్యాదిసంగ్రహః ।
ఇంద్రాగ్నిభేనృత్యగీత శిల్పలేఖనకర్మయత్ ॥ ౧౧౪ ॥

తా॥ ఇంద్రాగ్నిదేవతాకంబైన విశాఖయందు;— నూతనవస్త్రము భూషణంబులు, వాణిజ్యము, రసధాన్యాదుల సంగ్రహము, నృత్తము గీతము, శిల్పము, వ్రాతపనులు, మొదలగునవి ప్రశస్తంబులుగా జరుపనగును.

శ్లో॥ ప్రవేశస్థాపనోద్వాహ వ్రతబంధాష్టమంగళం ।
వస్త్రభూషణవాస్తుశ్చమైత్రభే సంధివిగ్రహం ॥౧౧౪॥

మిత్రదేవతాకంబైన అనూరాధా నక్షత్రమునందు - గృహప్రవేశము, స్థాపనము, వివాహము, ఉపనయనము, అష్టమంగళంబులు, వస్త్రాలంకారంబులు, అభరణంబులు, వాస్తుకర్మ, సంధివిగ్రహంబులు, మొదలగువాటికి మిక్కిలి ప్రశస్తంబు.

శ్లో॥ క్రూరోగ్రశస్త్రవాణిజ్య గోమహిష్యంబుకర్మచ ।
ఇంద్రభేనృత్యవాదిత్ర శిల్పలోహాశ్మలేఖనం ॥ ౧౧౫ ॥

తా॥ ఇంద్రదేవతాకంబైన జ్యేష్ఠానక్షత్రమునందు - క్రూరకృత్యములు, భయంకరకార్యంబులు, శస్త్రములు, వర్తకము, గోవులు, బర్రెలు, నీటిపనులు, నృత్తము, వాద్యము, లోహము, రాతిపనులు, శిల్పము, వ్రాతపనులు, మొదలగు వాటికిమంచిది.

శ్లో॥ వివాహకృషివాణిజ్య దారుణాహవ భేషజం ।
నిర్ఋతిభేనృత్యశిల్ప సంధివిగ్రహలేఖనం ॥ ౧౧౬ ॥

తా॥ నిరరుతిదేవతాకంబైన మూలానక్షత్రంబునందు;— సంధివిగ్రహంబులు, శిల్పము, లేఖనము, వివాహము, కృషి. వాణిజ్యము, క్రూరకృత్యములు, కలహము, ఔషధము, మొదలగువాటికి ప్రశస్తము.

శ్లో॥ ప్రతిష్ఠాక్షౌరసీమంత యానోపనయనౌషధం ।
పురగ్రామగృహారంభా విష్ణుభే పటబంధనం ॥ ౧౧౭ ॥

తా॥ విష్ణుదేవతాకంబైన శ్రవణమున;— దేవప్రతిష్ఠ, క్షౌరము, సీమంతము, ప్రయాణము, ఉపనయనము, ఔషధము, గ్రామపట్టణగృహ నిర్మాణంబులు, వస్త్రధారణంబు మొదలగువాటికి ప్రశస్తము.

శ్లో॥ వస్త్రోపనయనక్షౌర ప్రతిష్ఠాయానభూషణం ।
వసుభే వాస్తుసీమంతప్రవేశాఽస్త్ర విభూషణం ॥౧౧౮॥

తా॥ వసుదేవతాకంబైన ధనిష్ఠయందు;— వస్త్రధారణము, ఉపనయనము, క్షౌరము, సీమంతము, ప్రయాణము, దేవప్రతిష్ఠ, అలంకారము సీమంతము, వాస్తుకర్మ, గృహప్రవేశము, అస్త్రకర్మ, ఆభరణములు వీటికి మంచిది.

శ్లో॥ ప్రవేశస్థాపనక్షౌర మౌంజీబంధనభేషజం ।
అశ్వారోహణసీమంతం వాస్తు కర్మజలేశభే ॥ ౧౧౯ ॥

తా॥ వరుణదేవతాకంబైన శతభిషయందు;— గృహప్రవేశము, క్షౌరము, దేవస్థాపనము, ఉపనయనము, ఔషధము, గుఱ్ఱపుస్వారీ, సీమంతము, వాస్తుకృత్యము, మొదలగువాటికి మంచిదిగా నున్నది.

శ్లో॥ వివాహవ్రతబంధాశ్చ ప్రతిష్ఠాయానభూషణం ।
ప్రవేశవస్త్రసీమంత క్షౌర భేషజమంత్యభే ॥ ౧౨౦ ॥

తా॥ పూషదేవతాకంబైన రేవతియందు;— వివాహము, ఉపనయనము, దేవప్రతిష్ఠ, ప్రయాణము, అలంకారము, గృహప్రవేశము, వస్త్రధారణము, సీమంతము, క్షౌరము, ఔషధము, మొదలగువాటికి మంచిది.

## ౩౭. ధ్రువనక్షత్రములు; తత్కృత్యములును; వీటికివారనియమంబులును.

శ్లో॥ స్థిరసంజ్ఞంభచతుష్టయమంబు జజన్యృక్షముత్తరాత్రితయం । నరపతిపత్తనసదనం ప్రవేశబీజాది సిద్ధ్యతేత్రత్ర॥

తా॥ ఉత్తరఫల్గుని, ఉత్తరాషాఢ, ఉత్తరాభాద్ర, రోహిణి;— ఇవి ౪ ను ధ్రువసంజ్ఞయనిన స్థిరమను పేరుగల నక్షత్రంబులు. ఇవి పట్టాభిషేక, పట్టణనిర్మాణ, గృహనిర్మాణ, గృహప్రవేశ, బీజావాపాదులలో నుత్తమనక్షత్రంబులు. అని వసిష్ఠవచనము. దీనికి తగినట్లు ధ్రువాదులలో తగిన వారకృత్యములును ఉక్తంబులు ఎట్లనిన;—

శ్లో॥ నృపాభిషేకమాంగల్యసేవాయానాస్త్రకర్మయత్ । ఔషధాహవధాత్వాది విధేయంభానువాసరే ॥౧౨॥

తా॥ పట్టాభిషేకము, మాంగల్యము, సేవనము, ప్రయాణము, అస్త్రవిద్యాకృత్యము, ఔషధము, కలహము, ధాతువాదము మొదలగునవి భానువాసరమున తగినవియని నారదవచనము ఈధ్రువనక్షత్రప్రకరణ పతితమైయున్నది.

## ౩౮. చరనక్షత్రకృత్యములు సోమవారము.

శ్లో॥ అదితిః శ్రుతిభాత్రితయం చరసంజ్ఞంపంచకంమరుద్భంచ। వాహానకర్మవిభూషణచరకార్యోద్యానమంత్రసిద్ధ్యైతత్ ॥

తా॥ స్వాతి, శ్రవణము, ధనిష్ఠ, పునర్వసు, శతభిష;— ఇవి ౫ ను చరసంజ్ఞగల నక్షత్రములు. వీట్లిలో వాహనము, అలంకారము, మంత్రసిద్ధి, ఉద్యానము, మఱియును చరకృత్యములు, కాగలవని వసిష్ఠవచనము.

శ్లో॥ శంఖముక్తాంబురజత వృక్షేక్షుస్త్రీవిభూషణం ।
పుష్పగీతక్రతుక్షీర కృషికర్మేందువాసరే ॥ ౨౦౪ ॥

తా॥ చరనక్షత్రకృత్యంబులు, శంఖము, ముత్యములు, నీటిపనులు, వెండిపనులు చెరుకు మొదలగు వృక్షకృత్యములు, స్త్రీకృత్యము, అలంకారములు, పుష్పకార్యము, గీతము, పాలు వ్యవసాయము మొదలగునవి సోమవారంబున తగినవియని నారదవచనము.

౪౦. ఉగ్రనక్షత్రకృత్యములు-మంగళవారము.

శ్లో॥ పూర్వాత్రితయం పిత్ర్యభముగ్రాఖ్యమిదంచపంచకంయామ్యం । మారణభేదనబంధన విషహననంపంచభేకార్యం

తా॥ పూర్వఫల్గుని, పూర్వాషాఢ, పూర్వాభాద్ర, భరణి, మఖ;— ఈ ౫ ను ఉగ్రసంజ్ఞగల నక్షత్రములు. వీట్లిలో, కృత్యాప్రయోగములు బంధనము, ఛేదనము, విషవ్యాపారము, హింస మొదలగువాటికి తగునని వసిష్ఠవచనము.

శ్లో॥ విషాగ్నిబంధన స్తేయ సంధివిగ్రహమాసవం ।
ధాత్వాదికంప్రవాలస్త్రీ కర్మ భూమిజవాసరే ॥ ౨౦౫ ॥

తా॥ చరనక్షత్ర కృత్యంబులును, దొంగతనము, సంధివిగ్రహంబులు మద్యపానము ధాతువాదము పగడములపని స్త్రీకర్మ మొదలగునవి మంగళవారమున తగినదని నారదవచనము,

౪౧. మిశ్రనక్షత్రకృత్యములు. బుధవారము.

శ్లో॥ భద్వితయంశ్వసన సఖం సేంద్రాగ్నిభకం హిమిశ్ర సంజ్ఞంహి । నిఖిలానిచ సాధారణకార్యాణ్యుగ్రాణితత్రకార్యాణి ॥ ౧౨ ॥

తా॥ కృత్తిక, విశాఖ, ఇవి రెండును మిశ్రసంజ్ఞగలవి. వీట్లలో సాధారణములగు కృత్యములు, క్రూరకృత్యంబులును తగునని వసిష్ఠవచనము.

శ్లో॥ నృత్యశిల్పకలాగీత లిపిభూ రస సంగ్రహం ।
వివాహధాన్య సంగ్రాహ కర్మసౌమ్యస్యవాసరే ॥

తా॥ చరనక్షత్ర కృత్యంబులును, నృత్తము, శిల్పము, విద్య, గీతము భూమి, రసగ్రహణము, వివాహము, ధాన్యసంగ్రహము, మొదలగువాటికిని బుధవారము శుభకరమని నారదవచనము.

౪౨. లఘునక్షత్రకృత్యములు. గురువారము.

శ్లో॥ సురసచివాశ్వినిహస్తా స్తారాస్యుః క్షిప్రసంజ్ఞకాస్తాసు ।
ఔషధపణ్యవిభూషణ శిల్పకలాజ్ఞానకర్మసిద్ధిస్స్యాత్ ॥

తా॥ అశ్విని, హస్త, పుష్యమి, అభిజిత్తు:— ఇవినాల్గును లఘునక్షత్రంబు లనంబడును, వీట్లలో ఔషధము, వ్యాపారము, అలంకారము శిల్పము, విద్యాజ్ఞానకర్మలు తగునని వసిష్ఠవచనము.

శ్లో॥ యజ్ఞపుష్టికమాంగల్య స్వర్ణవస్త్రాదిభూషణం।
వృక్షగుల్మలతాయాన కర్మ దేవేజ్యవాసరే ॥ ౧౩౦ ॥

తా॥ లఘునక్షత్ర కృత్యంబులు యజ్ఞము, పుష్టికార్యము, మంగళ కార్యములు, వస్త్రాద్యలంకారము, వృక్షకృత్యము, పాదులపని, తీగెలపను లు ప్రయాణకృత్యము మొదలగువాటికి గురువాసరంబు ప్రశస్తంబని నారద వచనము.

## ౪౩. మృదునక్షత్రములు. శుక్రవారము.

శ్లో॥ మృదువృందం భచతుష్టయమంత్యత్వాష్ట్రాఖ్య సౌమ్య మిత్రర్క్షం। మంగళవనితాభూషణ మందిరగీతాని సిద్ధ్యంతి ॥ ౧౩౧ ॥

తా॥ మృగశిర. రేవతి, చిత్ర- అనూరాధ;— ఇవి నాల్గును మృదుసంజ్ఞగల నక్షత్రంబులు. వీట్లలో మంగళకృత్యములు, స్త్రీలు, అలంకారములు గృహము, గీతము, మొదలగునవి సిద్ధికరంబులని వసిష్ఠవచనంబు.

శ్లో॥ నృత్యవాదిత్రగీతాది స్వర్ణ స్త్రీ రత్నభూషణం।
భూషణోత్సవ గోధాన్య కర్మ భార్గవవాసరే ॥ ౧౩౨ ॥

తా॥ మృదునక్షత్ర కృత్యంబులు సువర్ణము, భూమి, పణ్యాకృత్యము గోవులు, ధాన్యకర్మ మొదలగువాటికి శుక్రవారము తగినదని నారద వచనము.

౪౪. తీక్ష్ణనక్షత్రములు. శనివారము.

శ్లో॥ దారుణభానిపురందర కోణప శివసర్పదైవాని ।
దారుణబంధన దహాన ప్రహారణ కర్మాణిసిద్ధిమాయాంతి

తా॥ జ్యేష్ఠ, మూల, ఆర్ద్ర, ఆశ్లేష;— ఇవి నాల్గును దారుణసంజ్ఞ గల నక్షత్రములు. వీట్లలో తీవ్రపుపనులు, బంధనము, కాల్చుట, కొట్టుట, మొదలగు పనులు తగియుండునని వసిష్ఠవచనంబు.

శ్లో॥ త్రపుసీసాయసాశ్మాస్త్ర విషపానా సవానృతం ।
స్థిరకర్మాఖిలంవాస్తు సంగ్రహం సౌరివాసరే ॥ ౧౩౪ ॥

తా॥ సీసము, తగరము, ఇనుము, రాతిపని, ఆయుధములు, విషముపానము, మధ్యము, అసత్యము, మఱియు స్థిరకృత్యంబులు గృహప్రవేశము, వాస్తుక్రియ, మొదలగువాటికి శనివారము ప్రశస్తంబైనదని నారదవచనము.

౪౫. అధోముఖనక్షత్రములు. తత్కృత్యములు.

శ్లో॥ భరణీకృత్తికాశ్లేషా మఖామూల విశాఖకాః ।
తిస్రఃపూర్వాస్తథాచైవ అధోవక్త్రాః ప్రకీర్తితాః॥
వాపీకూపతటాకాది జననంచ తృణాదికం ।
దేవతాగారజననం నిధానఖననంతథా ॥ ౧౩౬ ॥
గణితంజ్యోతిషారంభం ఖనీబిలప్రవేశనం ।
కుర్యాదధోగతాన్యేవ కార్యాణి వృషభధ్వజ ॥ ౧౩౭ ॥

తా॥ భరణి, కృత్తిక, ఆశ్రేష, మఖ, మూల, విశాఖ, పూర్వఫల్గుని పూర్వాషాఢ, పూర్వాభాద్ర;— అను నివి తొమ్మిదియును అధోముఖ నక్షత్రంబు లనంబడుచున్నవి. వీట్లలో బావిత్రొవ్వుట, కొలనుకట్టించుట తటాక నిర్మాణము, గడ్డిమొలిపించుట, దేవాలయారంభము, నిక్షేపముత్రివ్వించుట, గణితము, జ్యోతిషారంభము, గనులెత్తుట, బిలప్రవేశము, మొదలగువాటికి ప్రశస్తంబైన నక్షత్రంబులని గరుడ పురాణంబునగలదు.

౪౬. ఊర్ధ్వముఖనక్షత్రములు. తత్కృత్యంబులును.

శ్లో॥ రోహిణ్యార్ద్రాశ్లేథాపుష్యధనిష్ఠాచోత్తరాత్రయం ।
వారుణం శ్రవణం చైవనవచోర్ధ్వముఖాస్స్మృతాః॥౧౩౪
ఏషురాజ్యాభిషేకంచ పట్టబంధంచకారయేత్ ।
ఉచ్ఛ్రితానిచసర్వాణి కర్మాణిచ వృషధ్వజ ॥ ౧౩౫ ॥

తా॥ రోహిణి; ఆర్ద్ర, పుష్యమి, ధనిష్ఠ, ఉత్తరఫల్గుని, ఉత్తరాషాఢ, ఉత్తరాభాద్ర, శతభిష, శ్రవణము;— ఇవి ౯ యును ఊర్ధ్వముఖనక్షత్రంబులు. వీట్లలో, రాజ్యాభిషేకము, పట్టబంధము, మఱియు నింకయు నభివృద్ధికి రాతగిన పనులు, ఆభ్యుదయిక కర్మలు, యజ్ఞయాగాదులు, మొదలగువాటికి ప్రశస్తంబుగానుండును. అని గరుడపురాణవచనంబులు.

౪౭. తిర్యఙ్ముఖనక్షత్రములు. తత్కృత్యంబులు.

శ్లో॥ రేవతీచాశ్వినీచిత్రా స్వాతీహస్తః పునర్వసుః ।
అనూరాధామృగజ్యేష్ఠాఏతాః పార్శ్వముఖాః స్మృతాః॥

గజోష్ట్రాశ్వబలీవర్ద దమనం మహిషస్యచ ।
బీజానాంవపనంకుర్యా ద్గమనాగమనాదికం ॥ ౧౪౧ ॥

చక్రయంత్రరథాదీనాం నావాదీనాం ప్రవాహణం ।
పార్శ్వేషుయానికర్మాణి కుర్యాదేతేషుతానిచ ॥౧౪౨॥

తా॥ రేవతి, అశ్విని, చిత్ర, స్వాతి, హస్త. పునర్వసు, అనూరాధ, మృగశిర, జ్యేష్ఠ:—ఇవితొమ్మిది నక్షత్రంబులును తిర్యఙ్ముఖ సంజ్ఞ గలవిగానుండును. వీట్లలో, గజారోహణము, ఒంటెనెక్కుట, అశ్వవాహనము, ఎద్దులను వశపరచుట, ఎనుబోతులను స్వాధీనపరచుట, బీజావాపనము, గమనాగమనంబులు, రథచలనము, చక్రయంత్రచలనాదులు, నావలనుక్రొత్తగా విడుచుట, నాకారథాది ప్రయాణంబులు. ఇవియే మొదలగు కార్యంబులను చేయనగునని గరుడపురాణ ప్రోక్తంబు.

## ౪౭. నూతనవస్త్రధారణ ముహూర్తము.

శ్లో॥ రోహిణీషుకరపంచకేశ్విభేత్ర్యుత్తరేపిచపునర్వసుద్వయే
రేవతీషువసుదైవతే శుభే నవ్య వస్త్రపరిధాన మిష్యతే॥

తా॥ రోహిణీ, హస్త, చిత్ర, స్వాతి, విశాఖ, అనూరాధ, అశ్విని, ఉత్తర, ఉత్తరాషాఢ, ఉత్తరాభాద్ర, పునర్వసు, పుష్యమి, రేవతి, దనిష్ఠ ;— వీట్లలోనూతనవస్త్రిధారణముత్తమంబని శ్రీపతివచనము. వస్త్రిధారణవారఫలముకూడ శ్రీపత్యుక్తంబిట్లున్నది.

శ్లో॥ జీర్ణంరవౌసతతమంబుభిరార్ద్రమిందౌ। భౌమేశుచే బుధదినేచభవేద్ధనాయ॥ జ్ఞానాయమంత్రిణి భృగౌప్రియసంగమాయ। మందేమలాయచనవాంబరధారణంస్యాత్॥

తా॥ రవివారమున నూతనవస్త్రమును ధరించితే అదిత్వరగా జీర్ణమగును. సోమవారమున నెల్లప్పుడును తడిసియుండును, మంగళవారమున నపరిశుద్ధమగుచుండును. బుధవారమున ధనప్రదము. గురువారమున జ్ఞానప్రదము. శుక్రవారము స్త్రీసుఖదంబు. శనివారమున మలినంబగును.

౭౯. ప్రవాళశంఖ వలయకాంచనాది ధారణము.

శ్లో॥ కరాదిపంచకేశ్విభే సపౌష్ణ వాసరేస్మృతా।
ధృతిశ్చశంఖకాంచన ప్రవాళరక్తవాససాం॥ ౧౭౫॥

తా॥ హస్త, చిత్ర, స్వాతి, విశాఖ, అనూరాధ, అశ్విని, రేవతీ; వీట్లలో పగడములను శంఖములను, గాజులును, బంగారును, ఎఱ్ఱనిబట్టలు ధరించనగునని శ్రీపతివచనము. మఱియు "మాంజిష్ఠ కౌసుంభక రాగయోశ్చ మహీసుతః కాంచనభూషణేషు" =రంగుబట్టలను బంగారుసొమ్ములను మంగళవారమున ధరించనగుననియును అచ్చటనే చెప్పంబడియున్నది.

౮౦. మౌక్తికరత్నాభరణాది ధారణము.

శ్లో॥ నాసత్యపౌష్ణవసుభైః కరపంచకేన। మార్తాండభౌమగురుదానవమంత్రివారైః॥ ముక్తాసువర్ణమణివిద్రుమశంఖదంత। రక్తాంబరాణి విధృతానిభవంతిసిద్ధ్యై॥ ౧౭౬॥

తా॥ పైగాచెప్పిన నక్షత్రంబులలోను, గురుశుక్ర రవిమంగళవారంబులలో ముత్యములు భంగారుసొమ్ములు పగడములు శంఖములు దంతములు ఎఱ్ఱవస్త్రములు వీట్లనుధరించుటకు తగునని శ్రీపత్యాచార్యవచనంబు.

౫౧. స్త్రీలకునూతనవస్త్రభూషణ ధారణలో విశేషము.

శ్లో॥ రోహిణీగురుపునర్వసూత్తరేయాబిభర్తినవవస్త్రభూషణం
సానయోషిదవలంబతేపతింస్నానమాచరతివారుణేపివా

తా॥ రోహిణి, పునర్వసు, పుష్యమి, ఉత్తరఫల్గుని, ఈనక్షత్రంబులలో ఏస్త్రీనూతనవస్త్రంబులను ధరించునో నూత్నభూషణంబులను ధరించునో శతభిషానక్షత్రమున నభ్యంగస్నానముచేయునో నామగువ పతిని విడనాడునని ఫలము చెప్పంబడుటచేతనవి తగవు. వీనికనుగుణంబుగా చండేశ్వరవచనంబుగల దెట్లనిన:—

౫౨. స్త్రీలకు శతభిషాస్నాననిషేధము.

శ్లో॥ స్నానంకుర్వంతియానార్యశ్చంద్రేశతభిషాన్వితే ।
సప్తజన్మభవేద్వంధ్యావిధవాదుర్భగాధ్రువం ॥౧౪౮॥
ప్రమాదాచ్ఛతభంస్నానం నారీణాంయదిజాయతే।
పూజయేత్స్వామినంతత్ర చాత్మనాచధనేనచ ॥౧౪౯॥

తా॥ శతభిషలోచంద్రుడుండగా నభ్యంగస్నానముచేసిన వనితయేడుజన్మములు గొడ్రాలును, విధవయును, జారిణియును, అగును గాన. తెలియక చేసినచో ఆమగువ వెంటనే శక్తికొలది, సుబ్రహ్మణ్యస్వామి నారాధించితద్దోషపరిహారము నందవలయునని చెప్పంబడియున్నది.

## ౫౩. ఆకస్మికదగ్ధ వస్త్రఫలవిశేషము.

శ్లో॥ నవాంశుకంసమంకృత్వా చింతయేచ్చ శుభాశుభం ।
వసంతి దేవతాఃకోణే చాంత్యమధ్యద్వయేనరాః ॥౧౫౦॥
మధ్యాంశత్రితయేదైత్యా శ్చైవంశయ్యాసనాదిషు ।
అర్థప్రాప్తిర్దేవతాంశే పుత్రవృద్ధిర్నరాంశకే ॥ ౧౫౧ ॥
హానిఃపీడాపిశాచాంశే సర్వప్రాంతేష్వశోభనం ।
శంఖచక్రాంబుజచ్ఛత్ర ధ్వజతోరణసన్నిభాః ॥౧౫౨॥
శ్రీవత్ససర్వతో భద్ర నంద్యావర్త గృహోపమాః ।
వర్ధమానస్స్వస్తికేన మృగకూర్మ ఝషాకృతిః ॥౧౫౩॥
భేదాకృతిర్దైత్య భాగే స్యాయురర్థ ప్రదానృణాం ।
ఖరోష్ట్రోలూకకాకాహి జంబుకశ్వవృకోపమాః॥౧౫౪॥
త్రికోణసూర్యాకృతయో దేవభాగేప్యశోభనాః ।
నిందితంవసనందద్యా ద్ద్విజేభ్యస్స్వర్ణసంయుతం॥ ౧౫౫॥
ఆశిషోవాచనంకృత్వా త్వన్య ద్వస్త్రంచధారయేత్ ।
తద్దోషపరిహారస్స్యా దితికశ్యపభాషితం ॥ ౧౫౬ ॥

తా॥ ఆకస్మికముగా కప్పుకొన్నదో కట్టికొన్నదో వస్త్రము నిప్పుతగిలి కొంతకాలిపోయినపుడు, ఆవస్త్రమును తొమ్మిదిభాగములుగా విభాగముచే

సరా ముహూర్త రత్నావళియందు.

తా॥ హస్త, చిత్త, స్వాతి, పుష్యమి, పునర్వసు, శ్రవణము, ధనిష్ఠ, శతతార, అశ్విని, రేవతి, అనూరాధ, మూల; ఆదిత్యవారము. శుభదినములలోను;—వీట్లలో వైద్యముజేయుటకు ప్రశస్తముగానుండునని వసిష్ఠవచనము.

౫౮. ఆయుర్దాయకర యోగంబులు.

శ్లో॥ షట్సప్తాష్టాంత్యశుద్ధాచ బలినశ్శుభఖేచరాః ।
ఆయుర్దాయకరేయోగే కర్తవ్యాహ్యౌషధక్రియా

తా॥ లగ్నమునకు ౬-౭-౮-౧౨లో గ్రహములు లేకయుంశుట, శుభగ్రహములు బలవంతులైయుండుట, ఇట్టి ఆయుర్దాయయోగమునందు ఔషధక్రియ ప్రసస్తమని కశ్యపవచనము.

౫౯. వైద్యమునకు జన్మనక్షత్రనిషేధము.

శ్లో॥ జన్మనక్షత్రగశ్చంద్రః ప్రశస్తస్సర్వకర్మసు ।
క్షౌరభైషజ్యవాదాధ్వ కర్తనేషుచ వర్జయేత్ ॥ ౧౬౨॥

తా॥ తానుపుట్టిననక్షత్రమున చంద్రుడుండునపుడు అన్నిపనులకును ప్రశస్తము. క్షౌరము, వైద్యము, వివాదము, ప్రయాణము, ఛేదనము, ఈపనులకు జన్మనక్షత్రము నిషిద్ధమనిదీపికా వచనము.

౬౦. సూచీకర్మముహూర్తము.

శ్లో॥ అదితివాసవంత్వాష్ట్ర మైత్ర భైందవవాజినః ।
సూచీకర్మతనుత్రాణ మేభీబుధైఃప్రశస్యతే ॥ ౧౬౩ ॥

తా॥ పునర్వసు, ధనిష్ఠ, చిత్ర, అనూరాధ, అశ్విని, మృగశిర—ఈనక్షత్రంబులు వస్త్రపుపనికిని కవచనిర్మాణమునకును ప్రశస్తంబులని వ్యవహారోచ్చయగ్రంథము నందుగలదు.

౬౧. క్రయవిక్రయ ముహూర్తము.

శ్లో॥ యమాదిశక్రాదిహుతాశపూర్వా। నేష్టాఃక్రయేవిక్రయ
ణేతిశస్తాః॥ పౌష్ణాశ్వచిత్రాశ్వినవిష్ణువాతాః। శస్తాఃక్రయే
విక్రయణే నిషిద్ధాః ॥ ౧౬౪॥

తా॥ అశ్విని, శ్రవణము, రేవతి, చిత్ర, స్వాతి, శతతార—ఇవిక్రయము చేయుటకు ప్రశస్తనక్షత్రంబులు; ఇవి విక్రయంబునకు పనికిరావు. భరణి, విశాఖ, కృత్తిక, ఆశ్లేష, పూర్వఫల్గుని, పూర్వాషాఢ పూర్వాభాద్ర;—ఈనక్షత్రంబులు విక్రయమునకు ప్రశస్తంబులు; ఇవి క్రయముచేయుటకు తగినవికావు. అని దీపికావచనము.

శ్లో॥ కుంభరాశిమపహాయసాధుషుద్రవ్య కర్మభవమూర్తిజీవ
తీక్ష్ణాషు। అవ్యయేష్వశుభదాయిషూర్ధ్వమే భార్గవేవిపణిరిందు
సంమితే ॥ ౧౬౫ ॥

తా॥ నవమి, చవితి చతుర్దశి మంగళవారము, కుంభలగ్నము, వీటిని వదలిపెట్టి; తక్కిన శుభతిథివారలగ్నములలో ౧౨-౮లో పాపగ్రహములులేక శుద్ధములైనపుడును శుక్రవారమునాడును లగ్నమున చంద్రుడుండునపుడును అంగడిపెట్టి విక్రయించుటకు ప్రశస్తంబని రత్నమాలా వచనము.

## ౬౨. అశ్వవిషయ ముహూర్తము.

శ్లో॥ పుష్యశ్రవిష్ఠాశ్విని సౌమ్యభేషు పౌష్ణానిలాదిత్యకరావ్య
యేషు। సవాసవష్ట్రేఽషు బుధైస్సశ్రుతాని సర్వాణి
కార్యాణితురంగమాణాం ॥ ౧౬౬ ॥

తా॥ అశ్విని, పుష్యమి, హస్త, రేవతి, ధనిష్ఠ, మృగశిర, స్వాతి, శతతార, పునర్వసు :— ఈనక్షత్రంబులలో గుఱ్ఱముకొనుట మొదలగు అశ్వకార్యంబులకు తగునని రత్నమాలావచనము. ఇంక నశ్వారోహణంబునకై దైవజ్ఞమనోహరంబునందు అశ్వచక్రము చెప్పఁబడినది ఎట్లనిన—

శ్లో॥ అశ్వాకారంలిఖేచ్చక్రంసాభిజిద్భానివిన్యసేత్ ।
స్కంధేచసూర్యభాత్పంచపృష్ఠేచదశభానిచ ॥౧౬౭ ॥
పుచ్ఛేద్వేస్థ పయేత్పార్ష్ణి చతుఃపాదేచతుష్టయం ।
ఉదరేవిన్య సేత్పంచముఖేద్వేతురగస్యచ ॥ ౧౬౮ ॥
అర్థలాభోముఖేసమ్యగ్వాజీనశ్యతిచోదరే ॥
చరణస్థేరణేభంగఃపుచ్ఛేపత్నీవినశ్యతి ॥ ౧౬౯ ॥
అర్థసిద్ధిర్భవేత్పృష్ఠే స్కంధేలక్ష్మీపతిర్భవేత్ ॥౧౭౦॥

తా॥ అశ్వాకారముగా నొకచక్రమును వ్రాసి దానిలో చూచికొను సమయమున సూర్యుడుండెడు నక్షత్రమునుండి యభిజిత్తులతోడ ౨౮ నక్షత్రములను వ్రాయవలయును భుజమున ౫ వీపులో ౧౦, తోకలో ౨, పాద

ములలో నాల్గు. కడుపులో ౫, ముఖమున ౨, ఇట్లువరుసగా వ్రాయునది. గుఱ్ఱము నెక్కువాఁడు ముఖనక్షత్రమున నెక్కితే ధనలాభము. కడుపున గుఱ్ఱము చచ్చును. కాళ్లలో అపజయము. తోకలో నెక్కినవాని భార్యకు హాని, వీపున అర్థసిద్ధి భుజమున సంపదగల్గునని యీచక్రము చెప్పంబడినది.

## ౬౩. హస్తికార్యమునకు ముహూర్తము.

శ్లో॥ హస్తత్రయే సౌమ్య హరిత్రయేచ పౌష్ణద్వయే పుష్యపునర్వసౌచ । మైత్రేపిసర్వాణ్యపికుంజరాణాం కర్మాణిశస్తాన్యఖిలానియాని ॥ ౧౭౧ ॥

తా॥ చిత్ర, అనూరాధ, మృగశిర, రేవతి, అశ్విని, పుష్యమి, హస్త, శ్రవణము, ధనిష్ఠ, శతతార, పునర్వసు, స్వాతి— ఈ ౧౨ నక్షత్రంబులలో నేనుగను గొనుట దానిందెచ్చుట మొదలగు కార్యంబులకు ప్రశస్తముగా నుండునని వసిష్ఠవచనము.

శ్లో॥ శుభతారేశుభేలగ్నే శుభాంశేశోభనేతిథౌ ।
అంకుశాశికరిణాం యోజ్యాశ్శ్లగ్నేశనేర్దినే ॥ ౧౭౨ ॥

తా॥ మంచినక్షత్రములో శుభలగ్నములో శుభాంశలో మంగళమైనతిథిలో శనివారమునాఁడు శనిలగ్నంబులనిన శనిచూచిన శనియున్న మఱియు మకరకుంభంబులలో నేనుఁగుమీఁద నంకుశమును స్థాపించనగునని వ్యవహారోచ్చయ గ్రంథస్థవచనము. మఱియునచ్చట నే:—

శ్లో॥ పౌష్ణాశ్వినీవరుణ మారుతశీతరశ్మి ।
చిత్రాదితిశ్రవణ పాణిసురేజ్యవిత్తైః ।

వారేషుజీవశశిసూర్యసితేందుజానా ।
మారోహణరగజ తురంగరథేషుశస్తం ॥ ౧౨౩ ॥

తా॥ రేవతి, అశ్విని, హస్త, మృగశిర, శతభిష, చిత్ర, పునర్వసు, శ్రవణము, హస్త, పుష్యమి, ధనిష్ఠ, ఈనక్షత్రంబులలోను; సోమ బుధ సూర్య గురువారంబులలోను, గజతురగ రథారోహణంబునకు మిక్కిలి ప్రశస్తంబని చెప్పంబడినది.

## ౬౮. సొమ్ములుచేయించుటకు ముహూర్తము.

శ్లో॥ క్షిప్రచలాచలబుక్షేరిక్తా మావర్జితేషుదివసేషు ।
నిఖిలేష్వపివారేష్వపిత్రిపుష్కరే భూషణంకార్యం ॥

తా॥ శ్రవణ, ధనిష్ఠా, శతతారా, పునర్వసు, స్వాతి, పుష్యమి అశ్విని, హస్త, రోహిణి, ఉత్తర, ఉత్తరాషాఢ, ఉత్తరాభాద్ర ;— ఈనక్షత్రంబులలోను; చవితి, నవమి, ఏకాదశి, అమావాస్య, తప్పతక్కిన తిథులలోను; అన్నివారంబులలోను; త్రిపుష్కరయోగము కలనాడును; ఆభరణంబులను చేయింపవచ్చును. ఇది వసిష్ఠవచనము.

## ౬౯. రత్నాభరణంబులను చేయించుముహూర్తము.

శ్లో॥ స్థిరసాధారణచరభేలఘు మైత్రేష్వర్కకుజవారే ।
తేషామేవవిలగ్నే మాణిక్య మయంవిభూషణంకార్యం ॥

తా॥ మూల, జ్యేష్ఠ, ఆశ్రేష, పుబ్బ, పూషా, పూభా, భరణి, మఖ;— ఇవితప్ప తక్కిన నక్షత్రంబులలోను; ఆదిత్యవారము, మంగళవా

రము, వీట్లిలోను; వారిలగ్నములనిన సింహ మేష వృశ్చిక లగ్నంబులలోను రత్నాభరణంబులను చేయించవలయును. అని వసిష్ఠోక్తి గలదు.

౬౬. ముక్తావజ్రాద్యాభరణంబులముహూర్తము.

శ్లో॥ క్షిప్రమృదుధ్రువచరభే శశిసితయోర్వాసరేషుతల్లగ్నే ।
ముక్తాఫలరజతమయం భూషణమఖిలంసవజ్రకంకార్యం ॥

తా॥ చర, ధ్రువ, మృదునక్షత్రంబులలోను; సోమశుక్రవారంబులలోను; కర్కాటక వృష తులా లగ్నంబులతోను; వెండి, ముత్తెములు, వజ్రములు, పుష్యరాగముల నగలను చేయవలయునని వసిష్ఠవాక్యము.

౬౭. వెండిబంగారు పాత్రలుచేయించుటకు.

శ్లో॥ లఘుమైత్రధ్రువమృదుభే సితేందుబుధజీవవారేషు ।
హేమరజతాది భోజన భాజన మారోగ్య మమృతయోగేషు ॥ ౧౭౭ ॥

తా॥ లఘుధ్రువ మృదునక్షత్రంబులలోను, సోమబుధగురువారంబులలోను, అమృతయోగదినంబులలోను, వెండిబంగారు పాత్రలనుచేయించి వాట్లలో భుజించువారికి ఆరోగ్యముగల్గునని వసిష్ఠవచనము.

౬౮. ముద్రాపాతన ముహూర్తము.

శ్లో॥ మృదుధ్రువక్షిప్రచరేషుభేషు యోగేప్రశస్తే శనిచంద్రవర్జ్యే । వారేతిథౌపూర్ణ జయాఖ్యయోశ్చముద్రాప్రశస్తాశుభదానరాణాం ॥ ౧౭౮ ॥

గుర్వస్తేవాసితాస్తేవాము ద్రాయాఘట్టనంక్వచిత్ ।
క్రూరగ్రహాక్రాంతలగ్నేన కార్యంభూతిమిచ్ఛతా ॥

తా॥ సోమశనివారములుతప్ప తక్కిన వారంబులలోను; స్వా-శ్ర ధని-శత-ఉత్తర-ఉషా-ఉభా-రో-మృగ-చిత్ర - రేవ-అనూ-అశ్వ-హస్త-పుష్య-అభి-ఈ నక్షత్రంబులలోను; జయాపూర్ణ తిథులలోను; నాణ్యములు వేయుటచే ప్రజలకు మేలు. క్రూరగ్రహాలగ్నాంశలలోను గురుశుక్రాస్తకాలములలోను ఐశ్వర్యమునందెడు రాజులు నాణ్యములను వేయరాదు. అని సారసముచ్చయ వచనంబులు.

౬౯. నూతన వస్త్రక్షాళనకాలము.

శ్లో॥ (గణేశదైవజ్ఞః॥) పౌష్ణాదిత్యాదినం దాశ్వివసుషుచభవే
ద్వాసహాంక్షాళనాద్యం । హిత్వామష్టీంచపర్వాబ్జసుతశని
దినంశ్రాద్ధఘస్రంశుభంస్యాత్ ॥ ౧౭౯ ॥
(చండేశ్వరః) శనౌభూమిసుతే శ్రాద్ధేషష్ఠ్యామావాస్య
యోస్తథా । వస్త్రక్షాళనజోదోషోదహత్యాసప్తమం
కులం ॥ ౧౮౦ ॥
సంక్రాంత్యాంపంచదశ్యాంచ ద్వాదశ్యాంచరవేర్దినే ।
వస్త్రంనిష్పీడయేన్నైవక్షారేణాపినయోజయేత్ ॥

తా॥ క్రొత్తగుడ్డల నుతుకుటకుగాని ఉతికించుటకుగాని, ధని-అశ్వి-హస్త-చిత్ర-స్వా-విశా-అనూ-పున-పుష్య- ఈనక్షత్రంబులు ప్రశస్తంబులు

షష్ఠి, ద్వాదశి, పున్నమ, అమావాస్య, శ్రాద్ధదినము, ఈతిథులు తగవు. సంక్రమణ దినము కూడదు. మంగళ-శని-సూర్య-వారములుకూడదు. అనుక్తకాలమందు నూతనవస్త్రము నతికితే కులనాశముం జేయును.

## ౭౦. ఖడ్గాదిధారణ ముహూర్తము.

శ్లో॥ పుష్యేచాదితిచిత్రపద్మ తనయేశక్రోత్తరారేవతీ ।
వాజీహస్తవిశాఖమిత్రసహితేభానాగుకాభార్గవే ॥
కుంభేకీటగృహేమృగపతౌ చంద్రేశుభైర్వీక్షితే ।
సన్నాహాశ్వరఖడ్గకుంత ఛురికాధార్యాన్నృపాణాంహితాః॥

తా॥ పుష్య-పున-చిత్ర-అనూ-జ్యే-ఉ-ఉషా-ఉభా - రేవతీ-హస్త - విశాఖ-రో-అశ్విని-ఈనక్షత్రములలోను; భాను-గురు-శుక్ర-వారంబులలోను సింహ వృశ్చిక కుంభ లగ్నంబులలోను; చంద్రునికి శుభగ్రహవీక్షణ గల్గియుండగా నృపులకు క్రొత్తగా ఖడ్గాద్యాయుధ ధారణంబునకు హితకరంబని వ్యవహారోచ్చయ గ్రంథస్థవచనము,

## ౭౧. శయ్యాద్యుపభోగగ్రహణముహూర్తము.

శ్లో॥ మైత్రేందుపుష్యయ మఘాదితివాజిచిత్రా ।
హస్తోత్తరాత్రయ హరీజ్యవిధాతృభాని ।
ఏతేష్వతీవశయనాసన పాదుకానాం ।
సంభోగకార్యము దితంమునిభిశ్శుభాహే ॥ ౧౮౩ ॥

తా॥ అనూ-మృగ-పుష్య-భరణి-పున-అశ్వి-చిత్ర- హస్త-ఉ-ఉషా-ఉభా-శ్రవ-రో-పుష్య- ఈనక్షత్రంబులు గల్గిన శుభవారంబులనిన సోమ బుధ గురు శుక్రవారంబులలో, పరుపు, పీఠములు, మెత్తలు, దిండ్లు, పాదుకలు, మొదలగు దేహోపభోగవస్తువులను క్రొత్తగా నుపయోగించుకొనదగునని దీపికావచనంబు.

## ౭౨. అంధకాది నక్షత్రంబులు.

శ్లో॥ అంధకమథమందాక్షం మధ్యమసంజ్ఞంసులోచనంపశ్చాత్ । పర్యాయేణచగణయేచ్చతుర్విధం బ్రహ్మధిష్ణ్యాతః॥

తా॥ రోహిణి మొదలుకొని వరుసగా అంధకము, మందాక్షము, మధ్యమము, సులోచనము, అని సంజ్ఞనంది నక్షత్రములు గణ్యమని వసిష్ఠ వచనము. అనగా;—

అంధములు;—రో-పుష్య-ఉత్తర-విశా-పూషా-ధని-రేవతి. ౭.

మందాక్షములు;—మృ-ఆశ్రే-హస్త-అనూ-ఉషా-శత-అశ్వి. ౭.

మధ్యమములు;—ఆర్ద్ర-మఖా-చిత్ర-జ్యే-అభి-పూభా-భర. ౭.

సులోచనంబులు;—పున-పూఫ-స్వాతి-మూ-శ్ర-ఉభా-కృత్తి. ౭.

## ౭౩. అంధాదినక్షత్రఫలంబు.

శ్లో॥ లాభోంధకేనికట ఏవహృతస్యచౌరైః ।
ద్రవ్యస్యలబ్ధిరిహకేకర భే ప్రయత్నాత్ ।
దూరశ్రుతిశ్చిపిట భేషుకథంచిదేవ ।
నప్రాప్తిరుత్తమవిలోచన భేకదాచిత్ । ౧౨ ॥

తా॥ దొంగతనము పోయినప్పుడు అంధక నక్షత్రంబులలో నవి మరల లభించుచున్నవి. మందాక్షనక్షత్రంబులలో కొంచము ప్రయత్నము చేసిన పిదప లభించును. మధ్యమ నక్షత్రంబులో నెట్లో దూరవార్తమికిగాలి ప్రయాసము. సులోచన నక్షత్రంబులలో దొరుకుట యరుదని, రత్నమాలా వచనము.

౭౮. ధనప్రయోగని షిద్ధననక్షత్రాదులు.

శ్లో॥ ధ్రువోగ్రసాధారణ దారుణర్క్షే ।
నిక్షిప్తమర్థం త్వథవాప్రనష్టం ।
చోరైర్హృతందత్త ముపప్లవేవా ।
విష్ట్యాంచపాతేన చలభ్యతేతత్ ॥౧౮౬॥

తా॥ ధ్రువ, ఉగ్ర, క్రూర, సాధారణ నక్షత్రంబులలో; భద్రాకరణమున, మహాపాతసమయమునను, భూస్థాపన చేసిన ద్రవ్యంబును, నష్టద్రవ్యంబును, దొంగిలింపఁబడినదియును, గ్రహణసమయమున నిచ్చిన ద్రవ్యంబును, మరల లభించదు.

౭౯. జలాశయారంభ ముహూర్తము.

శ్లో॥ శశాంకతో యాంశకరార్యమిత్ర ।
ధ్రువాంబుపిత్ర్యే వసు రేవతీషు ।
ఉద్యానవాప్యాది తటాకకూప ।
కార్యాణిసిద్ధ్యంతి జలంధ్రువంస్యాత్ ॥౧౮౭॥

తా॥ మృగ-పూషా-హస్త-పుష్య-అనూరాధ మఖ-ధనిష్ఠ-రేవతి-ఉత్తర-ఉషా-ఉభా,—ఈనక్షత్రంబులలో తోటలు, బావులు, చెరువులు, మొదలగు కార్యంబులు సిద్ధించుచున్నవి. వీట్లలో చేసిన వాటిలో ధ్రువజలముగల్గునని వసిష్ఠవచనము జీర్ణోద్ధార విషయంబుగా నెఱుంగునది. వీటియారంభమునకైననో?

శ్లో॥ గురౌజ్ఞేవాలగ్నగతే శుక్రేఽర్మగతేఽపివా ।
ఆప్యభేజలకార్యాణా మారంభస్సిద్ధిదస్మృతః ॥౧౮౮॥

తా॥ లగ్నమున బుధుఁడు గాని గురుఁడు గాని ; ౧౦లో శుక్రుఁడు గాని చంద్రుఁడు గాని ; యుండి, పైజలకార్య నక్షత్రంబులలో నారంభించి చేసిన జలకార్య బులు సిద్ధించుచున్నవని కశ్యపవచనము.

### ౩౬. సంగీతనృత్తాదులకు ముహూర్తము.

శ్లో॥ క్షిప్రోత్తరామిత్రగురుశ్రవిష్ఠా హస్తేంద్రవారీశ్వరపౌష్ణభే
షు । సంగీతనృత్యాదిసమస్తకర్మ కార్యంవిభౌమార్క
జవాసరేషు ॥ ౧౮౯॥

తా॥ ఉత్తర-ఉషా-ఉభా-అనూ-పుష్య-హస్త-జ్యేష్ఠ శతభిష-ఆర్ద్ర-రేవతి-ధనిష్ఠ:—ఈనక్షత్రంబులలోను ; ఆదిత్యమంగళవారములు తప్పతక్కినవారంబులలోను ; సంగీతము నృత్తము మొదలగు కార్యంబులకు మంచిదని వసిష్ఠవచనము.

శ్లో॥ లగ్నసంస్థేబుధేచంద్రే బుధరాశౌతువీక్షితే ।
శుభగ్రహైశ్చతుర్థస్థైర్నాట్యారంభః ప్రశస్యతే ॥౧౯౦॥

# నక్షత్ర ప్రకరణము.

తా॥ నాట్యారంభంబునకు లగ్నమునందు చంద్రుడును బుధుడు లేకబుధక్షేత్రములైన మిథునకన్యలు లగ్నముగానుండగా, లగ్నమును బుధుడుచూచియుండగానైనను, ౪లో శుభగ్రహములుండగా ప్రశస్తంబని కశ్యపవచనము.

## ౨౨. సేవకాదాన ముహూర్తము.

శ్లో॥ దశమైకాదశేసూర్యేకుజే వాశుభలగ్నగే ।
విద్యాయుధాభ్యాసయుక్త సేవాకర్మాపిసిద్ధ్యతి ॥ ౧౯౧॥

తా॥ ౧౦-౧౧లో రవికుజులును, శుభలగ్నంబును గల్గియుండగా విద్యాభ్యాసమూ ఆయుధాభ్యాసమూ ప్రతిఫలముగా నెంచి సేవకునిగా నొకనినియమించుటకు ప్రశస్తము అనికశ్యపవచనము. ఇంక వేతనమనగా నెలజీతమునకు బంట్రౌతునుంచుటకైన:—

శ్లో॥ క్షిప్రేమైత్రే మృగేపూష్ణే కర్మాయస్థేరవౌకుజే ।
శుభలగ్నే సేవకస్యగ్రహణం శుభదంభవేత్ ॥ ౧౯౨ ॥

తా॥ పైనచెప్పిన లగ్నశుద్ధిగాక, అశ్వి-పుష్య-హస్త-చిత్ర-అనూరాధ, మృగ-రేవతీనక్షత్రంబులు జీతమునకు బంట్రౌతునుంచుటకు తగునని జ్యోతిః ప్రకాశవచనము(వైరంనృనార్యోర్నృపభృత్యయోశ్చ' అనువసిష్ఠవచనసూచన ననుసరించి భృత్యగ్రహణంబున యజమానుడు యోనిపొంతనమునుగూడ చూచికొనవలయునని తెలియవచ్చుచున్నది,

## ౭౮. ఋణప్రదానాదాన ముహూర్తము.

శ్లో॥ మృదుపుష్యాశ్వినీచైవ విశాఖాశ్రవణత్రయం ।
పునర్వసౌచశంసంతి ధనాదినిధివర్తనం ॥ ౧౯౩ ॥

తా॥ స్వా, పున, చిత్ర, అనూ, మృగ, రేవ, విశా, పుష్య, శ్రవ, ధని, శతతార :— ఈ౧౧నక్షత్రంబులలో అప్పిచ్చుటకు ప్రశస్తముగానుం డునని భీమపరాక్రమవచనము.

శ్లో॥ శుద్ధేషుధర్మాత్మ జనై ధనేషు
చరేవిలగ్నేద్రవిణ ప్రయోగః ॥ ౧౯౪ ॥

తా॥ లగ్నమున, ౯లో, ౧౧లో నే గ్రహముండరాదు; లగ్నము మేష, కర్కాటక తులా, మకరంబులలో నొకటిగానుండవలె; అప్పుడు అప్పని చ్చుటకు తగునని రత్నమాలావచనము.

శ్లో॥ ఋణంభౌమేనగృహ్ణీయాన్న దేయంబుధవాసరే ।
ఋణచ్ఛేదంకుజేకుర్యాత్ సంచయంసోమనందనే॥౧౯౫॥

తా॥ మంగళవారమునాడు అప్పుతీయరాదు ; అప్పుతీర్చవలయును బుధవారమున నప్పివ్వరాదు; డబ్బుచేర్చిపెట్టవలయును. అనిజ్యోతిఃప్రకా శవచనము. మఱియును :

శ్లో॥ హస్తేర్క–వారేసంక్రాంతౌ యదృణంస్యాత్కులేషుతత్ ।
వృద్ధియోగేతథాజ్ఞే యమృణచ్ఛేదంతుకారయేత్ ॥

తా॥ హస్తనక్షత్రమున, ఆదిత్యవారమున, సంక్రమణదినమున, వృద్ధియోగమున. అప్పును తీర్చవలయును. ఇట్లు తీర్చెడువానికి కులమునను ఋణబాధగలుగ నేరదనిభావము.

## ౭౯. దున్నుటకు ముహూర్తము.

శ్లో॥ మృధుధ్రువక్షిప్రచర విశాఖాపితృభేషుచ ।
హలప్రవాహంప్రథమం విదధ్యాన్మూలభేన్నృపైః ॥౧౯౭

తా॥ మృ, అను, చి, రే, అశ్వి, పుష్య, హస్త, అభిజిత్తు, పున, స్వాతి, శ్ర, ధని, శత, రోహి, ఉ, ఉషా, ఉభా, మూల, విశాఖా, మఖ, — ఈనక్షత్రములు మొదట దుడకపట్టుటకు మంచివి. అనినారదవచనము.

శ్లో॥ గురౌలగ్నగతేశుక్రే బలిన్యాహోదయేవిధౌ।
శస్తాకృషిక్రియాతత్ర దుర్బలైఃక్రూరఖేచరైః । ౧౯౮ ॥

తా॥ లగ్నమునగురుఁడు. శుక్రుడు బలవంతుఁడు, చంద్రుఁడుజన్మరాశిలో; క్రూరగ్రహములు దుర్బలులునైయుండగా కృషికర్మారంభములు శుభమగునని కశ్యపవచనము.

శ్లో॥ మేషలగ్నేపశూన్హంతికర్కటేజలజాంభయం ।
సింహేసస్యభయంజ్ఞేయం తులాయాంహాయసంక్షయః
మకరేసస్యనాశస్స్యాత్కుంభేచోరభయంతథా ।
హంత్యష్టమీబలీవర్దాన్న వమీసస్యఘాతినీ ॥ ॥౧౯౯ ॥

షష్ఠీచకీటజననీపశూన్ హంతిచతుర్దశీ ।
చతుర్థీచతద్దైవస్యాత్ హలకర్మణి వర్జయేత్ ॥ ౨౦౦ ॥

తా॥ కృషికర్మయందు, మేషమునపశుహాని, కర్కాటమున నీటిభయము, సింహమున సస్యభయము, తులలో గుల్మములకుహాని, సస్యహాని, కుంభమున దొంగలభయము, అష్టమిలో నెద్దులుపోవును, నవమినాడు సస్యహాని, షష్ఠిలో పులుగులబాధ, చతుర్దశినాడు పశునాశము, అశ్లేచవతినాడును, కావునవీటిని పరిత్యజించి, శుభముహూర్తమున నారంభించవలయునని జ్యోతిస్సార సాగరవచనము.

## ౮౦. బీజావాపముహూర్తము.

శ్లో॥ వసువాయుజనైఋుణాత్య త్రీఘ్రధువమృదూడుషు ।
సీతాంస్మృత్వాథబీజోప్తైరత్యుత్కృష్టఫలప్రదా ౨౦౧॥

తా॥ ధనిష్ఠ, మూ, స్వా, రోహి, ఉత్తర, ఉషా, ఉభా, అశ్వి, పుష్యమి, హస్త, చిత్ర, అనూ, రేవ, మృగ, అభిజిత్తు;— ఈ౧౫ నక్షత్రంబులలో శ్రీసీతాదేవిని స్మరించిచేయు బీజావాపము మిక్కిలిఫలదాయకంబని కశ్యపవచనము.

## ౮౧. బీజావాప ఫణిచక్రము.

శ్లో॥ భవేత్ భత్రితయంమూర్ధ్ని ధాన్యనాశాయ రాహుభాత్
గళేత్రయంకజ్జలాయువృద్ధైర్ద్వాదశచోదరే ॥ ౨౦౨ ॥
నిస్తండులత్వంలాంగూలేభచతుష్టయమీరితం ।

నాశోబహింపంచకేస్యాత్ బీజోప్తావితిచింతయేత్ ౨౦3॥

తా॥ సర్పాకారమునొకటిని వ్రాసిదానిలో — రాహువుండెడి నక్షత్రమునుండి 3 నక్షత్రంబులను పడిగెలో వ్రాయునది. అవిధాన్యనాశకంబులు గొంతులో 3, పంటనలు పెక్కును, కడుపున ౧౨ వ్రాయునది, అవిధాన్యవృద్ధినిచ్చును. తోకలో ౪నక్షత్రంబులు నిష్ఫలదంబు. అనిఫలము నెఱింగి కడుపుననుండు ౧౨ నక్షత్రంబులలో బీజావాపము ప్రశస్తంబని నారదవచనములు గలవు.

౮౨. బీజావాపమునకు లగ్నశుద్ధి.

శ్లో॥ భవరిపుసహజేపాపై స్త్రిత్రికోణకేంద్ర స్థితైశ్చశుభైః।
కథితేషుచధిష్ణ్యేష్వపి । శుభలగ్నే బీజవాపనంకార్యం ॥

తా॥ లగ్నమునకు 3-౬-౧౧లో పాపగ్రహంబులును ౧-౫-౪-౭-౯-౧౦-లో శుభగ్రహంబులునుండగా పైనచెప్పిన నక్షత్రంబులలో బీజావాపమును చేయవలయునని వసిష్ఠోక్తిగలదు.

౮3. హలప్రవహణమునకు హలచక్రము.

శ్లో॥ హలాదౌవృషనాశాయభత్రయం సూర్యభుక్తభాత్ ।
అగ్రేబుక్షత్రయంలక్ష్మైసౌఖ్యం పార్శ్వద్వపంచకే ।
శూలత్రయేపినవకం మరణాయాన్యపంచకం ।
శ్రియైపుచ్ఛత్రయం శ్రేష్ఠం స్యాచ్చక్రేలాంగలేశుభే

తా॥ నాగేటివలె నొకచక్రమును వ్రాసి అందు సూర్యుడుండెడు నక్షత్రమునుండి చెప్పునట్లు లెక్కగా నక్షత్రములను వ్రాసికొనునది. ఎట్లనిన ;- సూర్యనక్షత్రమునుండి మొదటి మూడునక్షత్రములలో మడకకట్టినన్నిఁతే యెద్దులు నాశమగును. దాని వెనుకటి 3 నక్షత్రంబులు సంపదనిచ్చును. ఆ వెనుకటిపార్శ్వమునందలి ౫ నక్షత్రంబులు సౌఖ్యకరంబులు. అటుమైత్రి శూలంబుననుండెడు ౯ నక్షత్రంబులు మరణప్రదము. అటుపైమఱియొక పార్శ్వమునందలి ౫ నక్షత్రంబులు సంపదనిచ్చునవి. దానిముందరి పుచ్ఛగత నక్షత్రంబులు మూడు సర్వోత్తమంబు. అని నారదవచనంబులు. ఇచ్చట మొదటచెప్పిన ఉక్తనక్షత్రంబులుగాను ఈఫణిచక్రములలోహల చక్రముల లో శుభదంబులుగానుండెడు తారలు గ్రాహ్యంబులని యెఱుంగనగు.

౮౮. వస్తివిరేచనాదులకు ముహూర్తము.

శ్లో॥ చిత్రాయుగేవిధియుగే ।
మిత్రయుగే లఘుషు వారుణే విష్ణౌ ।
వస్తివిరేచనవేధా ।
శ్శుభదినతిథిచంద్రలగ్నేషు ॥ ౧౦౭ ॥

తా॥ చిత్ర, స్వాతి, రోహిణి, మృగ, అనూ, జ్యే, శ్ర, శతతార, అశ్వి, పుష్య, హస్త;—ఈ నక్షత్రంబులలో శుభవార శుభతిథి శుభలగ్న శుభచంద్ర సమయంబులలో; వస్తియనుదేహశోధనకృత్యము, శిరామోక్షము రక్తము తీసివేయు చికిత్స, విరేచనంబు, వమనమునకు తీసికొనుట మొదలగుకార్యంబులకు తగియుండునని జ్యోతిస్సార సాగరవచనము.

౮౫. శాంతికపౌష్టిక కర్మలకుకాలము.

శ్లో॥ శుభగ్రహార్క వారేషు మృదుక్షిప్రధ్రువోడుషు ।
శుభరాశివిలగ్నేషు శుభంశాంతికపౌష్టికం ॥ ౨౦౮ ॥

తా॥ ఆదిత్య సోమ బుధ గురు శుక్రవారంబులలోను; అశ్విని, పునర్వసు, హస్త, రోహి, ఉత్తర, ఉత్తరాషాఢ, ఉభా, మృగ, చిత్ర, అనూ, రేవతి, ఈనక్షత్రంబులలోను; శుభగ్రహాధిపత్యముగల శుభలగ్నములలోను; ధర్మక్రియా కోటిహోమ రుద్రానుష్ఠానాది పౌష్టిక శుభకర్మల నాచరించ నగునని దీపికావచనము.

౮౬. ధాన్యచ్ఛేద ముహూర్తము.

శ్లో॥ రౌద్రేపిత్ర్యేతథా సౌమ్యేహస్తేపుష్యేనిలేతథా ।
సస్యచ్ఛేదంప్రశంసంతి మూలశ్రవణవాసవే ॥ ౨౦౯ ॥

తా॥ ఆర్ద్ర, మఖ, మృగ, హస్త, పుష్య, స్వాతి, మూల, శ్రవ, ధనిష్ఠ;— ఈ నక్షత్రంబులలో ధాన్యముల కోతకు బాగుగానుండునని రాజమార్తాండవచనము.

౮౭. ధాన్యమర్దనమునకు నక్షత్రంబులు.

శ్లో॥ ఫాల్గున్యౌశ్రవణశ్చైవమఖామూలంతథామతా ।
అనూరాధాతథాజ్యేష్ఠా రేవతీధాన్యమర్దనే ॥ ౨౧౦ ॥
కేవలేసింహలగ్నేవాగురు శుక్రోదయేథవా ॥

తా ॥ పుబ్బ, శ్రవణము, మఖ, మూల, అనూ, జ్యేష్ఠ, రేవతి — ఈ నక్షత్రంబులు ధాన్యమును దంపుటకు ప్రశస్తంబులు. మఱియు సింహలగ్నము మంచిది. గురూదయ శుక్రోదయసమయంబులు మేలు. అని వ్యవహారోచ్చయవచనము.

## ౮౭. సస్యరోపణ ముహూర్తము.

శ్లో ॥ పూర్వాభాద్రపదామూల రోహిణ్యుత్తరఫల్గునీ ।
విశాఖావారుణాం సస్యధాన్యానాంరోపణేవరాః ॥ ౨౧౧ ॥

తా ॥ పూభా, మూల, రోహిణి, ఉత్తర, విశా శతతార ఈ ౬ నక్షత్రంబులలో ధాన్యములను పెట్టినతావునుండి మరియొకచోటునకు మార్చుటకును, నాటిన నాటుకుపెరికిమఱియొకచోట నాటుటకును తగియుండునని రాజమార్తాండవచనము.

## ౮౮. ధాన్యస్థాపన ముహూర్తము

శ్లో ॥ యామ్యాగ్నిరుద్రాహివిశాఖపూర్వా మహేంద్రపిత్ర్యే
తరభైః శుభాహే । ధాన్యాదిసంస్థాపనమే షుశస్తంమ్
గస్థిరద్వ్యంగ గృహాదయేషు ॥ ౨౧౨ ॥

తా ॥ భరణి, కృత్తిక, ఆర్ద్ర, ఆశ్లేష, విశాఖ, పూఫ, పూష, పూభా మఖ, జ్యేష్ఠ; — ఈ నక్షత్రములు తప్పతక్కిననక్షత్రంబులలోను, శుభదినంబున, తులాకర్కాటక మేషములు తప్పతకిరానలగ్నములలోను ధాన్యస్థాపనంబునకు బాగుగనుండునని దీపికావచనము.

# నక్షత్ర ప్రకరణము.

## ౯౦. ధాన్యవృద్ధి ముహూర్తము.

శ్లో॥ శ్రవణత్రయంవిశాఖాధ్రువపుష్యపునర్వసూనివాయుశ్చ।
అశ్విన్యథచజ్యేష్ఠాధన ధాన్యవివర్ధనేశస్తాః ॥ ౨౧౩ ॥

తా॥ అశ్వి జ్యేష్ఠ, శ్రవణధనిష్ఠాశతభిషలు, విశాఖా, పునర్వసు, పుష్యమి, స్వాతి, ఉత్తర, ఉషా, ఉభా, రోహిణి:— ఈ నక్షత్రంబులు ధన, ధాన్యవృద్ధికి మంచివని దీపికావచనము. ధాన్యవృద్ధియనిన నిప్పుడు ౨ తూములు, ధాన్యమిచ్చిన ౧-౧౪ నెలకు 3 తూములుగా నీవలెనను ఒప్పందముతోఁ చేయుధాన్య వ్యాపారంబనంబడును.

## ౯౧. శాంతికపౌష్టికాదిక ముహూర్తము.

శ్లో॥ మిత్రాదిత్యమఖోత్తరాశతభిషక్స్వాతీ విరంచ్యాచ్యుత।
స్వర్గాధీశ్వరపూజ్యపౌష్ణరవిషుస్సితేతుపారత్విషిరి ॥ క్రాంపర్వవిహాయ సౌమ్యదివసేశస్తే నృణాంభూతయే।సర్వైవ
శ్శాంతికపౌష్టికంనిగదితంగర్గాది భిర్నిశ్చయాత్ ॥ ౨౧౪॥

తా॥ అశ్విని, హస్త, పుష్యమి, ఉత్తర, ఉషా, ఉభా, రోహిణి, స్వాతి, శ్రవణ, ధనిష్ఠ, పునర్వసు, రేవతి, అనూరాధ, మఖా, శతతార, నక్షత్రంబులలోఁ; చంద్రుడు వృద్ధినొంది ప్రకాశించుచుండగా, శుభవారంబునందు చవతి నవమి చతుర్దశి పున్నమలను వదలి తక్కిన తిథులలోఁ, పుష్టికామకంబులగు మంగళకృత్యంబులను వినాయకశాంత్యాదులు అరిష్టపరిహా

రకంబులైన మూలనక్షత్రాద్యుత్పన్న శాంతులును చేయుటకు ప్రశస్తంబని దీపికావచనము. "పూర్ణేచంద్రే వేశ్మగేర్కేంబరస్థే లగ్నేజీవే వాక్పతేః వాసరేచ"= పూర్ణచంద్రుడు ౪ లో, రవి ౧౦ లో, లగ్నమునగురుడును, ఉండగా గురువారము ప్రశస్తంబని లగ్నశుద్ధి రత్నమాలయందు చెప్పంబడినది. ఈశాంతికర్మలకు "శాంతికర్మాణి కుర్వీత రోగేనైమిత్తికేతథా। గురుభార్గవమౌఢ్యేపి దోషస్తత్రనవిద్యతే" అని దీపికావచనము గురుశుక్రాస్తదోషము లేదనియును చెప్పుచున్నది.

## ౯౭. హోమాహుతిశుద్ధి ముహూర్తము.

శ్లో॥ నక్షత్రేయత్రభానుస్స్యాత్తదాద్యం భత్రికంత్రికం ।
సూర్యజ్ఞశుక్రసౌరీణాఘందు భౌమబృహస్పతేః॥౭౧౫॥
రాహోఃకేతోశ్చనిర్దిష్టం వదనాదాశుభాశుభం।
సూర్యార్ధనాశస్సూర్యేస్యాదిందౌజలమయీాక్షితిః౭౧౬
భౌమేగ్నిదాహోరాష్ట్రస్యబుధేబుద్ధి వివర్ధనం ।
గురౌలక్ష్మీరభీష్టస్యరాజ్యం సౌభాగ్యనందితం॥౭౧౭॥
భార్గవేకార్యసంపత్తిరైహికాముష్మికీభవేత్ ॥
శనేర్ముఖాహుతౌజ్ఞేయోరాజ్యభంగోధనక్షయః౭౧౮
రాహోర్ముఖాహుతౌహానిః సర్వస్యపరికీర్తితా।
కేతోర్ముఖాహుతౌజ్ఞేయందుర్భిక్షం దేశవిప్లవం॥౭౧౯

మరణంప్రాణినాంచైవ రాజ్యభంగంతథైవచ।
తస్మాత్సర్వప్రయత్నేన గ్రహ నక్షత్రసంగమే ॥ ౨౨౦॥
దుష్టేనకుర్యాద్ధవనమిత్యాహుర్భార్గవాదయః ॥
ఇతి కశ్యపవచనాని ॥ ౨౨౧।

తా॥ సూర్యుడు ఏనక్షత్రముననుండునో ఆనక్షత్రమునుండి మూడేసినక్షత్రములు త్రికసంజ్ఞ గలది. అట్టిత్రికములు ౨౭ నక్షత్రంబులకు ౯ అగును. పంచాంగచారమున నిత్యచంద్ర నక్షత్రము ఎన్నియవ త్రికములో చేరియున్నదో తెలిసికొనునది. మొదటి త్రికము సూర్యుడు; ౨ బుధుడు; ౩ శుక్రుడు; ౪ శని; ౫ చంద్రుడు; ౬ కుజుడు; ౭ గురుడు; ౮ రాహు; ౯ కేతు:—సూర్యత్రికమున చంద్రుడుండగా హోమము చేసిన ధన సుఖహాని. ౨ వ బుధ త్రికమున చంద్రుడుండగా హోమముచేసిన బుద్ధివర్ధనంబు. ౩ వ శుక్ర త్రికమున ఇహపర సుఖసంపదకల్గును. ౪ వ శనిత్రికమున రాజ్యభంగము ధననాశముకూడకల్గును. ౫ వ చంద్ర త్రికమున కృషియంతయు జలమయంబగును. ౬ వ కుజత్రికంబులో రాష్ట్రమున కగ్నిదాహమగును. ౭ వ గురుత్రికమునందు అభీష్టలాభంబగును. ౮ వ రాహుత్రికమున సర్వవినాశము. ౯ వ కేతు త్రికమున దుర్భిక్షము దేశక్షోభము ప్రాణులకు మరణంబును గల్గును. కావున శుభత్రికమున హోమకర్మచేయ నగునని భావము.

౬౩: తన్ముహూర్త దోషశాంతి.

శ్లో॥ క్రూరగ్రహాముఖేచైవ సంజాతేహావనేశుభే।
శాంతింవిధాయగాందద్యా ద్బ్రాహ్మణాయకుటుంబినే॥
ఆయసీంప్రతిమాంకృత్వానిక్షిప్య తైలమధోముఖీం।
గోమూత్రమధుగంధాద్యైరర్చితాంప్రతిమాంతతః॥
కుండేనిధాయసంపూజ్యతత్ర హోమోవిధీయతే।
వృషాకపీసమారాధ్యా సర్వశాంతిర్భవిష్యతి ॥౧౨॥

తా॥ దైవికముగా పైత్రికంబులలో క్రూరగ్రహ్యాత్రికము హోమాది శాంతికర్మకు సంభవించినప్పుడు కుటుంబియగు సాధుబ్రాహ్మణునికి గోదానము చేయవలయును. ఇనుముతో ప్రతిమజేయించి దానిని తలక్రిందుగ హోమకుండంబునంబెట్టి, గోమూత్రము తేనె గంధము-వీటిచే పూజించి పిదప హోమము నాచరించవలయును. హరిహరుల నారాధించినచో సమస్త దోషంబులు నశించును. అని విష్ణు ధర్మోత్తర వచనంబులు.

౬౪. హోమకాల విశేషవిషయము.

శ్లో॥ తిథివారయుతిస్సైకా వేద భక్తావశేషకాత్॥
నివాసోగ్నేర్ధ్య్యోమ్ని హూపే విత్తప్రాణవినాశకః॥౧౩॥
పాతాళేద్వికశేషేణ ధనసంచయనాశకః।
గుణవేదావశేషేణభూమావిపుల సౌఖ్యదః॥౧౪॥

సంస్కారేషువిచారోస్యనకార్యోప్యపివైష్ణవే ।
నిత్యనైమిత్తికేకార్యేనచాగ్నేయమునిభిస్స్మృతిః ॥ ౨౨॥

తా॥ హోమముచేయునాటికి, శుక్లపక్షాదినుండి తిథిసంఖ్యను నాటివారసంఖ్యను కలిపి ౪ టిచే భాగించినచో నిలిచిన శేషము ౧ అయిన నగ్ని గగనమున నున్నట్లు భావింపఁబడును, అపుడు చేసిన హోమము ధన ప్రాణహాని నిచ్చును. ౨ మిగిలిన నగ్ని పాతాళమున నున్నట్లు, చేసినధనము నాశమగును. 3-౪ శేషముగాఁ నిలిచినపుడు అగ్నిభూగతుడు మిక్కిలి సౌఖ్యము కల్గును. కావున విశేష హోమసంస్కారసమయమున దీని నెఱింగి, అగ్ని భూవాస సమయములో హోమాదులంజేయనగును. మఱియు నీవిషయము జాతకర్మాది సంస్కారంబులలోను విష్ణుప్రీణన సత్కర్మయందును నిత్యనైమిత్తికకర్మలలోను ముఖ్యముకాదు. కామ్యపౌష్టికాది కార్యాంబులంబట్టి చేయు హోమసమయంబున నీవిషయము ముఖ్యమని భావము.

## ౯౫. వార్షికనవాన్నభక్షణ ముహూర్తము.

శ్లో॥ నవాన్నభోజనంన్రాణాం మృదుక్షిప్రచరైశ్శుభం ।
శుభేక్షితయుతేలగ్నే విషనాడీంవివర్జయేత్ ॥ ౨౫॥

తా॥ అశ్విని, హస్త, పుష్యమి, స్వాతి, శ్రవణ, ధనిష్ఠ, పునర్వసు మృగ, చిత్ర, అనూ, రేవతి:— ఈ నక్షత్రంబులును. శుభగ్రహాంబులచే

చూడబడు చేరియుండు లగ్నంబును, త్యాజ్యములేకయుండెడు సమయం బును ; ప్రతివత్సరంబునను క్రొత్తగాపండివచ్చిన ధాన్యమును భుజించుట కు సుముహూర్తంబని భుజబలివచనంబు.

## ౯౬. నౌకాఘటన ముహూర్తము.

శ్లో॥ జ్ఞభహరిఘటలగ్నే శక్రపిత్రద్విదైవే।త్రినయనవిధియామద్వ్యంద్వసార్పాంత్యభేన్యే। సుకరణతిథియోగే శుక్ర జీవార్క-వారేతరణిఘటనమిష్టంచంద్రతారావిశుద్ధా ॥

తా॥ మిథున, కన్యా,సింహ, లగ్నంబులును; జ్యేష్ఠా,మఖా, విశాఖా ర్ద్రారోహిణీ భరణీకృత్తికా శ్లేషా రేవతీనక్షత్రంబులు తప్పతక్కిన నక్షత్రం బులు గాయును; శుభతిథులును; శుభకరణంబులును; భానుగురు శుక్రవారం బులును; చంద్రతారాబలంబును; నౌకానిర్మాణమునకు ప్రశస్తంబని దీపికా వచనంబు.

## ౯౭. నౌకాచలన ముహూర్తము.

శ్లో॥ శుభాహేవిష్ణుయుగ్మేందు భగమైత్రాశ్వివాణిషు ।
చాలనంఘట్టనస్థానా న్నావశ్శుభతిథీందుషు ॥

తా॥ శుభదినంబున, శ్రవణ ధనిష్ఠామృగశిర పూర్వఫల్గునన్యనూరాధా శ్వినీహస్త నక్షత్రంబులలో, శుభతిథియందునౌకను నిర్మాణస్థానమునుండి చలింపచేయుటకు శుభముగానుండును, అనిదీపికావచనంబు.

## ౯౭. నౌకాయాత్ర ముహూర్తము.

శ్లో॥ అశ్వికరేజ్యసుధానిధి పూర్వా। మిత్రధనాచ్యుతభే శుభలగ్నే ॥ తారకయోగతిథీందు విశుద్ధౌ। నౌగమనంశుభదం శుభవారే ॥ ౨౩౧ ॥

తా॥ అశ్విని, హస్త, పుష్యమి, మృగశిర, పూఫ, పూషా, పూభా, అనూరాధ, జ్యేష్ఠ, శ్రవణము, ఈనక్షత్రంబులలోను; శుభలగ్నంబునను; నక్షత్రతిథియోగము మంచిదిగానుండునపుడును; చంద్రుడుశుద్ధుడుగానుండునపుడును; శుభవారంబననును; ఓడమీఁదప్రయాణము మంచిదని దీపికావచనంబు.

## ౯౮. అభిచారిక ముహూర్తము.

శ్లో॥ శశినైరృతియమపిత్రభే ష్వష్టమశుద్ధాభృగౌచపాతాళే॥ ఘటలగ్నగతే శశిజేసిద్ధిలావేతాలసిద్ధిస్స్యాత్ ॥ ౨౩౨ ॥

తా॥ మృగశిర, మూల, భరణి, మఖ, ఈనక్షత్రంబులలో; లగ్నమునకు ౮వ ఇల్లు శుద్ధముగానుండగా; శుక్రుడు నాల్గింటలోనుండగా; బుధుఁడు కుంభము నెక్కియుండగా; వేతాళంబనిన వీరసాధనంబగు నాభిచారికక్రియకు మంచిదని వసిష్ఠవచనంబు.

## ౧౦౦. ఆరోగ్య స్నానముహూర్తము.

శ్లో॥ పిత్ర్యమారుతసర్పాంత్యస్థిరర్క్షేష్వింద్రుశుక్రయోః। నకుర్యాద్వారయోరోగముక్తఃస్నానంకదాచన ॥

తా॥ రోగబాధనుండిముక్తుడు ఆరోగ్యస్నానము చేయుటకు:— మఖ, స్వాతి, అశ్లేష, రేవతి, ఉత్తర, ఉషా. ఉభా, రోహిణి, సోమవారము, శుక్రవారము, ఇవిపనికిరావనిన తక్కినవిశావచ్చు నని కశ్యపవచనము.

శ్లో॥ స్థిరేజ్యాదతిసర్పాంత్యపి తృవారుణభేషుచ ।
నకుర్యాద్రోగముక్తస్య స్నానంవారేజ్యశుక్రయోః ॥

తా॥ పైవచనమునను సరించి, మఱియు పుష్యమిశత తారానక్షత్రంబునుకూడ నారోగ్యస్నానమునకు తగదని నారదసంహితావచనము తెలుపుచున్నది.

శ్లో॥ లగ్నేచరేసూర్యకుజేజ్యవారే।రిక్తేతిథౌచంద్రబలేచహీనే । త్రికోణకేంద్రోపగతైశ్చ పాపైఃస్నానంహితంరోగవిముక్తకానాం ॥ ౨౩౪ ॥

తా॥ ఆరోగ్యస్నానమునకు— మేషలగ్నము, కర్కాటకము, తుల, మకరము, రవికుజగురువారంబులు, చవితి నవమి చతుర్దశి ఈ తిథులు కృష్ణచంద్రుడు, పాపగ్రహంబులు ౧-౫-౯-౪ ౭-౧౦లోనుండుట, ఇదిప్రశస్తంబని లగ్నశుద్ధినిగూడ శ్రీపత్యాచార్యులవారునుడివిరి.

## ౧౦౧. శిల్పవిద్యా ముహూర్తము.

శ్లో॥ లగ్నకర్మగతేసౌమ్యే జీవేవామృతదీధితౌ ।
తయోర్వర్గస్థితేశిల్ప విద్యారంభఃప్రశస్యతే ॥ ౨౩౬ ॥

తా॥ లగ్నమున ౧౦లో బుధగురువులున్న, వారివర్గలో చంద్రుండు నుండగా శిల్పవిద్యారంభము బాగుగానుండునని రత్నమాలావచనము.

శ్లో॥ శశితనయేజీవేవాచంద్రేదే వాలగ్నబలినిధర్మేవా ।
తద్వర్గేలగ్నగతేశిల్పారంభః ప్రశస్యతేసతతం॥ ౨౩౭ ॥

తా॥ బుధుడుగాని గురుడుగాని చంద్రుడుగాని, లగ్నమందో ౧౦లోనో బలిష్ఠుండునై యుండగా శిల్పారంభము చక్కగానుండునని వసిష్ఠుల వారివచనము.

౧౦౨. సంధాన ముహూర్తము.

శ్లో॥ భాగ్యేపుష్యేసమైత్రేచలగ్నేశుక్రేక్షితేయుతే ।
కరణేతైతులేష్టమ్యాం ద్వాదశ్యాంసంధిరిష్యతే ॥

తా॥ పూర్వఫల్గుని, పుష్యమి, అనూరాధ, ఈనక్షత్రంబులను; శుక్రుడున్నలగ్నము; శుక్రుడుచూచినలగ్నము; తైతులకరణము, అష్టమి, ద్వాదశి, ఇవి సంధానమనిన సంధి చేయుటకుమంచివని కశ్యపవచనము,

౧౨౩. పరీక్షా ముహూర్తము.

శ్లో॥ నోశుక్రాస్తేష్టమార్కేగురు సహితరవౌజన్మమాసేష్టమేందౌ। విష్టౌమాసేమలాఖ్యేకుజశనిదివసే జన్మతారాసుచాశు ॥ నాడీనక్షత్రహీనేసురగురు రజనీనాథతారావిశుద్ధౌ। ప్రాతఃకార్యాపరీక్షాద్వితనుచరగృహాం శోదయేశస్తలగ్నే ॥ ౨౩౮ ॥

తా॥ పరీక్షయనగా సువర్ణస్తేయాది మహాపాతకంబులం జేసిన వారియొక్క శుద్ధ్యశుద్ధి విచారాత్మకంబైన తప్తమాషాదిరూప దివ్యంబులు. దీనిని చేయించు న్యాయాధిపతి. శుక్రుడస్త. గతుడైయుండగాను, ౮లో రవియుండగాను, రవిగురువులు ఒకరాశిలో నుండగాను, ౮లో చంద్రుడుండగాను, భద్రకరణంబునను, అధికమాసములోను, మంగళశనివారంబులలోను, జన్మనక్షత్రంబునను; పరీక్ష చేయరాదు. నాడీనక్షత్రంబులనిన జన్మనక్షత్రము నుండి ౧-౧౦-౧౬-౧౮-౨౩-౨౫ వీట్లనువదలి, శుద్ధగురుండును శుద్ధ చంద్రుండును శుద్ధతారయనిన హస్తపునర్వసూశ్రవణ జ్యేష్ఠాశతతారలలోను, ప్రాతఃకాలంబున ప్రశస్తమైనచరద్విస్వభావరాసులలోనొకటి లగ్నమునైయుండగా పరీక్ష చేయింపనగునని దీపికావచనంబు. ఇక్కాలంబున నట్టిదివ్యపరీక్షలు లేవుగాని, శాస్త్రోక్తక్రమము చూపంబడినది.

## ౧౦౪. సామాన్యముగా లగ్నశుద్ధి.

శ్లో॥ ఉపచయభేలగ్నగతే వ్యయనైధన శుద్ధిసంయుతే లగ్నే।
ఉపచయగే శీతకరే మంగళ కర్మాణి కార్యాణి॥ ౨౪౦ ॥

తా॥ సామాన్యముగా సర్వశుభకర్మలకును, తనజన్మలగ్నమునకు ౩-౬-౧౦-౧౧ వ లగ్నముగానుండగా, ౧౨-౮-వ ఇండ్లలో శుభగ్రహము గాని అశుభగ్రహముగాని లేకయుండగా, చంద్రుడు ౩-౬ వ స్థానములనైనయుండగా ప్రశస్తంబని వసిష్ఠవచనము. లగ్నమునకు శుభగ్రహయోగముగాని దృష్టిగానిగల్గుటమఱియు మేలనియెఱుంగనగును.

౧౦౫. జ్వరోత్పత్తియైననక్షత్రమునకుఫలము. తచ్ఛాంతియును.

శ్లో॥ పూర్వాత్రయస్వాతిభుజంగ రౌద్రసురేశ్వరక్షేషుచయస్యరోగః । స్యాద్రక్షితుం దేవచికిత్సకోఽపితావశక్తః ఖలురోగిణంచ ॥ ౨౮౧ ॥

కృచ్ఛ్రాత్ స్ఫుటం ప్రాణితియత్రపౌష్ణ ధిష్ణ్యేచమాసాచ్ఛశివిశ్వధిష్ణ్యే । రోగస్యముక్తిః పితృదేవధిష్ణ్యే వారైర్భవేద్వింశతిభిశ్చనూనం ॥ ౨౮౨ ॥

పక్షాద్వసుద్వీశకరేషుభేషుమాలాశ్వినాగ్నిత్రితయేనవాహాత్ । తోయేశచిత్రాంతకవిష్ణుభేషు నైరుజ్యమేకాదశభిర్దినైశ్చ ॥ ౨౮౩ ॥

పుష్యేత్వహిర్బుధ్న్యపునర్వసౌచబ్రహ్మార్యమర్క్షేషుచసప్తరాత్రాత్ । బుధ్నేశరూపంకనకేనకృత్వా తల్లింగమంత్రైశ్చసుగంధపుష్పైః ॥ ౨౮౪ ॥

వస్త్రైశ్చతైర్గుగ్గులుధూపదీప నైవేద్యతాంబూలఫలైశ్చసమ్యక్ । పూజాంచకృత్వామయనాశనాయ ద్విజాయదద్యాదతులంశివాయ ॥ ౨౮౫ ॥

*

తా॥ పూర్వఫల్గుని, పూర్వాషాఢ, పూర్వాభాద్ర, స్వాతి, ఆశ్లేష, ఆర్ద్ర, జ్యేష్ఠ;—వీట్లలో నాడుదిగా నిమగవాడుగాని రోగము వచ్చిపండుకొనిన దానికి చికిత్స చేయుటకు అశ్వినీదేవతలకు లేకధన్వంతరికిగాడ నలవిగాదనిన నారోగిబ్రతుకుట దుస్తరము. అనూరాధ, రేవతి; — ఈ రెంటిలోపరుండినరోగి మిక్కిలికష్టముతో బ్రతుకును. మృగశిరోత్తరాషాఢలలో నెలరోజులకు రోగము నిమ్మళించును. మఖానక్షత్రమున ౨౦ రోజులకు నిమ్మళించును. హస్తవిశాఖాధనిష్ఠలలో ౧౫ రోజులకును; మూలకృత్తికాశ్వినీ నక్షత్రములలో ౯ రోజులకును; భరణీ చిత్రా శ్రవణ శతతారలలో ౧౧ రోజులకును; పుష్యమీపునర్వసూత్తరాభాద్రలలోను ఉత్తరఫల్గుని రోహిణీలలోను ౭ దినములకును; రోగవిముక్తియనియెఱుంగనగును. రోగమునివర్తించి మంగళకరంబగుటకై ఆయానక్షత్రాదిదేవతల బింబమును యథాశక్తిసువర్ణముతో చేయించి తత్తన్మంత్రములతో గంధపుష్పతాంబూల ధూపదీపనైవైద్యములచే నర్చించి బ్రాహ్మణునికి దానము చేయుట శ్రేయస్కరంబని వసిష్ఠవచనంబులు చెప్పుచున్నవి.

౧౦౬. శీఘ్రముగా రోగికి మరణమగు యోగంబులు.

శ్లో॥ ఆశ్లేషార్ద్రాత్రిపూర్వాయమవరుణమరుచ్ఛక్రతారాన
లాస్స్యుః ద్వాదశ్యంస్కందరిక్తాతిథిషుచ రవిజారార్కర
వారేషు యేషాం । రోగస్సంజాయతేతేయమపురమచి
రాత్ ప్రాప్నువంత్యేవ చంద్రే।జన్మన్యష్టాఖ్యబంధువ్య
యభవనగతేమృత్యులగ్నే చరాశౌ ॥ ౭౮ ॥

తా॥ ఆశ్లేష, ఆర్ద్ర, పుబ్బ, పూర్వాషాఢ, పూర్వాభాద్ర, భరణి, శతతార, స్వాతి, జ్యేష్ఠ, కృత్తికానక్షత్రంబులును; ద్వాదశి, షష్ఠి, చవతి చతుర్దశి, ఏకాదశి, ఈతిథులును; శనిభాను మంగళవారంబులును;—ఇట్లు తిథివారనక్షత్రంబులు చేరియుండగా రోగముసంభవించిన యెడల శీఘ్రముగా మరణముసంభవించునని యెఱుంగవలయును. మఱియు చంద్రుడు జన్మలోను ౪-౧౨-౮-లోనుండినను మృత్యులగ్నమునందును తప్పక మరణసంభవమని వసిష్ఠవచనము.

## ౧౦౭. ప్రేతదాహముహూర్తము.

శ్లో॥ క్షిప్రాహిమూలేంద్ర హరీశవాయుభే ।
ప్రేతక్రియాస్యాజ్ఝషకుంభగేవిధౌ ॥
ప్రేతస్యదాహం యమదిగ్గమంత్యజేత్ ।
శయ్యావితానం గృహగోపనాదిచ ॥ ౮౪ ॥

తా॥ అశ్విని, పుష్యమి, హస్త, ఆశ్లేష, జ్యేష్ఠ, మూల, శ్రవణ ఆర్ద్ర, స్వాతి,—ఈనక్షత్రములు తప్పతక్కిన ౧౮ నక్షత్రంబులలోను; చంద్రుడు కుంభమీనములలోనుండగాను; ప్రేతదాహము తగదు. చేసినచో స్వజనహాని. విధిలేక చేయునప్పుడు శాంతిపురస్సరముగా చేయనగును మఱియు నా ౧౮ నక్షత్రంబులలో దక్షిణదిక్కునకు ప్రయాణంబును, తృణకాష్ఠఖట్వాది సంగ్రహంబును, శయ్యావితానాది సంగ్రహంబును తగదని ముహూర్తచింతామణి వచనము.

౧౦౮. త్రిపుష్కరయోగంబును. తత్ఫలంబును.

శ్లో॥ విషమచరణంధిష్ణ్యంభద్రాతిథిర్యదిజాయతే ।
సురగురుశనిభౌమాపుత్రాణాం కథంచనవాసరే ।
మునిభిరుదితస్సోయంయోగస్త్రిపుష్కరసంజ్ఞిత ।
త్రిగుణఫలదోవృద్ధౌనష్టేహృతేచమృతేపివా ॥ ౨౮౫ ॥

తా॥ త్రిపాది నక్షత్రములనగా-కృత్తిక, పునర్వసు, విశాఖ, ఉత్తరాషాఢ; భద్రాతిథులనిన—ద్వితీయ, సప్తమి, ద్వాదశి; మంగళ గురు శని వారంబులును; ఈ మూటిలో నేయొక్కటి చేరియుండినను అది త్రిపుష్కరయోగంబనబడును. అట్టియోగము సంభవించియుండగా వృద్ధికిని నష్టమునకును మరణమునకును త్రిగుణంబు. అనిన నాసమయంబున వస్తువు నష్టమైనవెంటనే మఱిదానికి రెండింతలు నష్టమగును. మృతిగల్గిన నచ్చోట మరలమరణములు ఘటిల్లును. వృద్ధిగల్గినను అట్టేయని శ్రీపతివచనము.

శ్లో॥ అర్కార్కిభౌమవారేచేద్భద్రాయాం విషమాంఘ్రిభం
త్రిపుష్కరస్త్రిగుణదో ద్విగుణోయమళాంఘ్రిభే॥ ౨౮౬ ॥
దద్యాత్తద్దోషనాశాయగోత్రయంమూల్యమేవవా ।
ద్విపుష్కరేద్వయందద్యాన్నదోషస్త్వృక్షమాత్రతః॥

తా॥ త్రిపాన్నక్షత్రంబులును భద్రాతిథులును ఆదిత్యమంగళ శనివారంబులును చేరిన నది త్రిపుష్కరంబనబడును; ఇది త్రిగుణఫలదంబు. మఱి

య్య, ద్విపాన్నక్షత్రంబులనిన మృగశిర, చిత్ర, ధనిష్ఠ, వీట్లతో నాతిథివారములు కలిసియున్ననదియును త్రిపుష్కరయోగంబనబడు; ఇదిద్విగుణఫలదంబు. దీనికి, త్రిగుణమున మూడుగోదానంబులను, ద్విగుణంబున రెండుగోదానంబులను, వాటియుల్యదానంబుపు గాని చేసిన నాదోషము శాంతియగునని యుండు నారదవచనంబులు.

౧౭. శవప్రతికృతిదాహ నిషిద్ధకాలంబు.

శ్లో॥ శుక్రారార్కిషు దర్శభూతమదనే నందాసుతీక్ష్ణోగ్రభే ।
పౌష్ణేవారుణభే త్రిపుష్కరదినే న్యూనాధిమాసేఽయనే ॥
యామ్యేబ్దాత్పరతశ్చపాతపరిఘే దేవేజ్యశుక్రాస్తకే ।
భద్రావైధృతయోశ్శవప్రతికృతేర్దాహోనపక్షేసితే ॥

తా॥ ఈ శవప్రతికృతిదాహము మూడువిధములుగా సంభవించును. ౧ ఆశౌచమధ్యంబున. ౨ సంవత్సరమధ్యమున. 3. సంవత్సరానంతరంబున ప్రత్యక్షశవదాహంబునకు "ప్రత్యక్షశవసంస్కారేదినం నైవవిశోధయేత్" అనుగర్గవచనమునుపట్టి దినశుద్ధి విచారమక్కరలేదు. ఇంక శవముదొరకక తత్ప్రతికృతింబట్టి కర్మచేయునపుడు ఆశౌచమధ్యంబునందైనచో యథోచితముగా దినశుద్ధి విచారణీయంబు. వర్షమధ్యంబునంగాని వర్షానంతరమునగాని అవశ్యముగా కాలశుద్ధి విచార్యముగానుండును. ఎట్లనిన—మంగళ శుక్ర శని వారములు తగదు. పాడ్యమి షష్ఠి ఏకాదశి త్రయోదశి చతుర్దశి అమావాస్య ఈతిథులు పనికిరావు. తీక్షనంబులనిన మూలాశ్లేషార్ద్రా

జ్యేష్ఠానక్షత్రంబులును, ఉగ్రంబులగు పూర్వఫల్గునీ పూర్వాషాఢా పూర్వాభాద్రా భరణీ మఘానక్షత్రంబులును, రేవతియును, శతతారయును, త్రిపుష్కరయోగంబులును అధికక్షయమాసంబులును కూడదు. వత్సరానంతరంబైనచో దక్షిణాయనంబున తగదు. మహావ్యతీపాత మాహావైధృతులలోను పరిఘ యోగంబులుండునాడును భద్రాకరణంబుండునాడును గురుశుక్రాస్త కాలంబులలోను కూడదు. శుక్లపక్షంబుననుంశవప్రతికృతిదాహంబు తగదని ఫలితాంశము. ఈపైవిచారమంతయును ౧యాత్క్షేత్రంబునను గోదావరీతీరంబునను చూడనక్కరలేదు. తెలిసినవెంటనే చేయవచ్చును. అని ముహూర్తచింతామణి చెప్పుచున్నది.

## ౧౧౦. అభుక్తమూలస్వరూపము.

శ్లో॥ భుజంగపౌరందరపౌష్ణభానాం తదగ్రభానాంచయదంతరాలం । అభుక్తమూలంప్రహరప్రమాణంత్యజేత్సుతం తత్రభవాంసుతాంచ ॥ ౨౪౨ ॥

తా॥ ఆశ్లేషాంత్యము మఘాదిభాగముచేరిన యామకాలంబును; జ్యేష్ఠాంత్యభాగము మూలాదిభాగముచేరిన యామకాలమును అభుక్తమూలయనంబడును. అట్టిసమయమున పుట్టిన మొగబిడ్డనైనను ఆడబిడ్డనైనను పరిత్యజింపవలయునని వసిష్ఠవచనంబు.

శ్లో॥ అభుక్తమూలజంపుత్రంపుత్రీమపి పరిత్యజేత్ ।
అథవాబ్దాష్టకంతాతస్తన్ముఖంనవిలోకయేత్ ॥ ౨౪౩ ॥

తా॥ అభుక్తమూలలో జనించిన పుత్రునిఁగాని పుత్రికనుగాని విసర్జింపనగును. అటులేకపోయిన నాశిశువు తండ్రి ౮ సంవత్సరములవరకు నాబిడ్డ మోముఁ జూడరాదు.

౧౧౧. మూలాశ్లేషలలో జనించిన, చరణభేదముంబట్టి ఫలములు

శ్లో॥ మూలాద్యపాదజనితః పితరంనిహంతి ।
ద్వైతీయజః స్వజననీం త్రిపదేస్థవృందం ।
తౌరీయజస్శుభకరః ఫలమేత దేవ ।
వైలోమతో భుజగధిష్ణ్యభవస్యసర్వం ॥ వసి ॥

తా॥ జనన కాలంబునందు మూలనక్షత్రమున మొదటిపాదము, ఆశ్రేష్ఠలో ౪ వ పాదంబును, తండ్రికి గండము నిచ్చును. మూలద్వితీయ చరణము, ఆశ్రేష 3 వ చరణమును, తల్లికి గండము నిచ్చును. మూల తృతీయపాదము, ఆశ్రేషా ద్వితీయచరణమును, ధననాశముఁ జేయును. మూల ౪ వ పాదము, ఆశ్రేష ౧ పాదము, శుభకరంబు గానగును. అని వసిష్ఠవచనము.

శ్లో॥ మూలసార్పాదిజందోష్యంస్యాత్సం ర్వంతులగ్నపే।
సక్రూరేజ్జేచవిబలే శుభదృష్టివివర్జితే ॥ వసి ॥

తా॥ ఈ మూలాశ్రేష్ఠలలో జనించినవారికి, జననకాలంబున లగ్నపతి శుభుడై చంద్రుడు బలిష్ఠుడై శుభదృష్టుడై శుభయుతుడై యున్నచో నానక్షత్రదోషము బాధించదు. లగ్నపతి క్రూరుడై మతిదుర్బలుడై, చం

గ్రహుడును దుర్బలుడై పాపయుత దృష్టుడైనచో నాదోషము సంపూర్ణము గా ఫలించునని బాదరాయణ వచనము.

౧౧౨. జ్యేష్ఠానక్షత్ర జననఫలములు.

శ్లో॥ జ్యేష్ఠాదౌమాతృజననీంమాతామహంద్వితీయకే।
తృతీయేమాతులంహంతిస్వయయాతాచతుర్థకే॥౨౫౬॥
ఆత్మానంపంచమేహంతిషష్ఠేగోత్రక్షయోభవేత్।
సప్తమేకులనాశస్స్యాదష్టమేజ్యేష్ఠసోదరం॥౨౫౭॥
నవమేశ్వశురంహంతిసర్వస్వందశమేతథా।
తస్మాచ్ఛాంతింప్రకుర్వీతజ్యేష్ఠానిష్టనివృత్తయే॥౨౫౮॥

తా॥ జ్యేష్ఠానక్షత్రముయొక్క ఆద్యంతమానమును ౧౦ భాగములుగా విభజించి, అందులో మొదటిభాగమున శిశు జననమైన తల్లితల్లికి చెడుగు. ౨ తల్లితండ్రికి. 3 మేనమామకు. ౪ తల్లికి. ౫ శిశువునకు. ౬ గోత్రమునకు. ౭. కులమునకు. ౮. అన్నకు. ౯ పిల్లనిచ్చెడి మామకు. ౧౦ సర్వస్వనాశము

౧౧౩. విశేషసూచన—

ఈముహూర్త రత్నావళిలో, నక్షత్రమును ప్రధానముగా నెంచి చూడబడు ముహూర్తముల విచారమునకై యీనక్షత్రప్రకరణము చెప్పంబడినది. ఇందులో జననకాల నక్షత్ర ఫలాఫల విచారంబేల? జాతకఫలములలోగదా దీనివిచారము? అని శంక గలుగవచ్చును. అట్లుగాదు, శాం

తి చేయవలసిన నక్షత్రములకు తగినట్లు గ్రహస్థితి నెతింగి ముహూర్తంబును గ్రహింపవలసి యుండును. కావున నవి సూచింపఁబడినవి. మఱియు, ఇట్లే పైమూలాశ్లేషా జ్యేష్ఠాది నక్షత్రములకును శూలయోగాదులకును గండాంతంబులకును సూర్యసంక్రాంతి వ్యతీపాత వైధృతులకును కుహూసినీవాలీ దర్శాదులకును కృష్ణచతుర్దశికిని తత్తదుక్త శాంతివిధానంబులను ఏక నక్షత్ర జననశాంతిని గ్రహణశాంతిని శాంతి కమలాకర ప్రముఖగ్రంథంబులనుండి గ్రహించి, ఆస్తికబుద్ధితో ముహూర్తములను పాటించువారు తత్తచ్ఛాంతులను భక్తితో యథాశక్తిగా నెరవేర్చి శ్రేయస్సునందవలయును. ఇఁక నశ్విన్యాది నక్షత్రమానంబులను నక్షత్రస్వరూపంబులను వివాహ నక్షత్ర తారకాతుల్య వర్షఫల పరిజ్ఞానాదులకై జ్యోతిశ్చంద్రోదయ తరంగమునుండి గ్రహింపనగును:—

## ౧౧౪. జలాశయారామ దేవప్రతిష్ఠా ముహూర్తము.

శ్లో॥ జలాశయారామసురప్రతిష్ఠా సౌమ్యాయనే జీవశశాంక
శుక్రే । దృశ్యే మృదుక్షిప్రచరధ్రువే స్యాత్పక్షే సితేస్వర్క్ష
తిథిక్షణేవా ॥ ౨౪౫ ॥

తా॥ సామాన్యముగా వాపీకూప తటాకాది ప్రతిష్ఠలకును, ఉద్యానప్రతిష్ఠకును, శివవిష్ణ్వాది దేవతాప్రతిష్ఠలకును:—ఉత్తరాయణంబనిన మకరాది రాశిషట్కమున సూర్యుడుండఁగా, గురుశుక్రచంద్ర వీక్షణము గల్గియుండఁగా, మృదుక్షిప్రచర ధ్రువ నక్షత్రములలో చంద్రుడుండఁగా, శుక్లపక్ష

మునందు, చవితి నవమి చతుర్దశీ తిథులను వదలి తక్కిన తిథులయందును మంగళవార మితప్ప తక్కిన వారములయందును;— ప్రశస్తకాలంబని యె ఱుంగవలయునని ముహూర్తచింతామణి వచనము.

౧౧౫. ప్రతిష్ఠావిషయమున విశేషవచనము.

శ్లో॥ అథప్రతిష్ఠాంకథయామిసమ్య క్ఛివస్యవిష్ణో స్తథవాప రేషాం । సౌమ్యాయనే దేవగురౌచశుక్రేసంద్రుశ్యమానేపరిచారకాణాం ॥ ౨౬౦ ॥

శ్లో॥ మాసేతపస్యేతిథసిప్రతిష్ఠాధనాయురారోగ్యకరీచకర్తుః। చైత్రేమహాదుఃఖయదాచశుక్రే సమాధవేపుత్రధనాప్తయేస్యాత్ ॥ ౨౬౧ ॥

శ్లో॥ ఆషాఢమాసాదిచతుష్టయేపికిళ్తసంతానవినాశదాస్యాత్ । ఊర్జేచకర్తుర్ధనప్రదాచ సౌమ్యేసపౌషే కలదుఃఖదాస్యాత్ ॥ ౨౬౨ ॥

శ్లో॥ వళక్షపక్షశ్శుభదస్సనుస్తస్సదైవతత్రాద్యదినంవిహాయ । అంత్యత్రిభాగంపరివృత్య కృష్ణపక్షేపిశస్తఃఖలుపక్షమోక్షః ॥ ౨౬౩ ॥

# నక్షత్ర ప్రకరణము.

శ్లో॥ రిక్తావమత్యక్తదినేష్వనింద్యయోగేషు వైనాశకవర్జితేషు। దినేమహాదోషవివర్జితేచశశాంకతారాబలసంయుతేచ ॥ ౨౬౭ ॥

తా॥ శివవిష్ణ్వాది దేవప్రతిష్ఠలకు ఉత్తరాయణము సామాన్యముగా ముఖ్యము. గురుశుక్రులు అస్తంగతులుగా నుండరాదు. దేవాదిప్రతిష్ఠ చేయుకర్తకు మాఘఫాల్గున మాసంబులు ధనాయురారోగ్య కరంబులు. చైత్రము మహారోగభీతి నిచ్చును. వైశాఖ జ్యేష్ఠములు ధనలాభము నిచ్చును. ఆషాఢ శ్రావణభాద్రపదాశ్వయుజంబులు కళత్రసంతాన వినాశప్రదంబులు కార్తికము కర్తకాయుర్నాశన మిచ్చును. మార్గశిర పుష్యంబులు మిక్కిలి సుఖము నిచ్చును. శుక్లపక్షమున ప్రతిపత్తును కృష్ణపక్షమున దశమి మొదలు ౫ దినంబులును, తప్ప తక్కిన రెండుపక్షంబులును ప్రతిష్ఠకు ప్రశస్తము. రిక్తతిథులు, అవమదినము, నింద్యయోగంబులును, పనికిరావు. వైనాశిక నక్షత్రంబులు చంద్రతారాబలయుక్తంబును మహాదోష రహిత దినంబును శుభకరంబుగా నుండునని వసిష్ఠవచనంబులు.

## ౧౧౩. వైనాశకనక్షత్రంబులు.

శ్లో॥ వైనాశకనక్షత్రాణి నారదోక్తాని తచ్ఛృణు।
జన్మభాద్దశమంకర్మ సంఘాతక్షంచషోడశం ॥ ౨౬౮॥
అష్టాదశంసాముదాయ్యంత్ర యోవింశంవినాశభం।
మానసంపంచవింశర్క్షం నాచరేచ్ఛుభమేషుతు॥ ౨౬౯॥

తా॥ జన్మనక్షత్రమునుండి ౧౦ యవ నక్షత్రము కర్మసంజ్ఞగలది. ౧౬ వది సంఘాంతం బ్బనబడును. ౧౮ వ్వది సాముదాయికంబడును. ౨౩ వది వినాశం బనబడు. ౨౫ వది మానసంబనబడు. ఈ ౫ నక్షత్రంబులును వైనాశకంబులు గావున వీటిలో నేశుభకార్యంబులను చేయరాదు.

౧౧౭. దక్షిణాయనంబున దేవప్రతిష్ఠలు.

శ్లో॥ మాతృభైరవవారాహ నారసింహత్రివిక్రమాః ।

మహిషాసురహంత్రీచ స్థాప్యావై దక్షిణాయనే ॥ ౨౬౬॥

తా॥ గ్రామదేవతలు, భైరవుడు, వరాహమూర్తి, నరసింహమూర్తి, త్రివిక్రమమూర్తి, మహిషాసురమర్దని, మొదలగువాటి ప్రతిష్ఠలకు దక్షిణాయనము ప్రశస్తమని వైఖానస సంహితావచనము.

శ్లో॥ శ్రేష్ఠోత్తరేప్రతిష్ఠా స్యాదయనేముక్తిమిచ్ఛతాం ।

దక్షిణేతుముముక్షూణాం మలమాసేనసాద్వయోః ॥

తా॥ దేవప్రతిష్ఠకు మోక్షకాములు ఉత్తరాయణమును గ్రహింపదగును. దక్షిణాయనంబును మలమాసంబును పనికిరాదని శైవసిద్ధాంత శేఖర వచనము.

౧౧౮. ప్రతిష్ఠలో ప్రత్యేకవారఫలంబులు.

శ్లో॥ కీర్తిప్రదంక్షేమకరం కృశాను ।

భయప్రదం వృద్ధికరంద్రుఢంచ ॥

## నక్షత్ర ప్రకరణము.

లక్ష్మీస్త్రీరం సుస్థిరదం త్వినాది ।
వారేషుసంస్థాపనమామనంతి ॥ ౨౭౮ ॥

తా॥ ప్రతిష్ఠలో:— ఆదిత్యవారము కీర్తికరము, సోమవారము క్షేమకరము, మంగళవారము అగ్నిభయదంబు, బుధవారము వృద్ధికరము, గురువారము స్థిరఫలదంబు, శుక్రవారము లక్ష్మీకరము. శనివారము మిక్కిలి స్థిరఫలదంబని వసిష్ఠవచనము.

౧౧౯. దేవతాప్రతిష్ఠామూలకు లగ్నశుద్ధివిచారము.

శ్లో॥ సూర్యేందుభౌమార్క్యహికేతవశ్చ లగ్నస్థితానైధనదాశ్చభర్తుః । సౌమ్యగ్రహాలగ్నగతాస్తదైవహ్యాయుర్బలారోగ్యకరాశ్చనూనం ॥ ౨౭౯ ॥

శ్లో॥ సర్వేగ్రహానైధనదాస్త్వజస్రం సౌమ్యా అసౌమ్యాః ఖలుమృత్యుసంస్థాః । పంచేష్టకేజీవశశాంకసూర్యముఖ్యగ్రహైస్సౌమ్యనవాంశయుక్తైః ॥ ౨౮౦ ॥

శ్లో॥ లగ్నేస్థిరేచోభయరాశియుక్తే నవాంశకేచోభయగేస్థిరేవా । చరోదయేలగ్నగతేనకార్యం సంస్థాపనంనైవ చరాంశకేపి ॥ ౨౮౧ ॥

శ్లో॥ చరోపిముఖ్యస్సకలాంశకశ్చ సదామృదుత్వాత్సురసన్నివేశే । ఏకోపిజీవోబలవాంస్తనుస్థః సితాపి సౌమ్యోప్యథవాబలీచేత్ ॥ ౨౮౨ ॥

దోషానశేషాన్ వినిహంతిసద్యః స్కందోయథాతారక
దైత్యవర్గమ్ ॥

తా॥ లగ్నమున రవి చంద్ర మంగళ శని రాహు కేతువులు ప్రతి ష్ఠాసమయమున కర్తకు హానికలుగజేయుదురు. తక్కిన శుక్ర బుధ గురువులు లగ్నమునందుండిన నాయురారోగ్యబలంబుల నిచ్చెదరు. అష్టమము గ్రహ రహితంబుగా నుండవలయు. అందులో శుభులున్నను అశుభులున్నను కర్తకు మరణము నిచ్చెదరు మఱియును, లగ్నమునగాని గ్రహముల లోగాని స్థిరద్వి స్వభావనవాంశలు గ్రాహ్యంబులు. చరాంశలు పనికిరావు. అందులో, చరాంశయైనను తులాంశను శుభదంబగుటచే సాధించవగును. ముఖ్యముగా గురుండు, లేక శుక్ర బుధులైనను బలిష్ఠులుగా లగ్నమునందుండినచో సమస్తదోషంబులను కుమారస్వామి తారకాది దైత్యవర్గమును ధ్వంసముచేసినట్లు పరిహరించెదరని వసిష్ఠ వచనంబులు.

శ్లో॥ శుభలగ్నే శుభాంశేచ కర్తుస్సైనిధనోదయే ।
రాశయస్సకాలాశ్చే ష్ఠాఃశుభగ్రహాయుతేక్షితాః ॥
గుణాధికతరేలగ్నే దోషేత్యల్పతరేయది ।
సురాణాంస్థాపనంతత్ర కర్తురిష్టార్థసిద్ధిదం ॥ ౨౭౪ ॥

తా॥ సామాన్యముగా గుణాధికంబుగను దోషములు అత్యల్పముగా నుండినను శుభగ్రహములతోకూడిన దృష్టిచూడబడినచో అష్టమశుద్ధికల్గిన

౧౨ రాసులలో నేదియైనను దేవప్రతిష్ఠకు మంచిదిగా నుండునని నారద వచనంబులు.

౧౨౦. తత్తద్దేవతోచితలగ్నంబులు, నక్షత్రంబులును.

శ్లో॥ సింహోదయేదినకరోమిథునేమహేశో నారాయణశ్చయువతౌఘటభేవిధాతా। దేవ్యోద్విమూర్తిభవనేచనివేశనీయాః క్షుద్రాశ్చరేస్థిరగృహేనిఖిలాశ్చదేవాః॥ ౨౭౫ ॥

తా॥ సింహమున రవిని, మిథునమున శివుని, కన్యయందు విష్ణువును కుంభమున విధాతను, మిథునకన్యా ధనుర్మీన లగ్నంబులలో దేవిని, చర లగ్నంబులలో చతుష్షష్టి యోగినీప్రభృతులను, తక్కిన ఇంద్రాది సమస్తదేవతలను స్థిరలగ్నంబులలోను ప్రతిష్ఠజేయదగునని శ్రీపతివచనము.

శ్లో॥ సప్తర్షయోయత్రచరంతిధిష్ణ్యేకార్యాప్రతిష్ఠాఖలుతత్రతేషాం। శ్రీవ్యాసవాల్మీకిఘటోద్భవానాం తథాస్యాత్ వాక్పతిభేగ్రహాణాం ॥ ౨౭౬ ॥

తా॥ ఏనక్షత్రంబున సప్తర్షులు సంచరించుచుందురో ఆనక్షత్రమునాడు వారిని ప్రతిష్ఠింపవలయు. పుష్యమిలో వ్యాసవాల్మీకిఅగస్త్యమునులను చంద్రాదిగ్రహంబులను ప్రతిష్ఠింపనగునని రత్నమాలా వచనము.

శ్లో॥ గణపరివృఢరక్షో యక్షభూతాసురాణాం ।
ప్రమథఫణిసరస్వత్యాదికానాంచ పౌష్ణే ॥

శ్రవసి సుగతనామ్నా వాసవే లోకపానాం ।
నిగదితమఖిలానాం స్థాపనం హి స్థిరేషు ॥ ౭౭ ॥

తా॥ గణపతిని విద్యాధరోప్సరో యక్షరక్షోగంధర్వ కిన్నరపిశాచ గుహ్యాకసిద్ధులను సర్పంబులను సరస్వత్యాదులను కూడ పుష్యమిలో ప్రతిష్ఠింపనగును. శ్రవణనక్షత్రంబున జినప్రతిష్ఠతగును. ధనిష్ఠయందు లోకపాలకులను, అందరిని స్థిరలగ్నంబులలో ప్రతిష్ఠింపనగునని రత్నామాల.

ఇట్లు ముహూర్తరత్నావళిలో నక్షత్రప్రకరణంబు.

# ముహూర్తరత్నావళీగ్రంథమున

# (3). సంక్రాంతిప్రకరణం.

౧౨౧. సంక్రాంతిలో నామంబులు తత్ఫలంబులును.

శ్లో॥ ఘోరాధ్వాంక్షీ మహోదర్యా మందాకి మందాకినీ తథా ।
మిశ్రా రాక్షసికా సూర్యసంక్రాంతిస్సార్క-వాసరాత్ ౭౭౮

తా॥ ఆదిత్యవారమున గల్గిన సూర్యసంక్రమణంబునకు ఘోరంబనియు, సోమవారమున ధ్వాంక్షియనియు, మంగళవారమున మహోదర్యమనియు, బుధవారమున మందయనియు, గురువారమున మందాకినియనియు

శుక్రవారమున మిశ్రయనియు, శనివారమున రాక్షసికయనియు, నామం బులు గల్గియుండునని కశ్యపవచనము.

శ్లో॥ ఘోరోగ్రక్షే ధ్వాంక్షీలఘుభే మహోదరీమృదుభే।
మందాకినీ చరక్షే మందామిశ్రేచరాక్షసీతీక్ష్ణే ॥౨౯॥

తా॥ ఉగ్రనక్షత్రంబులలో సూర్యసంక్రమణంబైన ఘోరంబని, లఘునక్షత్రంబులలో ధ్వాంక్షియని, చరనక్షత్రంబులలో మహోదరియని, మృదు నక్షత్రంబులలో మందాకినియని, చరనక్షత్రంబులలో, మందయని, మిశ్రనక్షత్రంబులలో మిశ్రయని, తీక్ష్ణనక్షత్రంబులలో రాక్షసియని తెలుసుకొనవలె నని వసిష్ఠవచనము.

శ్లో॥ శూద్రతస్కరవైశ్యోస్త్రదేవభూపగవాంక్రమాత్ ।
అనుక్తానాంచసర్వేషాంఘోరాద్యాస్సుఖదాస్స్మృతాః॥

తా॥ పైనచెప్పిన ఘోరాదినామములుగల సంక్రాంతులు వరుసగా శూద్రులు దొంగలు వైశ్యులు బ్రాహ్మణులు క్షత్రియులు గోవులు చండాలాదులు వీరలకు వరుసగా సుఖప్రదంబులై యుండును. అని కశ్యప నారదవచనము.

## ౧౨. సంక్రమణ కాలఫలంబులు

శ్లో॥ పూర్వాహ్ణే నృపతీన్హంతి విప్రాన్మధ్యదినేవిశః ।
అపరాహ్ణేస్తగేశూద్రాన్ప్రదోషే చపిశాచకాన్ ॥౩౧

నిశిరాత్రించరాన్నాట్యకారానఃరరాత్రికే।
గోచారిణశ్చసంధ్యాయాంలిఁగినంరవిసంక్రమే ॥ ౨౮౨ ॥

తా॥ సంక్రమణసమయము ప్రొద్దునపదిగడియలలోనైన రాజుల కనిష్టము, పిదప-౨౦ గడియలలో బ్రాహ్మణులకును, పిదపసాయంతనమువరకు వైశ్యులకును సంధ్యాకాలమునశూద్రులకును, రాత్రిమొదటియామము పిశాచంబులకును అర్ధరాత్రిలో రాక్షసులకును, రాత్రి కేవయామమున నట్టువులకును, వేకువజామున గొల్లలకును పాషంకులకును, మంచిదికాదని భావము. అనినారద కశ్యపవచనము.

౧౨౩. జన్మనక్షత్రమున సంక్రాంతిఫలము.

శ్లో॥ యస్యజన్మర్క్షమాసాద్యరవి సంక్రమణంభవేత్ ।
తన్మాసాభ్యంతరే తస్యరోగక్లేశోధనక్షయః ॥ ౨౮౩ ॥

సూర్యసంక్రమణమైనదినంబున నెవనికి జన్మనక్షత్రదినమగునో, వానికి తన్మాసాదిగా నతుమ రోగము చిక్కులు ధనవ్యయము దీపికాగ్రంథమున చెప్పంబడినది.

౧౨౪. సూర్యచంద్రాదిగ్రహాంబులకు
సంక్రమణపుణ్యకాలములు.

శ్లో॥ నక్షత్రరాశ్యోరవిసంక్రమేస్యురవ్యాక్పరత్రాపిరసేందునాడ్యః । పుణ్యాస్తువేందోస్త్రిధరాపతైర్ద్వ్యగ్న్యగ్నైకనాడీ మునిభిస్సుభోక్తా ॥ ౨౮౪ ॥

# సంక్రాంతి ప్రకరణము.



శ్లో॥ నాడ్యశ్చతస్రస్సపలాః కుజస్య బుధస్యతిస్రో మనవః కలాని।
అబ్ధ్యబ్ధినాడ్యః పలసప్తయుక్తా గురోశ్చశుక్రే సపలాశ్చతస్రః ॥ ౫౭ ॥

శ్లో॥ ద్వినాగనాడ్యః పలసప్తయుక్తాశ్శనైశ్చరస్యాభిహితాస్సుపుణ్యాః। ఆద్యంతమధ్యే జపదానహోమం కుర్వన్నవాప్నోతి సురేంద్రధామ ॥ ౫౮ ॥

తా॥ మేషసంక్రమణము, వృషభ సంక్రమణము, అని యిట్లు రాశిసంక్రమప్రవేశంబులు రూఢిలోవాడుచున్నారుగాని నక్షత్రసంక్రమమును పరిపాటించకయున్నారు. దానినిగూడ గ్రహింపవలయుననియును, సూర్యునికివలెనే చంద్రాదిగ్రహంబులకును సంక్రమణకాలమును గ్రహించి తత్ఫలాఫలంబుల నెఱుంగవలయుననియును — జైమినిమునులచేనిట్లు, ఏగ్రహంబునకైనను సంక్రమప్రవేశము రాసులలోగాని నక్షత్రములలోగాని పూర్వోత్తరనాడికలనుపట్టి పుణ్యకాలంబులని యెఱుంగనగునని చెప్పియున్నారు — ఎట్లనిన:—

| గ్రహములు. | రవికి. | చంద్రు. | కుజునికి. | బుధునికి. | గురునకు. | శుక్రునికి | శనికి. |
|---|---|---|---|---|---|---|---|
| నాడికలు | ౧౬ | ౧ | ౪ | ౩ | ౪౪ | ౪ | ౮౨ |
| వినాడికలు | ౦ | ౧౩ | ౧ | ౧౪ | ౭ | ౧ | ౭ |

ఇట్లు తెలియజేసిన ఈపూర్వోత్తరసంక్రమకాలంబుల నడుమ చేయునట్టి జపదానహోమాదులు అనంతఫలదాయకంబులు. అనగా, నెవనికియే-

గ్రహము చాలకాలమునకు నానక్షత్రమును రాశిని ఆగ్రహముప్రవేశించినపుడు తద్గ్రహశాంతి చేయవలసియుండును. మఱియు, నట్టివానికి ముహూర్తనిర్ణయము చేయునపుడు తదవిరుద్ధముగా కాలము నిష్కర్షింపవలసియుండును. ఇట్టిపుణ్యకాలంబులలో శుభముహూర్తముల ననుసరింపరాదు. అట్టికాలంబులలో చేసిన శుభకార్యంబులకు తద్గ్రహపీడాదోషములు గల్గుచుండును. కావున నీసంక్రమవిచారము ఈముహూర్తరత్నావళిలో చూపంబడినది. ఇట్లే అపారమగునీ శాస్త్రవిచారములు అనేకంబులు ముహూర్తవిచారంబునకే కావలసియుండునుగాని, గ్రంథవిస్తరభీతిచే సంగ్రహంబుగా కొంత కొంత చూపంబడుచుండును.

## ౧౩౨. సంక్రాంతివశమున శుభాశుభంబులు.

శ్లో॥ సంక్రాత్యధరనక్షత్రాద్గణ యేజ్జన్మభావధి ।
త్రికంషట్కంత్రికం షట్కం త్రికంషట్క-మితిక్రమాత్ ॥
పంథాభోగోవ్యథా వస్త్రంహానిశ్చవిపులంధనం ।
నారదోక్తమిదంన్నృణాం రవిసంక్రాంతిజంఫలం ॥

తా॥ సంక్రాంతిప్రవేశము ఏనక్షత్రమందుగునో దానిపూర్వనక్షత్రము అనగా ఆర్ద్రలోసంక్రాంతిగల్గిన మృగశిరనుండి తానుపుట్టిననక్షత్రమువరకునెంచునది. అట్లుఎంచగా మొదటిమూడునక్షత్రములలో జన్మనక్షత్రముండిన నప్పుడు ప్రయాణ సంభవమున్నదనియును; పిమ్మటఆరునక్షత్రంబులలోనుండిన సుఖమని యెఱుంగనగును, పిదప ౩లో పీడయనియును; పిద

ప నారింటిలో వస్త్రాదిలాభంబనియును; ఆటువెనుక- ౩టిలో ద్రవ్యహానియనియును; తరువాత నారింటిలో ద్రవ్యలాభంబనియును; ఫలంబునెఱుంగవలయును. దానినికని పెట్టివాని వానిముహూర్తనిర్ణయ కాలములను చూచికొనుటలో మేలుగలదు.

౧౨౬. సంక్రమణబలానుగుణంబుగాఫలము.

శ్లో॥ రాజాలోకనసమయే రవిరార్యేకరతలగ్రహేసుబలీ ।
రణసమయేధరణీసుతః ప్రయాణసమయేసితోతిబలీ ॥

శ్లో॥ దీక్షణసమయేర్కసుతశ్శశితనయోజ్ఞానశిల్పవిధౌ ।
నిఖిలేష్వపికార్యేషుచ చంద్రబలంముఖ్యమఖిలనృణాం॥

శ్లో॥ బలప్రదస్యగ్రహవాసరేయ ద్యచ్చోక్తదిష్టంసముపైతి
సిద్ధిం । సుదుర్బలస్యగ్రహవాసరేతత్ ప్రయత్నపూర్వం
త్వపినైకసాధ్యం ॥ ౨౯౧ ॥

తా॥ ఇంక కార్యవిశేషమందు బలంబు, సామాన్యముగా సంక్రమణగ్రహబలంబును చెప్పఁబడుచున్నది — రాజదర్శనసమయంబున రవియును; వివాహసమయంబున చంద్రుండును; యుద్ధసమయంబున అంగారకుండును; ప్రయాణసమయంబున శుక్రుండును; దీక్షాసమయంబున శనియును; శిల్పజ్ఞానాదులలో బుధుండును; సమస్తకార్యంబులలోను చంద్రుండును; సమస్తమనుజులకును ముఖ్యముగాబలము గలవారనియును బలమిచ్చువారలనియును గ్రహింపవలయును. మఱియుని కార్యంబులు సబలగ్రహవారంబులలో సిద్ధించునని యును వసిష్ఠవచనంబులుగలవు.

౧౨ ముహూర్త రత్నావళియందు.

శ్లో॥ తారాబలేనశీతాంశుర్బలవాంస్తద్వశాద్రవిః।
బలీసంక్రమమాణస్యవశాత్తైటా బలాధికాః ॥ ౧౯ ॥
యాదృశేనేందునాభానోస్సంక్రాంతిస్స్యాద్దృశంఫలం।
నరఃప్రాప్నోతితద్రాశేశ్శీతాంశోస్సాధ్వసాధుతః॥ ౨౦ ॥

తా॥ తారాబలముచేత చంద్రుండుశుభుండని గ్రహింపవలయును. ఎప్పుడు చంద్రసంక్రమణంబగునో అచ్చట తారాబలము గల్గియున్న నా౧౧ దినము చంద్రుండశుభుండైనను శుభుండని గ్రాహ్యము. తారాదోషమున్న యెడ చంద్రుండుశుభుండైనను అశుభుండనియును గ్రాహ్యము. ఇట్లే; చంద్రునిబలముచుండి రవి సంక్రమణంబున అశుభుండైనను మాసపర్యంతము శుభుండనియును; శుభుడై అయినచో మిక్కిలి శుభఫలదంబనియును; చంద్రదౌష్ట్యమున శుభుడైనను అశుభుండనియును గ్రాహ్యము. తక్కిన కుజాదులు సూర్యబలమునుండియున్నచో అశుభులైనను శుభులనియును; స్వరాశిభోగకాలమువరకు రవిదౌష్ట్యంబునందు శుభులైనను అశుభులనియును గ్రాహ్యము. అనగానేమయినది? కుజాది సంక్రమ బలముకన్నను రవిసంక్రమంబును, దానికన్న చంద్రసంక్రమంబును, అంతకన్న తారాబలంబును బలిష్ఠంబులని భావమును కశ్యపవచనంబులు తెలియజెప్పుచున్నవి. కావుననే దీపికయందు ఇట్లునిర్ణయింపఁబడినది;—

శ్లో॥ యాదృశేనశశాంకేనగ్రహస్సంచరతేనృణాం।
తాదృశంఫలమాప్నోతిశుభంవాయదివాశుభం॥ ౨౧ ॥

## సంక్రాంతిప్రకరణము.

తా॥ ఎట్టిచంద్రునితో గ్రహము సంచరించుచుండునో, శుభమునుగాని అశుభమునుగాని, అట్టిఫలమును ఆగ్రహము నర్థులకిచ్చుచుండును.

శ్లో॥ యస్మిన్మాసే నర్క సంక్రాంతిర్దర్శనాత్ప్రాక్పరస్పరం।
దర్శముల్లంఘ్య భవతి స స సర్పోఽధిమాసకః॥ త్రి-౫ ॥
ఆరభ్య శుక్లప్రతిపత్ప్రివేశాత్సంక్రమద్వయం।
ఆగామీందుక్షయస్యాం తాత్ప్రాక్ న్యూనాఖ్య స్త్వహః
పతేః। స్ఫుటార్క సంక్రమాద్విద్యాన్న్యూనమాసాధిమాం
సకౌ। మాసౌన్యూనాధికౌ తౌతు సర్వకర్మబహిష్కృతౌ॥

తా॥ శుక్లప్రతిపత్తు మొదలు మరలశుక్లప్రతిపత్తు వుట్టుటకులోపల నే చాంద్రమాసంబున సూర్యునికిరాశి సంక్రమణ ప్రవేశముసంభవించదో; ఆచాంద్రమాసము అధికమాసం బనబడి ౬౦ దినాత్మకంబగును. ఏచాంద్ర మాసమున రెండురాశి సంక్రమణ ప్రవేశంబులు సూర్యునికిగలుగునో ఆనెల క్షయమాసంబనంబడు క్షయమాసమువచ్చినప్పుడు దానికి నిరుగెలంకులలోను అధికమాసంబులు రెండుసంభవించును. క్షయమాసమునకు మొదటవచ్చునట్టినది అంహస్పతియనునధికమాసము. క్షయమాసమునకు పిదపవచ్చునది సంసర్పాధిమాసము. క్షయమాసముసంభవములేక సామాన్యగావచ్చునధిక మాసము మలమాసంబనంబడు, వీట్లలో సకలశుభకర్మలును బహిష్కరింపంబడినవియని కశ్యపవచనంబులు. కావున — ముహూర్తవిచారమునకు ఇవియావశ్యకము —

ఈదిగువ చూపినట్లు. మలమాసవిషయమున సామాన్యముగాధర్మ శాస్త్రినిర్ణయములు గ్రాహ్యము —

మలమాసవర్జ్యావర్జ్యవిచారః. —

శ్లో॥ అనన్యగతికంనిత్యంనైమిత్తికంకామ్యం చాధికమాసక్షయమాసయోః కర్తవ్యం। సగతికంనిత్యంనైమిత్తికంకామ్యం చవర్జ్యం। తథాహి- సంధ్యాగ్నిహోత్రాదినిత్యం। జ్యోతిష్టోమాదినిత్యం జాతేష్ట్యాదినైమిత్తికం పుత్రకామేష్ట్యాదికామ్యంచ మలమాసోత్తరం శుద్ధమాస్యేవకర్తవ్యం। ఆరబ్ధకామ్యస్యమలమాసేప్యనుష్ఠానం। నూతనారంభస్సమాప్తిశ్చనకర్తవ్యా। తథాపూజాలోపాదినిమిత్తక పునర్మూర్తిప్రతిష్ఠాం గర్భాధానాద్యన్నప్రాశనాంత సంస్కారాన్ప్రాప్తకాలానననన్యగతికాన్ జ్వరాదిరోగశాంతిమలభ్యయోగే శ్రాద్ధవ్రతాదికం నైమిత్తికప్రాయశ్చిత్తం నిత్యశ్రాద్ధ మాసమాసికాది శ్రాద్ధాని దర్శశ్రాద్ధంచ మల మాసేపికుర్యాత్। మలమాసేమృతానాం కదాచిద్బహుకాలేన తస్మిన్నేవమలమాసేప్రాప్తేమలమాసఏవ ప్రతిసాంవత్సరికంశ్రాద్ధంకర్తవ్యం। శుద్ధమృతానాం ప్రత్యాబ్దికంశ్రాద్ధంమలమాసేనకర్తవ్యం। శుద్ధఏవకార్యమిత్యాదిక్" ధ. సిం. ॥ ౩౯ ॥

కాలాంతరమం దవకాశములేనిదగు నిత్యకర్మలను అట్టినైమిత్తిక కామ్యకర్మలను అధికమాసమునందు చేయవచ్చును. అవకాశముగల్గిన నిత్యనైమిత్తిక కామ్యకర్మల నాచరించకూడదు. ఎట్లనిన—సంధ్యాగ్నిహోత్రాది నిత్యకర్మలును గ్రహణస్నానాది నైమిత్తికకర్మలును వర్షముగురియుటకుచేయు కారీరేష్టి బ్రహ్మరక్షస్సుబట్టిన వానిబాగుచేయుకొఱకు రక్షోఘ్నేష్టి మొదలగు కామ్యకర్మలును మలమాసమందు కూడచేయవలసినవి. మఱిజ్యోతిష్టోమాది నిత్యకర్మలును జాతకర్మమొదలగు నైమిత్తిక కర్మలును పుత్రకామేష్టి మొదలగు కామ్యకర్మలును చేయకూడదు. పూర్వమారంభించిన కామ్యకర్మయేదియైనను మలమాసమునం దారంభింపవచ్చునేకాని నూతనారంభమును గానికర్మపరిసమాప్తినిగాని చేయరాదు. ఇట్లు పూజాలోపనిమిత్తకమైన దేవతామూర్తి పునఃప్రతిష్ఠను అవసరప్రాప్తమైన గర్భాధానము మొదల న్నప్రాశనవరకు కర్మలను అగతికములైన జ్వరాదిరోగశాంతికర్మలను అలభ్యయోగనిమిత్తములైన శాంతివ్రతాదులను నైమిత్తిక ప్రాయశ్చిత్తకర్మయును నిత్యశ్రాద్ధమును ఊనమాసికాదులను దర్శశ్రాద్ధమును మలమాసమునందును చేయనగును.

ఇట్లుముహూర్త రత్నావళిలోసంక్రమప్రకరణము.

3. వది ముగిసెను.

---

# ముహూర్త రత్నావళి యందు,

## ౪. గోచర ప్రకరణంబు.

———(౦)———

అ॥ ముహూర్తనిర్ణయమునుం జేయునప్పుడు; ఎవనినిగుఱించి ముహూర్తమునునిర్ణయించవలయునో; వానియొక్క గ్రహ చారస్థితిననుసరించి గోచరబలం బెట్లున్నదని చకరాగానెఱింగి చూచికొని; తద్గుణాగణములచే తద్బలాబలంబులను కనిపెట్టి, కాలమునందు బలకరంబుగా నాగోచారశుభసూచనకు అనుకూలంబుగా నుండునట్లు ముహూర్తమును నిర్ణయింపవలసియుండును. కావున నీముహూర్తరత్నావళిలో గోచరప్రకరణము ఇచ్చుటనిరూపింపంబడుచున్నది;— గోచరమనగానేమి? జన్మరాశినుండి చెప్పంబడిన నిషిద్ధస్థానస్థితులగు నిప్పటిగ్రహంబులవశముచే శుభాశుభనిరూపణంబు నొనరించుటయే గోచరంబనంబడును. అదియెట్లనిన;—

### ౧౩౦. రవిగోచర విచారము.

శ్లో॥ శుభోర్కో జన్మతస్త్ర్యాయదశషట్సువిధ్యతే ।
జన్మతో నవపంచాంబు వ్యయగైర్వ్యర్కిభిస్సదా ॥

తా॥ (ఇదినారదవచనము.) సూర్యుడుజన్మరాశినుండి 3-౬-౧౦-౧౧వరాసులలోనుండగా; శనితప్పతక్కినగ్రహములు ౯-౧౨-౪-౫వ రాసులలోనుండినయెడల విద్ధుండైశుభుండనంబడును. అనగాపైనచెప్పిన 3-౬-౧౦

౧౧వ స్థానములలోరవిమంచివాడయ్యె. తక్కిన ౪-౫-౭-౮-౯-౧౨-౧-౨ స్థానములలో నశుభఫలదుండని భావము. అందులోను ౧౨-౪-౯-౫ స్థానములలోనున్న సూర్యుడు అనిష్టస్థానములలలోనున్నను, పూర్వోక్తక్రమమున ను సరించి షష్ఠాదిస్థానస్థితులైన శనివర్జితగ్రహములనుండి విద్ధుడుకాకపోయి న ననిష్టఫలదుండు. ఇదియేవామవేధయనంబడును. ఎపుడువిద్ధుడో అపుడు శుభఫలదుండు. ఇక ౧-౨-౭-౮ స్థానంబులలోననిష్టుండని భావము.

## ౧౩౧. చంద్రగోచర విచారము.

శ్లో॥ విధ్యతేజన్మతోనేందు ద్యూనాద్యాయారిఖత్రిషు ।
స్వేష్వష్టాంత్యాంబుధర్మస్థైర్వ్యబుధైర్జన్మతశ్శుభః ॥

తా॥ (ఇదినారదవచనము.) జన్మరాశ్యాదిగా ౧౦-౩-౧౧-౧-౬-౭-చంద్రుడుండగా ౪-౯-౮-౫-౧౨-౨ స్థానంబులలో బుధేతరగ్రహంబులుండిన శుభఫలదాయకుండు. ఇట్లుండినవిద్ధుండనంబడును. దీనికివ్యతిరేకముగా గ్రహస్థితిగల్గిన ననగా ౪-౯-౮-౫-౧౨-౨లో చంద్రుడుండగా, ౧౦-౩-౧౧-౧ ౬-౭ స్థానములలో బుధేతరగ్రహములున్నయెడ పార్శ్వవిద్ధయనంబడును. అపుడును అశుభుడైనను ఫలదాయకుండు. విద్ధుడుకాకయుండిన ఫలదాయకుండు కాడనిభావము.

## ౧౩౨. కుజశని రాహుకేతు గోచరవిచారము.

శ్లో॥ త్రిషడేకాదశసహితోధరాసుతోరిష్ఫధర్మసుతసంస్థైః ।
దినకరతనయోపిశుభోన విధ్యతేఖచరైర్వ్యనోష్ణకరం ॥

ఇతివసిష్ఠః.

రాహుకేతుఫలంసర్వంమంద వత్కథితంబుధైః ।
వేదోపితద్వదేవోహ్యా వామవేధస్తథైవచ ॥
ఇతిశార్జ్గధరః.

తా॥ జన్మరాశ్యాదిగా కుజశని రాహుకేతువులు ౬-౧౧-౩లో నుండగా; ౯-౫-౧౨లో నుండు తక్కినగ్రహములచేత విద్ధులనంబడి శుభఫలప్రదులు. దీనికివ్యతిరేకమైన పాపులైనను వామవేధగలవారలై శుభఫలప్రదులే అగుదురు. తక్కినస్థానంబులలో నశుభఫలప్రదులు. అయిన సూర్యునివలన శనికివిద్ధలేదు.

## ౧౩౩. బుధగోచరవిచారము.

శ్లో॥ జ్ఞస్స్వబ్ధవ్యష్టఖాయేషు జన్మతశ్చేన్నవిధ్యతే ।
సుతత్ర్యంకాద్యష్టమాంత్య సంస్థితైరింమజష్ఖభిః ॥
ఇతినారదః.

తా॥ జన్మరాశిమొదలు బుధుఁడు ౨-౪-౬-౮-౧౦-౧౧ స్థానములలోనుండగా ౫-౩-౯-౧-౮-౧౨లో నితరగ్రహంబులచే విద్ధుడైశుభుండనంబడును. వ్యతిరేకముగానున్న నశుభుండైనను వామవిద్ధుడగుటచేత శుభుండగును. బుధునికి చంద్రవేధలేదు. విద్ధుఁడుకాక యితరస్థానములలోన శుభుండనిభావము.

## ౧౩౪. గురుగోచర విచారము.

శ్లో॥ శరాబ్ధిద్వ్యంత్యగోదిగ్ద్వివహ్ని రుద్రాగ్నిభిఃక్రమాత్ ।
జన్మరాశేర్గురుశ్శ్రేష్ఠోగ్రహైర్యదినవిధ్యతే ॥ ౩౦౪ ॥
ఇతినారదః.

తా॥ గురుండు జన్మరాశినుండి ౫-౨-౯-౭-౧౧ స్థానములలోనుండగా, ౪-౧౨-౧౦-౩-౩ స్థానములలో నుగ్రహంబులచేత, శుభఫలదుండు, వ్యతిరేకముగాండి పాపుడైనను వామవిద్ధచే శుభుం డనంబడును. విద్ధలేకతక్కిన ౭ స్థానములలోనుండిన నశుభుండని భావము.

## ౧౩౫. శుక్రగోచర విచారము.

శ్లో॥ జన్మభాదాసుతాష్టాంకాంత్యా యేష్వేష్టోనవిధ్యతే ।
భార్గవోమృత్యుసప్తాద్య స్త్వాంకేశాయారివహ్నిగైః ॥
ఇతినారదః.

తా॥ జన్మరాశ్యాదిగా ౧-౨-౩-౪-౫-౮-౯-౧౨-౧౧ స్థానములయందుండగా ౮-౭-౧-౧౦-౯-౫-౧౧-౬-౩ స్థానగతగ్రహంబులచేత విద్ధుండై; వ్యతిరేకమున వామవిద్ధుడై, మొత్తము మూడ స్థానంబులలో శుభఫలదాయకుండనంబడును. తక్కిన మూటిలోమాత్రమశుభుండు.

## ౧౩౬. వేధావిచారప్రయోజనము.

శ్లో॥ అపవిద్ధోగ్రహః కశ్చిన్నదదాతిశుభంఫలం ।
వామవేధవిధానేన త్వశుభోఽపిశుభప్రదః ॥ ౩౦౬ ॥
అతస్తద్ద్వివిధంమూలం విచార్యైవఫలంవదేత్ ।
హిమాద్రివింధ్యయోర్మధ్యే వేధజంతద్గ్రహోలయాత్ ॥
అజ్ఞాత్వాద్ద్వివిధంవేధంయోగ్రహాణాంబలంవదేత్ ।
సమృషావచనాభాషీహాస్యం యాతిజనైస్సదా ॥ ౩౦౭ ॥

తా॥ పైన చెప్పినట్లు విద్ధముకాని గ్రహము శుభఫలదాయకుండు కాచాలదు. వామవేధవిధానముచే గ్రహము అశుభుండైనను శుభఫలమొందగును. కావున నావేధావిచారంబును సమూలంబుగా చక్కగా నెఱింగి ఫలము చెప్పవలయును. ఈవేధావిచారము హిమవంతంబునకును వింధ్యపర్వతంబునకును నడుమనుండువారికి ముఖ్యమైనది-తక్కినవారికినీవిచారము వలదు. ఈద్వివిధవేధ నెఱుంగక గ్రహబలంబును చెప్పునట్టి జోయిసుఁడు అసత్యవాదయనంబడి జనులచే పరిహసింపంబడును అనికశ్యపవచనంబులు. ఇఁక సామాన్యముగా నంతట నందఱికిని విహితనిషిద్ధస్థానఫలంబులు విధిరత్నంబను గ్రంథమున చెప్పంబడియున్నది. అదియెట్లనిన:—

౧౩౨. సూర్యద్వాదశభావసంచారఫలము.

శ్లో॥ స్థానంజన్మని నాశయేద్దినకరః కుర్యాద్ద్వితీయేభయం ।
దుశ్చిక్యే శ్రియమాతనోతిహిబుకేమానక్షయంయ్ఛతి॥
దైన్యంపంచమగఃకరోతి రిపుహాషష్ఠోర్థహాసప్తమే ।
పీడామష్టమగఃకరోతిపరుషాం కాంతిక్షయంధర్మగః ॥

శ్లో॥ కర్మసిద్ధిజనకస్తు కర్మగో ।
విత్తలాభకృదథాయసంస్థితః ॥
ద్రవ్యనాశజనితాంమహాపదం ।
యచ్ఛతివ్యయగతో దివాకరః ॥ ౩౧౦ ॥

తా॥ (విశేషసూచన — ఈగోచారఫలమును జన్మకాలమునందు కుండలిలో చంద్రుడుండెడు రాశిజన్మ రాశియనఁబడును. అదిమొదలుతత్తత్ స్థానములకు గ్రహమువచ్చినప్పుడు శ్లో కోక్తఫలంబులు జరుగుచుండుననునది సామాన్యముగాలోక విదితవిషయము. ఆదిగాక, జన్మకాలకుండలిలో నేయే గ్రహము ఏయేరాశిలోనుండునో నాయాగ్రహగోచారమును చూచునప్పుడు ఆగ్రహముండినరాశినుండి తత్తత్ స్థానఫలంబును కూడనీప్రకారముగాగ్రహింపవలయును. ఇదిజ్యోతిస్సంప్రదాయపద్ధతిగానున్నది.) సూర్యుడు జన్మరాశ్యాదిగా, ౧లో స్థాననాశనము. ౨లోభయము. ౩లోసంపద. ౪లో గౌరవహాని. ౫లో దీనత్వము. ౬లో శత్రునాశము. ౭ లో ధనహాని. ౮పీడనము. ౯లో తేజోహాని. ౧౦లో సత్కర్మసిద్ధి. ౧౧లో ధనలాభము. ౧౨లో ధననాశమువలన మహావిపత్తు;— వీటిని కలుగజేయుచుండును.

౧౩౭. చంద్రద్వాదశ భావసంచారఫలము.

శ్లో॥ జన్మన్యన్నం విశతిహిమగు ర్విత్తనాశంద్వితీయే ।
దద్యాద్దివ్యంసహజభవనేకు క్షిరోగంచతుర్థే॥
కార్యేనాశంతనయగృహ గోపి త్తలాభంచషష్ఠే ।
ద్యూనేద్రవ్యంయువతిసహితంమృత్యుసంస్థోపమృత్యుం॥

శ్లో॥ నృపభయంకురుతే నవమశ్శశీ ।
దశమధామగతస్తు మహత్సుఖం ॥
వివిధమాయగతః కురుతేధనం ।
వ్యయగతస్తురుజంధన సంక్షయం ॥ ౩౧౨ ॥

తా॥ చంద్రుఁడు జన్మరాశ్యాదిగా—౧లో అన్నసౌఖ్యమును, ౨లో ధనహానిని, ౩లో ద్రవ్యలాభమును, ౪లో కడుపునొప్పిని, ౫లో కార్య నాశమును, ౬లో ధనలాభమును, ౭(స్త్రీ)లో ధనలాభమును, ౮లో అపమృత్యుభయమును, ౯లో రాజభయమును, ౧౦లో మహాసౌఖ్యమును, ౧౧లో (స్త్రీ)సంగసుఖమును, ౧౨లో రోగమునుధన హానినికూడనిచ్చుచుండును.

౧౩౯. కుజద్వాదశభావచారఫలం.

శ్లో॥ ప్రథమగృహగతః క్షోణీసూనుః కరోత్యరిజంభయం ।
క్షపయతిధనంవిత్తస్థానేతృతీయగతోర్థదః ॥
అరిభయమతః హాతాలేర్థాక్షీణోతిహి పంచమే ।
రిపుగృహగతః కుర్యాద్విత్తం రుజంమదనస్థితః॥ ౩౧౩ ॥

శ్లో॥ జనయతినిధనస్థశ్శత్రుబాధాంధరాజ్ఞో ।
దిశతినవమసంస్థః కాయపీడామతీవ ॥
శుభమపిదశమస్థోలాభ గోభూరిలాభం ।
వ్యయభవనగతోసావ్యాధ్యనర్థార్థనాశం ॥ ౩౧౪ ॥

తా॥ అంగారకుండు జన్మరాశ్యాదిగా; ౧ శత్రుభయమును, ౨ ధనక్షయమును, ౩ ధనలాభమును, ౪ శత్రుభయమును, ౫ ధనహానిని, ౬ ధనలాభమును, ౭ రోగమును, ౮ శత్రుబాధను, ౯ దేహసంకటమును, ౧౦ శుభమును, ౧౧ మిక్కిలి లాభమును, ౧౨ రోగకష్టనష్టంబులను కలుగ జేయుచుండును.

## ౧౪౦. బుధద్వాదశ భావచారఫలము.

శ్లో॥ బుధశ్చప్రథమగోభయం దిశతిబంధమర్థేధనే ।
ధనంరిపుభయాన్వితం సహజగశ్చతుర్థోర్థదః ॥
అనిర్వృతికరోభవేత్తనయగోరిగః స్థానదః ।
కరోతిమదనస్థితో బహువిధాంశరీరవ్యథాం ॥ ౩౧౫ ॥

శ్లో॥ అష్టమేశశిసుతేధనవృద్ధిం ।
ధర్మగస్తుమహతీం తనుపీడాం ॥
కర్మగస్సుఖమథాయగ తార్థం ।
ద్వాదశోభవతి విత్తవినాశః ॥ ౩౧౬ ॥

తా॥ బుధుడు జన్మరాశ్యాదిగా; ౧ భయమును, ౨ బంధనమును, ౩ శత్రుభయముతోచేరిన ధనమును, ౪ ధనలాభమును, ౫ సుఖములేకయుండుటను, ౬ స్థానలాభమును, ౭ అనేకవిధశరీరబాధలను, ౮ ధనవృద్ధిని, ౯ మిక్కిలిదేహపీడను, ౧౦ సుఖమును, ౧౧ ధనమును, ౧౨ ధననాశనమును వరుసగా కలుగజేయుచుండును.

## ౧౪౧. గురుద్వాదశభావ చారఫలము.

శ్లో॥ భయంజన్మన్యార్యోజనయతి ధనస్థోర్థమతులం ।
తృతీయేంగక్లేశం దిశతిచ చతుర్థేర్థవిలయం ॥
సుఖంపుత్రస్థానేరుజమపిచ కుర్యాదరిగృహే ।
గురుర్మాన్యేపూజాం ధననిచయనాశంచనిధనే ॥౩౧౭॥

శ్లో॥ ధర్మగతోర్థనవృద్ధికర స్స్యాత్ ।
ద్వ్యుత్తమహాయోదశ మేఽమరపూజ్యః ।
స్థానధనానిదదాతిసచాయే ।
ద్వాదశగస్తను మానసపీడాం ॥ ౩౧౭ ॥

తా॥ గురుండు జన్మరాశ్యాదిగా; ౧ భయమును, ౨ విశేషధనలాభమును, ౩ దేహకష్టమును, ౪ ధననాశనమును, ౫ సౌఖ్యమును, ౬ రోగమును, ౭ పూజ్యతను, ౮ ధననాశనమును, ౯ ధనవృద్ధిని, ౧౦ ధననాశనమును, ౧౧ సుఖవసతిని ధనలాభమునుకూడ, ౧౨ మనోదేహపీడను, వరుసగా కలుగజేయుచుండును.

౧౪౨. శుక్రద్వాదశ భావసంచార ఫలము.

శ్లో॥ జన్మన్యరిక్షయకరో భృగుజోర్థదోర్థే ।
దుశ్చిక్యగస్సుఖకరో ధనదశ్చతుర్థః ॥
స్యాత్పుత్రద స్తనయగోఽరిగతోరివృద్ధిం
శోకప్రదోమదనగోనిధనేర్థదాతా ॥ ౩౧౮ ॥

శ్లో॥ జనయతివివిధాంబరాణిధర్మే ।
నసుఖకరోదశమస్థితస్తుశుక్రః ॥
ధననిచయకరస్సలాభసంస్థో ।
వ్యయభవనే పిధనాగమంకరోతి ॥ ౩౨౦ ॥

తా॥ శుక్రుండు జన్మరాశ్యాదిగా; ౧ శత్రుక్షయమును, ౨ధనలాభము ను, ౩ సౌఖ్యమును, ౪ ధనలాభమును, ౫ సంతానలాభమును, ౬ శత్రువృద్ధిని, ౭ దుఃఖమును, ౮ ధనలాభమును, ౯ మంచినస్త్రీలాభమును, ౧౦ సౌఖ్యనష్టమును, ౧౧ ధనలాభమును, ౧౨ ధనలాభమును, వరుసగాఁ కలుగజేయుచుండును.

౧౪౩. శనిద్వాదశ భావసంచారము.

శ్లో॥ విత్తభ్రంశంరుగార్తిం దినకరతనయే జన్మరాశింప్రపన్నే।
విత్తక్లేశంద్వితీయే ధనహరణకృతిం విత్తలాభంతృతీయే।
పాతాలేశత్రువృద్ధింసుతభవనగతఃపుత్రభృత్యార్థనాశం।
షష్ఠేస్థానేర్థలాభం జనయతిమదనేదోషసంఘాతమూ
ర్ఛం॥ ౩౧॥ శరీరపీడాం నిధనేచధర్మే।
ధనక్షయం కర్మణిదౌర్మనస్యం।
ఉపాంత్యగోవిత్తమనర్థమంత్యే।
శనిర్దదాతీత్యవదద్వసిష్ఠః॥ ౩౨॥

తా॥ శనైశ్చరుండు జన్మరాశ్యాదిగా, ౧ రోగప్రాప్తిని ధననాశము ను, ౨ ద్రవ్యకష్టమును, ౩ పోగొట్టబడిన ద్రవ్యలాభమును; ౪ శత్రువృద్ధిని, ౫ పుత్రుల భృత్యుల ధనముల యొక్క కష్టమును, ౬ ధనలాభమును, ౭ అనేకదోషములను, ౮ దేహపీడనమును, ౯ ధనక్షయమును, ౧౦ చింతాసంతాపమును, ౧౧ ధనలాభమును, ౧౨ ధననష్టమును; వరుసగా కలుగజేయును.

## ౧౪౩. రాహుద్వాదశభావ సంచారము.

శ్లో॥ రాహుర్జన్మగతోభయం చకలహంసౌభాగ్యమానక్షయం।
విత్తభ్రంశమహాసుఖంనృపభయం చార్థక్షయంయచ్ఛతి॥
సంతాపంకలహంచవిత్తమధికం శీఘ్రంవినాశంన్నృణాం ।
కేతుస్తత్ఫలమేవరాశిషుభవే చ్ఛంసంతిగర్గాదయః ॥

తా॥ రాహువు జన్మరాశ్యాదిగా; ౧ భయమును, ౨ కలహమును, 3 సౌభాగ్యమును, ౪ గౌరవహానిని, ౫ ధనక్షయమును, ౬ మిక్కిలిసుఖమును, ౭ రాజభయమును, ౮ ధనక్షయమును, ౯ సంతాపమును, ౧౦ కలహమును, ౧౧ అధికధనలాభమును, ౧౨ హానిని; వరుసగా కలుగఁజేయుచుండును. కేతువుకూడ రాహువువలెనే ఫలము నిచ్చువాడుగా నుండునని యిట్లు నవగ్రహములకును గోచారఫలంబులు వసిష్ఠగర్గాదులచే చెప్పఁబడినవి.

## ౧౪౪. గ్రహఫల పరిపాకనియమము.

శ్లో॥ ఋక్షసంధిగతాఃఖేటాః రాశిసంధిగతాఃగ్రహాః॥
పశ్యరాశేః ఫలందద్యుః వక్రీ తద్విపరీతగం ॥ 3౨౪॥

తా॥ సామాన్యముగా గ్రహములు నక్షత్రసంధిని రాశిసంధిని పొందినపుడు పోబోవురాశియొక్క ఫలమునే కలుగ జేయుచుందురు. అయిన వక్రచారమునందిన గ్రహము వెనుకటి (పూర్వ) రాశిఫలమునే ఇచ్చునని కమలాసన వచనము.

౧౪౬. గోచారబలము చాలనపుడు వర్జ్యములు.

శ్లో॥ అకాలచర్యాం మృగయాంచసాహసం ।
సుదూరయానంగజవాజివాహనం ॥
గృహేపరేషాంగమనంవివర్జయే ।
ద్గ్రహేషురాజావిషమస్థితేషుహి ॥ ౩౨౫ ॥

తా॥ కాలోచితముకాని పనులను, వేటను. సాహసకార్యములను, దూరప్రయాణమును, అశ్వగజాది వాహనములను, ఇంటికి అన్యులరాకపోకలను, అనగా వివాహోపనాయనాద్యుత్సవంబులను మొదలగువాటిని గోచారగ్రహ బలము చాలనప్పుడు చేయరాదని శ్రీపత్యాచార్యవచనము.

౧౪౭ గోచారగ్రహబలము చాలనపుడు శాంతిముఖ్యము.

శ్లో॥ గ్రహేషువిషమస్థేషు యశ్శాంతింనకరోతిసః ।
అర్థహానించమరణం చాశ్నుతేసర్వసంకటం ॥ ౩౨౬ ॥
మాసిమాస్యయనేచైవ చంద్రసూర్యగ్రహేపివా ।
విషువత్త్రికసంక్రాంతౌ వ్యతీపాతే దినక్షయే॥ ౩౨౭ ॥

తా॥ గోచారబలము చాలనపుడు అనగా ప్రాగుక్తంబులైన శుభేతరస్థానంబులలో గ్రహములు సంచరించునపుడు ఎవడు శాంతిని చేయక మానునో, వాడు ధనక్షయమును లేక మరణమునందును. ఆశాంతిని ప్రతిమాసమువచ్చు నయనప్రవేశ కాలంబులలోనైనను, సూర్యచంద్రగ్రహణ కాలంబు

లలోనైనను, మేషాదిసంక్రమణ కాలంబులలోను, వ్యతిపాత యోగముల నాడును, అవమతిథిలోను శాంతిచేసి కొననగునని వసిష్ఠవచనంబులు.

౧౪౮. శాంత్యనావశ్యక సూచనలు.

శ్లో॥ సౌమ్యేక్షితే నిష్టఫలః శుభదః పాపవీక్షితః ।
నిష్ఫలాత్తా గ్రహాస్స్వేనశత్రుణాచ్చావలోకితః ॥౩౭॥
నీచరాశిగతస్స్వస్యశత్రుక్షేత్రగతోపివా ।
శుభాశుభఫలంనైవ దద్యాదస్తంగతేపివా ॥ ౩౮ ॥

తా॥ అనిష్టఫలము నిచ్చుగ్రహము, శుభగ్రహముచేత చూడబడినను, శుభమునుచేయుగ్రహము అశుభగ్రహముచేత చూడబడినను, గ్రహము తన శత్రుగ్రహము చేదృష్టుడైనను, నీచరాశిగతుండైనను శత్రుక్షేత్రమునందుండినను, అస్తంగతుండైనను, ఆగ్రహము శుభమును గాని అశుభమునుగాని ఏఫలమునుచేయజాలనివాడు (కావున నట్టిగ్రహమునకు శాంతియనావశ్యకమని తానుగా నేర్పడును.) అనివసిష్ఠ వచనంబులు.

౧౪౯. రాహుగోచరఫలవిశేషము.

శ్లో॥ జన్మర్క్షే నిధనంగ్రహేంజనిభతో ఘాతః క్షతిఃశ్రీర్వ్యథా ।
చింతాసౌఖ్యకలత్రదౌష్ట్యమృతయస్స్యుర్మాననాశ
స్సుఖం ॥ లాభోపాయ ఇతిక్రమాత్తదశుభధ్వస్త్యైజప

స్వర్ణగో । దానం శాంతిరథో గ్రహం త్వశుభదం నో వీక్ష్య
మాహుః పరే ॥ ౩౩౦ ॥

తా॥ గోచార ప్రస్తావమువలన గ్రహనక్షత్రఫలమును, గ్రహణీయ రాహుగోచరఫలమును, గ్రహణాశుభ ప్రతీకారమును, దుష్టగ్రహణదర్శన నిషేధమును, ముహూర్తచింతామణికారులిట్లు చెప్పియున్నారు— జన్మనక్షత్రమున గ్రహణము సంభవించితే ఆనక్షత్రమువారికి మరణభయము. "యస్యైవ జన్మనక్షత్రే గ్రస్యేతే శశిభాస్కరౌ । తజ్జాతానాం భవేత్పీడా యే నరాః శాంతివర్జితాః" అనివసిష్ఠవచనము గాన దానికిశాంతిచేసిననా భయము లేదు. (ఇచ్చటవిశేషము—"యస్యరాజ్యస్య నక్షత్రే స్వర్భానురుపరజ్యతే । రాజ్యభంగం సుహృన్నాశం మరణం చాత్ర నిర్దిశేత్॥" అని భార్గవీయ వచనము గావున రాజ్యాభిషేకమయిన నక్షత్రమున గ్రహణము సంభవించిన నప్పుడు తప్పక శాంతికార్యమును చక్కగాచేయించవలయును. లేనిచో రాజ్యమునకు రాజునకును హానిసంభవించును గాన రాజపురోహితులకది జ్ఞప్తియుండదగినవిషయము.) ఇక జన్మరాశిలో గ్రహణము సంభవించితే ఘాతమనగా శరీరపీడనము. ౨ వరాశిలో ద్రవ్యనాశము. ౩లో సంపద. ౪లో దేహపీడ. ౫లో చింత, పుత్రాదులకు తొందరయును. ౬ సౌఖ్యము. ౭ కళత్రదుఃఖము (స్త్రీ) మరణము. ౮లో అపమృత్యుభయము. ౯లో మానహాని. ౧౦లో సుఖము. ౧౧లో లాభము. ౧౨ లో మృత్యుభయము. "అర్కశశినోస్తుష్ణాస్నాసమద్యే గ్రహే" అని దైవజ్ఞమనోహర వచ

నముగావున ఈ రాశిఫలములు ౬ మాసములవరకు ననువర్తించుచుండునని యెఱుంగనగును. ఇంక దీనికై "సువర్ణనిర్మితంనాగం సతిలంతామ్రభాజనం । సదక్షిణంసవస్త్రంచశ్రోత్రియాయ నివేదయేత్ । సౌవర్ణంరాజతంవాపి బింబంకృత్వాస్వశక్తితః। ఉపరాగోద్భవక్లేశచ్ఛిదేవి ప్రాయకల్పయేత్ ॥ దానమంత్రస్తు ॥ తమోమయ మహాభీమసోమసూర్య విమర్దన । హేమనాగప్రదానేన మమ శాంతిప్రదోభవ" అనిదైవజ్ఞమనోహర ప్రమాణముగావున యథోక్త శాంతిచేత సుక్షేమముగల్గును. మఱియు "గోదానంభూమిదానంచస్వర్ణదానంవిశేషతః। గ్రహణేక్లేశనాశాయ దైవజ్ఞాయనివేదయేత్" అనిస్కాందవచనము. మఱియునిచ్చట దేశవిశేషమునుగాని పాత్రవిశేషమునుగాని ద్రవ్యవిశేషమునుగాని అపేక్షించవలసినదిలేదు. "సర్వంగంగాసమంతోయం సర్వేబ్రహ్మసమాద్విజాః । సర్వభూమిఃకురుక్షేత్రం గ్రహణే చంద్రసూర్యయోః" అనివ్యాసవచనము. ఇచ్చటకొందఱు గ్రహణము మేఘాచ్ఛాదితమై కనుబడకపోయినను, గ్రుడ్డివారికిని, బాలవృద్ధాతురులకును శాంత్యాదికమక్కఱలేదందురు. ఫలితాంశమేమనిన నేవిధముగానైనను రాహుపీడగాన పరిహరించుకొనుట శ్రేయస్కరము. ఇట్టివిషయంబులు జ్యోతిషికులకు సగ్రాంహ్యము.

## ౧౪౦. చంద్రబలమున విశేషము.

శ్లో॥ పాపగ్రహేణసంయుక్తః పాపజామిత్రసంస్థితః ।
పాపద్వయమధ్యగతశ్శుభోప్యశుభదశ్శశీ ॥ ౩౩౧ ॥
అనిష్టస్థానసంస్థోపిభవేచ్ఛుభకరశ్శశీ ॥
సౌమ్యభాగేధిమిత్రాంశే గురుణావాపివీక్షితే ॥ ౩౩౨ ॥

తా॥ గోచరవర్తిచంద్రునికి విశేషము చెప్పబడినది. ఎట్లనిన, ఆచంద్రుడు శుభుడుగానుండినను, వానితో పాపగ్రహము చేరియుండినను, వానికిసప్తమమున పాపగ్రహముండినను, ఇరుగెలంకులలో పాపగ్రహమున్నను, అట్టిచంద్రుడు తానియ్యవలసిన శుభఫలము నవ్వుడివ్వడు. గోచరవశమున ననిష్టస్థానగతుడైన చంద్రుండును సౌమ్యభాగలలోనుండినను అధిమిత్రాంశలోనుండినను గురునిచేతచూడంబడియున్నను అప్పుడనిష్టఫలముని వ్వక శుభఫలప్రదుండై యుండును. అని రాజమార్తండవచనము.

## ౧౪౧. పక్షానుసారము చంద్రునిఫలము.

శ్లో॥ మాసాదిందుశ్శుభోయస్య తత్పక్షస్తస్యశోభనః ।
కృష్ణాదింకాత్వశుభ దేశుభంతద్వ్యత్యయేన్యథా॥౩౩౩॥

తా॥ శుక్లపక్షప్రతిపదలో చంద్రుడు శుభుండుగానుండిన నాపక్షమంతయును శుభుడే. కృష్ణప్రతిపదలో చంద్రుడశుభుడుగానుండిన నాపక్షమంతయును శుభుండగానేయుండును. దీనికి వ్యత్యస్తమైనచో ఫలవ్యత్యాస

సమనగా, శుక్లాదినీ అశుభుడైన నాపక్షమంతయును అశుభుండు. కృష్ణాదిని శుభుడైన చో నా పక్షమంతయును అశుభుండైయుండును కావున ప్రతిపత్తా దిలోను చంద్రబలమునెఱింగికొని కాలబలమును కని పెట్టనగును.

౧౫౨. గ్రహపీడానివారక రత్నధారణము.

శ్లో॥ సూర్యాదీనాంచసంతుష్ట్యైమాణిక్యం మౌక్తికంతథా ।
సువిద్రుమంమరకతం పుష్పరాగంచవజ్రకం ॥ ౩౩౪ ॥
నీలగోమేధవైడూర్యం ధార్యం స్వస్వద్గ్రహక్రమాత్ ।
తదశక్తౌతుసంధార్యంతత్తదోషధిమూలికాం ॥ ౩౩౫ ॥

తా॥ సూర్యాదిగ్రహములు దుష్టస్థానగతులైయున్నపుడు వారికిప్రీత్యర్థముగా; ర. మాణిక్యము; చ-ముత్తెము; కు-పగడము; బు-పచ్చ; గు-పుష్యరాగము; శు-వజ్రము; శ-నీలము; రా-గోమేధికము; కే-వైడూర్యము; ఈరత్నములుసంధార్యములు గానుండును. దానికిగతిలేక పోయినతత్తద్గ్రహములకు చెప్పంబడియుండు మూలికలనైనను ధరింపవచ్చును. అనికశ్యపవచనము.

౧౫౩. చంద్రతారాబల విచారము.

శ్లో॥ జన్మసంపద్విపత్ క్షేమప్రత్యరిస్సాధనోవధః ।
మిత్రంపరమమిత్రం తుజన్మభాచ్చపునఃపునః ॥ ౩౩౬ ॥

తా॥ తనజన్మనక్షత్రము మొదలు పంచాంగదిననక్షత్రమువరకు నెంచిన నందులో ౧ జన్మతార; ౨ సంపత్తార; ౩ విపత్తార; ౪ క్షేమతార; ౫

ప్రత్యక్తార; ౬ సాధనతార; ౭ నైధనతార; ౮ మిత్రతార; ౯ పరమమిత్ర తార; మరలనిట్లే ౯; అటువెనుకనిట్లే ౯; వెరసి ౨౭ నక్షత్రములు. అనినారద వచనము.

### ౧౫౪. ఉత్తమాధమతారలు.

శ్లో॥ జన్మతారాద్వితీయాచ షష్ఠీచైవ చతుర్థికా ।
అష్టమీనవమీచైవ షట్కతారాశ్శుభావహాః ॥ ౩౩౭ ॥

తా॥ పైనచెప్పిన ౯ తారలలో ౧ జన్మతార; ౨ సంపత్తార; ౪ క్షేమతార; ౬ సాధనతార; ౮ మిత్రతార; ౯ పరమమిత్రతార; ఇవి యారును మంచివనియెఱుంగవలెనని నారదవచనము.

### ౧౫౫. తారాబలచంద్ర బలవిచారము.

శ్లో॥ శుక్లేపక్షే శీతరశ్మిర్బలీయా౯ ।
నప్రాధాన్యం తారకాయాస్తుతత్ర ॥
శక్త్యాయుక్తే విద్యమానేపికాంతే ।
నస్వాతంత్ర్యం యోషితః క్వాపిదృష్టం ॥ ౩౩౮ ॥

తా॥ శుక్లపక్షమునందు చంద్రుడు బలవంతుడు; అట్టిసమయమున తారాబలము ప్రధానము కాదు. శక్తియుక్తుండైన పతియుండగా పణతికొకప్పుడును స్వాతంత్ర్యములేదుగదా? అని రత్నమాలావచనము.

శ్లో॥ నఖలుబహులపక్షే శీతరశ్మేః ప్రభావః ।
కథితమిహహి తారావీర్యమార్యైః ప్రధానం ।

అతివికలశరీరేప్రేయసిప్రోషితేవా ।
ప్రభవతిఖలుకర్తుం సర్వకార్యాణియోషా ॥ ౩౩౯ ॥

తా॥ తన పెనిమిటి వికలాంగుండైనపుడును మార్గాయాసమునందుండు నపుడును సమస్తకార్యంబులను స్వాతంత్ర్యముతో జరుపుటకు ఇల్లాలు ఎట్లు శక్తురాలో అట్లు; కృష్ణపక్షమునందు చంద్రబలముకన్నను తారాబలము ప్రధానమని రత్నమాలావచనము. ఈవచనంబులకు “ కృష్ణేబలవతీతారాశుక్ల పక్షేబలీశశీ” అను నారదవచనాధారముగలదు.

## ౧౫౬. దుష్టతారా పరిహారకశాంతి.

శ్లో॥ ప్రత్యరేలవణందద్యాచ్ఛాకందద్యాత్త్రి జన్మసు ।
విపత్తారేగుడందద్యాన్నిధనే తిలకాంచనం ॥ ౩౪౦ ॥

తా॥ ౫వ ప్రత్యక్తారయందు లవణదానము; ౧-౧౦-౧౯వ జన్మతారలు ౩టియందు శాకదానము; ౩వ విపత్తారలో బెల్లముదానము; ౭ వనైధనతారలో తిలదానము కాంచనదానము; చెడ్డతారలలో నావశ్యకముగా కార్యము నెరవేర్చవలసి వచ్చినపుడు పైదానముల నాచరించి చేయవలయునని భావము.

## ౧౫౭. తారలలోనంశాది విచారము.

శ్లో॥ పర్యాయేప్రథమేవర్జ్యావిపత్ప్రిత్యరినైధనాః ।
ద్వితీయేత్వంశకావర్జ్యాస్తృతీయేత్వఖిలాశ్శుభాః॥౩౪౧॥

ఆద్యాంశేవిపదిత్యాజ్యః ప్రత్యరేచరమోఽశుభః ।
వధేత్యాజ్య స్తృతీయోంశ శ్శేషా అంశాస్తు శోభనాః॥

తా॥ తారాబలము చూచుటలో ౯-౯ నక్షత్రములు పర్యాయసంకేతములు. వీటిలో మొదటి ౯ ప్రథమపర్యాయంబనబడును. అందులో విపత్తార ప్రత్యక్తార నైధనతారలు వర్జ్యములు రెండవ ౯ నక్షత్రములు ద్వితీయ పర్యాయము అందులో చెడ్డతారలలోని అంశములును వదలవలయును. మూడవ ౯ నక్షత్రములు తృతీయపర్యాయమనబడు అందులో నన్నియును శుభములునుగానే భావించవచ్చును. నక్షత్రప్రమాణముయొక్క నాల్గవభాగము అంశమనబడును. విపత్తారయందు ప్రథమాంశత్యాజ్యము. ప్రత్యక్తారయందు కడపటి నాల్గువ అంశము త్యాజ్యము. నైధనతారయందు తృతీయాంశము త్యాజ్యము. తక్కిన అంశలు శుభప్రదంబులు. అనిజగన్మోహనగ్రంథస్థ గురువచనంబులు.

## ౧౫౮. చంద్రుని ద్వాదశావస్థలు.

శ్లో॥ చంద్రస్యద్వాదశావస్థారాశౌరాశౌయథాక్రమాత్ ।
యాత్రోద్వాహాదికేకార్యేసంజ్ఞాతుల్యఫలప్రదాః ౩౮౩
షష్టిఘ్నంచంద్రనక్షత్రంతత్కాలఘటికాన్వితం ।
వేదఘ్నమిషువేదాప్తమవస్థాభానుభాజితాః ॥ ౩౮౮ ॥

తా॥ ప్రతిరాశిలలోను చంద్రునికి ౧౨ అవస్థలు చెప్పంబడినవి. అవి వాటిపేళ్లకుతగినట్లుఫలమిచ్చునట్టివి. వాటినికనిపెట్టుట యెట్లనిన — ప్రతిరా

శిలోను గతనక్షత్రఘుల్లకు ౬౦ గడియలమానముచొప్పున గడియలనెత్తికొని వర్తమాననక్షత్రమున ఖాను పెట్టెడు ముహూర్తమునకు అగుగడియలను చేర్చి ౪తో గుణించి ౪౫ చేత భాగించినదానిని ౧౨తో భాగించిన ఇన్ని యవయవస్థనుయని తెలియవచ్చును. వివాహప్రయాణాది కార్యంబులకు వీటిని ముఖ్యముగా చూచికొన తగియున్నదని నారదవచనంబులు.

శ్లో॥ ప్రవాసనష్టాచమృతాజయాహాస్యారతిర్ముదా ।
సుప్తాభుక్తాజ్వరాకంపాసుస్థితిర్నామసన్నిభాః ॥ ౩౪౫ ॥

తా॥ ౧ ప్రవాసావస్థా=దీనిలో ప్రయాణక్లేశము. ౨ నష్టావస్థ=స్వత్వనష్టమగును. ౩ మృతావస్థా=ఇదియప మృత్యువునిచ్చును. ౪ జయావస్థా=ఇందుగెల్వగలదు. ౫ హాస్యావస్థ=పరిహాసమునందును. ౬ రతిః=కామసుఖదంబు, ౭ ముదావస్థా=సంతోషమబ్బును. ౮ సుప్తా=ఆలస్యముమగును. ౯ భుక్తా=భోజనసౌఖ్యము. ౧౦ జ్వరావస్థ=రోగమువచ్చును ౧౧ కంపావస్థ=భయముగల్గును. ౧౨ సుస్థితి=ఇందులో సౌఖ్యముగనుండునని ౧౨ వేళ్లను కశ్యపవచనము. తెలుపుచున్నది.

౧౫౯. విధిలేనప్పుడు దుర్దోషపరిహారశాంతి.

శ్లో॥ ధేనుం శంఖంరక్తవృషం హేమపీతాంబరద్వయం ।
శ్వేతాశ్వంకృష్ణధేనుంచకృష్ణలోహమజంక్రమాత్
స్వర్ణేనపాససీకృత్యదాతవ్యాదక్షిణాతతః ।
ఆచార్యార్థంజాపకేభ్యోబ్రాహ్మణేభ్యోథశక్తితః ॥ ౩౪౬॥

ఏవంయఃకురుతేసమ్యగ్గ్రహాయజ్ఞంనృపోత్తమః ।
సర్వాన్కామానవాప్నోతిశుభస్థానఫలంలభేత్ ॥ ౩౮౭॥

తా॥ (ఇచ్చట శాంతివిధానాదికము విస్తారముగా గ్రంథాంతరమునం దెలుంగనగును. అంతటిని వ్రాయవలయునన్న విస్తరమగును. సంగ్రహముగావ సిద్ధోక్త దక్షిణాది విధినిమాత్రము చూపియున్నాము.) రవికి ఆవు, చంద్రునికి శంఖము, కుజునికి ఎఱ్ఱయెద్దు, బుధునికిసువర్ణము, గురునకు పసుపువస్త్రములు, శుక్రునికి ధవళ తురగము, శనికినల్లనావు, రాహువునకు ఇనుము, కేతువునకు మేక, ఇవిక్రమముగా దక్షిణగానునచి శాస్త్రోక్తవిధానముగా శాంతినాచరించిన నశుభస్థానగత గ్రహదోషము నివారణమగును. మఱియు మేలుగలదు.

౧౬౦. రవ్యాదులు ఫలకరులగుకాలము.

శ్లో॥ సూర్యఃపంచదినం శశీత్రిఘటికంభౌమోష్టవైవాసరా ।
నష్టాహానిభృగుస్సోమతనయోమాసద్వయంవైగురుః
షణ్మాసాత్పురతోపిసూర్యతనయోరాహుశ్చమాసత్రయం। కేతుశ్చైవదదాతిభావిస కలంగంతవ్యరాశేఃఫలం॥

తా॥ గోచరఫలములను ఏగ్రహమైనను ఎప్పటినుండి యిచ్చుననిన రాశిప్రవేశము చేయుటకు మునుపే పూర్వరాశియందుండగా, రవి ౫దినములు, చంద్రుడు ౩ గడియలు అంగారకుండు ౮ దినములు, బుధశుక్రులు ౭

దినములు, గురుడు ౨ నెలలు, శని ౬ నెలలు, రాహుకేతువులు 3 నెలలు, ముందే ప్రవేశించ బోవురాశిఫలము నిచ్చుట ప్రారంభించెదరని చెప్పంబడినది.

శ్లో॥ ఆదిత్యాదిగ్రహాదద్యుర్లగ్నే వాగోచరేపివా ।
సప్తవిశంతిభాగోర్ధ్వంపరరాశిఫలంఖలు ॥ ౩౫౦ ॥

తా॥ సూర్యాది గ్రహంబులందఱును లగ్నమునగాని గోచరంబునగాని ౨౭ భాగలు గడిచినపిదప, ప్రవేశించ బోవునట్టి పరరాశిఫలమునిచ్చుచుందురని జగన్మోహన వచనము.

౧౬౧. పంచాంగదోషశాంతి విచారము.

శ్లో॥ యోగస్య హేమకరణస్యచధాన్యమిందోః ।
శంఖంచతండులమణీ తిథివారయోశ్చ ॥
తారాబలాయ లవణాన్యథగాంచరాశే ।
ర్దద్యాద్ద్విజాయకనకంశుచినాడికాయాం ॥ ౩౫౧ ॥

తా॥ తిథివారనక్షత్రాదులలో దోషమున్నప్పుడు విధిలేకముహూర్తమును సాధింపవలసిన, తద్దోషపరిహారార్థముగాని; అవిశుభములుగానుండిననాశుభము అతిశయించిఫలించుటకుగాని; చెప్పబోవు దానంబులను చేయుటమిక్కిలిశ్రేయస్కరము- ఎట్లనిన;— వారదోషమునకు రత్నదానము. తిథిదోషమునకు తండులదానము. నక్షత్రదోషమునకు లవణదానము. యోగదోషమునకు బంగారుదానము. కరణదోషములకు ధాన్యదానము. రాశిదోషము

నవ గోదానము. ఈ దానంబులను మంచిగడియ నెఱింగిచేయవలయును.
అనిదీపికావచనము.

## ౧౬౨. గోచరరాశిలో ఫలపరిపాకకాలము.

శ్లో॥ దినకరరుధిరౌప్రవేశకాలే । గురుభృగుజౌ భవనస్యమ
ధ్యయాంతౌ ॥ రవిసుతశశినౌ వినిర్గమస్థే । శశితనయఃఫ
లదస్తుసర్వకాలం ॥ ౩౫౨ ॥

తా॥ గ్రహములు ఏరాశిలోనున్నను ఆరాశిఫలమును, రవ్యంగార కులైనచో ప్రవేశకాలముననే, గురుశుక్రులైనచో మధ్యకాలమున, చంద్రశనులు రాశ్యంతము నందును, బుధుడు నిరంతరమును శుభాశుభఫల దాతల య్యెందురని వరాహవచనము.

ఇట్లు ముహూర్తరత్నావళిలో గోచర ప్రకరణము.

—నాల్గవది ముగిసెను—

# ముహూర్తరత్నావళీగ్రంథమున
# ౫వ - సంస్కార ప్రకరణము.

అవతారిక— ఈ ముహూర్తరత్నావళిలో సంస్కార ప్రకరణము చెప్పంబడుచున్నది. శ్రౌతకర్మచేతగాని స్మార్తకర్మచేత గానిపురుషుడు సం

స్కరింపంబడుటకు సంస్కారమని పేరు. లక్షణచేత తదర్థోక్త దినశుద్ధ్యాది కంబిచ్చుట సంస్కారశబ్దము చేతగ్రాహ్యంబు. కావున సంస్కారప్రకరణము ముహూర్తగ్రంథమున నావశ్యకంబైనది. ఆ సంస్కారంబులు నలుపదియెనిమిది. దానిని గౌతమమహర్షి యిట్లుచూపియున్నారు:—

౧౭౩. సంస్కార విచారము.

సూత్రం—"గర్భాధానం పుంసవనంసీమంతోన్నయనం జాతకర్మ నామకరణాన్నప్రాశన చౌలోపనయనం చత్వారివేద వ్రతాని స్నానం సహధర్మచారిణీ సంయోగః పంచానాంయజ్ఞానామనుష్ఠాన మష్టకా పార్వణశ్రాద్ధం శ్రావణ్యాగ్రహాయణీ చైత్ర్యాశ్వయుజీతి సప్తపాకసంస్థా అగ్న్యాధాన మగ్నిహోత్రం దర్శపౌర్ణమాసౌ చాతుర్మాస్యా న్యాగ్రయణేష్టి నిరూఢ పశుబంధ స్సౌత్రామణీతి సప్తహవిర్యజ్ఞ సంస్థా అగ్నిష్టోమోత్యగ్నిష్టోమ ఉక్థ్య షోడశీవాజపేయోతిరాత్రాప్తోర్యామ ఇతిసప్తసోమయజ్ఞసంస్థా ఇత్యేతే చత్వారింశత్సంస్కారాః। అష్టావాత్మగుణాః దయాసర్వభూతేషు క్షాంతిరనసూయా శౌచమనాయాసో మాంగల్యమకార్పణ్యమస్పృహేతి। యస్యైతే చత్వారింశత్సంస్కారాః అష్టావాత్మ గుణాంశ్చ సబ్రాహ్మణః సాయుజ్యమాప్నోతి" ఇతి ॥ ౩౫౩ ॥

తా॥ ౧ గర్భాధానంబు. (ఆహా! కలికాలమహిమయెట్టిదో? మొదటిసంస్కారమగు దీనినొకరుటిని మరువలేదుగాని తక్కినవి ధర్మశాస్త్రములలోజీర్ణంబులగుచువచ్చె.) ౨ పుంసవనము, 3 సీమంతోన్నయనంబు. ౪ జాతకర్మ. ౫ నామకరణము. ౬ అన్నప్రాశనము. ౭ చౌలము. ౮ ఉపనయనము. ౯-౧౦-౧౧-౧౨ నాల్గువేదవ్రతములు. ౧3 స్నాతకవ్రతము, ౧౪ సహధర్మచారిణీ సంయోగము. ౧౫ దేవయజ్ఞము. ౧౬. పితృయజ్ఞము. ౧౭ భూతయజ్ఞము. ౧౮. మనుష్యయజ్ఞము. ౧౯ బ్రహ్మయజ్ఞము. ఇవి (౧౯)న్నీ; అష్టకాదిసప్త పాకసంస్థలు (౭) ను; అగ్న్యాధానాది సప్తహవిర్యజ్ఞసంస్థలు (౭)ను; అగ్నిష్టోమాదిసప్తసోమయజ్ఞసంస్థలు (౭)ను; వెరసి ౪౦ సంస్కారంబులు. వీటితోడ ౧ సర్వభూతదయ; ౨ క్షాంతి; 3 నిరసూయ ౪ శౌచము; ౫ అనాయాసము; ౬ మాంగల్యము; ౭ అకార్పణ్యము; ౮ నైస్పృహ్యము; అనుఆత్మగుణంబులు వెరసి (౪౮) అయినది. ఇవన్నియునెవనికిగలదోవాఁడు బ్రాహ్మణుండనంబడును. అట్టిబ్రాహ్మణుడు సాయుజ్యమునందును, వాఁడుగదాఇహపరపూజ్యుండు. ఈపేళ్లనుకూడమరచియుండు మహాత్ములు కలికాలముయొక్కబ్రాహ్మణులు.

౧౬౪. సంతానమైహికాముష్మిక ఫలదంబు.

శ్లో॥ యదాగమవతఃపుంసో యదపత్యంప్రజాయతే ।
తత్తారయతిసంతత్యాపూర్వప్రేతాన్పితామహాన్ ॥
పున్నామ్నోనరకాద్యస్మాత్పితరంత్రాయతేసుతః ।
తస్మాత్పుత్రఇతిప్రోక్తస్స్వయమేవస్వయంభువా॥ 3౫౫ ॥

ఇష్టందత్తమధీతంచయజ్ఞాశ్చబహుదక్షిణాః ।
సర్వం తదనపత్యస్య కలాంనార్హంతిషోడశీం ॥ ३४६ ॥
వ్రతోపవాసైర్బహుభిఃకృతంభవతిభీష్మయత్ ।
సర్వంతదనపత్యస్యమోఘంభవతినిశ్చితం ॥ ३४८ ॥

తా॥ పితృవులను తరింపజేయునది సంతానము. తండ్రిని పున్నామ నరకమునుండి తప్పించునది అపత్యంబు ఎంతచదివినా ఎంతద్రవ్యమున్నను ఎన్నివ్రతాదులను చేసినను సంతానములేకపోయినను వ్యర్థము. కావున అపత్యమునకు సాటియైనది మఱియొకటి లేదుగావున సంతతికొఱకై గార్హస్థ్యము శ్లాఘ్యంబని భారతము కావున గర్భాధానసంస్కార మావశ్యకంబని ఫలితార్థము.

## ౧౬౪. గర్భాధానకాలనిషేధము.

శ్లో॥ రజోదర్శనతఃపూర్వం నస్త్రీసంసర్గమాచరేత్ ।
సంసర్గంయదికుర్వీతనరకేపరిపచ్యతే ॥ ३४७ ॥

తా॥ స్త్రీపుష్పిణికాకమునుపు సంసర్గమునింద్యము చేసినవానికి నరకయాతన తప్పదని భవిష్యత్పురాణవచనము (ఇహమున రాజదండన కావున నొంగముట్లు పెట్టియాతురపడువారికి ఇదివెచ్చరిక.)

## ౧౬౫. ప్రథమార్తవమాసఫలంబులు.

శ్లో॥ చైత్రేస్యాత్ప్రథమర్తౌతు నారీవైధవ్యభాగినీ ।
వైశాఖేధనపుత్రాఢ్యా జ్యేష్ఠేరోగాన్వితాతథా ॥

శుచౌమృతప్రజాప్రోక్తా శ్రావణేధనధాన్యదా ।
నభస్యేదుర్భగాక్లిష్టా ఆశ్వినేచతపస్వినీ ॥ ౩౬౦ ॥
ఊర్జేప్యాయుష్మతీనారీ మార్గశీర్షేబహుప్రజా ।
పౌషేతుపుంశ్చలీనారీ మాఘేపుత్రసుఖాన్వితా ॥౩౬౧॥
ఫాల్గునేశ్రీమతీసాధ్వీ క్రమాన్మాసఫలంస్మృతం ॥*॥

తా॥ తొలిసమర్త చైత్రమునందైన నామగువ విధవయగును, వైశాఖమునందైన ధనసుతసంపదగలదగును. జ్యేష్ఠమున రోగముగలదగును. ఆషాఢమున చచ్చుబిడ్డలుగలది. శ్రావణమున ధనధ్యాన్యములుగలది. భాద్రపదమున కష్టముగలదిమఱియుదుర్భగయగును. ఆశ్వయుజమున సదాచారసంపన్నరాగును. కార్తికమున నాయుస్సు గలది. మార్గశిరమున బహుపుత్రులుగలది. పుష్యమున జారిణియగును. మాఘమున పుత్రసుఖముగలది. ఫాల్గునమున పతివ్రతయును సంపదగలదియునగునని స్మృతిచంద్రికా వచనంబులు. మఱియు నచ్చటనే:—

## ౧౬౭. ప్రథమార్తవ పక్షఫలము.

శ్లో॥ శుక్లపక్షేసుశీలాస్యా త్కృష్ణేసాకులటాభవేత్ ।
కృష్ణస్యదశమీయావన్మధ్యమంఫలమాదిశేత్ ॥౩౬౨॥

తా॥ తొలిసమర్త శుక్ల పక్షమునందైన నాస్త్రీ పతివ్రతయైయొప్పను. కృష్ణపక్షమున కులట యగును. కృష్ణ ౧౦కి లోపల మధ్యఫలంబని.

## ౧౬౮. ప్రథమార్తవ వారఫలంబులు.

శ్లో॥ రోగిణీరవివారేతు సోమవారేపతివ్రతా ।
దుఃఖితాభౌమవారేతు బుధేసౌభాగ్యసంయుతా ॥
శ్రీసంయుతాగురోర్వారే పతిభక్తాభృగోర్దినే ।
మలినామందవారేతు రాత్రావపిత్తథైవచ ॥ ౩౬౪ ॥

తా॥ తొలిసమర్త భానువారమునందైన రోగముగలదు. సోమవారమున పతివ్రత, మంగళవారమున దుఃఖపడును. బుధవారమున సౌభాగ్యముగలదు. గురువారమున నైశ్వర్యవంతురాలు. శుక్రవారమున పతిభక్తిగలది. శనివారమున మరి రాత్రియందైనచో మలినమైయుండును.

## ౧౬౯. ప్రథమార్తవ లగ్నఫలములు.

శ్లో॥ మేషే సవ్యభిచారాస్యా ద్వృషభేపరభోగినీ ।
మిథునేధనభోగాఢ్యా కర్కటేవ్యభిచారిణీ । ౩౬౫ ॥
పుత్రాఢ్యాసింహరాశౌతు కన్యాయాంశ్రీమతీభవేత్ ।
విచక్షణాతులాయాంచ వృశ్చికేతుపతివ్రతా ॥ ౩౬౬ ॥
దుశ్చారిణీధనుఃపూర్వే చాపశేషేపతివ్రతా ।
మకరేమానహీనాచ కుంభేనిర్ధనబంధుతా ॥ ౩౬౭ ॥
మీనేవిలక్షణాలగ్నే గ్రహసంస్థావివాహవత్ ॥ ౩౬౮ ॥

తా॥ మేషమున జారిణి. వృషభమున పరులకుసుఖమిచ్చునది. మిథునమునధనభోగముగలది- కర్కాటకమున జారిణి. సింహమున పుత్రవతి. కన్యలో సంపదగలది, తులలోనేర్పరి. వృశ్చికమున పతివ్రత. ధనురాదిని దుష్టురాలు. ధనురంతమున సుశీల. మకరమున మానహీనురాలు. కుంభమున బంధుదారిద్ర్యము. మీనమున నేర్పరిగానుండు. మిగతగ్రహచారాదికమువివాహమునందువలె చూడతగినదని దైవజ్ఞమనోహార వచనము.

## ౧౭౦. ప్రథమార్తవ శుభఫలాపవాదము.

శ్లో॥ అశుభమపిసమస్తం చార్తవంసంప్రభూతం ।
సురగురుసితయుక్తే వీక్షితేవాథలగ్నే ।
తిమిరమివకఠోరజ్యోతి రుత్పత్తికాలే ।
క్షయమథసముపైతి ప్రాప్నుయాదీప్సితాని ॥ ౩౯ ॥

తా॥ తొలిసమర్తలో నెన్నిదోషములున్నను లగ్నమునందు గురువుగాని శుక్రుడు కాని చేరినను; లగ్నమును చూచినను; సూర్యునియుదయముచేత చీకటినశించునట్లు సమస్తదోషంబులు పరిహారంబనివసిష్ఠవచనము.

## ౧౭౧. ప్రథమార్తవకాల ఫలము.

శ్లో॥ ప్రాతఃకాలేతుసధనా సాయాహ్నేసర్వభోగినీ ।
మధ్యాహ్నేచభవేద్వేశ్యా నిశీథేవిధవాభవేత్ ॥౩౭౦॥

తా॥ ప్రొద్దున తొలిసమర్తయైన ధనవంతురాలగును, సాయంకాలమున సమస్తభోగములుగలది. మధ్యాహ్నమున కులటయగును. అర్ధరాత్రిలో వైధవ్యముసంభవించునని స్మృతివచనము.

## ౧౭౨. ప్రథమార్తవ నక్షత్రఫలంబులు.

శ్లో॥ సుభగాచైవదుశ్శీలా వంధ్యాపుత్రసమన్వితా ।
ధర్మయుక్తావ్రతఘ్నీచ పరసంతానమోదినీ ॥ ౩౭౧ ॥
సుపుత్రాచైవదుష్పుత్రా పితృవేశ్మరతాసదా ।
దీనాప్రజ్ఞావతీచైవ పుత్రాఢ్యాచిత్రకారిణీ ॥ ౩౭౨ ॥
సాధ్వీపతివ్రతానిత్యం సుపుత్రాకష్టచారిణీ ।
స్వకర్మనిరతాహింస్రా పుత్రపౌత్రాదిసంయుతా ॥౩౭౩॥
నిత్యంధనకథాసక్తా పుత్రధాన్యసమన్వితా ।
మూర్ఖార్థాఢ్యాగుణవతీ దస్రక్షాదేఃక్రమాత్ఫలం ॥

ఇతిగర్గవచనాని.

తా॥ వరుసగా నశ్విన్యాది నక్షత్రంబులలో తొలిసమర్తకు ఫలములు చెప్పంబడినవి॥ అ. శుద్ధురాలు, భ. దుష్టస్వభావముగలది, కృ. గొడ్రాలు, రో. పుత్రవంతురాలు, మృ. ధర్మవతి, ఆర్ద్రా. వ్రతనాశని, పున. పరసంతానముచేసంతసించునది, పుష్య. సుపుత్రవతి, ఆశ్రే. దుష్పుత్రులుగలది, మ. పుట్టినింటనుండునది, పూఫ. దీనురాలు, ఉఫ. నేర్పరి, హ. పుత్రవతి, చి. చేతిపనులలోనేర్పరి, స్వా. పతివ్రత, విశా. పతివ్రత, అనూ. సత్పుత్రులుగలది, జ్యే. కష్టచారిణి, మూ. స్వధర్మాచారముగలది, పూషా. హింసించునది, ఉషా. పుత్రపౌత్రులుగలది, శ్ర. ధనసంపదగలది, ధని. కుతూహలవంతు

రాలు, శత, సుతధాన్యసుఖముగలది, పూభా. పుత్రాఢ్యురాలు, ఉభా. ధనికురాలు, రే. గుణవతి, అనిగర్గవచనంబులు.

## ౧౭౩. ప్రథమార్తవ వస్త్రఫలంబులు.

శ్లో॥ సుభగాశ్వేతవస్త్రాస్యా ద్దృఢవస్త్రాపతివ్రతా ।
క్షౌమవస్త్రాక్షితీశాస్యా న్నవవస్త్రాసుఖాన్వితా ॥౩౭౫॥
దుర్భగాజీర్ణవస్త్రాస్యా ద్రోగిణీరక్తవాససా ।
నీలాంబరధరానారీ విధవాపుష్పితాయది ॥ ౩౭౬ ॥
మలినాంబరతోనారీ దరిద్రాస్యాద్రజస్వలా ॥ * ॥

తా॥ తొలిసమర్తతెల్లని వస్త్రముతోనైన సుందరియగు. గట్టివలువతో పతివ్రతయగు. పట్టువస్త్రమున నేలగలదగు. నూతనవస్త్రమున సుఖవంతురాలు. ప్రాతగుడ్డయైన దుర్భగయగును. ఎఱ్ఱవస్త్రమున రోగిణియగును. నీలవస్త్రమునన్ విధవయగును. మాసినగుడ్డలో దరిద్రురాలు. అనివసిష్ఠవచనము.

## ౧౭౪. ఆర్తవబిందు సంఖ్యాఫలము.

శ్లో॥ వస్త్రేస్యుర్విషమారక్త బిందవఃపుత్రమాప్నుయాత్ ।
సమాశ్చేత్కన్యకాచేతి ఫలంస్యాత్ప్రథమార్తవే ॥

తా॥ ప్రథమరజోదర్శనమున వస్త్రమునంటిన బిందువులు విషమముగనుండిన పుత్రసంతానము నొందు. సమసంఖ్యగానుండిన స్త్రీసంతానము నొందు. అని వసిష్ఠవచనము.

## ౧౭౫. ప్రథమార్తవ సమయవిశేషఫలము.

శ్లో॥ సంమర్దనంకాష్ఠతృణాగ్నిశూర్పాన్ ।
హస్తేదధానాకులటాతదాస్యాత్ ।
తల్పోపభోగైరహసిస్థితాచే ।
ద్దృష్టంరజోభాగ్యవతీతదాస్యాత్ ॥౧౩౭॥

తా॥ తొలిసమర్తయగునపుడు= పరక కఱ్ఱ కసవు నిప్పు చేట ఇట్టి వస్తువులనుచేత పట్టియుండిన నామగువ జారిణియగును. మంగళద్రవ్యములు గలదై పాన్పుపైయుండి రహస్యస్థలమున నయిన భాగ్యవతిగానుండును. అని వాసిష్ఠవచనము.

## ౧౭౬. నింద్యరజోదర్శనము.

శ్లో॥ అష్టమీషష్ఠ్యమారిక్తా ద్వాదశీసంక్రమేపివా ।
వైధృతౌవ్యతిపాతేచ గ్రహణేచంద్రసూర్యయోః ॥
విష్ట్యాంసంధ్యాసునిద్రాయాం దుర్భగాప్రథమార్తవే ॥

తా॥ షష్ఠి, అష్టమి, అమావాస్య, చవితి, ఏకాదశి చతుర్దశి, సంక్రమణము, వైధృతి, వ్యతీపాత, సూర్యచంద్రగహణములు, భద్రకరణము, సంజప్రొద్దులు, నిద్రలోను, (పరిఘయోగముయొక్క పూర్వార్ధము, ప్రతిపత్తుకూడపనికిరాదని నారదవచనము) వీటిలో తొలిసమర్తయైన నానారి దుర్భగయగుననికశ్యపవచనము.

## ౧౭౭. ఆర్తవస్థల విశేషఫలములు.

శ్లో॥ గ్రామాద్బహిఃపరగ్రామే వాచేత్స్యాద్వ్యభిచారిణీ ।
పతివ్రతాపతిస్థానే సుశీలాగృహమధ్యమే ॥౩౮౧॥
గ్రామమధ్యేచవృద్ధిశ్చ విధవాచదిగంబరా ।
ఉపరాగేచదుశ్శీలా చాయుష్యంజలసన్నిధౌ ॥ ౩౮౨ ॥
ధనమధ్యేతుకన్యాయాః ధనధాన్యసమృద్ధిదా ।
శైలాగ్రేచుఃఖినీభ్రష్టా తటాకేప్రథమార్తవే ॥౩౮౩॥

తా॥ తొలిసమర్త, ఊరివెలుపటగానీ పరగ్రామమునగానీ అయిన చోజారిణి. మొగుడున్నచోటపతివ్రత. ఇంటిలోనడుమ సుశీల. గ్రామమధ్యమున నభివృద్ధిగలది, దిగంబరురాలైనవిధవ. గ్రహణసమయమున చెడునడతగలది. నీటివద్దనాయుష్యముగలది. ద్రవ్యములనడుమ ధనధాన్యవృద్ధిగలదు. కొండమీద దుఃఖముగలది. తటాకాదిజలమధ్యమున భ్రష్టురాలు. అనివసిష్ఠవచనము.

## ౧౭౮. రజోదర్శనా స్పృశ్యత్వము.

శ్లో॥ రజోదర్శనతోస్పృశ్యా నార్యోదినచతుష్టయం ।
తతశ్శుద్ధాఃక్రియాస్త్వేతా స్సర్వవర్ణేష్వయంవిధిః ॥

తా॥ సమస్తవర్ణములలోను రజోదర్శనమైన పిదప నాల్గుదినంబులు ఆస్త్రీ అస్పృశ్యయన బడును ఆమగువ దేనిని అంటరాదు. పిదప పరిశుద్ధురాలు. అనినారదవచనము.

౧౭౯. అస్పృశ్యకారణ నిరూపణము.

శ్లో॥ ప్రథమేహనిచాండాలీ ద్వితీయేబ్రహ్మఘాతకీ ।
తృతీయేరజకీప్రోక్తా చతుర్థేహనిశుద్ధ్యతి ॥ ౩౮౫ ॥

తా॥ రజోదర్శనమైన దినమున నామగువ చండాలస్త్రీయనంబడును. రెండవనాడు బ్రహ్మ ఘాతుకరాలనబడు. మూడవ నాడు చాకలిదనబడు. నాల్గవనాడుశుద్ధురాలగునని భరద్వాజవచనము.

౧౮౦. రజోవతికి కర్మాధికారము.

శ్లో॥ భర్తృస్పృశ్యాచతుర్థేహ్ని స్నానేనస్త్రీరజస్వలా ।
పంచమేహనియోగ్యాస్యా ద్దైవేపిత్రేచకర్మణి ॥

తా॥ స్త్రీఋతుమైనపిదప నాల్గవనాడుస్నానానంతరము తనపతికి మాత్రము స్పృశ్యయనంబడి శుద్ధురాలు. ౫ వ నాడుస్నానానంతరము హవ్యకవ్యాదికర్మాధికారమునకు యోగ్యతగలదగునని ధర్మశాస్త్రివచనము.

౧౮౧. స్త్రీలకు ఋతుకాలావధి.

శ్లో॥ షోడశర్తుర్నిశాస్త్రీణాం తస్మిన్ యుగ్మాసుసంవిశేత్ ।
యుగ్మాసుపుత్రాజాయంతే స్త్రియోఽయుగ్మాసురాత్రిషు ॥ ౩౮౬ ॥

తా॥ స్త్రీలు ఆర్తవమైనపిదప ౧౬ రాత్రులు ఋతురాత్రులనంబడును. వాటిలో స్నానానంతరము సమదినములలో సంగమము సూక్తము. స

మదినంబులలో పుంసంతానము. విషమదినంబులలో స్త్రీసంతానంబని యాజ్ఞవల్క్యవచనము.

౧౮౨. ప్రథమరజస్వలాం స్నానముహూర్తము.

శ్లో॥ హస్తానిలాశ్వి మృగమైత్రవసుధ్రువాఖ్యైః ।
శక్రాన్వితైః శుభతిథౌ శుభవాసరేచ ।
స్నాయాదథార్తవవతీ మృగపౌష్ణవాయు ।
హస్తాశ్విధాతృభిరరం లభతేచగర్భం ॥ ౩౮౮ ॥

తా॥ హస్త, స్వాతి, అశ్విని, మృగశిర, అనూరాధ, ధనిష్ఠ, రోహిణి, ఉత్తరఫల్గుని, ఉత్తరాషాఢ, ఉత్తరాభాద్ర, జ్యేష్ఠ, శుభతిథులు, భద్రాదిసంక్రమాది వర్జితదినములు, శుభవారములనగా సోమబుధగురు శుక్రవారములు, ఇవి ప్రథమార్తవమున పణతికి స్నానయోగ్యములు. ఇట్లుక్తకాలమున స్నానముచే సత్సంతానము అభివృద్ధినందును.

౧౮౩. దుష్టరజోదర్శనశాంతివిధానము.

శ్లో॥ ప్రభూతదోషం యదిదృశ్యతేత ।
త్పుష్పంతతశ్శాంతికకర్మకార్యం ।
వివర్జయేదేవ తదైకశయ్యాం ।
యావద్రజో దర్శనమన్యథుస్రే ॥ ౩౮౯ ॥

శ్లో॥ ఈశానతో గోమయమండలేన ।
పరిస్తృతేగ్నౌ జుహుయాత్సదూర్వాం ।

యుగ్మాంఘ్రితాక్తాంచ సమిత్పరిమాణాం ।
గాయత్రికాంసాష్ట సహస్రసంఖ్యాం ॥ ౩౯౦ ॥

శ్లో॥ శతప్రమాణా మథవాఘహంత్రీం ।
శుభైర్యవైర్వాప్య హ్యతిభిస్తిలైశ్చ ।
తతస్సురాన్యామి సురాన్పితౄంశ్చ ।
సంతర్పయేదన్న సువర్ణవస్త్రైః ॥ ౩౯౧ ॥

తా॥ ఋతుకాలమున తిథ్యాది దోషములు పైనచెప్పంబడినవిసంభవించినప్పుడు, ఏకశయ్యనువదలి, మంచిప్రొద్దులో మరలఋతువగునంతవరకు నిరీక్షించవలయును. ఋతుదోషమునకుశాంతి నాచరించవలయునని వసిష్ఠవచనంబులు.

౧౫౪. గర్భాధాన నిషేధ కాలంబులు.

శ్లో॥ పౌష్ణద్వయేపిత్ర్యభయామ్యసార్ప ।
విష్ణుద్వయేనైధనజన్మభేషు ।
ఉత్పాతపాపగ్రహదూషితేషు ।
నకార్యమాధానమనిష్టలగ్నే ॥ ౩౯౨ ॥

శ్లో॥ ఉపప్లవేవైధృతపాతయోశ్చ ।
విష్ట్యందివాపారిఘపూర్వభాగే ।
సంధ్యాసుపర్వస్వపిమాతృపిత్రోః ।
ర్క్షేతేహ్నిపత్నీ గమనంవివర్జ్యం ॥ ౩౯౩ ॥

తా॥ జన్మనక్షత్రము, జన్మతారలు, నైధనతారలు, మూల, భరణి, ఆశ్విని, రేవతి, మఖ, ఆశ్రేష, శ్రవణధనిష్ఠలు, గ్రహణదినములు అనగా పూర్ణిమామావాస్యలు, వ్యతీపాతవైధృతులు, వ్యగ్రపవైప్రలు, తలిదండ్రులు మృతినొందినతిథులు, పగలు, దివ్యాంతరిక్షభౌమంబులను ఉత్పాతంబులుగల్గిన దినములు, జననక్షత్రమునకుగాని జన్మరాశికిగాని జన్మలగ్నమునకుగాని ౮వ లగ్నము, పరిఘయొక్క పూర్వార్ధము, భద్రకరణము, ఇవన్నియును పత్నీగమనమునకు తగవని వసిష్ఠవాక్యము.

## ౧౫౪. గర్భాధాన లగ్నవిచారము.

శ్లో॥ వృషమిథునకర్కిసింహకన్యా ।
ధటధరచాపఝషాశ్చభాభవంతి ।
యదిశుభఫలశాలినోనుకూలా ।
నిధనవిశుద్ధియుతానిషేకకాలే ॥ ౩౯౪ ॥

శ్లో॥ కేంద్రాగ్నికోణేషు శుభాంస్థితేషు ।
లగ్నేశశాంకేచశుభైస్సమేతే ।
పాపైస్త్రిలాభారిగతైశ్చయాయా ।
త్పుంజన్మయోగేషు చసంప్రయోగం ॥ ౩౯౫ ॥

శ్లో॥ ఆధానలగ్నే విషమాంశరాశౌ ।
జీవేందుజాభ్యాం యుతవీక్షితేవా ।

నాన్యైర్నపుత్రస్త్వథపాపఖేటైః ।
పాపీచమిశ్రైర్బలిభిశ్చమిశ్రైః ॥ ౩౯౬ ॥

శ్లో॥ ఓజర్క్షాంశేలగ్నగే వీర్యయుక్తే ।
జీవేంద్వర్కైరోజరాశ్యంశసంస్థైః ।
పుంజన్మస్స్యాద్వ్యత్యయేకన్యకాస్స్యా ।
న్మిశ్రైష్షండోద్వ్యంగగైర్ద్విప్రజన్మ ॥ ౩౯౭ ॥

తా॥ వృషభము, మిథునము, కర్కాటకము, సింహము, కన్య, తుల, ధనుస్సు, మీనము, ఈలగ్నంబులు అష్టమస్థానమున గ్రహములులేక శుద్ధమైయుండిన తక్కినగ్రహబలము లనుకూలంబుగానుండగా, నిషేకమునకు ప్రశస్తంబులు. గ్రహానుకూలంబెట్లనిన;— ౧-౪-౭-౧౦-౯-౫లలో శుభగ్రహంబులును లగ్నమునచంద్రుడు శుభగ్రహయుతుడైయుండిన, పాపగ్రహములు ౩-౬-౧౧లో నుండగా. పుంజన్మయోగంబున నాధానముప్రశస్తము. పుంజన్మయోగంబెట్టిదననిన;— విషమాంశయనగా ఓజాంశలో పుంలగ్నమున బుధగురుదృష్టముగాని యుతముగాని అయ్యుండెనగా, ఇతరపాపవీక్షణములేక యుండిన నదిపుత్రప్రదయోగము. ఓజరాశ్యంశలలోనుండెడు గురుచంద్రసూర్యులు చూచియో చేరియో బలవంతులైయుండగా, లగ్నమోజమైన పురుషప్రజాహేతువుగా నుండుననియును; అంతయును యుగ్మమైన స్త్రీప్రజాహేతువనియును; మిశ్రమువలన నపుంసకసంతానమనియును; ద్వ్యంగగ్రహబలముచేత నమడబిడ్డలయుత్పత్తియని యెఱుంగనగునని వసిష్ఠ వచనంబులు.

## ౧౮౬. విహితనక్షత్రము లనుకూలించనిచో మధ్యమ నక్షత్రములు.

శ్లో॥ చిత్రా దిత్యేతథాతిష్య తురగా చేతిమధ్యమాః ।
శేషాణ్యృక్షాణిదుష్టాని స్యుర్నిషేకాద్యకర్మణి ॥

తా॥ ప్రథమసంగమమునందు—చిత్ర, పునర్వసు, పుష్యమి, అశ్విని-ఇవినాల్గును మధ్యమంబులని బృహస్పతివచనము.

## ౧౮౭. సీమంతోన్నయన సంస్కారముహూర్తము.

శ్లో॥ చతుర్థేగర్భమాసేస్యాత్సీమంతోన్నయనక్రియా ।
షష్ఠేష్టమేవాకుర్వీత సూత్రాంతరవిధానతః ॥ ౩౯౯ ॥

తా॥ గర్భధారణమైనపిదప ౪-౬-౮వనెలలలో సీమంతోన్నయనంబను సంస్కారము కర్తవ్యముగానుండునని శౌనకవచనము.

శ్లో॥ పురుషగ్రహవారాస్యుశ్శుభాస్సీమంతకర్మణి ।
మధ్యాస్త్రీగ్రహవారౌతు వర్జయేత్తునపుంసకౌ ॥౪౦౦॥

తా॥ సీమంతసంస్కారమునకు రవి కుజ గురు వారంబులుత్తమంబులు. చంద్రశుక్రవారంబులు మధ్యమంబులు. బుధశనివారంబులు పనికిరావని వ్యాసవచనము.

శ్లో॥ పక్షచ్ఛిద్రాంచరిక్తాంచ వినాపంచదశీంశుభాః ।
చతుర్దశీచతుర్థీచకదాచిత్తుశుభప్రదే ॥ ౪౦౧ ॥

శుభసంస్థేన్నిశానాథే చతుర్థీచచతుర్దశీ ।

పౌష్ణమాసీంప్రశంసంతి కేచిత్సీమంతకర్మణి ॥ ౪౦౨ ॥

తా॥ ౧-౪-౧౧-౧౪-౧౫-౩౦ ఈతిథులు సీమంతమునకు పనికిరావు. తక్కినతిథులు మంచివి. చంద్రుడు శుభుడైయుండగా చవితిచతుర్దశికూడ కావచ్చుననియును, పున్నమకూడ సరిపడుననియును గురువచనంబులుగలవు.

శ్లో॥ పూర్వపక్షశ్శుభః ప్రోక్తః కృష్ణశ్చాంత్యత్రికంవినా ।

పూర్వాహ్ణాపవత్రాపి నాపరాహ్ణేకథంచన ॥ ౪౦౩ ॥

తా॥ శుక్లపక్షంబును కృష్ణపక్షమును ౧౨వరకును ఎన్నడైనను తొలిపగటిలో సీమంతముప్రశస్తంబు. అపరాహ్ణమున పనికిరాదని బృహస్పతి వచనము.

శ్లో॥ శ్రవణస్సకరః పునర్వసు ర్నిరరుతిభంచసపుష్యకోమృగః॥

తా॥ శ్రవణము, హస్త, పునర్వసు, మూల, పుష్యమి, మృగశిర, ఈనక్షత్రంబులు సీమంతమునకు ప్రశస్తంబని రత్నమాలావచనము.

శ్లో॥ యస్యమాసాధిపోరిక్తో నీచోవాస్తంగతోపివా ।

తస్మిన్మాసేక్షయంయాతి ప్రసవాత్తార్భవిష్యతి ॥౪౦౪॥

తా॥ స్త్రీలకుగర్భముగల్గియుండగా నామాసాధిపతి బలవర్జితుడైనను నీచుడైనను అస్తంగతుడైనను ఆనెలలో నామెక్షయించును. లేక- ప్రసవమైపోవును- అనిగర్గవచనముగావున " మాసేశ్వరె బలోపేతే

నాస్తగేనపరాజితే" మాసాధిపతి బలవంతుడై అస్తంగతుఁడును అపజయమునందిన వాఁడును కానపుడు సీమంతసంస్కారము కర్తవ్యమని నారద వచనముగలదు.

శ్లో॥ కేంద్రత్రికోణోపగతైశ్చసౌమ్యై ।
దుఃశ్చిక్యలాభారిగతైశ్చపాపైః ।
షడష్టలగ్నాన్త్యవివర్జితేందౌ ।
సీమంతకార్యం శుభదంతథైవ ॥ ౪౦౬ ॥

తా॥ ౧-౪-౭-౧౦-౫-౯లో శుభగ్రహంబులును, 3-౬-౧౧లో పాపగ్రహంబులును, ౬-౮-౧-౧౨లో చంద్రుడు లేకపోవుటయును, సీమంతకార్యమునకు ప్రశస్తంబని వసిష్ఠవచనము.

శ్లో॥ సీమంతలగ్నాదేకోపిక్రూరః పంచాష్టరిష్ఫగః ।
హంతిసీమంతినీంసోపి తద్గర్భంవానసంశయః ॥ ౪౦౭ ॥

తా॥ సీమంతలగ్నమునకు ౫-౮-౧౨ స్థానములలో నొకక్రూరగ్రహమున్నను ఆస్త్రీని గాని తద్గర్భమును గాని నశింపజేయునని కశ్యపవచనము.

శ్లో॥ లగ్నాదష్టమరాశీశః కేంద్రగశ్శుభవీక్షితః ।
యద్యప్యష్టమభస్యోక్తం దోషమాశువ్యపోహతి ॥

తా॥ ఒకవేళనష్టమశుద్ధిలేక దోషముగల్గియున్న, నాయష్టమేశుఁడు కేంద్రమునందుండి శుభగ్రహదృష్టుడైనచో నాదోషమును పరిహరించునని నృసింహావచనము.

శ్లో॥ సీమంతోన్నయనం కార్యం శుభాంశే శుభలగ్నగే ।
కులీరమృగకన్యాశ్చ వర్జ్యాశ్శేషాశ్చ శోభనాః ॥ ౪౯ ॥

తా॥ కర్కాటక మకర కన్యా లగ్నములు తప్పతక్కిన శుభలగ్నంబులలో శుభాంశలు సీమంతయోగ్యములని గర్గవచనము.

శ్లో॥ రోహిణ్యైంద్రవమాదిత్యం పుష్యహస్తోత్తరాత్రయం ।
పౌష్ణం వైష్ణవభం చైవ సీమంతాదిషు సమ్మతం ॥ ౫౦ ॥

తా॥ రోహిణి, మృగశిర, అనూరాధా, పుష్యమి, హస్త, ఉత్తర, ఉషా, ఉభా, రేవతీ, శ్రవణంబులు కూడ సీమంతయోగ్యంబులని గురువచనము గలదు.

౧౮౮. సీమంతాదులకు శుక్రాస్తమలమాస దోషములు లేవు.

శ్లో॥ సీమంతజాతకాదీని ప్రాశనాంతానియానివై ।
న దోషో మలమాసస్య మౌఢ్యస్య గురుశుక్రయోః ॥ ౫౧

తా॥ సీమంత జాతకర్మాన్నప్రాశనాదులకు గుర్వస్తశుక్రాస్తమలమాస దోషములు లేవని బృహస్పతి వచనము.

౧౮౯. గర్భిణీదశమాసాధీశ్వరులు.

శ్లో॥ సితారవనేయామరపూజ్యసూర్య ।
చంద్రార్కి సౌమ్యాదయ పేందుసూర్యాః ।
మాసాధిపాస్స్యుః క్రమశో దశైతే ।
నిపీడితో నాశయతి స్వమాసి ॥ ౫౨ ॥

తా॥ గర్భధారణమైనదిమొదలు మొదటినెల్లనుండి ౧౦వ-ప్రసూతి మాసపర్యంతము చెప్పబడెడువారు మాసాధీశ్వరులన్నంబడియెదరు ౧ శుక్రుడు. ౨ అంగారకుండు. ౩ గురుండు. ౪ సూర్యుండు ౫ చంద్రుడు. ౬ శనైశ్చరుండు. ౭ బుధుండు. ౮ గర్భాధానలగ్నాధిపతి. ౯ చంద్రుడు. ౧౦ సూర్యుండు. "కలలఘనాంకురాస్థి చర్మాంగజ చేతనాద్యాః క్రమశోగదితా భవంతి శుభాశుభంచమాసాధి పతేస్సదృశం"=శుక్లశోణితసన్నిపాతము, పిండము, మొలక, ఎముక, చర్మము, వెంట్రుకలు, మెదడు. మొదలగువాటియొక్క శుభాశుభంబు మాసేశ్వర బలాబలంబుననుసరించి తత్సదృశంబై యుండునని వరాహ వచనముగలదు.

## ౧౯౦. పుంసవనముహూర్తము.

శ్లో॥ సీమంతోన్నయనస్యోక్త తిథివాసరరాశిషు ।
పుంసవంకారయేద్విద్వాన్ సహైవైకదినేథవా ॥౪౧౩॥

తా॥ సీమంతోన్నయనమునకు చెప్పంబడిన తిథివాసరాది శుద్ధలగ్నమున పుంసవన సంస్కారంబును చేయుదగును. లేక సీమంతపుంసవనముల రెంటినొక్కమారే చేయవచ్చును. అని నృసింహవచనము.

## ౧౯౧. పుంసవనవారఫలంబులు.

శ్లో॥ సౌమ్యేమృతప్రజామందే మృత్యుర్వంధ్యాచభార్గవే ।
సోమేదుగ్ధవిహీనాస్యా త్సేషాస్సర్వార్థసిద్ధిదాః ॥ ౪౧౪ ॥

తా॥ ఏగర్భిణికి పుంసవన సంస్కారము చేయబడునో, నాడు బుధవారమైతే ఆస్త్రీ నచ్చు బిడ్డలుగలదగును. శనివారమైతే ఆమెకు మృత్యుభయము. శుక్రవారమైతే గొడ్రాలగును. సోమవారమైతే పాలులేనిదగును తక్కినవారంబులు మంచివి.

౧౯౨. పుంసవన ద్రేక్కాణాంశఫలంబు.

శ్లో॥ గురుశుక్రబుధేందూనాం ద్రేక్కాణదివసాంశకాః ।
తేషాముదయహోరాశ్చ పుంసవేతిశుభావహాః॥౪౧౪

తా॥ పుంసవనమునందు, గురుశుక్రబుధ చంద్రులయొక్క ద్రేక్కాణంబులును నవాంశలును హోరలును మిక్కిలి శుభప్రదంబులైయుండునని బృహస్పతివచనంబు.

౧౯౩. పుంసవనమున నక్షత్రవిశేషఫలము.

శ్లో॥ హస్తార్ద్రాతిష్యమూలాని సౌమ్యేవిష్ణుః పునర్వసుః ।
ప్రోష్ఠపదాద్వయం ప్రోక్తమాషాఢద్వయమేవచ ॥౪౧౫
శ్రేష్ఠానికథితాన్యేవధిష్ణ్యాన్యేకాదశైవతు ।
స్వాతౌతథామఘాయాంచ రేవత్యాంపల్గునీద్వయే॥౪౧౬॥
అశ్విన్యాం చైవనక్షత్రే యదాపుంసవనంభవేత్ ।
నరస్సంపద్యతేదైవాద్యదాస్యాద్గురుతల్పగః ॥౪౧౭॥
లుబ్ధోహ్రస్వతనుఃక్రూరో నారీచేత్కులటాభవేత్ ।
శేషాణిదశధిష్ణ్యాని నిందితాని విశేషతః ॥ ౪౧౮ ॥

తా॥ హస్త, ఆర్ద్ర, పుష్యమి, మూల, శ్రవణము, పునర్వసు, పూర్వాభాద్ర, ఉత్తరాభాద్ర, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ;—ఇవి ౧౧నక్షత్రములు పుంసవనమునకు ప్రశస్తనక్షత్రంబులు. ఇంక స్వాతి, మఖ, రేవతి, పూర్వఫల్గుని, ఉత్తరఫల్గుని, అశ్విని;—ఈ నక్షత్రంబులలో పుంసవనసంస్కారముజరిగి దైవవశమున శిశుజనించితే, ఆపురుషుడైనచో గురుతల్పగామియగును. స్త్రీయైనచో జారిణియగును. మఱియునాపురుషశిశు లుబ్ధుండును పొట్టివాడును, క్రూరుండునగును. తక్కిన ౧౦ నక్షత్రంబులు మిక్కిలి నింద్యంబులు. అని ఋష్యోచ్చయ వచనంబులు.

## ౧౯౪. గర్భరక్షార్థ విష్ణుపూజాముహూర్తాదికము.

శ్లో॥ మాస్యష్టమేచగర్భస్య కుర్యాద్విష్ణుబలిక్రియాం ।
శ్రవణశ్చైవరోహిణ్యాం పుష్యేచైవప్రశస్యతే ॥౪౨౦॥
ద్వితీయాసప్తమీచైవ ద్వాదశీచశుభాతిథిః ।
శుభగ్రహోదయాశ్చస్తా స్తేషాంచదివసాఅపి ॥౪౨౧॥
పాపాస్త్ర్యరియారిగాశ్చేష్టా నేష్టాసర్వేష్టమేస్థితాః ।
రంధ్రేశశ్చస్వాంశగస్స్వచ్ఛే స్వక్షేత్రోపచయర్క్షగః ॥
లగ్నాష్టమేశయోర్మైత్రే లగ్నేశేబలసంయుతే ।
అస్తగేనిధనేశేచ నిధనేపిశుభగ్రహే ॥ ౪౨౩ ॥

తా॥ గర్భమునకు ౮వ నెలలో విష్ణుబలిక్రియను చేయనగును. దానికి శుభ కాలమును చూచికొనదగినది. అందుకు శ్రవణరోహిణీ పుష్యమీనక్షత్రం

బులును, ద్వితీయా సప్తమీద్వాదశీతిథులును, శుభగ్రహముదయించి యుం డులగ్నంబులును, ప్రశస్తంబులు. అష్టమమున నే గ్రహమును ఉండరాదు. ౩-౬-౧౧లో పాపగ్రహము లుండవలయును. అనివసిష్ఠవచనము. అష్టమాధిపతి తనయుచ్చక్షేత్రమునందు గాని తనయంశలో గాని ఉపచయర్క్షమందు గాని ఉండిన నాదోషములేదని గురువచనము. లగ్నాధిపతికిని అష్టమాధిపతికిగాని మిత్రత్వముండినను, లగ్నపతిబలిష్ఠుడైనను, అష్టమేశుడు సప్తమంబుననున్న ను, అష్టమమున శుభుడున్నను దోషములేదని నారదవచనము.

౧౯౫. వాసిష్ఠసంహితోక్తతత్పూజావిధి.

శ్లో॥ పీతాంబరం కృష్ణవర్ణం శంఖచక్రగదాంబుజం ।
వైకుంఠవాసినంవిష్ణుం మృత్కుంభేస్థాపయేత్తతః ॥

శ్లో॥ విష్ణోస్స్వరూపంకనకేన కృత్వాతల్లింగమంత్రైరథగం
ధపుష్పైః ॥ వస్త్రాక్షతైర్గుగ్గులు ధూపదీపైర్నైవేద్య
తాంబూల ఫలైశ్చసమ్యక్ ॥ ౪-౫౫ ॥

శ్లో॥ విష్ణుంస్వదేవతాపూజాం గర్భాణాంరక్షణాయచ ।
బ్రాహ్మణాయప్రదాతవ్యా ప్రతిమావస్త్రసంయుతా ॥

తా॥ నూతనకుంభమున సువర్ణ విష్ణుప్రతిమనునచి కులదేవతతో విధ్యుక్తముగా పూజించి గర్భరక్షణార్థముగా బ్రాహ్మణునికి దానమునొసం గవలయుననివసిష్ఠసంహితా వచనంబులు.

## ౧౯౭. జాతకర్మ విధానకాలము.

శ్లో॥ శ్రుత్వాజాతంపితాపుత్రం సచైలంస్నానమాచరేత్ ।
ఉత్తరాభిముఖోభూత్వా నద్యాంవాదేవఖాతకే ॥

తా॥ తండ్రికొడుకుపుట్టెనను మాటనువినినవెంటనే ఉత్తరాభిముఖుండై నదిలోగాని దేవఖాతమనగా గుంటలోగాని సచేలావగాహన స్నానము చేయవలెనని వసిష్ఠవచనము.

శ్లో॥ యస్మిన్ముహూర్తేజనితః కుమార ।
స్తస్మిన్విధేయం ఖలుజాతకర్మ ।
సంతర్ప్య దేవాన్సపితౄన్ ద్విజాంశ్చ ।
సువర్ణగోభూతిల కాంస్యవస్త్రైః ॥ ౪౨ ॥

తా॥ ఏముహూర్తమున జననమో ఆముహూర్తమునందు జాతకర సంస్కారమును చేయవలయుననియును వసిష్ఠవచనము. అదియెందువల్లననిన:—

శ్లో॥ యావన్నొచ్ఛిద్యతేనాలం తావన్నాప్నోతిసూతకం ।
ప్రాజ్ఞాభివర్ధనాత్పుంసోజాతకర్మవిధీయతే ॥ ౪౯ ॥

తా॥ బొడ్డుకోయువరకు పురుడను సూతకములేదు గావున, బొడ్డుకోయుటకుమునుపే జాతకర్మసంస్కారమును చేయవలయునని జైమినివచనము.

శ్లో॥ తస్మిన్ జన్మముహూర్తేతు సూతకాంతేతథాశిశోః ।
జాతకర్మచకర్తవ్యం పితృపూజనపూర్వకం ॥ ౪౩౦ ॥

తా॥ జననకాలమున తప్పిపోయిన, పురుడువెళ్లిన పిదపనైనను తప్పక పితృపూజాపురస్సరంబుగా జాతకర్మసంస్కారమును జరిగించితీరవలయునని నారదసంహితావచనము.

## ౧౯౭. జాతకర్మ ప్రయోజనము.

శ్లో॥ జాతకర్మక్రియాంకుర్యాత్పుత్రాయుఃశ్రీవివృద్ధయే ।
గ్రహదోషవినాశాయ సూతికాఽశుభవిచ్ఛిదే ।
కుమారగ్రహనాశాయపుంసాం సత్త్వవివృద్ధయే ॥

తా॥ పుత్రునికి ఆయుస్సంపద యభివృద్ధియగుటకును, గ్రహదోషములు పరిహారంబగుటకును సూతికాదిపీడలు తొలగుటకును. పుంస్త్వసంపాదనమునకును. జాతకర్మసంస్కారము ముఖ్యంబయ్యె.

## ౧౯౮. నామకరణవిధాన ముహూర్తకాలము.

శ్లో॥ ఏకాదశేహ్ని విప్రాణాంక్షత్రియాణాంత్రయోదశే ॥
వైశ్యానాంషోడశేనామమాసాంతేశూద్రజన్మనః॥౪౩౧॥

తా॥ బ్రాహ్మణులకు ౧౧ వ-నాడు; క్షత్రియులకు ౧౩ వ-నాడు వైశ్యులకు ౧౬ వ-నాడు; శూద్రులకు ౩౦ దినములైన పిదప- నామకరణ సంస్కారము నియతంబని సారసంగ్రహవచనము.

శ్లో॥ నామధేయందశమ్యాంతుద్వాదశ్యాం చాస్యకారయేత్ ।
పుణ్యేతిథౌముహూర్తేవానక్షత్రేవా గుణాన్వితే॥౭౩౩॥

తా॥ ౧౧ వ-నాడుగాని ౧౨ వ నాడుగాని శుభతిథి ముహూర్తము నందు గుణయుక్తనక్షత్రమున నామకరణంబు కర్తవ్యంబని మనువచనము. (ఇది బ్రాహ్మణమాత్రవిషయము).

౧౯౯. నామకర్మ విశేషవిచారము.

శ్లో॥ ఉక్తకాలే ప్రకర్తవ్యాద్విజా నామఖిలాః క్రియాః ।
అతీతేషుచకాలేషుకర్తవ్యాశ్చోత్తరాయణే ॥ ౭౩౪ ॥
సురేజ్యే హ్యసురేజ్యే వానాస్తగే నచవార్ధకే ।
శుభలగ్నేశుభాంశేచశుభేహ్నిశుభవాసరే ॥ ౭౩౫ ॥
చంద్రతారాబలోపేతేనైధనోదయవర్జితే,
పూర్వాహ్ణే-క్షిప్ర నక్షత్రచరస్థిరమృదూడుషు ॥ ౭౩౬ ॥
నామమంగలఘోషైశ్చరహస్యం దక్షిణశ్రుతౌ ॥

తా॥ ఉక్తకాలాతిక్రమణంబున, గురుశుక్రాస్తాది దోషంబులులేక, చంద్రతారాబలయుక్తంబగు శుభవార తిథ్యాదులనైఱింగి, చరస్థిరమృదుసంజ్ఞా నక్షత్రంబులలో నామకరణము కావలసియుండునని కశ్యపవచనము.

౨౦౦. నామకరణ ప్రయోజనంబు.

శ్లో॥ నామాఖిలస్య వ్యవహారహేతుః ।
శుభావహంకర్మసుభాగ్యహేతుః ॥

నామ్నైవకీర్తిం లభతేమనుష్య ।
స్తతఃప్రశస్తం ఖలునామకర్మ ॥ ౪౩౭ ॥

తా॥ సమస్తలోకవ్యవహారంబులకును కారణంబును, భాగ్యమును, శుభమును కలుగజేయునదియును, మనుష్యుడుకీర్తినందుటకు హేతువును, అగునది నామకరణంబు. అనిగురువచనము.

౨౦౧. జన్మనక్షత్రానుగుణ నామకరణంబు విహితంబు

శ్లో॥ చూచేచోలాప దేష్వాద్యే లీలూలేలో యమస్యభే ।
ఆ ఈ ఉ ఏ ఇమే గ్నేభే ఓ వావీవూత థాకభే ॥౪౩౮॥
వెవొకాకీమృగేఖ్యాతాః కూఘంజచ్ఛాస్తురాద్రభే ।
కేకోహాహీత్యదితిభే హూహేహోఢాచపుష్యభే ॥౪౩౯॥
డీడూడేడో ఇమేసార్పేమామీమూమే మఖాభిదే ।
మోటాటీటూతథాభాగ్యే టేటోపాప్యర్యమర్క్షగే ॥
పూషణాడాతథాహస్తే పేపోరారీతిచిత్రభే ।
రూరేరోతాతథాస్వాతౌ తీతూతేతోద్విదైవభే ॥ ౪౪౧ ॥
నానీనూనేక్రమాన్మైత్రే నోయాయీయూతథేంద్రభే ।
యేయోబాబీతిమూలాఖ్యేభూధాఫాఢాజలస్యభే ॥౪౪౨॥
భేభోజాజీతివిశ్వర్క్షే జూజేజోభాభ్యజిద్భవేత్ ।
ఖీఖూఖేఖో శ్రుతౌజ్ఞేయాగాగీగూగే చవాసవే ॥ ౪౪౩ ॥

గో సాసీసూజలేశర్క్షే సేసో దాదీక్ష్యజాంఘ్రిభే ।
దూఝఙథాతథోపాంత్యే దేదోచాచీతిపౌష్ణభే ॥ ౪౪౪ ॥
ఇతి ప్రోక్తా ఇమే పద్యే వర్ణా నామాదిజాస్స్ఫుటాః ।
జ్ఞేయా మేషాదిరాశీనాం నవభిర్నవభిః పదైః ॥ ౪౪౫ ॥

తా॥ వరుసగా నశ్విన్యాదులకు " చూచేచోలా " అశ్వినికి, అనియిట్లు నక్షత్రముయొక్క నాల్గుపాదంబులకు నాల్గేసి అక్షరంబులు చెప్పంబడినవి. దీనిచేత " చూడామణి-చేరమరాజు-చొక్కనాథం-లాపణ్యేశ "- ఇత్యాదినామంబులను తత్తన్నక్షత్ర పాదంబులలో జనించినవారికి నక్షత్రనామంబులని పెట్టతగినదియని ఫలితాంశము. ఇదిశతపదచక్రోద్ధారక్రమము. " తదక్షరాదికంనామ యస్మిన్ధిష్ణ్యే తదక్షరం" అని ప్రోక్తంబైనది.

## ౨౦౨. మాసనామకరణంబు.

శ్లో॥ చైత్రాదిమాసనామాని వైకుంఠోథజనార్దనః
ఉపేంద్రో యజ్ఞపురుషో వాసుదేవస్త్రివిక్రమః ॥ ౪౪౬ ॥
యోగీశః పుండరీకాక్షః కృష్ణోనంతోచ్యుతస్తథా ।
చక్రధారీతిచైత్రాదిక్రమాదాహుర్మనీషిణః ॥ ౪౪౭ ॥

తా॥ చైత్రవైశాఖాది మాసంబులలో జనించినవారికి వరుసగా వైకుంఠజనార్దనాది నామంబులు వసిష్ఠోక్తంబులై యున్నవి. ఈనక్షత్రమాస

నామంబులు ఈముహూర్త ప్రకరణంబు నందేలయని శంకింపవలదు. గ్రహాచారదోష శాంత్యాదివిచారంబులలో నావశ్యకంబైవచ్చును.

## ౨౦౩. ప్రసూతాస్నాన ముహూర్తము.

శ్లో॥ ఉత్తరాత్రయరోహిణ్యః సౌమ్యః పవన రేవతీ।
ప్రసూతావనితాస్నాయాద్ధస్తమైత్రాశ్వినీషుచ ॥౪౪౮॥

స్నాతాప్రసూతాప్యసుతాబుధేన।
స్నాతాచవంధ్యాభృగునందనేన॥
స్నా రేమృతిః క్షీరహతిశ్చసోమే।
పుత్రార్థలాభోరవిజీవభౌమే ॥ ౪౪౯ ॥

తా॥ ఉత్తర- ఉత్తరాషాఢ, ఉత్తరాభాద్ర, రోహిణి, మృగశిర, స్వాతి, రేవతి, హస్త అనూరాధ, అశ్విని, ఈనక్షత్రంబులలో ప్రసూతా స్నానము ప్రశస్తము. బుధవారమున స్నానముచేసిన నసుతయగు. శుక్రవారస్నానము వంధ్యాత్వమునిచ్చును. శనివారము. మృతినిచ్చును సోమవారమున పాలుక్షీణించును, కావున భానుమంగళ గురువారంబులు ప్రసూతాస్నానమునకు ప్రశస్తంబులని దైవజ్ఞవల్లభవచనంబులు.

## ౨౦౪. ప్రసూతాస్నాననిషిద్ధ నక్షత్రములు.

శ్లో॥ భరణీకృత్తికామూలమార్ద్రాః పుష్యః పునర్వసుః।
మఘాచిత్రావిశాఖాచశ్రవణో దశమస్తథా ॥ ౪౫౦ ॥

పఃషుమందేబుధేవారే సూతస్నానంనకారయేత్ ।
యదిస్నానంప్రకుర్వీత పునస్సూతిర్నవిద్యతే ॥ ౪౫౧ ॥

తా॥ కృత్తిక, భరణి, ఆర్ద్ర, పునర్వసు, పుష్యము, చిత్ర, విశాఖ, మూల, శ్రవణ, నక్షత్రంబులును దశమనక్షత్రంమన గా జన్మనక్షత్రమునకు ౧౦-వ నక్షత్రంబును;—పనికిరావు, వీట్లలో స్నానముచేసిన మరలకానుపు లరుదుగనగునని దైవజ్ఞమనోహర వచనంబులు.

## ౨౦౫. బాలక స్తన్యపాన ముహూర్తము.

శ్లో॥ రిక్తాంభౌమంపరిత్యజ్యవిష్టింపాతం సవైధృతిం ।
మృదుధ్రువక్షిప్రభేషు స్తన్యపానంహితంశిశోః॥ ౪౫౨ ॥

తా॥ చవితి, ఏకాదశి, చతుర్దశీ తిథులను; భద్రకరణమును; వైధృతి వ్యతీపాతలనువదలి— మృదుధ్రువక్షిప్రనక్షత్రంబులలో ప్రథమస్తన్య పానము చేయింపనగును. అని గోవింద పండితీయ వచనము.

## ౨౦౬. దంతజనన ఫలవిచారము.

శ్లో॥ ప్రథమేదంతజననాత్స్వయమేవవినశ్యతి ।
ద్వితీయేభ్రాతరంహంతితృతీయేభగినీంతథా ॥ ౪౫౩ ॥
చతుర్థేమాతరంహంతిపంచమేచాత్మనోౖగ్రజం।
షష్ఠేచమంత్రజీవీస్యాత్సప్తమేపితృసౌఖ్యదః ॥ ౪౫౪ ॥
అష్టమేపుష్టిజనకోనవమేలభతేధనం ।
లభతేదశమేమాసిసౌఖ్యమేకాదశేపివా ॥ ౪౫౫ ॥

ద్వాదశేధనస్సంపత్తిర్ధంతానాంజననేఫలం ।
తత్రశాంతిః ప్రకర్తవ్యాపాద్మోక్తాశుభలిప్సునా॥౭౫౬॥

తా॥ పుట్టినబిడ్డకు జననాదిగా మొదటినెలలోనే పండ్లుపుట్టిన నాశిశుజీవించదు. ౨వ-నెలలోభ్రాతృహాని. మూడవనెలలో అకాలమహాని, ౪వ నెలలోతల్లినిచంపును. ౫వనెలలోపెద్దన్నకుకష్టము, ౬వనెలలో మంత్రాలోచనతోబ్రతుకును. ౭వనెలలో తండ్రికిమంచిది. ౮వనెల దేహపుష్టినిచ్చును. ౯వ నెల-ధనలాభమగును. ౧౦వనెలలోసౌఖ్యము. ౧౧వది యుక్తము. ౧౨ వది-సంపదనొదవించును. కావున ౫ నెలలలోపుగా దంతజననమైనచో పద్మపురాణోక్తశాంతిని శ్రేయస్కాములు చేయనగును. అని చండేశ్వరవచనంబులు.

౨౦౭. డోలారోపణమునకు డోలాచక్రము.

శ్లో॥ సూర్యభాచ్చంద్రభంయావత్పంచపంచచతుర్దిశం ।
మధ్యేతుసప్తదేయానిడోలికాచక్రఉత్తమే ॥ ౭౫౭ ॥
పూర్వభాగేనిరోగత్వం దక్షిణేమరణంధ్రువం ।
పశ్చిమేతుకృశోబాలఉత్తరేవ్యాధిసంభవః ॥ ౭౫౮ ॥
శేషేషుసప్తధిష్ణ్యేషుబాలకస్యసుఖంభవేత్ ।
డోలాచక్రమిదంజ్ఞేయంమునిభిః పరికల్పితం ॥ ౭౫౯ ॥

తా॥ డోలాస్థాపనమనగా తొట్లపెట్టుటలో:— సూర్యుడుండెడు నక్షత్రమునుండి నాడుచంద్రుడుండెడు నక్షత్రమువరకు గణనముచేసి:—

నాల్గుదిక్కులకును అయి దేసినక్షత్రములను నడుమ ౭ నక్షత్రంబులను చూచికొనునది. అందు మొదటి ౫ పూర్వనక్షత్రములు వాటిలో చంద్రుడుండిన నా శిశువుకారోగ్యము. పిదప ౫ దక్షిణనక్షత్రములు వాటిలో శిశుమరణము. పశ్చిమనక్షత్రములు ౫ టిలో బాలకుడుకృశించును. ఉత్తరనక్షత్రములు ౫, వాటిలో రోగసంభవము. తక్కిన ౭ నక్షత్రంబులు శిశువుకు సుఖదంబులు కావున శ్రీనారదోక్త చక్రమునననుసరించి తొట్లపెట్టించుట శ్రేయస్కరము.

## ౨౮౯. అవసరప్రాప్తమగు డోలాముహూర్తము.

శ్లో॥ డోలారోహస్తు కర్తవ్యో దశమే ద్వాదశేపివా ।
షోడశే దివసేవాపి ద్వాత్రింశద్దివసేపివా ॥ ౮౬౦ ॥

తా॥ జననాదిగా ౧౧, ౧౨, ౧౬, ౩౨ వ-దినములనాడు యథాసంభవముగా డోలారోహణము కావచ్చునని గురువచము. అనగానివి సముచితోక్తకాలంబులు.

శ్లో॥ ఉగ్రేంద్రమూలాహిశివాగ్నివర్జ్యం ।
శస్తేందునాయుక్తతిథిలగ్నయోగే ।
విష్టిక్షమాపుత్రయమాహవర్జ్యా ।
మాందోలికారోహణమత్రశస్తం ॥ ౮౬౧ ॥

తా॥ ఉగ్రనక్షత్రంబులు, ఆశ్రేష, ఆర్ద్ర, కృత్తిక, మూల, జ్యేష్ఠ, వీట్లనువదలి తక్కిన నక్షత్రంబులలో శుభచంద్రయుక్త తిథిలగ్నయోగం

బులలోను;— భద్ర, మంగళ, శనివారములు విడిచి తక్కిన వారంబులలో
ను డోలారోహణము ప్రశస్తంబని దీపికావచనము.

## ౭౦౯. నిష్క్రమణ ముహూర్తము.

శ్లో॥ గృహాన్నిష్క్రమణంసూనోశ్చతుర్థేమాసికారయేత్ ।
యాత్రోక్తేసమయేమాసితృతీయేద్వాదశేహని॥౪౬౨॥

తా॥ గృహనిష్క్రమణమనగా పుట్టిన బిడ్డను ఇంటినుండి మఱియొక
మంచితావుకు తీసికొనివెడలుట. దీనికి ౪ వ నెల ప్రశస్తమని "చతుర్థే
మాసికర్తవ్యంశిశోర్నిష్క్రమణంగృహాత్" అనిమనువచనంబు
నుగలదు. ౧౨ వ దినము, 3 వ నెల, ౪ వ నెల, ప్రయాణప్రకరణోక్త శు
భతిథివారనక్షత్ర లగ్నశుద్ధిగల సమయము ప్రశస్తంబగునని గురువచనము.

శ్లో॥ మైత్రమాదిత్యపుష్యౌచరోహిణీచశుభావహాః ।
ఝషాళిమేషావర్జ్యాస్తథైవాధోముఖానిచ ॥౪౬3॥
సతాంతువారవర్గాశ్చశుభదాస్తూదయాస్తథా ।
కేంద్రత్రికోణగాస్సౌమ్యాః పాపాష్షష్ఠత్రిలాభగాః॥

తా॥ అధోముఖనక్షత్రంబులు, కూడదు, అనూరాధ, పుష్యమి,
రోహిణి, పునర్వసు, ఈనక్షత్రంబులు నుత్తమంబులు, మీనమేషవృశ్చిక
లగ్నంబులుకూడదు. తక్కినవి మేలు, శుభవారములలో శుభలగ్నమున కేంద్ర
త్రికోణంబులలో శుభగ్రహంబులును 3-౬-౧౧లో పాపగ్రహంబులునుం
డగా ప్రథమనిష్క్రమణమునకు ప్రశస్తంబని ముహూర్తసంగ్రహవచనము.

అచ్చటనే "ఉపనిష్క్రమణేశస్తామాతులోవాహా యేచ్ఛిశుం"- మేనమామ బిడ్డనెత్తుకొని యింటినుండి వెడలుట ప్రశస్త మనియున్నది.

శ్లో॥ అథనిష్క్రమణంనామగృహాత్ప్రథమనిర్గమః ।
అకృతాయాంక్రియాయాంస్యాదాయుశ్శ్రీనాశనంశిశోః।
కృతేసంపద్వివృద్ధిస్స్యాదాయుర్వర్ధనమేవచ ॥ ౭౬౭ ॥

తా॥ ఈయింటినుండి ప్రథమనిర్గమనమనునది ఉక్తకాలమున చేయకపోయినను అనుక్తకాలమున చేసినను బిడ్డకు ఆయుస్సంపదలు క్షీణించును. కావున నుక్తకాలమున చేసి ఆయుస్సంపదలనందదగునని బృహస్పతి వచనము.

౨౧౦. శిశువుకు సూర్యచంద్రాదర్శనలను కాన్పించుట.

శ్లో॥ తృతీయేమాసికర్తవ్యంశిశోస్సూర్యస్యదర్శనం ।
చతుర్థేమాసికర్తవ్యమగ్నేశ్చంద్రస్యదర్శనం ॥ ౭౬౮ ॥

తా॥ పుట్టినబిడ్డకు మూడవనెలలో సూర్యునిని, ౪వ నెలలో చంద్రాగ్నులను చూపించవలయునని యమవచనము.

౨౧౧. సూతికాజలపూజా ముహూర్తము.

శ్లో॥ ఏకత్రింశేవాసరేవాద్వితీయే ।
జన్మర్క్షేవాశుద్ధలగ్నేనుకూలే ॥
శంఖేక్షీరంసంనిదద్ధ్యాచ్ఛిశూనాం ।
వక్త్రేధాత్రీపూజ్యపూజాంవిధాయ ॥ ౭౬౯ ॥

తా॥ ౨౧వ దినమునందుగాని ౨౨వ దినమునందుగాని బాలింతయైన ది, జన్మనక్షత్రమునందైనను; శుభలగ్నాదిశుద్ధియనుకూలముగానుండెడువేళ లో జలభూపూజను పెద్దలకు మ్రొక్కుటను ఆచరించి శంఖమునందు పాలు నింపి బిడ్డకు పోయనగును.

## ౨౧౨. అన్నప్రాశనమునకు కాలము.

శ్లో॥ యుగ్మేషుమాసేషుచషష్ఠమాసా ।
త్సంవత్సరేవానియతంశిశూనాం ।
అయుగ్మమాసేషుచకన్యకానాం ।
నవాన్నసంప్రాశనమిష్టమేతత్ ॥ ౪౬౭ ॥

తా॥ మొగబిడ్డలకు ౬ వ నెల మొదలు సమమాసములలోనన గా ౬-౮-౧౦-౧౨ వ నెలలోను; ఆడబిడ్డలకు ౫-౭-౯-౧౧ వ నెలలలోను; అన్నప్రాశనకు సకాలము గానుండునని వసిష్ఠవచనము—

## ౨౧౩. అన్నప్రాశనకు ముహూర్తము.

శ్లో॥ దశమేశుద్ధిసంయుక్తేశుభలగ్నేశుభాంశకే ।
శుక్లపక్షేచపూర్వాహ్ణేసౌమ్యయుక్తనిరీక్షితే ॥౪౬౮॥
త్రిషష్ఠలాభగైఃపాపైఃకేంద్రధీధర్మగైశ్శుభైః।
వ్యంత్యారినిధనస్థేన చంద్రేణప్రాశనంశుభం ॥౪౬౯॥

తా॥ అన్నప్రాశనకు శుభలగ్నము, శుభాంశ, పూర్వాహ్ణము, శుభగ్రహయోగము, శుభగ్రహదృష్టి;— లగ్నమునకు ౧-౭-౪ లోను ౯-౫లోను శుభగ్రహంబులును. ౩-౬-౧౧లో పాపగ్రహంబులు నుండవలయును, ౧౦వ యింటిలో నేగ్రహమునుఉండక శుద్ధముగా నుండనగును. ("చరస్థిరమృదుక్షిప్రనక్షత్రేషుశుభేదినే"=అనుకశ్యపవచనమననుసరించి చరస్థిరమృదుక్షిప్రనక్షత్రంబులలో నన్నప్రాశనముప్రశస్తము.) ఇట్లు నారద వచనంబులుగలవు.

## ౨౧౪. అన్నప్రాశనకుజన్మనక్షత్ర ప్రాశస్త్యము.

శ్లో॥ పట్టబంధనచౌలాన్నప్రాశనేచోపనాయనే ।
శుభదంజన్మనక్షత్రమశుభంత్వన్యకర్మణి ॥ ౪౭౦ ॥

తా॥ పట్టాభిషేకము, చౌలము, అన్నప్రాశనము, ఉపనయనము;— వీట్లలోజన్మనక్షత్రముప్రశస్తంబైనది. తక్కినవాట్లలోనశుభము. అనినారద వచనముగలదు. అయినను, జన్మతారయేప్రశస్తముగాని జన్మనక్షత్రము తగదని లల్లవాక్యముగలదు ఎట్లనిన;—

శ్లో॥ హిత్వైకంజన్మఋక్షం ద్వేతారేజన్మసంజ్ఞితేశుభదే ।
ఉద్వాహేచోపనయే యాత్రాయామన్నభోజనేక్షురే
కార్యే ॥ ౪౭౧ ॥

తా॥ జన్మనక్షత్రమువదలి, జన్మసంజ్ఞగల శుభకరమగు రెండుతారల వగా ౧౦-౧౯వ నక్షత్రములలో వివాహోపనయనయాత్రాన్న భోజ

వాదులు కావచ్చును. అన్నప్రాశనాన్నభోజనశబ్దములకు సాధారణముగానే కార్థమని పీయూషసుధాకర కారునిమతము. కొందఱు వార్షికనవాన్నభోజనమునకే అన్నభోజనమనివివరించెదరు.

శ్లో॥ జన్మర్క్షే కర్మనక్షత్రే ఆధానర్క్షే చ వర్జయేత్ ।
కర్ణవేధంతథాయానం క్షురకర్మాన్నభోజనం ॥ ౪౭౨ ॥

తా॥ జన్మనక్షత్రమునందును ౧౦ యవనక్షత్రమునందును ఆధాననక్షత్రమునందును కర్ణవేధను ప్రయాణమును క్షౌరమును అన్నభోజనమును చేయరాదని గురువచనము. ఇచ్చట వార్షికనవాన్న భోజనమని యర్థము వ్యాఖ్యానకారులమతము.

## ౨౧౪. అన్నప్రాశనలగ్నగ్రహస్థితిఫలము.

శ్లో॥ కుష్ఠీలగ్నగతే సూర్యే క్షీణ చంద్రే చ భిక్షుకః ।
సత్రదః పూర్ణచంద్రే స్యాత్కుజే పిత్తరుజార్దితః ॥ ౪౭౩ ॥
బుధే జ్ఞానీ గురౌ భోగీ దీర్ఘాయుర్భాగ్యవాన్సితే ।
వాతరోగీ శనౌ రాహౌ కేతౌ చాన్నవివర్జితః ॥ ౪౭౪ ॥

తా॥ లగ్నమున, సూర్యుడున్న కుష్ఠరోగము, క్షీణచంద్రుడున్న భిచ్చమెత్తును; పూర్ణచంద్రుడున్న సత్రము వేయించును. కుజుడున్న పిత్తరోగియగును బుధుడున్న జ్ఞానియగును; గురుడున్న భోగియగును; శుక్రుడున్న భాగ్యారోగ్యవంతుడగును; శని రాహువులున్న వాతరోగియగును; కేతువున్న అన్నములేని వాడగును. అనివసిష్ఠవచనములు.

## ౨౧౬. సందర్భవశమున పూర్ణచంద్రలక్షణము.

శ్లో॥ సంపూర్ణేందూభయాష్టమ్యోఃమధ్యేందుఃపూర్ణసంజ్ఞకః।
వినష్టేందూభయాష్టమ్యోర్మధ్యేసౌక్షీణసంజ్ఞకః॥౪౭॥

తా॥ శుక్లాష్టమిమొదలు కృష్ణాష్టమివరకు చంద్రుడు పూర్ణచంద్రుండనియును; కృష్ణాష్టమిమొదలు శుక్లాష్టమివరకు క్షీణచంద్రుండనియును సంకేతము గల్గియుండునని వసిష్ఠవచనము.

## ౨౧౭. భూమ్యుపవేశన ముహూర్తము.

శ్లో॥ పంచమేచతథామాసిభూమావాతముపవేశయేత్ ।
తత్రసర్వేగ్రహాశ్శస్తాభౌమోరామవిశేషతః ॥ ౪౮ ॥
తిథించవర్జయేద్రిక్తాం శస్తానిశృణుభానిమే ।
ఉత్తరాత్రితయంసౌమ్యంపుష్యర్క్షంశక్రదైవతం॥౪౯
ప్రాజాపత్యంచహస్తంచశస్తమాశ్వినమిత్రభం ।
వరాహంపూజయేద్దేవంపృథివీంచతథాగ్రహాన్ ॥ ౫౦॥

తా॥ పుట్టినబాలకునిని ౫-వ నెలలో నేలమీఁదకూర్చుండ బెట్టవలయును. అప్పుడు గ్రహములు బలవంతులుగ నుండవలయు. ముఖ్యముగా నంగారకుఁడు బలిష్ఠుడైయుండగా, రిక్తాతిథియనగా ౪-౧౧-౧౪ తిథులుతప్ప తక్కిన శుభతిథులలో రోహిణి ఉత్తర ఉత్తరాషాఢ ఉత్తరాభాద్ర మృగశిర జ్యేష్ఠ అనూరాధ అశ్విని పుష్యమిహస్తయను ౧౦ నక్షత్రంబుల

లో శుభముహూర్తమున్నడుముకు పట్టుదారముకట్టి వస్త్రముచుట్టి, వరాహస్వామిని భూదేవతన్ను నవగ్రహములను పూజించి, బిడ్డను భూమిమీద కూర్చుండ బెట్టవలయును. అనిపద్మ పురాణవచనములు. అచ్చటనే తన్మంత్రంబులును చెప్పంబడినవి. ఎట్లనిన;—

శ్లో॥ రక్షైనంవసుధేదేవి సదాసర్వగతంశుభే ।
ఆయుఃప్రమాణం నిఖిలం నిక్షిపస్వహరిప్రియే ॥ ౪౭ ॥
అచిరాదాయుష స్తస్యయేకే చిత్పరిపంథినః ।
జీవితారోగ్యవి త్తేషునిర్దహస్వాచిరేణతాం ॥ ౪౮ ॥
ధారిణ్యశేషభూతానాం మాత స్త్వమధికాహ్యసి ।
కుమారంపాహిమాత స్త్వంబ్రహ్మాతదనుమన్యతాం ॥
తస్యోపవేశనం కృత్వాభూమౌబ్రాహ్మణ భోజనం ।
తతఃకృత్వాతతః కార్యముత్సవంపూర్వవద్ద్విజ॥ ౪౯ ॥

తా॥ పైమంత్ర శ్లోకములతో భూదేవతను పూజించి, ప్రార్థనచేసి బిడను నేలమీద కూర్చుండబెట్టి, బ్రాహ్మణ సమారాధనజేసినపిదప నారతి మొదలగు నుత్సవములను చేయునగును.

౨౧౮. ఆసమయమున జీవికాపరీక్షణము.

శ్లో॥ తస్మిన్కాలేస్థాపయే త్తత్పురస్తాత్ ।
వస్త్రం శస్త్రం పు స్తకంలేఖనీంచ ।

స్వర్ణం రౌప్యం యచ్ఛ గృహ్ణాతి బాలః।
తైరాజీవై స్తస్య వృత్తిః ప్రదిష్టా ॥ ౪౮౩॥

తా॥ బిడ్డను నేలమీఁద కూర్చుండబెట్టి నపుడు, బిడ్డ యెదుట వస్త్రము ఆయుధము పుస్తకము కలము బంగారు వెండిని పెట్టవలయును. వాట్లలో నాబాలుఁడు దేనిని చేతదీసి కొనునో వానిజీవనవృత్తి తన్మూలకంబుగా పరిణమించునని యెఱుంగనగునని ముహూర్త చింతామణి వచనము. సామాన్యముగా నీజీవికాపరీక్షణంబును అన్నప్రాశన సమయమునే చేయుట శిష్టాచారంబుగానున్నదని పీయూషసుధాకరటీ కాకారుల వయభిప్రాయము.

౨౧౯. శిశువుకు తాంబూలభక్షణ ముహూర్తము.

శ్లో॥ మూలాదితిద్రవిణతిష్యకరోత్తరాసు।
పౌష్ణాశ్వివిష్ణురజనీకరశక్రభేషు ॥
వారేషుసూర్యశశిజీవసితేందుజానాం।
తాంబూలభక్షణవిధిః కథితశ్శిశూనామ్ ॥ ౪౮౪ ॥

తా॥ "సార్ధమాస ద్వయేప్రాగం తాంబూలం వాశిశోర్హితం" పుట్టినబిడ్డకు ౨౻ నెలలో వక్కగాని తాంబూలముగాని హితకరమైనదని, అనుచండేశ్వర వచనాను సారముగా; దీపికాగ్రంథమున నాయాచారము గలవారికిట్లు కాలము విధింపబడుచున్నది—

## ౨౨౧. కర్ణవేధ ముహూర్తము.

శ్లో॥ యోజన్మమాసే క్షురకర్మయాత్రాం ।
కర్ణస్య వేధం కురుతేహి మోహాత్ ॥
మూఢస్సరోగీధన పుత్రనాశం ।
ప్రాప్నోతిగూఢం నిధనంతదాశు ॥ ౪౮౫ ॥

తా॥ ఎవడుజన్మ మాసమునందు క్షౌరకర్మను ప్రయాణమును చెవులు కుట్టుటను చేయునో వాడురోగియగును, ధనపుత్రహానిగల్గును, మఱియు గుట్టుగా మృతినందునని వ్యాసవచనము.

శ్లో॥ నజన్మమాసేనచచైత్రపౌషే ।
నజన్మతారాసు హరౌప్రసుప్తే ॥
తిథౌ వరిక్తే నచవిష్టిదుష్టే
కర్ణస్య వేధో నసమానవర్షే ॥ ౪౮౬ ॥

తా॥ చెవులుకుట్టుటకు ఈచెప్పబోవు కాలములుతగవు. ఏవియనిన-- జన్మమాసము, చైత్రము, పుష్యమాసము, జన్మనక్షత్రము ౧౦-౧౯వ తారలును, ఆషాఢశుక్ల ౧౧ మొదలు కార్తికశుక్ల ౧౨ వరకును, రిక్తాతిథులున్నూ, భద్రకరణము, సరియేండ్లనగా ౨-౪-౬ ఇట్టివయుస్సు వత్సరంబులును తగవు. అనివ్యవహారసముచ్చయ వచనము.

శ్లో॥ కార్తికేపౌషమాసేవా చైత్రేవాఫాల్గునేపివా ।
కర్ణవేధంప్రశంసంతి శుక్లేపక్షే శుభేహని ॥ ౪౮౭ ॥

తా॥ కార్తికమున, పుష్యమున, చైత్రమున, ఫాల్గునమునకూడ. శుక్లపక్షశుభదినమున కర్ణవేధకావచ్చునని వ్యాసవచనము. పైవచనమునకు విరోధముగానున్నదైనను; ఇచ్చట మేషచైత్రముకావచ్చును. మకరపుష్యము గ్రాహ్యము; కార్తిక శుక్ల ౧౩ మొదలు గ్రాహ్యము; అనియెఱుంగనగును.

శ్లో॥ పుష్యేథనిష్ఠాస్వదితౌహరీందు ।
త్వాష్ట్రేశ్వికరేంత్యేతిసృషూత్తరాసు ॥
దస్రేసమైత్రేప్యథకర్ణవేధో ।
నేష్టాశ్చసర్వేష్టమరాశిసంస్థాః ॥ ౮౩౮ ॥

తా॥ శ్రవణము, ధనిష్ఠ, పునర్వసు, పుష్యమి, చిత్ర, అనూరాధ, మృగశిర, రేవతి, అశ్విని, హస్త, ఉత్తర, ఉత్తరాషాఢ, ఉత్తరాభాద్రలును; చెవులుకుట్టుటకు తగిననక్షత్రంబులు. తక్కినవిపనికిరావనుట. మఱియు, తత్కాల లగ్నమునకు ౮ వ యింటిలో నేగ్రహము లేకశుద్ధముగా నుండవలయునని గర్గవచనము.

శ్లో॥ కర్ణవేధోవినిర్దేశ్యో లగ్నసంస్థేబృహస్పతౌ ।
తదభావేన్యకేంద్రస్థేతదభావేత్రికోణగే ॥ ౮౩౯ ॥

తా॥ చెవులుకుట్టునపుడు తత్కాలలగ్నమున గురుడుండుట మిక్కిలిమంచిది. అదిసంభవించనిచో ౪-౭-౧౦-వ యిండ్లలో నైననుండవలె అట్లు లేకపోయిన ౫-౯-లో నైననుమంచిది. ముఖ్యముగా గురుబలము ప్రశస్తమయినదని గురువచనము.

## ౨౨౧. కర్ణవేధలో విశేషములు.

శ్లో॥ కర్ణరంధ్రేరవిచ్ఛాయానవిశేదగ్రజన్మనః ।
తందృష్ట్వావిలయంయాంతిపుణ్యౌఘశ్చపురాతనః॥౪౯౦

తా॥ జ్యేష్ఠపుత్రునికి చెవులుకుట్టిన నారంధ్రములు చిన్నవిగనుండనగును. అనినదానిలో సూర్యరశ్మి దూరిపడరాదు, అట్లు పడినయెడల వెనుకటి పుణ్యంబులు నశించునని దేవలవచనము.

శ్లో॥ అవిద్ధకర్ణైర్యద్భుక్తం లంబకర్ణైస్తథైవచ ।
దగ్ధకర్ణైశ్చయద్భుక్తంతద్వై రక్షాంసి గచ్ఛతి ।౪౯౧ ॥

తా॥ చెవులుకుట్టుకొననివారును, వ్రేలాడు చేవులవారును, కాలిన చెవులవారును, భుజించినది రాక్షసులనుచేరును. అనిన దైవారాధనకు వీరుతగరని భావము. అని సాలంకాయనవచనము.

## ౨౨౨. అబ్దపూర్తి విచారము.

శ్లో॥ అబ్దేనసౌరేణశిశోస్సమాంతే ।
బాలంనుసంస్నాప్యచ జన్మధిష్ణ్యే ॥
కృత్వాయుషోవృద్ధి కరంచకర్మ ॥
తంధారయేద్వస్త్ర సువర్ణసూత్రం ॥ ౪౯౨ ॥

తా॥ బిడ్డకుసౌరమానమును పట్టిసంవత్సరాంతమున వచ్చెడు జన్మనక్షత్రమునాడు బాలకునికిమంగళస్నాన మును చేయించి ఆయుర్వృద్ధికరంబగు.

నాయుస్సూక్తహోమాది కర్మను చేయించి బంగారుమొలత్రాడు మొదలగు నాభరణంబులచేతను నూతనవస్త్రములచేతను అలంకరించి యాశీర్వదించనగునని విధిరత్నవచనము.

శ్లో॥ ఉదయవ్యాపిజన్మర్క్షం తస్మాద్గ్రాహ్యంతుజన్మతః ।
సంగవ్యాపిని ఖండర్క్షే తత్రజన్మకరంశుభం ॥ ౪౯౩ ॥

తా॥ జన్మకాలమునుండి ఉదయవ్యాపియైన జన్మనక్షత్రమెద్దియో అనక్షత్రమును గ్రహించవలయును; మరియును, అనక్షత్రము సంగమకాలవ్యాపిగానున్నపుడు జన్మోత్సవము చేయనగునని ఖండనక్షత్రవిచారము గర్గవచనము తెలుపుచున్నది

౨౨౩. ఇకచౌలకర్మ విచారము.

౨౨౪. శుభకర్మకు ధూమకేతూదయముతగదు.

శ్లో॥ కేతోరస్తదినాదూర్ధ్వంసప్తాహంమంగళంత్యజేత్ ।
యావత్కేతూదయస్తావదశుద్ధస్సమయోహిసః ॥ ౪౯౪ ॥

తా॥ కేతువుదయించిన దినములన్నియును అశుద్ధసమయంబని, యాకేతూదయ సమయంబును, అస్తమించినపిదప ౭ దినములయందు మంగళకార్యముల నాచరించరాదు, అనిచండేశ్వరవచనము. (ఈచౌల ప్రకరణమున నాదిలో నీవిచారము చేయబడును. ఇట్లేసకలశుభకర్మలను చేయరాదని భావము.) కేతువనగ బ్రహ్మదండమని యెఱుంగనగు నెట్లనిన:—

శ్లో॥ చూడాకర్మద్విజాతీనాంసర్వేషామేవధర్మతః
ప్రథమేబ్దేద్వితీయేవాకర్తవ్యంశ్రుతిచోదనాత్ ॥ ౪౯౫ ॥

తా॥ జుట్టువిడిపించుటయును కర్మబ్రాహ్మణులకు మఱియునందఱికిని ప్రథమవత్సరమున రెండవయేటనా మూడవయేటను, చేయవలెనని శ్రుతిగల దు గావున ముఖ్యమైయున్నదని మనువచనముగలదు. ఇట్లుచెప్పియుండునది బహుకాలములుగావున స్వకులాచార పద్ధతి ననుసరించనగును.

౨౨౫. కేతువనిన బ్రహ్మదండము తల్లక్షణంబును.

శ్లో॥ త్రిశిఖస్త్రివర్ణయుక్తో బ్రహ్మసుతో బ్రహ్మదండనిభః ।
అనియతదిక్ప్రభవోఽసౌ కాంతికరో బ్రహ్మదండాఖ్యః॥

తా॥ ఈ కేతుననువాఁడు;— మూడు మోములుఁగల, మూడురంగులుగ ల, బ్రహ్మపుత్రుఁడైన, బ్రహ్మదండమువలె వెల్గుచుండు, ఇచ్చవచ్చినట్లు ఏది క్కునందైనను జనించునట్టి, మనోహరకరుఁడైన; బ్రహ్మదండ మను పేరుగ లవాఁడు, అనివసిష్ఠవచనము.

శ్లో॥ త్రిశిఖాఖ్యాస్త్రిరాత్రాశ్చరక్తా లోహితరశ్మయః ।
ప్రాయశస్తూత్తరామాశాం సేవంతే నిత్యమేవ తే ॥౪౭౭॥
లోహితాంగాత్మజా జ్ఞేయా గ్రహాః షష్టిస్సమాసతః ।
నామతః కౌంకుమా జ్ఞేయా రాజ్ఞాం సంగ్రామకారకాః ॥
కృష్ణాభాః కృష్ణపర్యంతాః సంకులాః కృష్ణరశ్మయః ।
రాహుపుత్రాస్త్రయస్త్రింశత్కీలకాశ్చాతిదారుణాః ॥

తా॥ ఈధూమకేతువులు అనగా; వీర్లలో కొందఱు త్రిశిఖులు త్రిరా త్రులు దయించియుండువారును, ఎఱ్ఱని కాంతులుగలవారును, ఎఱ్ఱనివారు

ను, ప్రాయికముగా నుత్తరదిక్కు నాశ్రయించి యుండువారును, నానుందురు; వీరలు లోహితాంగాత్మజులని యెఱుంగునది, వీరలు ౬౦ మంది, వీరిపేరు కౌంకములని యెఱుంగనగును. వీరు రాజులకు కలహములనిచ్చువారలు; నల్లనివారు. నల్లనికాంతులుగలవారు, సంకులులు, రాహుపుత్రులగువీరు 33 కోట్లుగలరు. అనియిట్లు ధూమకేతులక్షణాదులు గర్గవచనములచే నెఱుంగనగును.

## ౨౭౬. గురుశుక్రవార్ధక్యములు చౌలాదులకు తగవు.

శ్లో॥ పశ్చాత్ప్రాగుదితశ్శుక్రో దశత్రిదివసంశిశుః ।

వృద్ధఃపంచదినంపక్షం గురుఃపక్షంచవర్జయేత్ ॥ ౫౦౦ ॥

తా॥ శుక్రుడు పశ్చాదుదయంబును ప్రాగుదయంబు నందుచుండును. అస్తమించుటకు మునుపే బాలుడనంబడును. ఉదయించిన పిమ్మట వృద్ధుడనంబడును. అస్తమించుటకు మునుపే ౧౦ దినములు బాలుడనియును, ఉదయించిన పిదప ౫ దినములు వృద్ధుడని యెఱుంగనగును. గురువు అస్తమించుటకు మునుపు ౧౫ దినములు బాలుండు. ఉదయించిన పిదప ౧౫ దినములు వృద్ధుడు. అని నారదవచనము.

శ్లో॥ శుక్రోగురుఃప్రాక్పరతశ్చబాలో వింధ్యేద్దశావంతిషు సప్తరాత్రం । వంగేషుహూణేషు చషట్చపంచ శేషేషు దేశేత్రిదినంవదంతి ॥ ౫౦౧ ॥

తా॥ గురుశుక్రు లిరువురును అస్తసమయమునకు ఇరుగెలంకులలోను అవంతిదేశము వారికి ౧౦ దినములు, వంగదేశమువారికి ౭ దినంబులు, హూణులకు ౬-౫ దినంబులును, తక్కిన దేశములవారికి ౩ దినంబులును వేధనిచ్చువారలయి యుందురని గర్గవచనము గలదు. కావున చౌలాది శుభకర్మలకు తత్కాలము పనికిరాదని ఈసందర్భమున చెప్పంబడియున్నది. సందర్భానుసారముగా చంద్రునికి అస్తదోషము గలదు. అదియెట్లనిన;—

## ౨౨. చంద్రబాల్యవృద్ధ నిర్ణయము.

శ్లో॥ వృద్ధత్వమిందోస్త్రి దినందినార్థం బాల్యత్వమస్తత్వమహర్ద్వయంచ। అస్తేవిధౌమృత్యుముపైతికన్యా బాల్యేన్యసక్తా విధవాచవృద్ధే ॥ ౫౦౨ ॥

తా॥ చంద్రునికి అమామధ్యకాలము అస్తకాలము. అస్తమునకు మొదట మూడుదినములు లేక ౧౪ దినము బాలత్వము. అస్తమయిన పిదప ౨ దినములు వృద్ధత్వము. ఇవి దోషయుక్తములని యెఱుంగనగును. కన్యకకు అస్తసమయమున శుభకర్మ మృత్యుప్రదము, బాల్యమున వ్యభిచారమునిచ్చును. వృద్ధత్వమున వైధవ్యము గలుగునని వసిష్ఠవచనము గలదు.

శ్లో॥ వృద్ధచంద్రస్త్రియంహంతి పతింహంత్యస్తమాగతః।
యతోస్యామృతరశ్మిత్వాద్బాలోపిశుభదస్మృతః ॥ ౫౦౩॥

తా॥ వృద్ధచంద్రుడు స్త్రీనిచంపును, అస్తచంద్రుడు పతినిచంపును. చంద్రుడు అమృతకిరణుండై యుండుటచేత బాలుడైయున్నను శుభప్రదుడు

డే అగునని కశ్యపవచనము గలదు. ఇట్లు నిషిద్ధకాలములను సూచించి, ఇంక చౌలముహూర్తము చెప్పంబడుచున్నవి.

౨౨౭. చౌల ముహూర్తము.

శ్లో॥ పంచమీసప్తమీచైవ దశమ్యేకాదశీతథా ।
త్రయోదశీతృతీయాచ క్షురకర్మశుభావహాం ॥ ౫౦౪ ॥

తా॥ చౌలమునకు శుక్ల 3, ౫, ౭, ౧౦, ౧౧, ౧౩ కృష్ణ 3, ౫, ౭ యును ప్రశస్తతిథులుగా నుండునని వసిష్ఠవచనము.

శ్లో॥ సితేజ్యసౌమ్యవారేషు క్షౌరంపక్షద్వయేహితం ।
ఇందువారస్సితేపక్షే వారాశ్శేషానశోభనాః ॥౫౦౫॥

తా॥ బుధగురు శుక్రవారంబులు శుక్లకృష్ణపక్షంబులు రెంటిలోను; సోమవారము శుక్లపక్షమునందు మాత్రము; చౌలమునకు ప్రశస్తంబులు. తక్కినవారములు అశుభకరంబులని పరాశరవచనము.

౨౨౮. చౌలమున పాపవారంబుల కపవాదము.

శ్లో॥ పాపగ్రహాణాంవారేపి విప్రాణాంతుశుభోరవిః ।
క్షత్రియాణాంతుభూసూనుః విట్ఛూద్రాణాంశనిశ్శుభః॥

తా॥ చౌలకర్మలో బ్రాహ్మణునికి భానువారంబును, క్షత్రియునికి మంగళవారంబును, వైశ్యశూద్రులకు శనివారంబును శుభకరంబగునని ప్రయోగ పారిజాత వచనము.

శ్లో॥ దాస్రేందుదిత్యపుష్యేంద్ర భేషుహస్తత్రయేపిచ।
విష్ణుత్రయేచపౌష్ణర్క్షే చౌలకర్మశుభప్రదం ॥ ౫౦౭ ॥

తా॥ అశ్విని, మృగశిర, పుష్యమి, జ్యేష్ఠ, హస్త, చిత్ర, స్వాతి, శ్రవణ, ధనిష్ఠ, శతతార, పునర్వసు, రేవతి;— ఈనక్షత్రంబులు చౌలమునకు ప్రశస్త నక్షత్రంబులని కశ్యపవచనంబు,

## ౨౩౦. చౌలలగ్న నిర్ణయము.

శ్లో॥ అష్టమస్థాగ్రహాస్సర్వే నేష్టాశ్శుక్రవివర్జితాః।
శుక్రశ్చనిధనేక్షౌరే సర్వసంపత్కరశ్శిశోః ॥ ౫౦౮ ॥

తా॥ చౌలలగ్నమునకు ౮ వ ఇంటిలో శుక్రుడు తప్ప తక్కినగ్రహములుండరాదు, శుక్రుడు మాత్రమున్నయెడల బాలునికి సంపత్కరంబుగానుండునని పరాశరవచనము.

శ్లో॥ క్షౌరర్క్షేషుస్వకులవిధినా చౌలమాహుర్మునీంద్రాః।
కేంద్రంయాతైర్గురు భృగుబుధై స్తత్రసూర్యే జ్వరస్స్యాత్ ॥ శస్త్రాన్నాశోధరణి తనయేపంగు తాచార్కపుత్రే। శీతజ్యోతిష్వపచితతనౌనిశ్చితంనాకమేతి॥

తా॥ తనకుల విధిప్రకారముగా క్షౌరమునకు ఉక్తంబులయిన నక్షత్రంబులలో చౌలకర్మ చేయింపవలయునని మునీంద్రులు చెప్పియున్నారు గురుబుధ శుక్రులు కేంద్రంబు లనగా ౧-౪-౭-౧౦ లో నుండవలయును. అట్టికేంద్రంబులలో రవియుండినచో నాబాలునికి జ్వరమువచ్చును. కుజు

డున్నచో ఆయుధగండము కల్గును. శనియుండ్నచో కుంటివాడగును. క్షీణచంద్రుడున్నచో తప్పక నాశముగల్గునని రత్నమాలయందు చెప్పంబడినది. మఱియు నచ్చటనే కేంద్రవ్యతిరిక్త స్థానఫలంబుకూడ చెప్పంబడినది యెట్లనిన:—

శ్లో॥ ధనవ్యయత్రికోణస్థై రసద్భిర్హి మృతావపి ।
క్షురక్రియాన శోభనా శుభైస్తుపుష్టికారిణీ ॥ ౫౧౦ ॥

తా॥ ౧-౨-౯-౫-౧౨ లగ్నమునకు ఈయిండ్లలో క్షీణ చంద్ర కుజ శనులున్నచో, చౌలమునందును మృతియందును అశుభకరంబు. అచ్చోట శుభులున్నచో పుష్టిప్రదము. అనిననీ స్థానములలోను శుభులుశుభులనుట.

## ౨౩౧. చౌలమునందుతారాబలము ముఖ్యము.

శ్లో॥ వివాహేసవితాశస్తో వ్రతబంధేబృహస్పతిః ।
క్షౌరేతారావిశుద్ధిశ్చ శేషేచంద్రబలంబలం ॥ ౫౧౧ ॥

తా॥ పెండ్లిలోసూర్యుడు శుభస్థానమున బలవంతుడై యుండవలెను. ఉపనయనమున గురుడుబలవంతుడై యుండవలెను. చౌలమున తారాబలము ముఖ్యమైనది. తక్కిన శుభకర్మలలో చంద్రబలము అత్యంత శ్లాఘ్యంబైనది యని జ్యోతిర్నిబంధవచనము.

## ౨౩౨. చౌల ప్రయోజనము.

శ్లో॥ సర్వేషామేవవర్ణానాం చూడాకర్మవిధిస్స్మృతః ।
కేశమూలంపితాజ్ఞేయః కేశాగ్రంజననీతథా ॥ ౫౧౨ ॥

చౌలేనై వాయుషోవృద్ధిశ్చౌలేనై వాయుషఃక్షయః ।
తస్మాచ్చౌలం ప్రయత్నేన కారయేద్బుద్ధిమాన్నరః ॥

తా॥ అన్నిజాతులవారికిని చౌలముముఖ్యమైన విధిగానున్నది. ఎందువల్లననిన తండ్రికల మూలముతండ్రి, మెండ్రుకలకొనలుతల్లి, కావున చౌలముచేతనాయుస్సు వృద్ధినందును, మఱియు చౌలమువలననే ఆయుస్సుక్షయించును. కావున మంచిదైన యథోక్తకాలమున చౌలమును చేయించుట ముఖ్యమని వసిష్ఠులవారి వచనంబులుగలవు. కావున చౌలముహూర్తమును తగినట్లుచూచి కొనుటమంచిది.

౨౩౩. క్షౌరచౌల భేదజ్ఞాపకము.

శ్లో॥ చంద్రశుద్ధిర్యదానాస్తితారాయాశ్చవిశేషతః ।
అక్షౌరభేపికర్తవ్యంవారేణబుధసోమయోః ॥ ౫౧౪ ॥

తా॥ చంద్రబలములేక పోయినను తారాబలంబును లేకపోయినను, అనుక్తనక్షత్రమునందును కూడ బుధసోమవారంబులు ప్రశస్తంబులని కొందఱువచనమున్నదిగాని, యిదిసామాన్యక్షౌర విషయము. దీనింబట్టి చౌలకర్మ విధియందు నిర్ణయించరాదు.

౨౩౪. తల్లిగర్భిణియైన చోచౌలముతగదు.

శ్లో॥ పుత్రచూడాకృతౌమాతాగర్భిణీయదివాభవేత్ ।
విపద్యతేగురుశ్చైవ దంపతీశిశురబ్దతః ॥ ౫౧౫ ॥
గర్భేమాతుఃకుమారస్య నకుర్యాచ్చౌలకర్మచ।
పంచమాసాదధఃకుర్యాత్తతఊర్ధ్వంనకారయేత్ ॥౫౧౬॥

తా॥ తల్లిగర్భిణిగా నుండునపుడు బాలకునికి చౌలము చేయించినచో తలిదండ్రులిరువురికిని విపత్తుసంభవించును. అయితే ౫ మాసములకు లోపుగానున్న చౌలముకావచ్చును. పిదపపనికిరాదని వసిష్ఠవచనములు.

శ్లో॥ సూనోర్మాతరిగర్భిణ్యాంచూడాకర్మనకారయేత్ ।
పంచమాబ్దాత్ప్రాగతోర్ధ్వంగర్భిణ్యామపికారయేత్ ॥

తా॥ బిడ్డతల్లి గర్భిణీగానుండినచో చౌలముతగదైనను, చౌలవటువుకు ౫ ఏడ్లునిండియుండినచో తల్లిగర్భిణిగా నున్నప్పుడును చౌలముకావచ్చునని నారదవచనము.

## ౨౩౫. చౌలమునందు దుష్టతారాపవాదము.

శ్లో॥ సౌమ్యసుహృన్మిత్రజవర్గే, చంద్రేతుంగత్రికోణగేవాపి ॥
క్షౌరాదికోపకరణే,తారాదోషోనదోషయతే ॥ ౫౧౮ ॥

తా॥ చౌలమునందును ఆదిశబ్దముచే యాత్రయందును చంద్రుఁడుచ్చుండై త్రికోణములలోనుండి శుభమిత్రవర్గలనంది యుండినచో నప్పుడు దుష్టతారయైనను కావచ్చునని జ్యోతిస్తంత్రవచనము. అయినను "విపత్తారాగుడందద్యా"దిత్యాది పూర్వోక్త శాంతికర్తవ్యంబుగానుండు.

## ౨౩౬. చౌలాదికృత్యములయందు కాలవిశేషనిషేధము.

శ్లో॥ యస్యమాంగలికంకృత్యంతస్యమాతారజస్వలా ।
వైధవ్యంజాయతేతత్రతన్నునార్యోఃపాణిపీడనే । ౫౧౯ ॥

తా॥ చౌలాదిమంగళ కార్యములు జరుగునప్పుడు చిన్నవానితల్లి

ఋతుమతియైయుండినచో వైధవ్యము చెప్పఁబడినది. అని ప్రచేతసునివచనంబు.

౨౩౭. జ్యేష్ఠమార్గశిరమాసములు చౌలమునకుతగవు.

శ్లో॥ మార్గేమాసితథాజ్యేష్ఠే వివాహంచౌలమేవచ ।
జ్యేష్ఠపుత్రదుహిత్రోశ్చ నకుర్యాత్ వ్రతంతథా ॥ ౫౨౦ ॥

తా॥ మార్గశిరమాసంబునను జ్యేష్ఠమాసమునందును, పెద్దకొడుకుకు చౌలము ఉపనయనము కూతునకు వివాహంబును తగదని వాత్స్యవచనము.

౨౩౮. సామాన్యక్షౌరాది ముహూర్తవిచారము.

శ్లో॥ హస్తత్రయే పుష్య పునర్వసౌచ ।
శశాంకవిష్ణు త్రితయే శ్వినేషు ।
పౌష్ణేంద్రధిష్ణ్యేక్షురకర్మశస్తం ।
వ్యర్కారశన్యంశకవారలగ్నే ॥ ౫౨౧ ॥

తా॥ హస్త, చిత్ర, స్వాతి, పునర్వసు, పుష్యమి, మృగశిర, శ్రవణ, ధనిష్ఠ శతతార, అశ్విని, రేవతి, జ్యేష్ఠ—వీట్లలో రవికుజశన్యంశలును వారములును లేక శుద్ధిలగ్నమున క్షౌరము కల్యాణప్రదమని వసిష్ఠవచనంబు

౨౩౯. క్షౌరవారఫలంబులు.

శ్లో॥ భానురాయుశ్శిశుపయతిమాసం సప్తశనైశ్చరః ।
భౌమోమాసాష్టకంహంతిజ్ఞోయచ్ఛేత్పంచమాసకం

సప్తమాసాన్ దదాతీందుః సురేజ్యో దశమాసకం ।
ఏకాదశ కవిర్దద్యాత్ కృతే తు క్షౌరకర్మణి ॥ ౫౨౩ ॥

తా॥ క్షౌరము చేసికొన్నప్పుడు భానువారమైన ౧ నెల, శనివారమైన ౭ నెలలు, అంగారక వారమైన ౮ నెలలు, ఆయుస్సు క్షయించును. బుధవారమయిన ౫ నెలలు, సోమవారమైన ౭ నెలలు, గురువారమైన ౧౦ నెలలు, శుక్రవారమయిన ౧౧ నెలలు, ఆయుర్వృద్ధి గల్గునని గర్గవచనంబులు.

శ్లో॥ ఆదిత్యభౌమార్కిజదినేషు ధీమాన్ ।
న్న దంతకాష్ఠక్షురకర్మ కార్యం ।
కుర్వన్న వాప్నోతి ఫలం సమగ్రం ।
శస్త్రేణ సమ్యక్ స్వశరీరఘాతం ॥ ౫౨౪ ॥

తా॥ ఆదిత్య మంగళ శనివారంబులలో బుద్ధిశాలియైనవాడు పుల్లతో పండ్లుతోమరాదు. క్షౌరమును చేయించికొనరాదు. అట్లు వినక చేయించుకొనువారికి దేహమున నాయుధముతో దెబ్బతగులునని వసిష్ఠవచనము.

౨౮౦. నిషేధకాలమున క్షౌరము అలక్ష్మీకరము.

శ్లో॥ చతుర్థీంచైవ షష్ఠీంచ అష్టమీంచ చతుర్దశీం ।
తథా పంచదశీంచైవ బ్రహ్మచారీ భవేత్సదా ॥ ౫౨౫ ॥
శ్మశ్రుకర్మ శిరోభ్యంగ దంతధావన మైథునం ।
జంతుశ్చైతాని యఃకుర్యాల్లక్ష్మీస్తత్ర న తిష్ఠతి ॥ ౫౨౬ ॥

తా॥ చవితి, షష్ఠి, అష్టమి. చతుర్దశి, పున్నమ, వీట్లలో బ్రహ్మచ ర్యము నందియుండనగును. మఱియును వీట్లలో తలంటు, క్షౌరము, పుల్ల. తో పండ్లు తోముట, సంగమము, వీట్లను ఆచరించువాని వద్దసంపద నిలువ దని మహర్షి వచనములుగలవు. "యేషుయేషు ప్రశంసంతిక్షుర కర్మమహర్ష యః। తేషు తేషు ప్రశంసంతి నఖవంతవిలేఖనం"— అనియును గ్రా హ్యంబు.

## ౨౮౧. క్షౌరమునకు తగని కాలములు.

శ్లో॥ శన్యారరవివారేషురాత్రౌ పాతే వ్రతేహని ।
శ్రాద్ధాహే ప్రతిపద్రిక్తాభద్రాక్షౌరేవివర్జయేత్ ॥ ౫౨ ॥

తా॥ రవికుజశని వారంబులలోను, రాత్రియును, వ్యతీపాతనాడు ను, వ్రతదినములలోను, శ్రాద్ధమునాడును, పాడ్యమినాడును, ౪-౯-౧౪ తిథులలోను, భద్రాకరణమునను, క్షౌరముతగదని వృద్ధగర్గవచనము.

## ౨౮౨. అఖలవారర్క్షతిథులలో క్షౌరము.

శ్లో॥ నృపవిప్రాజ్ఞయాయజ్ఞేమరణే బంధమోక్షణే ।
ఉద్వాహేఖిలతారర్క్షతిథిషు క్షౌరమిష్టదం ॥ ౫౮ ॥

తా॥ రాజాజ్ఞగల్గినప్పుడును, ప్రాయశ్చిత్తముగా బ్రాహ్మణాజ్ఞగల్గిన పుడును, యజ్ఞంబునను మాతాపిత్రాది మరణంబులలోను, చెరవిడిచివచ్చిన ప్పుడును, వివాహంబునను;— తిథివారనక్షత్రాదులను చూడకక్షౌరము కావచ్చునని నారదవచనము. మఱియును;—

శ్లో॥ గంగాయాంభాస్కరేక్షేత్రేమాతాపిత్రోర్మృతేహని ॥
ఆధానేసోమపానేచషట్సుక్షౌరం విధీయతే ॥ ౫౨ ॥

తా॥ క్రొత్తగా గంగాతీరమునకు పోయినప్పుడును, భాస్కరక్షేత్రంబునను, తలిదండ్రులు చచ్చిననాడును, ఆధానముచేయునప్పుడును, యజ్ఞంబునను;— ఈ ఆరిటిలో క్షౌరము విధ్యుక్తంబులైనవి యని ధర్మశాస్త్రవచనము.

## ౨౪౩. గర్భిణీపతికి క్షౌరముతగదు.

శ్లో॥ వపనం మైథునంతీర్థంవర్జయేద్గర్భిణీపతిః ।
శ్రాద్ధంచసప్తమాన్మాసాదూర్ధ్వంనాన్యత్రవేదవిత్ ॥

తా॥ క్షౌరమును, సంగమమును, తీర్థాటనమును, తీర్థకార్యశ్రాద్ధములను;— గర్భిణీపతి యేడవనెలనుండి విడువవలయును, చేయరాదని నారదవచనము.

## ౨౪౪. శోభాకర ముఖక్షౌరవిధి.

శ్లో॥ మహీభృతాం పంచమ పంచమేహ్ని ।
క్షౌరంచకార్యం హితముక్తభేషు ॥
నలభ్యతేచేచ్ఛతదుక్త ధిష్ణ్యం ।
తదోదయేవా నిఖిలం విధేయం ॥ ౫౧ ॥

తా॥ రాజులయినవారు (భూపతులు) ౫-౫ ఐదేసిదినంబుల కొకసారు హితకరంబుగానుక్త నక్షత్రంబులలో క్షౌరమును చేసికొననగును.

అట్లు ఉక్తకాలము దొరకక పోయినప్పుడు ముఖక్షౌరమును చేసికొనుచుండి సకాలములో సర్వాంగక్షౌరమునందవచ్చును. అనివసిష్ఠవచనమున్నది. (ఇది పూర్వికహిందూ రాజుల పద్ధతిగానుండె. ఇప్పుడికకాలిలో నందఱును రాజులై ముఖక్షౌరములను చేసికొనకయుండువారే అరుదైరి.)

## ౨౭౫. తీర్థక్షౌరమునకు తగనివారు.

శ్లో॥ రాజాయోగీపురంధ్రీచ మాతాపిత్రోస్తుజీవతోః ।
ముండనంసర్వతీర్థేషునకుర్యాద్గర్భిణీపతిః ॥ ౫౩౨ ॥

తా॥ తీర్థస్థలములకు బోయినపుడు, రాజులును, యోగులును, తలిదండ్రులు బ్రదికియుండువారును, గర్భిణీపతులును క్షౌరమును చేసికొనరాదు. అని స్మృతివచనము.

## ౨౭౬. శుభవారము లభించనిచో నాహ్వారముఖ్యము.

శ్లో॥ యస్యఖేటస్యయత్కర్మవారేప్రోక్తంవిధీయతే ।
గ్రహస్యక్షణవారేపితస్య తత్కర్మసర్వదా ॥ ౫౩౩ ॥

తా॥ ఏగ్రహవారమున నేకర్మ చెప్పంబడినదో నాడుదానినిచేయుటమేలు. ఒకవేళనదిసంభవించనపుడు, దొరకినవారమున నాగ్రహముయొక్క కాలహోర యందైనను ఆకర్మనాచరించ వలయుననని నారదవచనము

## ౨౭౭. క్షౌరమునందు మరణసూచన.

శ్లో॥ అష్టాబ్జర్క్షాణి పితృపంచకశ్చ ।
షడ్వహ్నిధిష్ణ్య శ్చతురర్యమర్క్షాణి ।

త్రిమైత్రభః షడ్భుజసంనిభోఽపి ।
క్షౌరీనరోఽబ్దాన్నిధనంగతస్స్యాత్ ॥ ౫౩౪ ॥

తా॥ రోహిణీనక్షత్రమునందు ఎనిమిదిమార్లును మఖానక్షత్రమునందు ౫ మార్లు; కృత్తికానక్షత్రమున ౭ మార్లును; ఉత్తరలో ౪ మార్లును; అనూరాధలో మూడుమార్లును; విడువక వరుసగా క్షౌరముచేసికొన్నవాడు, సంవత్సరమునకు లోపల మరణమునందునని వసిష్ఠవచనము.

## ౫౪౮. అక్షరాభ్యాస ముహూర్తము.

శ్లో॥ ఉదగ్గతేభాస్వతిపంచమేఽబ్దే ।
ప్రాప్తేఽక్షరస్వీకరణం శిశూనాం ॥
సరస్వతీం విఘ్నవినాయకంచ ।
గుడోదనాద్యై రభిపూజ్యకుర్యాత్ ॥ ౫౩౫ ॥

తా॥ బాలకునికి ౫-వ సంవత్సరమునందు, ఉత్తరాయణమునందు గణేశసరస్వతీదేవతలను పూజించి అక్షరస్వీకరణము చేయించవలయునని వసిష్ఠవచనము.

శ్లో॥ హస్తాదిత్యసమీరమిత్ర పురజిత్పౌష్ణాశ్విచిత్రాచ్యుతే ॥
స్వారార్క్యంశయినో దయాదిరహితే లగ్నే స్థిరేచోభయే ॥ పక్షేపూర్ణనిశాకరే ప్రతిపదంరిక్తాం విహాయాష్టమీం । షష్ఠీమష్టమశుద్ధిభాజిభవనేప్రోక్తాక్షరస్వీకృతిః॥

తా॥ హస్త, పునర్వసు, స్వాతి, అనూరాధ, ఆర్ద్ర, రేవతి, అశ్విని, చిత్ర, శ్రవణము, ఈనక్షత్రంబులలోను. కుజశన్యంశలు వదలిన, స్థిరద్వి స్వభావలగ్నంబులనగా మేషకర్కాటక తులామకరములను వదలి తక్కిన లగ్నంబులలోను, శుక్లపక్షమునందు ౧-౪-౯-౧౪-౮-౬ ఈతిథులను వదలి తక్కినతిథులలోను, లగ్నమునకు ౮వ యింటిలో నేగ్రహము లేక శుద్ధము గానుండగా బాలకునికి అక్షరాభ్యాసము శుభప్రదంబై యుండునని ప్రయోగపారిజాతము చెప్పుచున్నది.

౭౪౯. విద్యారంభ ముహూర్తము.

శ్లో॥ పూర్వాత్రయే మూలమృగాదిపంచకే।
తథాశ్వినీషు త్రితయేచ హస్తాత్।
సవిష్ణుధిష్ణ్యేష్వథసర్వవిద్యా।
ప్రారంభ ఇష్టశ్శుభవాసరేషు ॥ ౫౩౭ ॥

తా॥ అక్షరస్వీకారమైన పిదప నాయక్షరజ్ఞానంబు దృఢమైన పిమ్మట; విద్యారంభమును చేయించవలయును. అందుకు, పుబ్బ, పూర్వాషాఢ, పూర్వాభాద్ర, మూల, మృగశిర, ఆర్ద్ర, పునర్వసు, పుష్యమి, ఆశ్రేష, అశ్విని, హస్త, చిత్ర, స్వాతి, శ్రవణము; వీటిలో సకలవిద్యల నారంభించుటకును శుభదినమున శుభకరంబని వసిష్ఠవచనము.

శ్లో॥ విద్యారంభేగురుశ్శ్రేష్ఠోమధ్యమౌభృగుభాస్కరౌ।
మరణంశనిసోమాభ్యామవిద్యాబుధసోమయోః ॥౫౩౮॥

తా॥ విద్యారంభమునకు గురువారము ప్రశస్తంబు. భానుశుక్రవారంబులు మధ్యమంబులు. శనివారంబును కృష్ణపక్షసోమవారంబును మరణప్రదము. బుధవారము శుక్ల పక్షసోమవారంబును అజ్ఞానప్రదము. అనివారఫలంబు భోజప్రోక్తముగా నున్నది.

## ౨౫౦. విద్యారంభమున గ్రహబలము.

శ్లో॥ శుభాఃపాపాశ్చరంధ్రస్థాస్సర్వేనేష్టాస్సదాగ్రహాః ।
భ్రాతృషష్ఠాయకర్మస్థాఃపాపాస్సర్వేశుభావహాః॥ ౫౩౯
శుభాఃకేంద్రత్రికోణస్థాధనభ్రాతృగతాశ్శుభాః ।
సర్వేలాభేప్రశస్తాస్స్యురక్షరగ్రహణేశిశోః ॥ ౫౪౦ ॥

తా॥ విద్యారంభకాలమున లగ్నమునకు ౮-లో నేగ్రహమును శుభుడు కాడు. ౩-౬-౧౦-౧౧-లో పాపగ్రహములుండిన వారుశుభప్రదులు. ౧-౪-౭-౧౦ ౫-౯-లో శుభగ్రహంబులుండినవారు శుభకరులు. ౧౧-లో నుండెడు ఏగ్రహంబైనను శుభఫలదాయకుండగునని నృసింహవచనములు.

## ౨౫౧. అంకురార్పణ ముహూర్త విచారము.

శ్లో॥ ఆధానంగర్భసంస్కారంజాతకర్మచనామచ ।
హిత్వాన్యత్రవిధాతవ్యంమంగళాంకుర వాపనం ॥౫౪౧॥
ప్రదోషకాలేకుర్వీతపూర్వాహ్ణేవాన రాత్రిషు ।
వాస్తుకర్మణికార్యేచస్యాద్దివైవాంకురార్పణం ॥ ౫౪౨ ॥

౧౮౯. ముహూర్త రత్నావళియందు.

తా॥ గర్భాధానము, పుంసవనము, సీమంతము, జాతకర్మ, నామకరణము:— ఇవితప్పతక్కిన శుభశోభన ప్రస్తుతంబులలో మంగళకరంబుగా నంకురార్పణమును చేయనగును. దానిని రాత్రిచేయరాదు. సాయంతనమున, ప్రొద్దున పూర్వాహ్ణమునచేయనగును. వాస్తుకర్మయందును చేయనగు. పగటి కాలము ప్రశస్తంబని శౌనకవచనము;

౨౪౨. అంకురార్పణ విధానము.

శ్లో॥ కర్తవ్యంమంగళస్యాదౌమంగళాయాంకురార్పణం ।
నవమేసప్తమేవాపి పంచమేదివసేపివా ॥ ౪౮౩ ॥
తృతీయేబీజనక్షత్రే శుభవారే శుభోదయే ।
సమ్యగ్గృహానలంకృత్యవితానధ్వజతోరణైః ॥ ౪౮౮ ॥
ఆశిషోవాచనంకార్యంద్విజైఃపుణ్యాంగనాదిభిః ।
సహవాదిత్రనృత్యాద్యైఃగత్వాప్రాగుత్తరాందిశం ౪౮౪
తత్రమృత్సికతంశ్లక్ష్ణంగృహీత్వాపునరాగతైః ।
మృణ్మయేష్వథవాసమ్యగ్వేణుపాత్రేషుపూరయేత్ ॥

తా॥చాలవివాహోపనయనాది మంగళకార్యంబులలో మొదట౩-౫-౭-౯ దినములకు మునుపు బీజావాపనక్షత్రమునందు శుభతిథివారలగ్నంబులలో, చక్కగామందిరము నలంకరించి తోరణాకదళస్తంబులచే, స్వస్తిపుణ్యాహవాచమును బ్రాహ్మణులతోడ నాచరించి, మంగళవాద్యంబులతోడ తూర్పునకుగాని యుత్తరంబునకుగాని వెడలి, అచ్చట శుద్ధమృత్తికను ఇసుక

నుగ్రహించికొని వచ్చిమట్టిపాత్రలలోగాని వెదురుపాత్రలలోగాని నింపి అనేకబీజసంయుక్తంబుగను తోయపుష్పోపశోభితంబుగను చేసిబ్రాహ్మణ సువాసిన్యాశీర్వాదంబు నందవలయునని నారదవచనంబులు.

## ౨౫౩. అంకురార్పణ ముహూర్తము.

శ్లో॥ హస్తస్వాతీవిరించాసురపితృసురజిన్మిత్రపౌష్ణార్యసార్పే।
పాథోనాథోత్తరాసు క్రియయువతిధనుర్వృశ్చికే కామ
రిక్తే।హిత్వాపర్వాసురేజ్యామరగురుశశివిద్వారలగ్నాం
శకేష్వా। దుప్తస్థే బీజవాపశ్శశినిశుభయుతేచాష్టమే
శుద్ధియుక్తే ॥ ౫౮౭ ॥

తా॥ హస్త, స్వాతి, రోహిణి, మూల, మఖ, శ్రవణము, అనూరాధ, రేవతి, పుష్యమి, ఆశ్లేష, శతతార, ఉత్తర ఉత్తరాషాఢ, ఉత్తరాభాద్ర;—వీట్లిలో, మేషవృశ్చికకన్యా ధనుర్లగ్నంబులలో; ౪-౯-౧౪-౧౩-౧౯-౩౦ తిథులనువదలి, చంద్ర బుధగురుశుక్ర వారంబులలోను మఱితల్లగ్నాంశలలోను, అష్టమశుద్ధిం జూచికొని అంకురార్పణమును చేయనగునని కాశ్యపకాల విధానవచనంబు.

## ౨౫౪. ఉపనయనవయః కాలవిచారము.

శ్లో॥ ఆధానాదష్టమేవర్షేజన్మతోవాగ్రజన్మనాం।
రాజ్ఞామేకాదశేమౌంజీబంధనంద్వాదశేవిశాం ॥౫౮౮॥

౧౮౨ ముహూర్త రత్నావళియందు.

తా॥ గర్భాధానకాలమునుండి ౮-వ యేట బ్రాహ్మణులకును, ౧౧వ యేట క్షత్రియులకును, ౧౨-వ యేట వైశ్యులకు నుపనయన కాలంబు విధ్యుక్తంబని నారదవచనము.

శ్లో॥ బ్రహ్మవర్చసకామస్య కార్యం విప్రస్య పంచమే ।
రాజ్ఞో బలార్థినష్షష్ఠే వైశ్యస్యార్థార్థినోష్టమే ॥ ౫౪౭ ॥

తా॥ బ్రహ్మతేజస్సు నపేక్షించు బ్రాహ్మణునికి ౫-వ సంవత్సరమునను, బలమునుగోరు రాజునకు ౬-వ సంవత్సరమునను, ధనాపేక్షగల వైశ్యునికి ౮-వ సంవత్సరమునను; ఉపనయనము సముచితంబని మనువచనము.

సూత్రం—పంచమే విద్యాకామష్షష్ఠే పుత్రకామస్సప్తమే బ్రహ్మ
వర్చసకామోష్టమే త్వాయుష్కామో నవమే తేజస్కామో
దశమేన్నాద్యకామ ఏకాదశే ఇంద్రియకామో ద్వాద
శే పశుకామస్త్రయోదశే జయకామశ్చతుర్దశే పౌ
రుషకామః పంచదశే పూర్ణకామష్షోడశే రాజ్యకామః॥

తా॥ ౫-వ ఏట విద్యాకాముండు, ౬ పుత్రకాముండు, ౭ బ్రహ్మవర్చస్కాముండు, ౮ ఆయుష్కాముండు, ౯ తేజస్కాముడు, ౧౦ అన్నసుఖకాముడు, ౧౧ ఇంద్రియభోగాపేక్షగలవాడు, ౧౨ పశుకాముండు, ౧౩ జయాపేక్షగలవాడు, ౧౪ పౌరుషకాముండు, ౧౫ పూర్ణకాముండు ౧౬ రాజ్యకాముండునై, బాలునికి ఉపనయనము చేయందగునని ఆపస్తంబముని వచనంబు.

శ్లో॥ ఆషోడశాద్బ్రాహ్మణస్యసావిత్రీనాతివర్తతే ।
ఆద్వావింశాద్బ్రహ్మబంధోరాచతుర్వింశతేర్విశః॥౫౧॥

తా॥ ౧౬ సంవత్సరములవరకు బ్రాహ్మణుని, ౨౨ వరకుక్షత్రియునిని, ౨౪ వరకు వైశ్యునిని, సావిత్రీదేవత యుపనయనము చేయుదురానేనభిముఖురాలై వర్ణాశ్రమధర్మ జ్ఞానంబునొసంగుదునే యని ప్రతీక్షించుచుండునని మనువచనము—

౨౫. ఉపనయన కర్తవ్యకాలము.

శ్లో॥ విప్రాణాముపనయనంవసంతసమయే ధరాధినాథానాం।
గ్రీష్మేతౌ శరదివిశాంమాసాస్సాధారణాశ్చమాఘాద్యాః

తా॥ వసంతఋతువులో బ్రాహ్మణులకును, గ్రీష్మర్తువులో క్షత్రియులకును, శరదృతువులో వైశ్యులకును. సామాన్యముగ మాఘాదిపంచకమునందఱికిని ప్రశస్తంబని వసిష్ఠవచనము.

శ్లో॥ మాఘేద్రవిణశీలాఢ్యః ఫాల్గునేచ దృఢవ్రతః ।
చైత్రేభవతిమేధావీవైశాఖే కోవిదోభవేత్ ॥ ౫౩ ॥
జ్యేష్ఠేతుగృహనీతిజ్ఞ ఆషాఢేక్రతుభాగ్భవేత్ ।
మార్గశీర్షేభవేద్భ్రిష్టశ్శేషేదుఃఖమవాప్నుయాత్ ॥

తా॥ ఉపనీతవటు— మాఘమునందు ధనశీలములుగల్గియుండును. ఫాల్గునమునందు దృఢముగావ్రతాచరణములంజేయును. చైత్రమునందు బుద్ధిశాలియగును, వైశాఖంబున పండితుండగును. జ్యేష్ఠమునందు గృహకృత్యని

పుణుండగును. ఆషాఢమ్మునందు యజ్ఞయాగంబులనందును (ఆషాఢము వర్జ్యా మయ్యెనని శంకించవలదు. మిథునాషాఢముగనుండవలె - మతి శుక్ల ౧౩ కిలోపల యనిభావము;) మార్గశిరంబునందు భ్రష్టుండగును. తక్కిన మాసం బులలో దుఃఖించువాఁడగునని చండేశ్వరవచనంబులచే మాసఫలంబుల నె ఱుంగునది.

## ౨౫౬. ఉపనయన నక్షత్రంబులు.

శ్లో॥ ప్రాజాపత్యాదిషడ్భృక్షే భగత్వాష్ట్రాదిషు పంచసు ।
మూలాదిదశకేచైవ సమ్యగుత్రే వ్రత బంధనం ॥ ౫౫౫ ॥

తా॥ భరణీకృత్తికా మఖావిశాఖా జ్యేష్ఠలుతప్ప తక్కినన క్షత్రంబు లు ఉపనయనయోగ్యంబులని సామాన్యవచనంబు చెప్పంబడినది.

శ్లో॥ హస్తత్రయేచశ్రవణత్రయేచ। ధాతుద్వయేత్యుత్తరమైత్రభేషు । పౌష్ణద్వయేచాదితిభద్వయేచ। శస్తం ద్విజా నాంఖలుమౌంజికర్మ ॥ ౫౫౬ ॥

తా॥ ఈవసిష్ఠవచనము ననుసరించియే ౧౬ నక్షత్రంబులు ముఖ్యంబు లని గురువచనముగలదు. అదియేదియనిన;—

శ్లో॥ కృత్తికాభరణీమూలజ్యేష్ఠార్ద్రాసువిశాఖయోః ।
పూర్వాత్రయేచసార్పర్క్షే నకుర్యాదాపనాయనం ॥

తా॥ కృ, భ, మూ, జ్యే, ఆర్ద్రి, విశాఖ, పూఫ, పూషా, పూభా ఆశ్రే, చకారముచే మఖయును; ఈ ౧౧ నక్షత్రంబులు ఉపనయనమునకు తగవనిభావము. తక్కినవి కావచ్చునని గురువసిష్ఠులొప్పి యున్నారు.

### ౫౫౭. శాఖాభేదముచే నక్షత్రనిర్ణయము.

శ్లో॥ మూలేహస్తత్రయేసార్పేశైవపూర్వాత్రయేతథా ।
ఋగ్వేదాధ్యాయినాంకార్యంమేఖలాబంధనంబుధైః ॥
పుష్యేపునర్వసౌపౌష్ణేహస్తేమైత్రేశశాంకభే ।
ధ్రువేషుచప్రశస్తం స్యాద్యజుషాంమౌంజిబంధనం ॥
పుష్యవాసవహస్తాశ్విశివకర్ణోత్తరాత్రయం ।
ప్రశస్తంమేఖలాబంధేవటూనాంసామగాయినాం ॥
మృగమైత్రాశ్వినీహస్తరేవత్యాదితివాసవం ।
అధర్వపాఠినాంశస్తోభగణోఽయంవ్రతార్పణే ॥ ౫౬౧ ॥

తా॥ ఋగ్వేదులలో - మూ - హస్త - చిత్ర - స్వాతి - ఆశ్రే - ఆర్ద్రా - పూఫ - పూషా - పూభా - ఇవియును; యజుర్వేదులలో - పుష్య - పున - రేవ - హస్త - అనూ - మృగ - ధ్రువనక్షత్రములు, ఇవియును; సామవేదులలో - పుష్య - జ్యే - హస్త - అనూ - అశ్వి - ఆర్ద్రా - శ్రవ - ఉఫ - ఉషా - ఉభా - ఇవియును; అధర్వ వేదులలో - మృగ, అనూ - అశ్వి - హస్త - రేవ - పున - జ్యే - ఇవియును; ఉపనయనమునకు ప్రశస్తంబులని శాఖాభేదముంబట్టి నక్షత్రంబులు జ్యోతిర్నిబంధమున చెప్పంబడినవి.

### ౫౫౮. ఉపనయన నక్షత్రంబులకు వేధయుండరాదు.

శ్లో॥ కర్ణవేధేవివాహేచవ్రతేపుంసవనేతథా ।
ప్రాశనేచాద్యచూడాయాంవిద్ధమృక్షంపరిత్యజేత్ ॥

తా॥ చెవులుకుట్టునపుడు, పెండ్లిలో, ఉపనయనమునందు, పుంసవనమున, అన్నప్రాశనమున, చౌలమునందును; పాపగ్రహవేధగల్గిన నక్షత్రంబులను విడువవలయును. అనిదీపికావచనము. (ఈవేధ-పంచాంగములలో కువే - శవే - రావే - కేవే - యనివేయబడుచుండును. ఇది పంచశలాకావేధయనియును సప్తశలాకావేధయనియును రెండుతెరంగులుగానుండును. అందువివాహమునకు పంచశలాకావేధ పనికిరాదు. తక్కినవాటికి సప్తశలాకావేధతగదని వసిష్ఠవచనముగలదు.)

౨౫౯. పంచశలాకావేధాచక్రము.

శ్లో॥ తిర్యగూర్ధ్వగతా రేఖాః పంచసంఖ్యా లిఖేద్బుధః ।
కృత్తికాదీనిభాన్యత్ర సాభిజిత్క్రమేణచ ॥ ౨౬౩ ॥

తా॥ నిడుపుగానడ్డముగాను ఏడేసిగీతలను వ్రాయునది, వాటిమొనలలో కృత్తికాదిగా వరుసగా నభిజిత్తునుకలిపి ౨౮ నక్షత్రములను వ్రాయునది. అందులో నిత్యచంద్రనక్షత్రమునకు సమరేఖలో పాపగ్రహముండెడు నక్షత్రము చేరియుండరాదు. అట్లు చేరియుండినచో నానిత్యనక్షత్రము వేధగల్గినదని యర్థము.

౨౬౦. పాపగ్రహాక్రాంతలత్తలును పనికిరావు.

శ్లో॥ నిహితంత్రివిధోత్పాతైః, క్రూరాక్రాంతంచ విద్ధభంత్వఖిలం। త్యాజ్యంతచ్ఛుభకర్మణి, నపాదతః పాతధిష్ణ్యంచ॥

తా॥ మూడుతెఱంగు లగునుత్పాతంబులు గలసినదియును, క్రూరగ్రహములుండెడు నక్షత్రంబును, పాపవిద్ధయగు నక్షత్రంబును, పాపగ్రహ

పాదతాడితంబనిన లత్తానక్షత్రంబును శుభకర్మలలో త్యాజ్యంబులై యుం డునని వసిష్ఠవచనము.

### ౨౬౧. ఉపనయన యోగ్యవారంబులు.

శ్లో॥ ఆచార్య కావ్యసౌమ్యానాంవారాశ్శస్తాశ్శశీనయోః ।
వారౌతౌమధ్యఫలదౌనింది తావితరౌవ్రతే ॥ ౬౮ ॥

తా॥ ఉపనయనమున బుధ గురుశుక్రవారంబులు ప్రశస్తంబులు, భా నుసోమవారంబులు మధ్యమంబులు, కుజశనివారంబులు నింద్యంబులని నారద వచనము.

### ౨౬౨. శాఖాధిప వారాదిప్రాశస్త్యము.

శ్లో॥ శాఖాధిపతివారశ్చ శాఖాధిపబలంశిశోః ।
శాఖాధిపతిలగ్నంచ త్రితయం దుర్లభంవ్రతే ॥ ౫౬ ॥

తా॥ ఎవరు ఏవేదశాఖవారో ఆవేదాధీశగ్రహవారంబును ఆగ్రహ బలంబును ఆగ్రహాధిపత్యలగ్నంబును వారికి దుర్లభంబనిన ప్రశస్తంబని భావము. కావున సామవేదులకు తచ్ఛాఖాధీశ మంగళవారాదులు మంగల ప్రదంబని యెఱుంగనగును. (౨౬౯లో చూడుడు.)

### ౨౬౩. ఉపనయనతిథిఫలంబులు.

శ్లో॥ ప్రతిపదిమదిరాసక్తశ్రుతిధరమేధాధికోద్వితీయాయాం।
నీతిజ్ఞోమేధావీజితసకలారి స్తృతీయాయాం ॥ ౭౬ ॥

మందధీర్యాపహృతచిత్తోఽధీతశ్చపలశ్చతుర్థ్యాంస్యాత్ ।
పంచమ్యాంబహువిత్తః పూర్ణాయుర్ధన పతిర్మతిమాన్ ॥
షష్ఠ్యామశుచి స్సతతంస ప్తమ్యాంవ్యాధినంత ప్తః ।
అల్పాయు రథాష్టమ్యాంనవమ్యాంధనవర్జితస్సదాపురుషః ॥
దశమ్యామ ర్థసంపత్తి రేకాదశ్యాంగుణాన్వితః ।
ద్వాదశ్యాంనీ తిశాస్త్రజ్ఞోనిధనాయత్రయోదశీ ॥౫౯॥
చతుర్దశ్యాంభ వేన్నాశః పంచదశ్యాంక్షయోభవేత్ ।
అమావాస్యాంపరమభ్రష్టఃకృతేమౌంజీవ్రతేసతి ॥ ౬౦ ॥

తా॥ ఉపనయన సమయమునందలి తిథిఫలంబులు వరుసగా నిట్లు బాదరాయణ వచనంబులచే తెలియవచ్చుచున్నయవి— ౧ మద్యపాయియగును. ౨ విన్నదానిని ధారణచేయునట్టి బుద్ధిశాలియగును. ౩ నీతిమంతుడును మతిమంతుడునై పగతులను గెల్చువాడునగును. ౪ చపలుండును నీచసహవాసముగల్గి మందబుద్ధి యునగును. ౫ ధనసుఖము గలవాడై బుద్ధిశాలియునగును ౬ దురాచారుండగును. ౭ ఎల్లప్పుడును రోగిగానుండును. ౮ అల్పాయుస్సుగల వాడగును. ౯ నిర్ధనుండగును. ౧౦ ధనికుండగును. ౧౧ గుణవంతుడగును. ౧౨ నీతిశాస్త్రవేత్తయగును. ౧౩ మరణముగల్గును. ౧౪ నాశమగును. ౧౫ క్షయముగల్గును. ౩౦ నాడుపరమభ్రష్టుండగునని భావము తిథిఫలముగానున్నది.

## ౨౬౪. గళగ్రహాతిథులు.

శ్లో॥ కృష్ణపక్షే చతుర్థీతిస ప్తమ్యాదిదినత్రయం ।
చతుర్దశీ చతుష్కంచ అష్టావేతే గలగ్రహాః ॥ ౫౭౨ ॥

తా॥ కృష్ణపక్షమున ౪-౭-౮-౯-౧౪-౧౫-౧- ౩౦ ఇవిగళగ్రహాతిథులని యెఱుంగనగును. కృష్ణపక్షమునందు చవితికిమాత్రే మన్వయము. వీట్లలో నుపనయనంబుతగదని వసిష్ఠవచనము.

## ౨౬౫. ఉపనయన దినసమయము.

శ్లో॥ సర్వదేశేషుపూర్వాహ్ణేముఖ్యంస్యాదుపనాయనం ।
మధ్యాహ్నేమధ్యమంప్రోక్తమపరాహ్ణేంతుగర్హితం ॥

తా॥ పగలు ౧౦ గడియలకులోపుగా నుపనయనమునకు ముఖ్యకాలము. ౨౦ గడియలవరకును సామాన్యము. పిదప సాయంకాలము వరకు నింద్యమని మనువచనము,

## ౨౬౬. ఉనయన లగ్నఫలవిచారము.

శ్లో॥ మేషేభవతివాక్కుంఠోవిత్తవిద్యాయుతోవృషే ।
యుగ్మేవేదాంతదర్శీస్యాత్కుళీరేచషడంగవిత్ ॥ ౫౭౪ ॥
వటుశ్శిల్పకరస్సింహేమ స్త్రీభవతిపండితః ।
తులాయాంవణిజప్రాప్తిః కాండపృష్ఠశ్చవృశ్చికే ॥ ౫౭౫ ॥
సర్వత్రపూజితశ్చాపేశూద్రవృత్తిర్మృగేతథా ।
రాజప్రేష్యోభవేత్కుంభేమీనేవేదాంతపారగః ॥ ౫౭౬ ॥

శ్లో॥ లగ్నాయసౌమ్యగ్రహ రాశయోయే ।
గ్రాహ్యానపాపగ్రహరాశయోయే ॥
గ్రాహ్యాశ్చ తేపి ప్రబలైశ్చ సౌమ్యై ।
రధిష్ఠితాశ్చాపి నిరీక్షితావా ॥ ౫౭౭ ॥

తా॥ ఉపనయనలగ్నము మేషమైతే వటువు మాటాడచాలని వాడగును. వృషభమయితే విద్యాధనంబులు గల్గియుండును. మిథునమయితే వేదాంతశాస్త్రము నెఱుంగును. కర్కాటకమయితే షట్ఛాస్త్ర వేత్తయగును. సింహమయిన చో శిల్పవిదుండగును. కన్యయైనచో పండితుండగును. తులయైన చో వర్తకుండగును. వృశ్చికమయినచో శస్త్రజీవియగును. ధనుస్సయినచో నంతటపూజింపబడును. మకరమయినచో శూద్రవృత్తినందును. కుంభమయినచో రాజవాల్లభ్యమునందును. మీనమైనచో వేదాంతపారంగతుండగును. (ఇచ్చటఉక్తమాసంబులలో పగటిలోనుక్తకాలంబున నన్నిలగ్నములు నుఘటిల్లవే, వసిష్ఠులవారీ ఫలంబుల నేలచెప్పిరని శంకింపవలదు. ఎందుకనిన, గతిలేనిదిక్కుమాలిన వటువునెవరో ఎచ్చటనోఉపనీతునించేయు సందర్భంబులు పొసగును. మఱియును, ఏలగ్నమయినను, తన్నవాంశలకు నీఫలంబులనూహింపవలయునని భావము. కావుననే) సామాన్యముగా శుభగ్రహరాసులేగ్రాహ్యంబులు. పాపగ్రహరాసులు అగ్రాహ్యంబులు. ఆపాపగ్రహరాసులుగూడ ప్రబలులైన శుభగ్రహములచే యుక్తంబులై యున్నను దృష్టంబులైయున్నను పరిగ్రాహ్యంబులుగానుండును. అని వసిష్ఠవచనంబులు.

౨౬౬. ఉపనయన లగ్న గ్రహ బలవిచారము.

శ్లో॥ త్రిషడాయగతైః పాపైః షడష్టాంత్యవివర్జితైః ।
శుభైః షష్ఠాష్టలగ్నాంత్యవర్జితేనహిమాంశునా ॥ ౫౭ ॥

తా॥ 3-౬-౧౧లో పాపగ్రహములుండవలయును, ౬-౮-౧౨ లో శుభగ్రహములుండరాదు. ౬-౮-౧-౧౨లో చంద్రుడుండరాదు. అని నారదవచనము.

శ్లో॥ చంద్రక్రూరాస్తనానేష్టాః సర్వేరంధ్రేవ్యయేకవిః ।
సితేందులగ్నపాష్షష్ఠేవటోః ప్రాణాపహారకాః ॥ ౫౯ ॥

తా॥ లగ్నమున చంద్రుడు మతి క్రూరగ్రహములు; ౮లో ఏగ్రహమైనను; ౧౨లో శుక్రుడు, ౬లో శుక్రచంద్రలగ్నాధిపతులు; ఉండినచో వటువుకు ప్రాణహానియని యొకవచనమున్నదిగాని యిదియంతగా ముఖ్యమనంబడదు. ఎందువల్లననిన దీనిలోనికొన్నిటికి విరుద్ధప్రబల ప్రసిద్ధవచనంబులుగలవు చూడుడు —

శ్లో॥ సర్వత్ర శుభదశ్శుక్రష్షష్ఠ సప్తాష్టమంవినా = ౬-౭-౮ తప్పతక్కినచోట్లలో నంతట శుక్రుండు శుభఫల ప్రదుండని కశ్యపవచనముగలదు గావున ౧౨లో శుక్రుడు చెడుఫలమునిచ్చునను పైవచనమునకు విరోధముగల్గినది.

శ్లో॥ ద్వాదశస్థం రవింభౌమః పశ్యన్నాచార్యనేత్రహా ।
బలినంబలవాన్నూనమచిరాన్నాత్రసంశయః ॥ ౬౦ ॥

సర్వేగ్రహాశ్చాష్టమగానిధనాధనశోకదాః ।
వినాస్వతుంగస్వక్షేత్రాధిమిత్రగాశ్శుభవర్గగాః ॥ ౫౮౧ ॥
ఆచార్యమశుభాఘ్నంతిశిష్యంఘ్నంత్యశుభేతరాః ।

తా॥ ౧౨లోనుండురవిని కుజుడుచూచుచుండెనా బ్రహ్మోపదేశకునికి కండ్లుగ్రుడ్డియగును ఆగ్రహములు బలిష్ఠులుగానుండినచో నిందుకుసందేహమేలేదు. అన్నిగ్రహంబులును ౮లో మృతిదారిద్ర్య శోకంబులనిచ్చెదరు. మఱివారు తమయుచ్చ స్వక్షేత్ర మిత్రక్షేత్రగతు లనబడినచో కొంత మేలు. అట్లు లేకున్న పాపగ్రహములు ఉపదేశముచేసినవానిని, శుభగ్రహములు వటువును నాశముజేయుదురని వసిష్ఠవచనము.

## ౨౯౭. చంద్రలగ్న శుభయోగబలము.

శ్లో॥ చంద్రాత్ స్మరారిరంధ్రేషుయద్యే కస్మిన్ శుభగ్రహే ।
స్థితేధియోగేసంజ్ఞాస్యాచ్ఛుభయోగోద్విజన్మనాం ॥౫౮౨
కేంద్రత్రికోణగే జీవేభానుశ్శుక్రోథవావ్యయే ।
ద్వితీయేజ్ఞేశుభేయోగే ద్విజానాముపనాయనం ॥౫౮౩॥

తా॥ చంద్రునికి ౭-౬-౮ స్థానంబులలో నేదైన నొకచోటిలో శుభగ్రహమున్నయెడ నది అధియోగంబనంబడును. ద్విజులకిది మిక్కిలి శుభప్రదము. మఱియు చంద్రకేంద్రంబులలోగాని త్రికోణంబులలోగాని గురుడును, ౧౨ లో రవిగాని శుక్రుడుగాని యుండినను, ౨ లో బుధుడును, ఉండుట, ద్విజుల యుపనయనంబున శుభయోగంబనబడును. కావున

చంద్రునింబట్టి యిట్టి శుభగ్రహసంస్థను ముహూర్తసమయమునందు ఏర్ప రచికొనుట ముఖ్యంబు. అని వసిష్ఠవచనములు.

౨౧౮. లగ్నచంద్ర విశేషఫలము.

శ్లో॥ వర్ధమానోపివాచంద్రః పూర్ణోవాయదితుంగగః ।
నిస్స్వంకరోతివ్రతినం లగ్నగఃక్షయరోగిణం ॥ ౫౮౪ ॥

తా॥ లగ్నమునందుండు చంద్రుడు వృద్ధిచంద్రుడైనను, పూర్ణచంద్రుడైనను, ఉచ్చగతుండైననుసరియె ఉపనీతవటువును దరిద్రునిగాను క్షయరోగినిగాను చేయును. కావున నుపనయన లగ్నమున చంద్రుండు తగడని కశ్యపవచనము.

౨౧౯. వేదశాఖాధీశులు, తత్ఫలంబును.

శ్లో॥ ఋగ్యజుస్సామశాఖేశాగురుశుక్రధరాత్మజాః ।
అధర్వణస్య వేదస్య శాఖేశశ్చంద్రనందనః ॥ ౫౮౫ ॥

తా॥ ఋగ్వేదమునకు గురుండు, యజుర్వేదమునకు శుక్రుండు, సామవేదమునకుకుజుండు, అధర్వణ వేదమునకు బుధుండు; శాఖాధీశులనం బడెదరని వసిష్ఠవచనము.

౨౨౦. గురుశుక్ర శాఖాధీశుల బలానుసారముఫలము.

శ్లో॥ స్వోచ్చసంస్థేతదంశేవాస్వరాశౌవా తదంశకే ।
శాఖేశేవాగురౌశుక్రే వేదవేదాంగపారగః ॥ ౫౮౬ ॥

పరమోచ్చగతే జీవే శాఖేశేవాథవాసితే ।
ప్రతీశిశుర్ధనాఢ్యస్స్యాద్వేదవేదాంగపారగః ॥ ౫౮ ॥
మిత్రరాశిగతేజీవే తదంశేవాస్వశాఖపే ।
శుక్రేవాచార్యసంయుక్తేతదాతత్రప్రతీశిశుః ॥ ౫౯ ॥
స్వాధిమిత్రగృహస్థేవాతస్యోచ్చస్థేతదంశకే ।
గురౌభృగుర్వాశాఖేశే విద్యాధనసమన్వితః ॥ ౬౦ ॥

తా॥ శాఖాధీశగ్రహముగాని, గురుడుగాని, శుక్రుండుగాని - వారి వారి యుచ్చరాసులలో నున్నను ఉచ్చాంశలలోనున్నను, స్వక్షేత్రముల యందున్నను, స్వాంశలలోనున్నను, అట్టికాలమున నుపనీతుడైనవటువు వేదములను వేదాంగంబులను తెలిసినవాఁడగును. మఱియు, గురుడుగాని శుక్రుడుగాని శాఖాధిపతిగాని పరమోచ్చభాగలలో నున్నయెడల నావటువు వేదవేదాంగంబుల నెఱింగి ధనవంతుండునగును. వీరు ఇష్టమిత్రక్షేత్రమునందినను స్వాధిమిత్ర క్షేత్రమునందినను విద్యా ధన సమన్వితుండగును అనగా శాఖాధిపతి గురుడు శుక్రుడు వీరుముగ్గురును బలిష్ఠులగుట వటువుకు శ్రేయస్కరము. దుర్బలులగుట నీచఫలదంబు. అని నారదవచనంబులు.

౨౭౧. గ్రహబలములలో విశేషము.

శ్లో॥ పితుస్సూర్యబలం శ్రేష్ఠం శాఖావర్ణేశయోర్వటోః ।
సర్వేషాంగురుచంద్రార్కబలంశ్రేష్ఠంవ్రతాదిషు॥౬౧॥

తా॥ తండ్రికి సూర్యబలంబును, వటువుకు శాఖేశవర్ణే శబలంబును అందరికినిగురుచంద్ర సూర్యబలంబులునుముఖ్యంబనిరాజమార్తండవచనము.

## ౨౭౨. బ్రహ్మక్షత్ర వైశ్యులకుగ్రహబలము.

శ్లో॥ విప్రాణాంగురుసితయో।
రాజ్ఞాంరవిభౌమయోర్బలం శస్తం।
ఇందోర్వైశ్యానాంరవీందు।
త్రిదశేజ్యబలేఖిలానాంతు ॥ ౫౯౧ ॥

తా॥ బ్రాహ్మణులకు గురు శుక్రబలంబులును, క్షత్రియులకు రవికుజబలంబులును, వైశ్యులకు చంద్రబలంబును, అందఱికిని రవిచంద్ర గురు బలంబులు ప్రశస్తంబయినవి. అని భీమపరాక్రమ వచనము.

## ౨౭౩. శాఖేశాదులకు అస్తదోషముతగదు.

శ్లో॥ శాఖేశగురుశుక్రాణాంమౌఢ్యే బాల్యేచవార్ధకే।
నైవోపనయనంకార్యం వర్ణేశేదుర్బలేసతి ॥ ౫౯౨ ॥

తా॥ శాఖాధిపతి, వర్ణాధిపతి, గురుడు, శుక్రుడు:—వీరలలో నెవండైనను అస్తంగతుడైయున్నను బాల్యవార్ధక దోషంగతుడైయున్నను ఉపనయనము తగదని వసిష్ఠవచనము.

## ౨౭౪. జ్యేష్ఠపుత్రునికి జన్మమాసాదులు తగవు.

శ్లో॥ నజన్మమాసే జన్మర్షే నజన్మదివసేపివా।
ఆద్యగర్భసుతస్యాథదుహితుర్వాకరగ్రహః ॥

తా॥ ప్రథమగర్భమున పుట్టిన చిన్నవానికి వాడుపుట్టిన నెలలోను నక్షత్రమునను జన్మదినమునను (మఱియు తల్లగ్నమునను) ఉపనయము తగదు. తొలియాడబిడ్డకు పెండ్లియును తగదని నారదవచనము.

౨౭౫. అబ్దబలము గురుబలము కన్న సుముఖ్యము.

శ్లో॥ ఉక్తేపివర్షేనబలీగురుశ్చేచ్ఛాంత్యాప్రశస్తం వ్రతబంధ
కర్మ । అనుక్తవర్షేపిబలప్రదోపి నైవంతయోరబ్దబలం
బలీయః ॥ ౫౯౪ ॥

తా॥ గర్భాష్టమాద్యుక్త సంవత్సరమున నుపనయము ప్రశస్తము. అపుడు గురుబలము లేకపోయినను తచ్ఛాంతింజేసిన మేలగును. అనుక్తకాలమున గురుబలమున్నను ప్రశస్తము కాదు. కావున గురుబల కాలబలంబులలో నబ్దబలమే ప్రబలంబని వసిష్ఠవచనము.

౨౭౬. గోచారబలముకన్నను అష్టకవర్గ విశుద్ధిముఖ్యము.

శ్లో॥ అష్టవర్గవిశుద్ధేషుగురుశీతాంశుభానుషు ।
వ్రతోద్వాహౌచకర్తవ్యౌగోచరేణకదాపిన ॥ ౫౯౫ ॥

తా॥ అష్టకవర్గ వేసి, దానిలో రవి చంద్రగురువులు శుద్ధులుగానుండు కాలమున నుపనయన వివాహాదులు ప్రశస్తంబుగానుండునుగాని, సామాన్య గోచరబలము తగదని రాజమార్తాండవచనము.

౨౭౭. ఉపనయనమునందు వర్జ్యతిథ్యాదులు.

శ్లో॥ వ్రతేహ్నిపూర్వసంధ్యాయాంవారిదోయదిగర్జతి ।
తద్దినంస్యాదనధ్యాయంవ్రతంతత్రవివర్జయేత్ ॥ ౫౯౬ ॥

తా॥ ఉపనయన దినమున ప్రొద్దున మేఘముగర్జించిన యెడల నాదినంబు అనధ్యాయంబబనడును. కాడును; కృష్ణపక్షమునందలి చవితియును, రెండుపక్షములలోను ౭-౮-౯, ౧౩-౧౨-౧౪-౧౫-౧ (౩౦) యను చేరి ౮ దినంబులుగళ్ గ్రహంబులనబడును; అగళ్గ్రహ దినములనాడును; ఉపనయనము తగదని వసిష్ఠవచనము.

౫౭౮. ఉపనయనలగ్నమునందురవ్యాద్యంశఫలము.

శ్లో॥ క్రూరోజడోభవేత్పాపోవటుష్షట్కర్మకృత్పటుః ।
యజ్ఞార్థభాక్తథామూర్ఖోరవ్యాద్యంశేతనా క్రమాత్ ॥

తా॥ ఉపనయన లగ్నమున వటుఁడు ఉపనీతుఁడైనపుడు రవియంశగానున్న క్రూరుండగును; చంద్రాంశగానున్న జడుఁడగును; కుజాంశగానున్న పాపియగును; బుధాంశగానున్న నేర్పరియగును; గుర్వంశగానున్న; షట్కర్మవేత్తయగును; శుక్రాంశగానున్న యజ్ఞధనమునందును; శన్యంశగానున్న మూర్ఖుండగును; కావున లగ్నమును బుధ గురు శుక్రాంశలలో ననగా వృషభమిధున కన్యాతులాధనుర్మీనాంశలలో పెట్టవలయునని భావము, అని చింతామణివచనము.

౨౭౯. రవ్యాద్యంశలలోనున్నచంద్రునిఫలములు.

శ్లో॥ సూర్యాంశకగతే చంద్రేమహాపాతకకృద్వ్రతీ ।
పణ్యోపసేవీస్వాంశస్థేనీచేనిస్వోఽఖిలోభవేత్ ॥౪౯౮॥
కుజాంశకగతేచంద్రేశస్త్రజీవీఖిలోవ్రతీ ।
బుధాంశకగతేచంద్రేవేదవేదీభవేద్వటుః ॥౫౯౯॥

జీవాంశకగతేయజ్వాసాంగవేద విశారదః ।
శుక్రాంశగేధనీదాతా విద్యావిత్తవిశారదః ॥ ౬౦౦ ॥
క్షిప్రోద్వాహోయజ్ఞకృత్స్యాత్స త్రదోభోగవాన్భవే
త్। సౌరాంశకగతేచంద్రేసదాచాండాలసేవకః॥౬౦౧॥

తా॥ ఉపనయకాలమున, చంద్రుడు సింహాంశలోనుండిన వటువు మహాపాపియగును; కర్కాటకాంశలోనున్న క్రయవిక్రయ జీవియగును; మేషవృశ్చికాంశలలోనున్న శస్త్రజీవియగును; మిథునకన్యాంశలలోనున్న వేదవేత్తయగును; ధనుర్మీనాంశలలోనున్న సాంగవేదవిదుడై యాజకుండగును; వృషతులాంశలలోనున్న త్వరగా పెండ్లియగును, యజ్ఞముంజేయును, సత్రమువేయించును, సుఖవంతుఁడు నగును; మఱియు ధనవంతుడగును, దాతనైయుండును; మకరకుంభాంశలలోనున్న సంతతము చండాలసేవకుండైయుండును. అని వసిష్ఠవచనంబులు గావున చంద్రునిశుభాంశ నెఱింగి యుపనయనముహూర్తము నేర్పరుప వలయును.

శ్లో॥ శ్రవణాదితి నక్షత్రేకర్కాటం శస్థేనిశాకరే।
తదాప్రవతీవేదశాస్త్రధనధాన్యసమృద్ధిమాన్ ॥ ౬౦౨ ॥

తా॥ (పైవచనంబులలో స్వాంశాపవాదముగా నారదవచనము.) శ్రవణ నక్షత్రము ౪ వ పాదమునగాని, పునర్వసు ౪ వ పాదమున గాని చంద్రుడున్న, నదికర్కాటక స్వాంశయగును అప్పుడు మాత్రము దోషములేదు. వటువు ధనధాన్యవేదశాస్త్రి సంపన్నుండగును.

## ౨౭౦. కేంద్రంబులలో పాపగ్రహ నిషేధములు.

శ్లో॥ స్ఫూర్జితం కేంద్రగే భానౌ వ్రతినో వంశనాశనం।
కూజితం కేంద్రగే భౌమే శిష్యాచార్యవినాశనం॥ ౬౦౩॥
కరోతి రుదితం కేంద్రే సంస్థే మందే మహాగదం।
లగ్నకేంద్రగతే రాహౌ రంధ్రే మాతృవినాశనం॥ ౬౦౪॥
ఉగ్రం కేంద్రగతే కేతౌ వ్రతివిత్తవినాశనం।
సర్వశాఖాధిపం భానుం కేచిదాహుర్మహర్షయః॥ ౬౦౫॥
తస్మాద్గత్యంతరాభావే కేంద్రస్థోర్కః ప్రశస్యతే।
జ్ఞేజ్యశుక్రాస్తు కేంద్రస్థా జ్ఞానవిద్యార్థదాయకాః॥ ౬౦౬

తా॥ ఉపనయకాలమున కేంద్రములలోనన గా ౧-౪-౭-౧౦ ఇం డ్లలో రవియుండిన స్ఫూర్జితంబను దోషము, దీనిచే వటువుకు వంశనాశన ము. కుజుడున్నచో కూజితమను దోషము, దీనిచే వటువుకును మంత్రోప దేశకునకును హాని. శనియున్నచో రుదితమను దోషము, దీనిచే మహావ్యాధిగ ల్గును. కేంద్రములే గాక ౮ లోగూడ రాహువున్నయెడల తల్లికిహాని. కేతు వున్నచో ఉగ్రమనుదోషము, వటువుకు దారిద్ర్యమునిచ్చును. అయితే త్రయీమూర్తియగు సూర్యుని, సర్వశాఖలకును అధిపతినిగా మహాముని లెంచినందున గత్యంతరాభావమున కేంద్రగతరవి ప్రశస్తుండగునుగాని తక్కినవారు తగరు. కేంద్రంబులలోనుండు బుధ గురు శుక్రులు జ్ఞానము ను విద్యను ద్రవ్యమును ఇచ్చువారలై యుందురు.

౪౮౧. గుణాధిక్యము గ్రాహ్యము.

శ్లో॥ లగ్నంసర్వగుణోపేతంలభ్యతేపర్గినైర్నతత్ ।
దోషాల్పత్వంగుణాధిక్యంబహుసంమతమిష్యతే ॥

తా॥ (ఏకవింశన్మహాదోష వర్జితసుముహూర్తము సంభవించనిచో నేమిచేయవగుననిన నారదవచనమిట్లున్నది.) సమస్తగుణంబులు నమరినలగ్నముదొరకకపోయిన, గుణాధిక్యంబును దోషములుకొద్ది గాగలదియును అగు లగ్నము బహుసమ్మతంబుగా గ్రాహ్యంబైయుండును.

౪౮౨. దోషమునకు దుష్టత్వము ప్రబలము.

శ్లో॥ దోషోప్యేకోగుణాన్హంతి తద్విరోధీగుణోనచేత్ ।
పంచగవ్యమయంపూర్ణకుంభంమద్యలవోయథా ॥

తా॥ ఒక్కదోషమున్నను అనేకగుణంబులను చెరుచును. కావున తద్దోషపరిహారకంబైన గుణంబును సంపాదించికొనుట మేలు. ఎట్లనగా. పంచగవ్యపూర్ణకుంభమును మద్యముచుక్క చెరచదా? యనివసిష్ఠవచనము.

౪౮౩. ఉపనయనమున మాతృరజోదోషము.

శ్లో॥ వివాహవ్రతచూడాసు యదిమాతారజస్వలా ।
తదానతత్ప్రకర్తవ్యమాయుఃక్షయకరంయతః ॥

తా॥ పెండ్లి, వడుగు, చౌలము, వీట్లలో తల్లిరజస్వలయైనచో నప్పుడు నాకార్యముచేయకూడదు. ఎందువల్లననిన నప్పుడు కార్యముజరిపితే ఆయుస్సుక్షయించును. అనివృద్ధమనువచనము.

శ్లో॥ వైధవ్యంచవివాహేస్యా జ్జడత్వంవ్రతబంధనే ।
చూడాయాంచ శిశోర్మృత్యుర్విఘ్నం యాత్రాప్రవేశయోః ॥

తా॥ పెండ్లిలోనముట్టుదోషము వైధవ్యమునిచ్చును; వడుగులోమాఢ్యమునిచ్చును; చౌలములోబాలకునికిమృత్యువు; ప్రయాణమునను గృహప్రవేశంబునను విఘ్నప్రదంబైనదైయుండును.

౨౮౪. అట్టిసమయమునముహూర్తము దొరకనిచోకర్తవ్యము.

శ్లో॥ అలాభేసుముహూర్తస్యరజోదోషేహ్యుపస్థితే ।
శ్రియంసంపూజ్య విధివత్తతోమంగళమాచరేత్ ॥
హైమీంమాషమితాంపద్మాం శ్రీసూక్తవిధినార్చయేత్
ప్రత్యృచంపాయసంహుత్వాభిషిచ్యహితమాచరేత్ ।
ఉపవాసేనశుద్ధ్యంతినార్యస్సద్యోరజస్వలాః ।
ఏకాకిన్యోవివాహాదౌ దేశభంగేషుచాపది ॥ ౬౧౩ ॥

తా॥ సుముహూర్తమును పెట్టుకొని యార్థికముగానప్పుడు రజోదోషము సంభవించినచో; అదియాపత్కాలముగానుండినయెడల, మఱిపేరొకసుముహూర్తముదొరకని చోనప్పుడురజస్వలలైననారులు ఉపవాసముచేతశుద్ధురాండ్రయిరనుకొని; లక్ష్మీదేవినిపూజించి ఆసుముహూర్తముననే నెరవేర్పవచ్చును. ఆశాంతిక్రమమెట్టులనిన — మినపగింజంతబంగారుతో

శ్రీదేవీప్రతిమను శ్రీసూక్తవిధిచేపూజించి ప్రతిబుధవారమున పాయసహోమము చేసి, కలశోదకముచేనభిషేకించి మంగళకార్యముల నాచరింపనగును. అనివాక్యసారవచనములు.

## ౨౮౫. ఛురికాబంధనముహూర్తము.

శ్లో॥ ఛురికాబంధనంవక్ష్యే నృపాణాంప్రాక్కరగ్రహాత్ ।
వివాహోక్తేషుమాసేషుశుక్లపక్షేప్యనస్తగే ॥ ౬౧౪ ॥
జీవశుక్రేచభూపుత్రే చంద్రతారాబలాన్వితే ।
మౌంజీబంధనభుక్షేషుభౌమవర్జితవాసరే ॥ ౬౧౫ ॥
వ్రతలగ్నోదయేకర్తురష్టమోదయవర్జితే ।
ధనత్రికోణగైస్సౌమ్యైఃపాపైర్భవరిపుత్రిగైః ॥ ౬౧౬ ॥
అర్చయేచ్ఛురికాంసద్మదేవతానాంచసన్నిధౌ ।
ఛురికాబంధనంకార్యమర్చయిత్వాసురాన్ద్విజాన్ ॥

తా॥ క్షత్రియులకు వివాహమునకు మునుపుకత్తికట్టడమను శుభకర్మయొకటిగలదు. అందుకా, వివాహోక్తమాసములు; శుక్లపక్షము, కుజగురుశుక్రుల స్తంగతులుకాకయుండుట, చంద్రతారాబలము కలిగియుండుట; ఉపనయననక్షత్రము; అంగారకవారముతప్ప తక్కినవారములు; అష్టమశుద్ధి; ఉపనయనమునకు చెప్పినలగ్నశుద్ధి; ౨-౧-౫-౯లో శుభగ్రహములు; ౩-౬-౧౧లోపాపులు; ఇట్టికాలమున కత్తినిపూజించి కులదేవతా సన్నిధానమునందు; దేవబ్రాహ్మణులనుపూజించి నడుమునకుఆకత్తినికట్టవలయును. దీనికిఛురికాబంధనమను శుభకర్మయనిపేరు. అనినారదవచనంబులుగలవు.

## ౨౮౬. సమావర్తనముహూర్తము.

శ్లో॥ విభౌమభానుజేవారేనక్షత్రేచవ్రతోచితే।
చంద్రతారాదిశుద్ధౌ చస్యాత్సమావర్తనక్రియా॥

తా॥ శనిమంగళవారములు తప్పతక్కినవారంబులలోను, చంద్రతారాబలయుక్తదినమునందును ఉపనయనోక్తనక్షత్రంబులలోను, సమావర్తనశుభకర్మను జరుపనగునని. సురేశ్వరవచనము.

## ౨౮౭. మరలవివాహ కాలనిర్ణయము.

శ్లో॥ ప్రమదామృతివాసరాదితః పునరుద్వాహవిధిర్వరస్యచ
విషమేపరివత్సరే భవేద్యుగళంచైనమృతిప్రదంభవేత్॥

తా॥ పత్నీవియోగమైనదినము మొదలు బేసిసంవత్సరమున ననగా ౧-౩-౫ సంవత్సరములలో మరలపెండ్లిచేసికొనందగును, అట్లుగాక సరివత్సరములలో చేసికొనిన మరలమరణమునిచ్చును. అనిసంగ్రహావచనము.

ఇట్లుముహూర్తరత్నావళిలో సంస్కారప్రకరణము ౫వది ముగిసెను.

ప్రథమభాగము సంపూర్ణము. శుభమస్తు



# ముహూర్తరత్నావళిలో.

## ఉత్తర భాగము.

## (౬వ- వివాహప్రకరణము.)



### ౧. వివాహలగ్నశుద్ధి ప్రాముఖ్యము.

శ్లో॥ అథాతస్సంప్రవక్ష్యామి గృహస్థాశ్రమముత్తమం ।
యఆధారోఽన్యాశ్రమాణాంభూతానాంప్రాణినాంతథా॥
ఋణత్రయచ్ఛేదకారి ధర్మకామార్థసిద్ధిదం ।
ఏతత్సర్వంస్థితంస్త్రీషు శీలవృత్తాన్వితాసుచ ॥ ౨ ॥
తచ్ఛీలవృత్తలబ్ధిస్తు సులగ్నవశతోభవేత్ ।
తస్మాత్సమ్యగ్లగ్నశుద్ధిం ప్రవక్ష్యామ్యానుపూర్వశః ॥ 3 ॥

తా॥ ఇంక గృహస్థాశ్రమంబుత్తమంబని చెప్పబడుచున్నది. ఎందువల్లననిన తక్కిన యాశ్రమంబుల కన్నిటికిని అట్లే సమస్త ప్రాణులకును ఇది యాధారంబైనది. మఱియు దేవఋణ పితృఋణ ఋషిఋణంబులను త్రివిధఋణంబులను నశింపజేయునది. దీనివల్లనే ధర్మంబు కామంబు అర్థంబును సిద్ధించుచున్నది, ఇంతయును స్త్రీలలో నిలచియున్నది. ఆస్త్రీ

లు సుశీలముచేతను సద్వర్తనముచేతను బరగుచుండ నగును. అట్టి శీలవృత్త వతి యగు భార్యాలాభంబన్ననో మంచిలగ్నముచేతనే లభించును. కావున వివాహవిషయమై చక్కగా లగ్నశుద్ధి చెప్పంబడుచున్నది. అని కశ్యపవచనము.

## ౨. వివాహంబులు అష్టవిధంబులు.

శ్లో॥ బ్రాహ్మోవివాహ ఆహూయదీయతే శక్త్యలంకృతా।
తజ్జఃపునాత్యుభయతః పురుషానేకవింశతిం ॥ ౪ ॥
యజ్ఞస్థఋత్విజేదైవ ఆదాయార్షస్తుగోద్వయం।
చతుర్దశప్రథమజః పునాత్యుత్తరజశ్చషట్ ॥ ౫ ॥
ఇత్యుక్త్వాచరతాంధర్మం సహ యాదీయతేఽర్థినే।
సకాయఃపావయేత్తజ్జః షట్ షట్ వంశ్యాన్సహాత్మనా॥
ఆసురోద్రవిణాదానాద్గాంధర్వస్సమయాన్మిథః।
రాక్షసోయుద్ధహరణాత్పైశాచః కన్యకాచ్ఛలాత్ ॥ ౬॥

తా॥ యథాశక్తిగా కన్యక నలంకరించి వరునింబిలిచికొనివచ్చి కన్యాదానముచేసిన నది బ్రాహ్మ వివాహంబు. ఇది వెనుకముందు ౨౧ తరములను తరింపజేయును. యజ్ఞమునందు ఋత్విజున కిచ్చునట్టిది దైవవివాహము. ఇది ౧౪ తరములను తరింపజేయును. రెండావులను తీసికొని కన్యాదానముం జేసిన నది యార్షంబనబడును; ఇది ౬ తరంబుల నుద్ధరించును. ధర్మార్థ కామంబులలో నీసహధర్మిణి నతిక్రమింప వలదని వచ్చిన వరు

నికి కన్యనిచ్చునది ప్రాజాపత్య వివాహంబు. ఇది తనతోడ ముందు వెనుక నారుతరంబుల నుద్ధరించును. డబ్బు తీసికొని యమ్మునది యాసురం బనబడును. కన్యావరులు ఒప్పందము మీద చేసికొనునది గాంధర్వము. యుద్ధమునం దపహరించునది రాక్షస వివాహము. మోసముచే కన్యనపహరించునది పైశాచము పరమనింద్యము. అని యాజ్ఞవల్క్య వచనంబులు.

## ౩. ఉక్తకాలముననే వివాహముకర్తవ్యము

శ్లో॥ ప్రాజాపత్యబ్రాహ్మదైవ వివాహాబుషిసంజ్ఞకాః ।
ఉక్తకాలేషుకర్తవ్యాశ్చత్వారః ఫలదాయకాః ॥ ౮ ॥

తా॥ ప్రాజాపత్యము, బ్రాహ్మము, దైవము, ఆర్షము, అను నీ నాల్గు వివాహంబులును ఉక్తకాలంబులలోనే చేయందగినవి. ఎందువల్లననిననివి ఫలముల నిచ్చునవి. అని నారదవచనము. (ఇచ్చట తక్కిన గాంధర్వాసుర పైశాచ రాక్షసంబులు కాముకారంబులు ఫలకారులు కావనియును వీటికి కాలనిర్బంధము లేదనియును గ్రాహ్యము.)

## ౪. ప్రశ్నలగ్నముచే వివాహయోగము.

శ్లో॥ లగ్నాత్త్రి పంచాస్తదశాయగస్తు ।
హిమద్యుతిజ్ఞవనిరీక్షితశ్చ ॥
తమోస్తుసంబంధకరస్తదానీం ।
నార్యాంశులుప్తో నచనీచగశ్చేత్ ॥ ౯ ॥

తా॥ ఈకన్యక నీ వరునకు చేయవచ్చునాయ్యని దైవజ్ఞుని దగ్గిరికి వచ్చినప్పుడు; తత్కాల లగ్నమునకు 3-౬-౭-౧౦-౧౧ లో నెచ్చటనైనను చంద్రుడుండి గురువుచేత చూడబడి, ఆ చంద్రుడు కృష్ణపక్షాంత్య భాగము వాడు కాకయున్నను, నీచరాశిగతుడు కాకయున్నను, ఆకన్యావరులకు వివాహము పొసగునని భావింప వలసినది. అని వసిష్ఠవచనంబు. (ఇట్లే. ప్రశ్నయోగంబు లెన్నియో గలవుగాని యికాలమున నట్టిదైవజ్ఞ భక్తితో ప్రవర్తించు వారరుదుగాన నావిషయమింతతో వివరింపం బడి యున్నది.)

శ్లో॥ యదిలగ్నగతః క్రూర స్తస్మాత్సప్తమగః కుజః ।
విజ్ఞేయంమరణంపుంసః సప్తమాబ్దాంతరేయది ॥ ౧౦ ॥

తా॥ ప్రశ్నలగ్నమున క్రూరగ్రహముండి, ౭వ యింటిలో నంగారకుడుండిన నాపొంతనము చేసినట్లయితే ౭ ఏండ్లలోగా వరునికి మరణయోగంబని నారదవచనము. (ఇట్లుండగా, పాడితీసి వేసికొనునంత మర్యాదతో జ్యోశ్యుని నడిగెడు వారు, దాక్షిణ్య శ్రాద్ధముగా జెప్పెడు జ్యోశ్యులు; పిదప వారే మంచిలగ్నమున నే ముహూర్తము చేసితిమే, ముండమోసెనని మొత్తుకొనుట; చివరకు జ్యోతిష మబద్ధమని కొందఱు; ఇట్లునోటికి తోచినట్లు మాటలు. కావున;—ఎంతెంత భక్తి శ్రద్ధలతో శాస్త్రము ను పాటింతురో వారికి అంతంత ఫలించును. శాస్త్రమర్యాద తెలియని వారికిం జెప్పుట దుస్తరంబు - అనుసంగతిని సూచించుటకై ఈవిషయము వ్రాయబడె. తెలిసికొను విషయంబులు - పెక్కుగలవు. గ్రంథవిస్తర భీతిచే నింత

తో నిలుపుదము.) వివాహ ప్రశ్నమునందలి వంధ్యామృత పత్న్యాది లక్ష
ణాతంబులను ఇట్లే ఎఱింగెడు సదుపాయంబులు గలవు.

౫. అంగారక దోషవిచారము.

శ్లో॥ ధనేవ్యయేచపాతాలే జామిత్రేచాష్టమేకుజే ।
స్త్రీణాంభర్తృవినాశస్స్యాత్పుంసాంభార్యావినాశనం॥

తా॥ ౨-౧౨-౪-౭-౮ఈ యైదుస్థానంబులలో నంగారకుండుండెడు స్త్రీజాతకమునకు వైధవ్యయోగంబును, పురుషజాతకంబునకు అపత్నీయోగంబును, అగస్త్యసంహితా వచనము చెప్పుచున్నది.

శ్లో॥ లగ్నేవ్యయేచ పాతాలేజామిత్రేచాష్టమేకుజే ।
కన్యాభర్తుర్వినాశాయ భర్తాకన్యావినాశదః ॥ ౧౨ ॥

తా॥ లగ్నమున ౪-౧౨-౭-౮ ఈయైదుస్థానంబులలోను జాతకమున కుజుడున్న నాకన్యకపతి ధ్వంసము చేయుననియును, పతికి అట్లుండిన పత్నిని ధ్వంసము చేయుననియును కేరళీయ వచనంబు.

శ్లో॥ అగ్నిః క్రూరదృగ్వక్రీకుజః పాపఫలప్రదః ॥
స్వాధిష్ఠితంస్వదృష్టంచ భావంనాశయతిధ్రువం ॥ ౧౩ ॥
అర్కేందుక్షేత్రజాతానాంకుజదోషోనవిద్యతే ।
స్వోచ్చమిత్రభజాతానాం పీడకోనభవేత్కుజః ॥ ౧౪ ॥

తా॥ కుజుండు అగ్నిస్వరూపుండును క్రూరదృష్టిగలవాఁడును వక్రుండును రౌద్రుండునగుటచేత పాపఫలము నిచ్చువాఁడు. తాను చేరిన

మఱిదానుచూచిన భావంబును నాశముచేయును. కావున ౭వ ఇల్లు భార్యా కుభర్తృస్థానం బనియును తెలిసి, అందలో కుజుడు లేనట్లును కుజుడు దానిని చూడనట్లును జాతకమున్న నంగారదోషము లేదనియును, అట్లున్న నంగారకదోషము గలదనియును తెలియవలయును. అయ్యంగారకుని యుచ్చక్షేత్రమగు మకరలగ్న జాతకము వారికిని, వాని స్వక్షేత్రములయిన మేషవృశ్చికములలో పుట్టినవారికిని, వాని మిత్రులగు రవిగురు చంద్ర క్షేత్రములనగా కర్కాటకసింహధను మీనలగ్నముల వారికిని కుజదోషము చూడనక్కర లేదనియును సామాన్యవచనంబులు గలవుగాని ; రెండు జాతకంబులలోను అంగారకదోషమును సమానముగా చూచి యాదాంపత్యమును కలుగించుటలో మేలని భావము.

శ్లో॥ దంపత్యోర్జన్మకాలేవ్యయధనహిబుకేస ప్తమేరంధ్రలగ్నే
లగ్నాచ్చంద్రాచ్చశుక్రాద పిఖలునివసత్ భూమిపుత్ర స్త
యోశ్చ ॥ దాంపత్యందీర్ఘకాలంసుతధన బహుళంపు
త్రలాభంచసౌఖ్యం ! దద్యాదేకత్రహీనోమృతిరఖిల
భయంపుత్రనాశంకరోతి ॥ ౧౫ ॥

తా॥ దంపతులకు రెండుజాతకంబులలోను ; లగ్నమునుండియును చంద్రుని నుండియును, శుక్రునినుండియు, ౧-౨-౪-౭-౮-౧౨ ఈ ౬ స్థానంబులలో నంగారకుండుండిన యెడల నాదాంపత్యము దీర్ఘకాలము సుఖించును. బిడ్డలు సంపదగల్గియుండును కావున కుజదోషముగల వరునికి

కుజదోషముగల కన్యనిచ్చి పెండ్లిచేయవలయును. అటుగాక నొక్కజాతకమున కుజదోషముండి మఱియొకచోట లేకయుండినచో పుత్రనాశంబు, మరణము, భయము గల్గును. అనునదిసిద్ధాంత వచనము.

విశేషసూచన—లగ్నముకన్నను చంద్రుడు, చంద్రునికన్నను శుక్రుండు; దోషము తక్కువగాన, రెండు జాతకంబులలోను - దీనిలో లగ్న కుజదోషమున్న దానిలోను లగ్న కుజదోషము; దీనిలో చంద్రకుజదోషమున్న దానిలోను చంద్రకుజదోషము; దీనిలో శుక్రకుజదోషమున్న దానిలోను శుక్రకుజదోషము; ఇట్లుండనగును. అయితే అట్లు తటస్థించనపుడు, ఒకటిలో లగ్నమునకు కుజదోషముండి మఱియొకటిలో చంద్రశుక్రకుజదోషములు మాత్రమున్నను కావచ్చును.

౬. జాతకీయవైధవ్యయోగ పరిహారోపాయంబులు.

శ్లో॥ యోయోభావస్స్వామి దృష్టోయుతోవా ।
సౌమ్యైర్వాస్యాత్తస్య తస్యాభివృద్ధిః ॥
పాపైరేవంతస్యభావస్యహాని ।
ర్నిర్దేష్టవ్యాపృచ్ఛతాం జన్మతోవా ॥ ౧౬ ॥

తా॥ అనుభట్టోత్పల వచనముంబట్టి సప్తమస్థానమును సప్తమాధిపతిగాని పూర్ణచంద్ర బుధగురు శుక్రులుగాని చూచియో చేరియో ఉండినయెడల, మఱియు ౧౦వ యింటిలో శుభగ్రహములున్నయెడల వైధవ్యారిష్టయోగము పరిహారంబని పీయూషసుధాకర టీకాకారుని మతముగా నున్నది. ఇదియునుగాక-

శ్లో॥ సావిత్ర్యాదివ్రతాదీని భక్త్యాకుర్వంతియాఃస్త్రియః।
సౌభాగ్యంచసుహృత్వంచ భవేత్తాసాంసుసంతతిః॥

తా॥ భక్తితోడనేస్త్రీలు సావిత్రీవ్రతాదులను చేయుదురో వారికి సంపదయును దాంపత్యసుఖంబును సంతానంబును గల్గియుండునని వ్రతఖండలో చెప్పంబడినది.

శ్లో॥ అవైధవ్యకరైర్యోగైః వివాహపటలోదితైః।
వరాయాయుష్మతేదేయా కన్యావైధవ్యయోగజా॥

తా॥ వివాహ పటలమునందు చెప్పంబడిన వైధవ్య యోగములు లేనట్లుగా నాయుష్మంతుండగు వరునికి, వైధవ్య యోగంబునందు పుట్టిన కన్యకను ఇచ్చి పెండ్లిచేయవలయును. అని సంహితా సారవచనంబు. అట్టి వైధవ్యము నివ్వని యోగంబు లేవియనిన కుంభ వివాహము, అశ్వత్థ వివాహము, మొదలగునవి ధర్మశాస్త్ర విహితంబులు.

## ౭. సామాన్యముగా వరనిశ్చయమున శుభాశుభ నిమిత్తంబులు.

శ్లో॥ వాదిత్రతూర్యఘోషోపి వీణా వేణుప్రగీతశబ్దాశ్చ।
శంఖధ్వనిఃప్రశస్తః పృచ్ఛాకాలేకుమారీణాం॥
కృకలాసవానరోరగగర్దభ భసంశ్లేషణాంమిథోపిభవేత్।
దైవజ్ఞపృచ్ఛకానాం కన్యాపకత్రసంరమతే॥ ౨౦ ॥

భిద్యత్యియద్యుదకుంభశ్శయ్యా సనపాదుకాదిభంగోవా।
ప్రశ్నసమయేపియస్యాస్త స్యావైధవ్యమాదేశ్యం ॥

తా॥ ఏకన్యను గురించి ప్రశ్నచేయనుందురో; అప్పుడు మంగళ వాద్యములు వీణ వేణు మృదంగంబులు శంఖము, వీట్లధ్వని మంగళకరంబులు. మఱియడిగెడు వారికి చెప్పెడువారికిని నడుమ తొండ కోతి పాము గాడిదె వీటిసంశ్లేషణంబు గలేనేని యకన్యక యొకచోట ముడిబడును. కుండపగిలినను పరుపుచినిగినను ఆసనము విరిగినను పాదుకలు పగిలినను ప్రశ్న సమయంబున నిటులయినచో నాకన్యకకు వైధవ్యమును చెప్పవలయును. అని శౌనకవచనంబులు.

౯. ఉపశ్రుతి విచారము.

శ్లో॥ ఆరోప్యాక్షత పూరితేగణపతింప్రస్థాదిపాత్రేశనైః।
సమ్మార్జన్యధివేష్టితేయువతయస్త్రిస్రస్సకన్యానిశి ॥
నిర్యాతారజకాదివేశ్మసు కరెకృత్వాతమభ్యర్చితం ।
యాంవాచంశ్రుణుయుస్త దర్థసదృశీలోకేకిలోపశ్రుతిః॥

తా॥ తూము మొదలగు కొలిచెడు పాత్రలో బియ్యముపోసి, అందలో గణపతి ప్రతిమనునచి, దానికిచుట్టు పరకలనుకట్టి, దానిని షోడశోపచారంబులతో పూజించి, ముగ్గురు ముత్తయిదువలు దానించేత దీసికొని కన్యకతోడ రాత్రిలో చాకల వాడలో పోవునప్పుడు, అర్థకముగా నకస్మాత్తుగా ప్రస్తాపవశముగా వినబడునట్టి వాక్యమే ఉపశ్రుతి యనంబడును.

అని వివాహబృందావనమునందు చెప్పఁబడినది. ఆవాక్యానుగుణంబుగా వరలాభాది ఫలమూహ్యంబు. అచ్చటనే॥ “ఉపశ్రుతి మహాదేవి చండాలగృహవాసిని । యథార్థం బ్రూహి దేవిత్వం శక్రకార్య ప్రవర్ధిని ” అని ఉపశ్రుతి ప్రార్థనా మంత్రము గూడ గలదు.

## ౯. కన్యావరణముహూర్తము.

శ్లో॥ పంచాంగ శుద్ధిదివసే చంద్రతారాబలాన్వితే।
వివాహోక్తేషుఋక్షేషు కుజవర్జితవాసరే ॥ ౨౩ ॥
మాసాద్య దివసంరిక్తామష్టమీంనవ మీంతిథిం ।
త్యక్త్వాన్యదివసే గంధస్రక్తాంబూలఫలాన్వితైః ॥ ౨౪ ॥
త్రిషడాయగతైః పాపైః కేంద్రకోణగతైశ్శుభైః।
సహవృద్ధద్విజగణైః వరయేత్కన్యకాంసతీం॥ ౨౫ ॥

తా॥ పంచాంగమునందు శుద్ధమగు తిథి వారనక్షత్రంబులలో చంద్రతారా బలంబులను చూచికొని వివాహమునకు చెప్పిన నక్షత్రంబులలో మంగళవారము తప్ప తక్కిన వారంబులలో పాడ్యమి చవితి ఏకాదశి చతుర్దశి అష్టమి వీట్లను వదలి తక్కిన తిథులలోలగ్నమునకు ౧-౪-౭-౧౦లో శుభులును ౩-౬-౧౧లో పాపులుగల లగ్నములో వృద్ధబ్రాహ్మణులతోడ కన్యను వరించుటకై జననగును. అని కశ్యపవచనంబులు.

## ౧౦. వరణముహూర్తము.

శ్లో॥ పూర్వాత్రితయమాగ్నేయముత్తరాత్రితయంతథా।
రోహిణీత్రవరణే భగణశ్శస్యతేసదా ॥ ౨౬ ॥

ఉపవీతఫలం పుష్పం వాసాంసివివిధానిచ
దేయంవరాయ వరణేకన్యాభ్రాత్రాద్విజేనవా॥ ౨౭ ॥

తా॥ పుబ్బ, పూర్వాషాఢ, పూర్వాభాద్ర, ఉత్తర, ఉత్తరాషాఢ, ఉత్తరాభాద్ర, రోహిణి, ఈ నక్షత్రంబులలో వస్త్రోపవీత ఫలపుష్పంబులను కన్యా సోదరుని చేతనైనను వృద్ధబ్రాహ్మణుని చేతనైనను ఇప్పించి వరునిని వరించవలయునని చండేశ్వర వచనంబు.

౧౧. రజస్వల కాకమునుపే కన్యాదానము.

శ్లో॥ రజోహిదృష్టంయదికన్యకాయాః
కులద్వయందుర్గతిమేతితస్యాః ॥
తస్మాన్నితాంతంచ తదుక్తకాలం ।
నోల్లంఘ్యపాణిగ్రహణంవిధేయం॥ ౨౮ ॥

తా॥ వివాహము కాకమునుపు కన్యకకు అంటుకనబడినట్టయితే, ఆకన్యకయొక్క రెండు కులములవారును నరకమునందెదరు. కావున రజస్వల కాకమునుపే కాలాతిక్రమణము కానట్లు వివాహమును చేయనగునని వసిష్ఠవచనము.

౧౨. కన్యావరులకు వివాహనయఃఫలము.

శ్లో॥ వివాహోజన్మతః స్త్రీణాంయుగ్మేబ్దేపుత్రపౌత్రదః।
అయుగ్మేశ్రీప్రదఃపుంసాంవిపరీతేతుమృత్యుదః ॥ ౨౯ ॥

తా॥ స్త్రీకి సరి సంవత్సరంబులలో వివాహము పుత్ర పౌత్రుల నిచ్చును. పురుషునికి బేసి సంవత్సరంబులలో పెండ్లి సంపత్కరంబు. అట్లుగాక స్త్రీకి బేసిసంవత్సరమునను పురుషునికి సరిసంవత్సరమున వివాహము చేసిన నది మృత్యుప్రదము. అని కశ్యపవచనంబు.

శ్లో॥ మాసత్రయాదూర్ధ్వమయుగ్మవర్షే ।
యుగ్మే తుమాసత్రయమేవవర్షే ॥
వివాహశుద్ధింప్రవదంతి సంతో
వాత్స్యాదయోగర్గవరాహముఖ్యాః ॥ ౩౦ ॥

తా॥ (స్త్రీకిఽవ - వయస్సు రోహిణి యనబడు, అందు వివాహము యుక్తమయ్యె, అది సరి యేడు కాదని యాక్షేపము రానట్లు వచనము చెప్పంబడును.) ఏయేటిలో పెండ్లియైనను సరి సంవత్సరములలో ౪వ నెల నుండి ౯ నెలలును, బేసివర్షంబులలో ౧ నుండి మూడు నెలలును వివాహమునకు ప్రశస్తంబులని గర్గవాత్స్యాదులు చెప్పుచున్నారని శ్రీపతి నిబంధము.

౧౩. వివాహమునగురు శుద్ధి ముఖ్యము.

శ్లో॥ స్త్రీణాంగురు బలేనైవ వివాహశ్శోభనస్స్మృతః ।
వరస్యార్కబలంగ్రాహ్య మైందవంతూభయోరపి॥

తా॥ స్త్రీలకు గురుబలము ముఖ్యము. వరునికిసూర్యబలము ముఖ్యము ఇరువురికిని చంద్రబలము ముఖ్యము. వారివారి రాసులనుండి గోచర మిట్లుండిన మంగళప్రదమని గురువచనము.

 ముహూర్త రత్నావళియందు.

శ్లో॥ గోచరంవేధజం చాష్టవర్గజంరూపజంబలం ।
యథోత్తరంబలాధిక్యంస్థూలంగోచరమూర్జజం ॥ ౩౨॥

తా॥ జన్మరాశికి బలాబలము చూచుట నాల్గు తెరంగులుగా నున్నది. వాటిలో నందలు చూచుచుండు గోచార బలముకన్నను వేధజబలము ప్రబలమని, దానికన్నను అష్టకవర్గబలము ప్రబలము, (ఇచట రూపజమనగా వయః పరిమాణమును పట్టివచ్చుబలమని యభిప్రాయము. "శ్లో॥ దశవర్ష వ్యతిక్రాంతతాకన్యా శుద్ధివివర్జితా । తస్యాస్తా రెండులగ్నానాం శుద్ధౌపాణిగ్రహోమతః', అనువ్యాసవచనముంబట్టి కాలాతిక్రమణమైన కన్యకకు గురుబలాదులను పరిపాటింపక పెండ్లికావలయునని భావము, దానికన్నను షడ్బలసాధనలో తేలెడురూపజ బలము ప్రబలము. కావున గోచరబలము స్థూలమని నారదవచనముకావున నందఱికి సులభ సాధ్యమైన అష్టక వర్గబలమును చూచికొనుటకు మేలుగానుండు.

## ౧౪. వివాహ యోగ్యమాసములు.

శ్లో॥ ఉత్తరాయణగేభానౌమీన చైత్రంచవర్జయేత్ ।
అజగోద్వంద్వకుం భాళిమృగరాశిగతేరావౌ ।
ముఖ్యంకరగ్రహంత్వన్య రాశిగేనకదాచన ॥ ౩౩ ॥

తా॥ సూర్యుడుత్తరాయణము నందియుండగా, మీన చైత్రము పనికిరాదు. రవి మేష వృషభ మిథునవృశ్చిక మకరముల నెక్కియుండగా వివాహము కావచ్చును. తక్కిన మాసములు తగవని కశ్యపవచనము॥

శ్లో॥ దినాధిపేమేష వృషాళికుంభ ।
నృయుగ్మనక్రాఖ్య ఘటర్క్షసంస్థే ।
మాఘద్వయేమాధవశుక్లయోశ్చ ।
ముఖ్యోథసా కార్తికసౌమ్యయోశ్చ ॥ ౩౮ ॥

తా॥ రవి మేషవృషభ వృశ్చిక కుంభ మిథున మకరతులలలో నుండగా నసగా, మేషచైత్రము వైశాఖము, జ్యేష్ఠము, తులాశ్వయుజము, మార్గశిరము, మాఘము, కుంభఫాల్గునము, ఇవి వివాహమునకు ప్రశస్తంబు అని వసిష్ఠ వచనంబులు.

౧౨. వివాహమునకు జన్మమాసాదులనిషేధము.

శ్లో॥ జాతందినం దూషయతేవసిష్ఠః ।
పంచైవగర్గః త్రిదినంతథాత్రిః ॥
తజ్జన్మపక్షంకిలభాగురిశ్చ ।
వ్రతేవివాహేగమనే క్షురేచ ॥ ౩౯ ॥

తా॥ వివాహోపనయన చౌలాదులకు జన్మతిథి పనికి రాదని వసిష్ఠుల మతము, అవి మొదలు ౫ దినములు కూడదని గర్గమతము. ౩ దినములు కూడదని అత్రిమతము. ఆపక్షమే తగదని భాగురిమతము. (ఆనెల పనికిరాదని ఈవరకే ఉపనయన ప్రకరణమున చెప్పఁబడినది.) ఇట్లు జగన్మోహన వచనము.

శ్లో॥ జన్మర్క్షే జన్మమాసేవా తారాయామథజన్మని।
జన్మలగ్నేభ వేదూఢా వృద్ధాసంతతిసౌఖ్యభాక్ ॥

తా॥ జన్మనక్షత్రంబున, జన్మమాసమున, జన్మతారలలో; జన్మలగ్నంబునను; పెండ్లియాడిన యిల్లాలు ముసలదగునంతవరకు సంతాన సౌఖ్యంబులతో రంజిల్లునని చండేశ్వర వచనము గలదు కావున; (జన్మమాసాదులు ఆద్యగర్భంబులకు కూడదనియును ద్వితీయగర్భాది జాతులకు కావచ్చుననియును గ్రాహ్యంబు.)

౧౬. వివాహమున జ్యేష్ఠము జ్యేష్ఠులకుతగదు.

శ్లో॥ ద్వౌజ్యేష్ఠౌమధ్యమౌ ప్రోక్తావేకజ్యేష్ఠశ్శుభావహః।
జ్యేష్ఠత్రయంనకుర్వీత వివాహేసర్వసంమతం ॥ ౩౭ ॥

తా॥ తొలిచూలి వరుఁడు, తొలిచూలు కన్యక, జ్యేష్ఠమాసము, వీటికి మూటికిని త్రిజ్యేష్ఠమనిపేరు. వీట్లలో నొకజ్యేష్ఠము పెండ్లిలో శుభకరము. రెండు జ్యేష్ఠములు మధ్యమము, మూడు జ్యేష్ఠములు హానినిచ్చును. అని వరాహవచనము.

శ్లో॥ జ్యేష్ఠాయాఃకన్యకా యాశ్చజ్యేష్ఠపుత్రస్యవై మిథః।
వివాహోనైవకర్తవ్యోయదిస్యాన్నిధనంతయోః ॥

తా॥ తొలిచూలువరునికి తొలిచూలు కన్యకను ఇచ్చిపెండ్లిచేయుటలో వారికి హానియని గర్గవచనము కలదు. కావుననె పైనవరాహ వచనము ఇట్టి పెండ్లిని మధ్యమంబనె. దీనిలోను జ్యేష్ఠమాసము తగదని భావము కావుననే;— ॥ ౩౮ ॥

శ్లో॥ అజ్యేష్ఠాకన్యకాయత్ర జ్యేష్ఠః పుత్త్రోవరోయది।
వ్యత్యయో వా తత స్తత్ర జ్యేష్ఠమాసశ్శుభావహః ॥౩౯॥

తా॥ తొలివరుడు ద్వితీయాదిగర్భ జాతయగు కన్యకను, తొలికన్యక ద్వితీయాది గర్భజాతుడగు వరునిని, పెండ్లాడునపుడు జ్యేష్ఠమాసము శుభకరంబని పరాశర వచనము గలదు. కావున ముఖ్యముగా త్రిజ్యేష్ఠము సుతరాం కూడదని ఫలితార్థము. (ఇట్లేమార్గశిర మాసంబుకూడ వివాహాదులలో జ్యేష్ఠ కన్యావరులకు తగదని ఈవరకే ఉపనయన ప్రకరణమున చెప్పంబడినది.)

## ౧౭. ఏకగర్భజాతులకు ఒకేసంవత్సరమున వివాహాదులుతగవు.

శ్లో॥ స్త్రీవివాహః కులే నిర్గమః కథ్యతే।
పుంవివాహః ప్రవేశో వసిష్ఠాదిభిః॥
నిర్గమాదాదితో నప్రవేశో హిత।
స్తత్ర సంవత్సరాంతోవధిః కీర్తితః ॥ ౪౦ ॥

తా॥ ఆడబిడ్డ పెండ్లి నిర్గమంబనియును, మొగబిడ్డ పెండ్లికి ప్రవేశంబనియును, వసిష్ఠాది ముని మతమున సంకేత నామంబులు. మొదట యింటిలో ప్రవేశమును జరిపి, అది మొదలు సంవత్సరమగు నంతలో నిర్గమము తగదని యనగా కొడుకుకు పెండ్లియైన వత్సరమున కూతురికి పెండ్లి తగదని భావము అని వాత్స్యవచనము.

శ్లో॥ కులేబుత్రత్రయాదర్వాగ్దండనాన్న తుముండనం ।
ముండనాన్నఖేడనం కార్యంమండనాన్నైవముండనం ॥

తా॥ తనకులమున మూడుబుత్రులనిన నారుమాసంబులకు లోపుగా పెండ్లియైన వెనుక నుపనయన సమావర్తనాదులు చేయరాదు. మొదట నుపనయన సమావర్త నాదులను జరిపి పిదప నాడుబిడ్డ పెండ్లిని చేయవచ్చును. చేసిన నారుమాసముల నైనను విడువవలెనని అత్రి నారదవచనార్థంబులు గలవు.

శ్లో॥ పుత్రీవివాహోత్పర తస్సదైవ ।
శుభప్రదం పుత్రవివాహకర్మ ॥ ౪౨ ॥

తా॥ మొదట కూతురికి పెండ్లిచేసి, పిమ్మట పుత్రవివాహము జేయుట శుభప్రదంబని వసిష్ఠ వచనముగలదు. ఇదియును పైవాత్స్యవచనమునననుసరించి చూచిన, ౬ నెలలు తాళిన పిదప యనిభావము. అనగా కన్యాదానము మొదట మంచిది. పిదప కన్యా ప్రతిగ్రహము శ్రేయస్కరంబని యెఱుంగనగును.

శ్లో॥ ఏకమాతృజయో రేకవత్సరేపురుషస్త్రియోః ।
నసమానక్రియాంకుర్యాన్మాతృభేదేవిధీయతే ॥ ౪౩ ॥

తా॥ ఒకతల్లి బిడ్డలలో కూతురిపెండ్లి,కొడుకునుపెండ్లివడుగు మొదలైనది ఒకవత్సరముననే కారాదు. మారుతల్లిబిడ్డలగా నుండిన కావచ్చునని వృద్ధమను వచనము. (ఈ విషయమును సంవత్సర మెందుకు ౬ నెలలు చాలునని నారదాభిప్రాయము).

శ్లో॥ ఏకోదరప్రసూతానామేకస్మిన్వత్సరేయది ।
పాణిగ్రహోభవేన్నానంతత్రైకావిధవాభవేత్ ॥

తా॥ ఒకతల్లి బిడ్డలగు నక్క చెల్లెండ్రకు ఒకసంవత్సరముననే పెండ్లిచేయుట యనుచితంబు. అట్లుచేసినచో, నొకతె విధవ యగునని పరాశర వచనంబు గలదు గావున నక్కచెల్లెండ్ర వివాహంబు కూడ ఏకకాలమున చేయుట యశాస్త్రీయము.

శ్లో॥ పుత్రీపరిణయాదూర్ధ్వంయావద్దిన చతుష్టయం ।
పుత్ర్యంతరస్యకుర్వీతనోద్వాహమితిసూరయః ॥ ౨౫ ॥

తా॥ ఒకకూతురిపెండ్లిచేసి పిదప నాల్గు దినములలోగా నింకొకకూతురిపెండ్లి చేయరాదు. అనిగర్గ వచనముగలదు. ఇంతమాత్రముచే నేకకాలంబుననే అక్కచెల్లెండ్రకు నేకలగ్నమునకూడ పెండ్లిచేయుచున్నారుగాని యుచితగదు. ఈవచనము ఒకతండ్రిబిడ్డలలో తల్లులువేరుగానుండు వారివిషయము. వారికిని ౪ దినములు అంతరముగల్గి యుండవలెనని భావము.

శ్లో॥ ఆదౌచౌలంతతోమౌంజీవివాహశ్చ శుభప్రదః ।
మాతృభేదేబుధైరుక్తోమాతురైక్యేనకర్హిచిత్ ॥ ౨౬ ॥

తా॥ మొదటచౌలము, పిదప ఉపనయనము, ఆవెనుక పెండ్లి, యిట్లు ఒకసంవత్సరముననే భిన్నోదరులుగా నుండెడువారికి కావచ్చును, ఒకతల్లి బిడ్డలకైననో కూడదని చ్యవనవచనము.

శ్లో॥ ఏకస్మిన్వత్సరేప్రాప్తే కుర్యాద్యమళ జాతయోః ।
క్షౌరంచైవ వివాహంచ మౌంజీబంధనమేవచ ॥ ४౭ ॥

తా॥ అనుడబిడ్డలగా పుట్టినవారికి ఈయేకసంవత్సర నిర్బంధములేక చౌలోపనయన వివాహాదులు కావచ్చునని పరాశరవచనంబు గలదు. (ఈవిషయమున నింకయునుత్సర్గాపవాదంబులు విచారించిన గలదుగాని యింతతో చాలును.)

౧౮. మంగళకార్యానంతరము అమంగళకార్యముతగదు.

శ్లో॥ కృతేవాఙ్నిశ్చయే పశ్చాన్మృత్యుర్భవతిగోత్రిణః ।
తదా నమంగళం కార్యంనారీ వైధవ్యదంధ్రువం ॥ ४౮ ॥

తా॥ ఇట్లు శుభముహూర్తమున ఇకన్య నీవరునికిచ్చి పెండ్లిజరుప వలయునని వాఙ్నిశ్చయము చేసికొన్నపిదప, నాకన్యాగోత్రజులనగా పితృపితామహులు పినతండ్రులు అన్నదమ్ములు మొదలగువారిలో నొకరికిమరణము సంభవించినచో నప్పుడు ఆవివాహమును చేయరాదు. అట్లుచేసిరేని కన్యకకు వైధవ్యము సంభవించునని స్మృతిచంద్రికా వచనంబుగలదు.

శ్లో॥ వాగ్దానానంతరం యత్రకులయోః కస్యచిన్మృతిః ।
తదాసంవత్సరాదూర్ధ్వంవివాహశ్శుభదోభవేత్ ॥ ४౯ ॥
పితురాశౌచమబ్దంస్యాత్తదర్థం మాతురేవహి ।
మాసత్రయంచభార్యాయాస్తదర్థంభాతృపుత్రయోః ॥

తా॥ వాఙ్నిశ్చయమైనపిదప, వరునిపక్షముగాని కన్యపక్షముగాని యేదైననొకమరణము సంభవించినచో నాసంవత్సరము కడచినపిదప వివాహముజరుపవలయును. అపుడావివాహము మంగళప్రదమగును. అయితే; కన్యావరులలో నెవరికైనను తండ్రిగతించిన నొకవత్సరమును; తల్లిగతించిన నారుమాసంబులును; అన్నదమ్ములుగతించిన ౧౪ నెలలును, వరునికి పత్నిగతించిన ౩ నెలలును; వదలివివాహము శుభదంబని మాండవ్యవచనము.

శ్లో॥ ప్రతికూలేపికర్తవ్యో వివాహో మాసమంతరా ।
శాంతింవిధాయగాందత్వా వాగ్దానాదిచరేద్బుధః ॥ ౫౧॥

తా॥ వాఙ్నిశ్చయమైనపిదప మరణవిఘ్నములిట్లు తటస్థించినను, ఆశౌచానంతరమున. ఒకనెలలో పలనైనను విధిలేకచేయవలసినట్లు సందర్భించిన పక్షమునందు శాంతినిజేసిగోదానముంజేసి వివాహమును చేయవచ్చును. అని జ్యోతిఃప్రకాశ వచనంబుగలదు.

౧౯. ఆరుమాసములలోనైనను అబ్దభేదము ముఖ్యము.

శ్లో॥ ఫాల్గునేచైత్రమాసేతుపుత్రోద్వాహోపనాయనే ।
భేదాదబ్దస్యకుర్వీత నర్తుత్రయ విలంఘనం ॥ ౫౨ ॥

తా॥ ఈవత్సరమున ఫాల్గునములో కొడుకుపెండ్లి; రాగలసంవత్సరమున చైత్రములో మఱియొకకొడుకును చేలము; ఇట్లు చేయుటతగదు ఎందువల్లననిన ఋతుత్రయమనిన నాఱుమాసములవిధిని దాటరాదు అనిన కడనెలలో తొలినెలలో నిట్లుచేయరాదు. ఈవత్సరమున మాఘములో, రాగల

వత్సరమున వైశాఖములో చేయుట నిర్వివాదము. అపుడు అబ్దభేదమయిన దనిఋతుత్రయలంఘన దోషము రాజాలదనిభావము. ఇదిసారావళీవచనము.

౨౦. మూలాశ్లేషాజాత కన్యావరుల విచారము.

శ్లో॥ నైఋత్యభోద్భూత సుతస్సుతా వా ।
త్రిపాదవశ్యం శ్వశురం నిహంతి ॥
తదంత్య పాదే జనితోఽసి హంతి ।
నైవోత్క(–)మేణాహిభవః కళత్రం ॥ ౫౩ ॥

తా॥ మూలనక్షత్రమున పుట్టినవరుడైనను కన్యయైనను మామనుచంపెదువారు. అయిననానక్షత్రమున ఆమూలలో నాల్గవపాదజాతులైయున్న నీదోషములేదు. కావున అట్టివారికి వివాహముచేయునప్పుడు మామచనిపోయి యుండునట్లు సంబంధము చేయనగునని భావము అశ్లేష ఆశ్లేషానక్షత్రమున పుట్టిన వరుడైనను కన్యయైనను అత్తనుచంపెదువారు. అయినను మొదటిపాదజాతులైయున్న నీదోషములేదు. కావున నట్టివారికి వివాహము చేయునప్పుడు అత్తచనిపోయి యుండునట్లు సంభంధము చేయనగునని భావము. ఇదివసిష్ఠవచనము.

౨౧. విశాఖాజ్యేష్ఠానక్షత్రజాతకన్యా విచారము.

శ్లో॥ సురేశతారా జనితా ధవాగ్రజం ।
ద్విదైవతారా జనితాతు దేవరం ।
నిహంతికన్యాకిల వృశ్చికోద్భవా ।
దుష్టా విశాఖాసుగుణాతులాఢ్యా ॥ ౫౪ ॥

తా॥ జ్యేష్ఠానక్షత్రమున పుట్టినకన్య మొగునియన్నను చంపునుగాన, దానిని అన్నలేనివరునికిచ్చి పెండ్లిచేయనగును. విశాఖానక్షత్రమున జనించిన కన్య పెనిమిటి తమ్మునికి చెఱుగుచేయునుగాన తమ్ములు లేనివరునికి ఆకన్యక నీయందగును, అయిన "నహంతిదేవరం కన్యాతులామిశ్రద్విదైవజా। చతుర్థపాదజాత్యాజ్యాదుష్టావృశ్చికపుచ్ఛవత్" అను నారదవచనానుసారముగా విశాఖనాల్గవ పాదము చెడ్డదిగాని; మొదటిమూడుపాదములు మంచిదే, అందుజనించిన కన్య తమ్ములుగల వానికితగును. అనివసిష్ఠవచనము.

౨౨. దశకూట ఘటితార్థము.

శ్లో॥ దినంగణం చమాహేంద్రం స్త్రీదీర్ఘం యోనిరేవచ।
రాశిరాశ్యధిపౌరజ్జుర్వశ్యం వేధోదశస్మృతాః ॥ ౫౫ ॥

తా॥ కూటములనిన పొంతనములు. ఇవి పదితెఱంగులుగా నున్నవని నారదవచనంబుగలదు. అందు ౧. దినకూటము; ౨ గణకూటము; 3 మాహేంద్రకూటము; ౪ స్త్రీదీర్ఘకూటము; ౫ యోనికూటము; ౬ రాశికూటము; ౭ రాశీశ్వరకూటము; ౮ రజ్జుకూటము; ౯ వశ్యకూటము; ౧౦ వేధాకూటము; అనియున్నది.

౨౩. గర్గమతమున ౧౮ కూటంబులు.

శ్లో॥ మాహేంద్రం గణకూటంచ దినకూటంచ యోనిజం।
స్త్రీదీర్ఘంరజ్జుకూటంచవశ్యం వర్ణాఖ్యకూటకం ॥ ౫౬ ॥

రాశిరాశ్యధిపాఖ్యౌచ వేధో నాడ్యాఖ్యకూటకం ।
భూతలింగాఖ్యకూటంచజాత్యాఖ్యంపక్షికూటకం ॥౫౭॥
యోగినీగోత్రకూటంచ కూటాన్యష్టాదశైవతు ।
దంపత్యోర్వృద్ధికారీణి యత్నాచ్చింత్యానిశాస్త్రతః ॥

తా॥ పైనచెప్పిన ౧౦ కూటములుగాక; ౧౧ వర్ణకూటము; ౧౨ నాడీకూటము; ౧౩ భూతకూటము; ౧౪ లింగకూటము; ౧౫ జాతికూటము; ౧౬ పక్షికూటము; ౧౭ యోగినీకూటము; ౧౮ గోత్రకూటము; అని గర్గాచార్యులవారి మతము. (ఇట్లు; మునిమతంబులు పలు తెఱంగులు. అంతట సుప్రసిద్ధంబులు ౮ కూటంబులు గ్రాహ్యంబులు. ఎట్లనిన;—

౭౪. ప్రసిద్ధకూటంబు లెన్మిది, వాటి గుణసంఖ్య.

శ్లో॥ నాడీభేదేగుణా అష్టౌస ప్తసద్రాశికూటకే ।
షడ్గుణాగణమైత్ర్యాంచసాహార్ధపంచఖేటయోః ॥ ౫౯ ॥
యోనిమైత్ర్యాం చచత్వారస్త్రయస్తారాబలేగుణాః ।
వశ్యత్వేద్వౌగుణౌప్రోక్తౌ వర్ణఏకః ప్రకీర్తితః ॥ ౬౦ ॥

తా॥ ఉక్తలక్షణంబులంబట్టి; భిన్ననాడిగానున్నచో దానిగుణంబులు ౮; రాశికూటము బాగుగానుండిన దానిగుణంబులు ౭; గణకూటము పొసగినదానిగుణంబులు ౬; గ్రహమైత్రి కూడివచ్చినదానిగుణంబులు ౫; యోనికూటము ౪ గుణంబులుగలది; దినమునకు ౩ గుణంబులు; వశ్యకూటమునకు ౨ గుణంబులు; వర్ణకూటమున ౧ గుణము; అనిదైవజ్ఞమనోహర వచనము.

## ౨౫. వర్ణకూట విచారము.

శ్లో॥ ఝషాళికర్కటావిప్రా స్తదూర్ధ్వాః క్షత్రియాదయః ।
పుంవర్ణరాశౌ స్త్రీరాశౌ సమేహీనేతథాశుభం ॥ ౬౧ ॥

వర్ణజ్యేష్ఠాతుయానారీవర్ణహీనస్తుయః పుమాన్ ।
వివాహంయదికుర్వీతతస్యాభర్తావినశ్యతి ॥ ౬౨ ॥

తా॥ కర్కాటకవృశ్చిక మీనములు, బ్రాహ్మణవర్ణము; మేషసింహ ధనుస్సులుక్షత్రియవర్ణము; వృషకన్యామకరములు వైశ్యవర్ణము; మిథున తులాకుంభములు శూద్రవర్ణము; — ఇట్లుండ వధూవరుల జాతకంబులలో చంద్రుఁడుండెడు రాసులనెఱింగి. వాట్లలో రెండును సమాన వర్ణంబులైనను లేక పురుషరాశికన్నను స్త్రీరాశి తక్కువవర్ణంబైనను శుభప్రదంబు. అటు గాక పురుషరాశివర్ణముకన్నను స్త్రీరాశివర్ణముత్తమంబైనచో నావాహంతనము చేసిన పెనిమిటికి హానిగల్గునని నారదవచనంబులు.

శ్లో॥ ఏకోగుణస్సదృగ్వర్ణేతథావర్ణోత్తమేవరే ।
హీనవర్ణేవరేశూన్యంకేప్యాహుస్సదృశేదళం ॥ ౬౩ ॥

తా॥ ఇట్లుస్త్రీపురుషులు సమానవర్ణరాశి జాతులైనను, వరుడుత్తమ వర్ణరాశి జాతుండైనను ఒక్కగుణముగలదనియు, అటుగాకస్త్రీకన్నను వరుడు హీనవర్ణరాశి జాతుడైనచో సొన్నయనియు నెఱుంగనగునని దైవజ్ఞ మనోహర వచనము.

## ౭౬. వశ్యకూట విచారము.

శ్లో॥ వశ్యాస్త్వక్త్వా రాశయోఽన్యే నృభానాం ।
సింహం త్యక్త్వైక మన్యే విధేయాః ॥
కీటంత్యక్త్వాలోక తోన్యత్ప్రసిద్ధం ।
వశ్యావశ్యంనైవ తోయాలయాశ్చ ॥ ౬౪ ॥

తా॥ మిథునకన్యాతూలా రాసులు నరరాసులనంబడును. వీట్లకు సింహముతప్ప తక్కినవన్ని రాసులును వశ్యంబులు. ఆసింహమునకు వృశ్చికమొకటితప్ప తక్కినవన్నిరాసులును వశ్యంబులు. ఆవృశ్చికమునకును జలచరరాసులకును వశ్యావశ్యములేదు. అని వసిష్ఠవచనము. ఇచ్చటనరరాసులకు జలజరాసులనగా కర్కాటకము మకరకుంభమీనములు భక్ష్యంబులు. తక్కిన చతుష్పాద్రాసులకును జలచలరాసులకును చతుష్పద జలచరరాసులకును పరస్పరవశ్యంబులనియు నెఱుంగనగును.

శ్లో॥ సఖ్యంవైరంచభక్ష్యంచవశ్యమాహుస్త్రిధాబుధాః ।
వైరేభక్ష్యేగుణాభావోద్వయోస్సఖ్యేగుణద్వయం॥౬౫ ॥

తా॥ ఈవశ్యకూటమునకు చెప్పంబడిన గుణంబులు రెండు. వాటిలో వధూరాశికిని వరరాశికిని వైరత్వముగాని భక్ష్యత్వముగాని యుండిన గుణమే లేదు. రెండురాసులకును పరస్పరముగా వశ్యముండిన రెండుగుణంబులుగల్గి యుండుననని దైవజ్ఞమనోహర వచనంబు.

౨౭. దినకూట విచారము. ఇది మొత్తాన్వాకూటము.

శ్లో॥ స్త్రీభమారభ్య గణనేనవపర్యాయతః క్రమాత్ ।
జన్మత్రిపంచసప్తస్థం పుంభంస్యాద్ద్వార నాశనం ॥ ౬౬ ॥
పుంభమారభ్య గణనేస్త్రీభం జన్మాదికేస్థలే ।
స్త్రీవినాశోభవేత్తస్మాద్దిన కూటంవివర్జయేత్ ॥ ౬౭ ॥

తా॥ కన్యానక్షత్రము మొదలుకొని ౯ వరకు మూడుపర్యాయములు లెక్కించపగా ౧-౩-౫-౭ లోపల వరనక్షత్రముండిన వరునికిహాని. అట్లే వరనక్షత్రము మొదలు లెక్కించ ౧-౩-౫-౭ స్త్రీనక్షత్రమున్న స్త్రీహాని. కావున దినకూటము ననుసరించి యీ దోషమును పరిహరింపనగునని నారదవచనంబులు.

శ్లో॥ ఏకత్రోలభ్యతేతారాశుభాచైవాశుభాన్యతః ।
తదాసార్థోగుణశ్చైవతారాశుద్ధ్యామిథఃస్త్రియః॥౬౮॥

తా॥ స్త్రీతారకు పుంతారశుభముగానున్న ౧½ గుణము; పుంతార స్త్రీతారశుభకరమైన ౧½ గుణము; రెండునుశుభకరమైన ౩ గుణంబులు; రెండును శుభముకానిచో గుణమునున్నయని దైవజ్ఞమనోహర వచనము.

౨౮. యోనికూట విచారము.

శ్లో॥ అశ్వేభమేషభుజగద్వయకుక్కురౌతు ।
మేషోతుమూషకమథోందురు గోలులాయాః ।

శార్దూల మూషిక గవారి మృగద్వయంశ్వా ।
కేశోథబభ్రుయుగకేశగవాశ్వసింహాః ॥ ౬౯ ॥

తా॥ అశ్వినీశతతారలు గుఱ్ఱములు; భరణీరేవతులు ఏనుగులు; కృత్తికాపుష్యములు మేకలు; రోహిణీమృగశిరలు సర్పములు; ఆర్ద్రామూలలు, కుక్కలు; పునర్వసు ఆశ్లేషలు పిల్లులు; మఖాపూర్వఫల్గునులు ఎలుకలు;-హస్తస్వాతులు ఎనుములు; చిత్రవిశాఖలు పులులు; అనూరాధజ్యేష్ఠలు లేళ్లు ఉత్తరఫల్గున్యుత్తరాభాద్రలు గోవులు; అభిజిదుత్తరాషాఢలు ముంగిసలు; ధనిష్ఠాపూర్వాభాద్రలు సింహములు; పూర్వాషాఢాశ్రవణములు కోతులు; ఇవి నక్షత్రములకు చెప్పంబడిన జంతువులు. వీట్లలో వధూవరనక్షత్రములు గోవ్యాఘ్రములుగాను- గజసింహములుగాను- అశ్వమహిషంబులుగాను; జింకకుక్కలగాను, పాముముంగిసెలుగాను, ఇట్లే పరస్పర వైరనక్షత్రంబులుగా నుండరాదు అని వసిష్ఠవచనము.

శ్లో॥ అష్టావింశతితారాణాం యోనయస్తుచతుర్దశ ।
మైత్రంచైవాతిమైత్రంచవివాహేనరయోషితోః ॥ ౭౦॥
మహాద్వైరేచవైరేచస్వభావేచయథాక్రమం ।
మైత్రేచైవాతిమైత్రేచఖేందు ద్విత్రిచతుర్గుణాః ॥ ౭౧ ॥

తా॥ ౨౮-వ నక్షత్రంబులకు ౧౪ యోనులు చెప్పంబడినవి. వీట్లలో అత్యంతవిరోధ యోనులుగా వధూవరులయొక్క నక్షత్రంబులున్నచో గుణము సున్న. విరోధయోనులుగానున్న గుణమొకటి, స్వాభావికంబుగా వాటి

నంతె యవి యుండిన గుణము రెండు. మిత్రయోని స్థానన్న గుణముమూడు, పరమ మిత్రత్వమునగా నేకయోనిమైనచో నాల్గుగుణంబులు నున్నట్లెఱుంగ వలననియు దైవజ్ఞ మనోహరవచనంబు.

## ౨౯. గ్రహమైత్రియుదియే రాశీశ్వర కూటము.

శ్లో॥ రవేస్సమోజ్ఞో మిత్రాణి చంద్రారేజ్యాఃపరావరీ ।
ఇందోర్నశత్రవస్సమిత్రేరవిజ్ఞావితరేసమాః ॥ ౭౨ ॥
సమాః కుజస్యశుక్రార్కీ బుధోరిస్సుహృదఃపరే ।
జ్ఞస్యచంద్రోరిపుర్మిత్రే శుక్రార్కీ ఇతరేసమాః ॥౭౩ ॥
గురోరారేంద్విన మిత్రాణ్యార్కీమధ్యఃపరావరీ ।
భృగోస్సమావిజ్యకుజౌ మిత్రేజ్ఞార్కీపరౌరిపూ ॥ ౭౪ ॥
శనేర్గురుస్స మోమిత్రే శుక్రజ్ఞౌ శత్రవః పరే।
(ఇతికశ్యపమహర్షివచనాని) ॥ ౭౫ ॥

తా॥ రవికి— బుధుడు సముడు, చంద్ర కుజగురువులు మిత్రులు, శుక్రశనులు శత్రువులు, చంద్రునికి—శత్రువులులేరు. రవిబుధులు మిత్రులు; కుజగురు శుక్రశనులు సములు; కుజునికి— రవిశుక్రులు సములు, బుధుడు శత్రువు, చంద్రగురు శనులుమిత్రులు. బుధునికి — చంద్రుడు శత్రువు, శనిశుక్రులు మిత్రులు, కుజగురు సూర్యులు సములు; గురునికి — శని సముడు, రవికుజ చంద్రులు మిత్రులు; బుధశుక్రులు శత్రువులు; శుక్రునికి —

శనిబుధులు మిత్రులు, రవిచంద్రులు శత్రువులు, గురుకుజులు సములు; శనికి —గురుడు సముడు, బుధశుక్రులు మిత్రులు, రవిచంద్రకుజులు శత్రువులు. సముడుగురుడు. పొంతనముచూచునపుడు వధూవరులయొక్క జాతకమున చంద్రుడుండెడు రాశికధిపతులెవ్వరో వారినిగ్రహించి, వారికిశత్రుమిత్రభావమును తెలియవలయును.

శ్లో॥ గ్రహమైత్రం సప్తవిధంగుణాః పంచప్రకీర్తితాః ।
చత్వారస్స మమిత్రత్వేద్వయోస్సామ్యేత్రయోగుణాః ॥
సమవైరేగుణైకస్స్యాత్ మిత్రవైరేగుణద్వయం ।
పరస్పరంఖేటవైరేగుణశూన్యంవినిర్దిశేత్ ॥ ౭౭ ॥

తా॥ గ్రహమైత్రీ పొంతనమున, ఏకాధిపత్యమనగా మకరకుంభములు, ధనుర్మీనములు, మేషవృశ్చికములు, తులావృషభములు, కన్యామిథునములు, ఇట్లు వధూవరరాసులుండినచో దానికిసంపూర్ణముగా నైదుగుణంబులు. వధూవరరాసులు పరస్పరముగా సమశత్రుత్వమైతే నాల్గుగుణంబులు. సమసమంబైతే మూడుగుణంబులు. మిత్రవైరమున ౨ గుణంబులు సమశత్రుత్వమైతే గుణమొక్కటి. శత్రుశత్రుభావమైన పక్షమున గుణము సున్నయని గ్రహించవలయునని దైవజ్ఞమనోహర వచనము.

శ్లో॥ అన్యోన్యమిత్రం శస్తంస్యాత్సమమిత్రం తుమధ్యమం ।
ఉదాసీనంకనిష్ఠంస్యాద్విష్ఠితిదంశాత్రవంస్మృతం ॥౭౮ ॥
శత్రుమిత్రం చనిష్టే యందంపత్యోః కలహప్రదం ।
అన్యోన్యసమశత్రుత్వం దంపత్యోర్విరహప్రదం ॥ ౭౯ ॥

తా॥ పరస్పరముగా వధూవరరాశ్యధి పతులు మిత్రులగుట మంచిది. సములగుట కనిష్ఠము. శత్రువులగుట మరణప్రదము. శత్రుమిత్రత్వమైనచో కలహమునిచ్చునని; వసిష్ఠవచములు ఫలముచెప్పెను.

శ్లో॥ రాశినాథేవిరుద్ధే పిసబలావంశకాధిపే ।
తస్మిన్ మైత్రేపిచకర్తవ్యం దంపత్యోశ్శుభమిచ్ఛతా ॥ ౮౦॥

తా॥ ఒకవేళ రాశీశ్వరులు విరుద్ధులుగానున్నను నవాంశచక్రమున చంద్రనవాంశాధిపతులు బలవన్మిత్రులుగానుండుట నైననుచూచికొని, దాంపత్యక్షేమమునాలోచించువారు వివాహఘటితార్థమును పొసగింపవలయునని వసిష్ఠవచనంబు.

## ౩౦. గణకూట విచారము.

శ్లో॥ రక్షోగణఃపితృత్వాష్ట్రీద్విదైవత్యేంద్రతారకాః।
వసువారీశమూలాహికృత్తికాభిర్యుతాస్తతః ॥ ౮౧ ॥
త్రిస్రఃపూర్వోత్తరాధాతృయమమాహేశతారకాః ।
ఇతిమర్త్యగణాజ్ఞేయాస్స్యుర్దమర్త్యగణాః పరే ॥ ౮౨॥
హయాదిత్యార్కవాయ్వంత్యమిత్రాశ్వీజ్యేందుతారకాః
(ఇతి నారద వచనాని) ॥ ౮౩ ॥

తా॥ పున. పుష్య, స్వాతి, హస్త, శ్రవ, రేవ, అనూ, మృగ, అశ్వి:—ఇవి దేవగణ నక్షత్రంబులు. రోహి, పూఫ, పూషా, పూభా, భర, ఆర్ద్ర, ఉఫ, ఉషా, ఉభా; —ఇవి మనుష్యగణ నక్షత్రంబులు- కృత్తి,

ఆశ్లే, మఖ, చిత్త, విశాఖ. జ్యే, మూ, ధని, శత;—ఇవి రాక్షసగణ నక్షత్రంబులని నారదవచనంబులు.

శ్లో॥ స్వగణేచోత్తమాప్రీతిః మధ్యమాఽమరమర్త్యయోః ।
మర్త్యరాక్షసయోర్వైరమసురాసురయోరపి ॥౮౪॥

తా॥ వధూవరనక్షత్రంబులేకగణంబుగానుండిన నత్యుత్తమంబు. దేవమానుషంబైనచో మధ్యమంబు. మానుషరాక్షసంబైనచో శత్రుత్వము, రాక్షసరాక్షసంబైననుకలహంబే అని కశ్యపవచనము.

శ్లో॥ రక్షోగణః పుమాన్స్యాచ్చేత్కన్యా భవతిమానవీ ।
కేపీచ్ఛంతితదోద్వాహంవ్యస్తంకోపీహనేచ్ఛతి ॥ ౮౫ ॥

తా॥ స్త్రీ మానుషగణము, పురుషుడు రాక్షసగణము, ఇట్లుండినను కొందరువీనిని సంమతించెదరు. స్త్రీ రాక్షసగణము, పురుషుడు మానుషగణమైన, దాని నెవరును సంమతించరని శార్ఙ్గీయవచనము.

శ్లో॥ షడ్గుణాగుణ సాదృశ్యేపంచస్యుస్సుర మానుషే।
నార్యాదేవేనరఃపుంసశ్చత్వారోఽగాగుణాస్త్రయః॥౮౬॥
దేవరాక్ష సయోశ్శూన్యం తథైవనరరక్షసోః ।
పుంసోరక్షోగణోయత్రనార్యాదేవోథవానరః ॥ ౮౭ ॥
గుణౌద్వౌక్రమత శ్చైకోగుణోగ్రాహ్యోన్యథానహి॥
(ఇతిదైవజ్ఞ మనోహారవచనాని) ॥ ౮౮ ॥

తా॥ వధూవరనక్షత్రంబులు ఏకగణంబుగా నుండిన యెడల (౬) గుణంబులు ; కన్యది మానుషము వరునిది దైవముగానుండిన ౫ గుణంబులు ; స్త్రీ దేవగణము వరునిది మానుషమైతే ౪ గుణంబులు ; లేక 3 గుణంబులనందగును. స్త్రీ రాక్షసంబైన పురుషుడు దైవమైనను మానుషంబైనను సున్నయనిన గుణములేదు; పురుషుడు రాక్షసమై స్త్రీ దైవమైన ౨ గుణంబులు, మానుషంబైన ౧ గుణంబు ;

3౧. గణకూటాపవాదంబు.

శ్లో॥ రాశీశయోస్సుహృద్భావో మిత్రత్వేనాంశనాథయోః ।
గణాదిదోషైర్వ్యుద్వాహః పుత్రపౌత్రప్రవర్ధనః॥ ౪౯॥

తా॥ గ్రహమైత్రీకూటము రాశితః లేక అంశతః అన్యోన్యమైత్రిగానమరి యుండిన పక్షమున, గణకూటాదులు దోషయుక్తములు గానున్నను పుత్రపౌత్రాభివృద్ధినిచ్చునని చేయవచ్చునని అత్రివచనము.

3౨. ఏకాధిపత్యప్రాశస్త్యము.

శ్లో॥ ద్విర్ద్వాదశేవాసుఖకర్మకేవా షష్ఠాష్టకే రాక్షసయోషితోవా । ఏకాధిపత్యేభవనేశమైత్ర్యే శుభాయపాణిగ్రహణంవిధేయం ॥ ౫౦ ॥

తా॥ రాశికూటమున ౨-౧౨ గానుండినను, ౪-౧౦ గానుండినను, ౬-౮ గానుండినను, స్త్రీ రాక్షసంబైనను, గ్రహమైత్రిలోనేకాధిపత్యముగానుండిన పక్షమున వివాహమునుమంగళకరంబుగాచేయవచ్చునని వశిష్ఠవచనము.

33. రాశికూట విచారము.

శ్లో॥ ద్వికేద్వాదశకేమృత్యురాయుర్ద్వాదశకేద్వికే ।
తృతీయైకాదశేదుఃఖంసుఖమేకాదశత్రికే ॥ ౯౧ ॥
చతుర్థదశకేనిస్స్వంధనందశచతుర్థకే ।
అశుభంపంచనవమే శుభంస్యాన్నవ పంచమే ॥ ౯౨ ॥
షష్ఠాష్టకేపుత్రనాశఃపుత్రలాభోష్టషష్ఠకే ।
సమసప్తేతుమాంగల్యందంపత్యోః ప్రీతివర్ధనం ॥ ౯౩ ॥

తా॥ స్త్రీరాశినుండి చూచికొనునది. స్త్రీరాశికిపురుష రాశి౨అయితే మృత్యువు; ౧౨ అయితే ఆయువృద్ధి; 3 అయితేదుఃఖము; ౧౧ అయితే సుఖము; ౪ అయిన దారిద్య్రము; ౧౦ అయినధనము; ౫ అయితే అమంగళము; ౯ అయిన మంగళకరము; ౬ అయిన పుత్రనాశనము; ౮ అయిన పుత్రలాభము; ౭ వయిల్లయినచోమిక్కిలి శుభకరమైదంపతులకు ప్రీతినిచ్చునని గర్గవచనంబులు-

శ్లో॥ మీనాళిభ్యాం యుతే కీటేకుంభే మిథునసంయుతే ।
మకరేకన్యకాయుక్తే నకుర్యాన్నవపంచమే ॥ ౯౪ ॥

తా॥ వధూవరరాసులు కర్కి—వృశ్చికమీనంబులైనపుడును, మిథునకుంభములయినపుడును. మకరకన్యలయినపుడును; నవపంచక రాశికూటముకూడి రాదని శుక్రవచనము.

శ్లో॥ ద్విర్ద్వాదశం శుభంప్రోక్తం మీనాదాయుగరాశిషు ।
మేషాదాయుగ్మరాశౌతునిర్ధనత్వంనసంశయః ॥ ౯౫॥

శ్లో॥ ఆయుష్యసంప త్సుతభోగసంప ।
త్పుత్రార్థసంప త్పతిసౌఖ్యసంపత్ ।
సౌభాగ్యసంపద్ధన ధాన్యసంప ।
ఝషాదియుగ్మే క్రమతః ఫలాని ॥౯౬॥
అజాదియుగ్మే క్రమతః ఫలాని ।
వైధవ్యమృత్యుర్వధబంధనాని ।
వియోగసంతాప మతీవదుఃఖం।
వసిష్ఠగర్గప్రముఖైః స్మృతాని ॥ ౯౭ ॥

తా॥ మీనము మొదలు రెండురెండు రాసులలో వధూవరులకు ద్విర్ద్వాదశరాశికూటంబై యుండినపక్షమున శుభంబు. మేషాదిగారెండేసి రాసులలో నశుభంబు. మఱియు,మీన మేషములయితే ఆయుస్సంపద; వృషమిథునములు పుత్రభోగ సంపద; కర్కాటసింహములు పుత్రధన సంపద; కన్యాతులలు పతి సౌఖ్యసంపద; వృశ్చికధనుస్సులు సౌభాగ్యసంపద;మకరకుంభ ములుధనధాన్యసంపదనిచ్చుచుండును. అట్లై మేషవృషభములు వైధవ్యమును,మిథునకర్కాటములు మృత్యువును- సింహాకన్యలువధను, తులావృశ్చికములు బంధనమును, ధనుర్మకరములు వియోగసంతాపంబును. కుంభమీనములు మిక్కిలిదుఃఖమునిచ్చునని ఫలవిశేషంబును గర్గవశిష్ఠవచనంబులు పలుకుచున్నవి.

## ౩౪. నాడీకూట విచారము.

శ్లో॥ నాడీకూటంతుసంగ్రాహ్యంకూటానాంతుశిరోమణిః ।
బ్రహ్మణాకన్యకాకంఠసూత్రత్వేనవినిర్మితం ॥ ౯౮॥

తా॥ బ్రహ్మచేతకన్యకకు మాంగల్యబలంబును చూపునట్లు చెప్పంబడిన నాడీకూటమును చక్కగాపరిశీలించ వలయునని గర్గవచనంబు.

శ్లో॥ చతుః పత్కన్య కాఋక్షం గణయే దశ్విభాదికం ।
త్రిభంసవ్యాపసవ్యేన భిన్నంపర్వసుఖావహం ॥ ౯౯ ॥
కన్యకర్క్షంత్రిపాచ్చేత్స్యాద్గణయే త్కృత్తికాదికం ।
చతుర్భిఃపర్వభిస్తద్వదభిజిత్తారకాన్వితం ॥ ౧౦౦॥
కన్యకర్క్షంద్విపాచ్చేత్స్యాద్గణయేత్సౌమ్యభాదికం ।
పంచభిస్త్వవరోహేతు పంచమాంగుళివర్జితే ॥ ౧౦౧ ॥

శ్లో॥ సంశ్లిష్టామధ్యనాడీ తుపురుషంహంతివేగతః ।
సంశ్లిష్టాపార్శ్వనాడీతు కన్యకాంహంత్యసంశయం ॥

తా॥ స్త్రీపురుష నక్షత్రంబులు మధ్యనాడిలో చేరియుండిన పురుషుని జంపును. పార్శ్వనాడిలో చేరియుండిన కన్యకను చంపును. అని గర్గ వచనములు. ఆనాడీభేదము నెఱుంగునది యెట్లనిన;—నక్షత్రములు మూడు తెఱంగులుగా నుండును. (౧) అశ్విని, భరణి, రోహిణి, ఆర్ద్ర, పుష్యమి, ఆశ్లేష, మఖ, పుబ్బ, హస్త, స్వాతి, అనూరాధ, జ్యేష్ఠ, మూల, పూర్వా

షాఢ, శ్రవణ, శతతార, ఉత్తరాభాద్ర, రేవతి, - ఈ ౧౮ నక్షత్రంబులును చతుః పాద నక్షత్రంబు లనంబడును. వీట్లిలో పుట్టిన కన్యకకు అశ్విని మొదలుగా మూడేసి సవ్యాపసవ్యముగా, నెంచుచు వచ్చిన నడి వ్రేలిలో వధూవరుల నక్షత్రంబులు రెండును చేరితే మధ్యైకనాడి యనియును ప్రక్క వ్రేళ్లలో చేరిన పార్శ్వనాడి యనియును, వెవ్వేరుగానుండిన శుభకరంబనియును, ఎంఱుంగనగును. (౨). కృత్తిక, పునర్వసు, ఉత్తర, విశాఖ, ఉత్తరాషాఢ, అభిజిత్తు, పూర్వాభాద్ర;—ఈ ౭ నక్షత్రంబులు త్రిపాద నక్షత్రంబులు ; వీట్లలో పుట్టిన కన్యకకు, అభిజిత్తును కూడ కలుపుకొని నాల్గేసి నక్షత్రంబులుగా కృత్తిక మొదలుకొని సవ్యాపసవ్యముగా నెంచుచు రావలయును ; దీనిలోను భిన్ననాడిగా నుండిన మంచిది. (3) మృగశిర, చిత్ర, ధనిష్ఠ ;—ఇవి మూడును ద్విపాన్నక్షత్రంబు లనంబడును. వీట్లలో పుట్టిన కన్యకకు ఐదేసి నక్షత్రంబులుగా మృగశిర మొదలుకొని యెంచుచు వెనుకకు దిఱుగునపుడు అయిదవ వేలునువదలుచు నెంచిన ౨౭ నక్షత్రంబులు సరిబోవును ; దీనిలోను భిన్ననాడి శుభకరము.

## 3౫. నాడులకు దేశభేదవ్యవస్థ.

శ్లో॥ చతుర్నాడీత్వహల్యాయాం పాంచాలేపంచనాడికా ।
త్రినాడీసర్వదేశేషు వర్జనీయాఃప్రయత్నతః ॥ ౧౦3 ॥

తా॥ అహల్యాదేశమున చతుర్నాడికా ప్రభేదమును ; పాంచాల దేశమున పంచనాడికా ప్రభేదమును ; అంతట నన్నిదేశంబులలోను త్రినాడికా ప్రభేదమును అనుసరించి పార్శ్వైకనాడులను వదలి భిన్ననాడీకూట

ము స్వీకరించ నగునని నారదవచనము. కావున, సర్వత్ర త్రినాడీ ముఖ్యము. అశ్వి, ఆర్ద్రి, పున, ఉఫ, హ, జ్యే, మూ, శత, పూభా:—ఇదియొక పార్శ్వనాడియొక్క వరుస. కృ, రో, ఆశ్లే, మఖ, స్వాతి, విశా, ఉషా, శ్రవ, రేవ:—ఇదియొక పార్శ్వనాడియొక్క వరుస. భర, మృగ, పుష్య, పూఫ, చిత్ర, అనూ, పూషా, ధని, ఉభా:—ఇది మధ్యనాడియొక్క వరుస. వీటిలో నొక్కొకవరుసలో వధూవర నక్షత్రంబులు చేరియుండరా దని భావము.

## ౩౬. నాడీకూటాపవాదము.

శ్లో॥ దంపత్యోర్జన్మనక్షత్రే ఏకనాడీగతేయది ।
తయోఃపరస్పరం నిత్యమత్యంతకలహోభవేత్ ॥
దంపత్యోరేకరాశిత్వేభిన్న మృక్షంభవేద్యది ।
నక్షత్రైక్యేభిన్నరాశౌనాడీదోషోనవిద్యతే ॥ ౧౦౫॥

తా॥ దంపతుల నక్షత్రంబులు ఏకనాడిలో చేరియుండిన వారికి సంతతము కలహముగా నుండును. (మరణ భయము చెప్పబడలేదు.) మఱియు, దంపతుల నక్షత్రమొకటే అయి రాశిభేదమున్నను ; రాశియొకటైయై నక్షత్రభేదమున్నను ; ఈనాడీ దోషవిచార మక్కర లేదనియును - ఇంకయును; —

శ్లో॥ కరగ్రహేపృష్ఠనాడ్యా ననింద్యేఇతియద్వచః ।
తత్ క్షత్రియాదివిషయం గౌతమ్యాయామ్యత స్తథా ॥

తా॥ వివాహమున పార్శ్వనాడీ నింద్యముకాదను మాట బ్రాహ్మ ణేతరులకు క్షత్రియాదులలో పాటింపనగును. మఱియు, నీనాడీదోషము గోదావరికి దక్షిణముననుండు వారికి నక్కఱలేదు. అని జ్యోతిర్ని బంధ జ్యోతిః ప్రకాశ వచనంబులు.

౩౭. నాడీకూటవేధ, తత్ఫలంబును.

శ్లో॥ ఏకనాడీస్థితాయత్రగురుమంత్రాశ్చదేవతాః ।
తత్రద్వేషంరుజం మృత్యుంక్రమేణఫలమాదిశేత్ ॥
ప్రభుఃపణ్యాంగనామిత్రం దేశంగ్రామంపురంగృహం ।
ఏకనాడీస్థితంభవ్యం విరుద్ధంవేధవర్జితం ॥ ౧౦౪ ॥
ఆద్యాంశేనచతుర్థాం శంచతుర్థాంశేనచాదిమం ।
ద్వితీయేనతృతీయంతు తృతీయేనద్వితీయకం ॥ ౧౦౫ ॥
ఏవంభాంశవ్యధోయెషాం జాయతేవరకన్యయోః ।
తేషాంమృత్యుర్నసందేహః శేషాంశాంస్స్వల్పదోషదాః॥

తా॥ ఈ నాడీదోషము నంతట చూడదగినది, ఎట్లనిన గురుశిష్యవ్య నక్షత్రంబు లేక నాడిలోనుండిన ద్వేషమును కలిగించును. మంత్ర మంత్ర జాపకులలోనుండిన రోగములుగల్గును. దేవతోపాసకులలో నుండిన మృత్యువు నిచ్చును. ప్రభు సేవకులలో వైరమునిచ్చును; మిత్రులలో కల హప్రదము ; లంజరికమున ననర్థప్రదము ; ఇట్లే దేశవాసమునకు, గ్రామవా

సమునకు, పురనివాసమునకు, గృహమునకు నాడీదోష మావశ్యకము. దీని లో నంశ వేధగలదు. అనిన నిరువురి నక్షత్రంబులలో పుట్టిన పాదంబుల నైతింగి చూచికొనునది. ౧-౪; ౪-౧; ౨-౩; ౩-౨; పాదములుగా నుండిన నాకన్యావరులకు మృత్యుప్రదము. అని స్వరోదయ గ్రంథమున చెప్పంబడియున్నది. ఈపాద వేధను వేధలను చెప్పెడు స్థలములయందంతట గ్రహించవలయుననునది సూచనము.

## ౩౮. నాడీదోష పరిహారక శాంతి.

శ్లో॥ దోషాపనుత్తయేనాడ్యా మృతుంజయజపాదికం ।
విధాయ బ్రాహ్మణాంశ్చైవతర్ప యేత్కాంచనాదినా ॥
హిరణ్మయీందక్షిణాంచ దద్యాద్వర్ణాదికూటకే ।
గావోన్నంవసనంహేము సర్వదోషాపహారకం ॥ ౧౧౨॥

తా॥ నాడీదోష పరిహారమునకై మృత్యుంజయజపంబు, గోదానము వస్త్రిదానము అన్నదానము సువర్ణదానము ప్రశస్తము. ఇవి సమస్త దోషంబులను పరిహరించును. అని గురువచనంబులు.

తా॥ ఈవరకు దైవజ్ఞమనోహర కారాదులు వాడెన అష్టకూటవిచారంబైనది. వీటిలో గుణాధిక్యముం జూచికొని వధూవర ఘటితార్థము గ్రాహ్యంబైయుండును. ఇంక మునిమత భేదముల ననుసరించి తక్కిన కూటంబులు చెప్పంబడి యున్నవి. ఎట్లనిన;—

## ౩౯. మాహేంద్రకూట విచారము.

శ్లో॥ మాహేంద్రస్తుచతుస్సప్త దశమానిత్రయోదశ।
షోడశైకోనవింశత్యోర్ద్వావింశః పంచవింశతిః ॥ ౧౧౩॥
వధ్వాదివరనక్షత్ర మేతత్సంఖ్యాకముత్తమం।
దినకూటే ప్రశస్తేతు నాయందోషోనబాధకః ॥ ౧౧౪ ॥

తా॥ వధూనక్షత్రము మొదలు వరనక్షత్రము ౪-౭-౧౦-౧౩-౧౬-౧౯-౨౨-౨౫ వదిగానుండిన మాహేంద్ర కూటము కూడి వచ్చినట్లు; ఇది యుత్తమ ఫలదంబు. దినకూటము మిక్కిలి ప్రశస్తముగా నుండినదీని దోషములేదు.

## ౪౦, రజ్జుకూట విచారము.

శ్లో॥ అశ్వీసార్పమఖాజ్యేష్ఠా మూలాంత్యాపాదరజ్జుగాః।
యామ్యైజ్యభగమైత్రాపోత్తరాభాద్రాశ్చజానుగాః ॥
వహ్న్యదిత్యార్యమైంద్రాగ్నవిశ్వపూర్వాస్తునాభిగాః
బ్రాహ్మారుద్రకరస్వాతీ శ్రోణావారుణకంఠగాః ॥ ౧౧౬ ॥
వసుచిత్రేందుతారాస్తుజ్ఞే యామస్తకరజ్జుగాః।
శిరోరజ్జుఃపతింహంతి కంఠరజ్జుఃస్త్రియంహరేత్ ॥
నాభౌసంతానభంగశ్చ జానోరోగాదిపీడనం।
పాదేవియోగదుఃఖచభిన్నరజ్జుశ్శుభావహః ॥ ౧౧౭ ॥

తా॥ దంపతుల నక్షత్రంబులు ఒకటేరజ్జువునందుండరాదు. భిన్న రజ్జువుగానుండిన శుభఫలదంబు. అశ్వి, ఆశ్రే, మఖ, జ్యే, మూ, రేవ ;— ఇవి పాదరజ్జు నక్షత్రములు, దంపతులకు విరహదుఃఖము నిచ్చును. భర, పుష్య, పూఫ, అనూ, పూషా, ఉభా ;—ఇవి జానురజ్జువు; ఇది రోగప్రదము. కృకా, పున, ఉఫ, విశా, ఉషా, పూభా ;—ఇవి నాభిరజ్జువు, ఇది సంతాన భంగమునిచ్చును. రో, ఆర్ద్ర, హస్త, స్వాతి, శ్రవ, శత ;—ఇవి కంఠరజ్జువు; ఇది కన్యకకు హానినిచ్చును. మృ, చి, ధని ;—ఇవి శిరోరజ్జు ఇది వరునికిని హాని నిచ్చును.

## ౨౮. రజ్జుకూటాపవాదము.

శ్లో॥ దినమాహేంద్రరాశీశరాశివర్గాశ్శుభాయది ।
రజ్జువర్గస్త్వభావోపినాయందోషోనబాధకః ॥ ౧౧౯ ॥

తా॥ దినకూటము, మాహేంద్రకూటము, గ్రహమైత్రి, రాశికూటము ;—ఇవి కూడి వచ్చియుండినచో, రజ్జుకూటమున నేకరజ్జువైనను దోషము లేదు. చెడుగు చేయదు

## ౨౯. వేధాకూట విచారము.

శ్లో॥ అశ్వినీజ్యేష్ఠయోర్వేధా. భరణీమైత్రయోస్తథా ।
విశాఖాకృత్తికావిద్ధా రోహిణీస్వాతివేధకృత్ ॥ ౧౨౦॥
మృగశీర్షోత్తరాషాఢాం పూర్వాషాఢాచరౌద్రభం ।
వేధోమూలపునర్వస్వోః పుష్యమిత్రశతతారయోః ॥

ధనిష్ఠాశ్లేషయోర్వేధో మఖాశ్రవణయో స్తథా ।
పూర్వఫల్గున్యభిజితోః వేధస్స్యాదర్యమాంత్యయోః।
హస్తాహిబుర్ధ్న్యయోశ్చిత్ర ప్రోష్ఠపద్యోరితిక్రమాత్ ॥
దంపత్యోర్విద్ధనక్షత్రే విప్లవపరస్పరం ॥ ౧౩ ॥

తా॥ అశ్వినికి జ్యేష్ఠ; భరణికి అనూరాధ; కృత్తిక విశాఖలు; రోహిణీ స్వాతులు; మృగశిరోత్తరాషాఢలు; ఆర్ద్ర పూర్వాషాఢలు; మూల పునర్వసువులు; పుష్య మీ శతతారలు; ధనిష్ఠాశ్లేషలు; మఖాశ్రవణములు; అభిజిత్పూర్వఫల్గునీలు; ఉత్తరఫల్గునీ రేవతులు; హస్తోత్తరాభాద్రలు; చిత్రజ్యేష్ఠలు; ఇవి పరస్పర వేధగల్గిన నక్షత్రములు. ఈవేధ గల నక్షత్రంబులు దంపతుల నక్షత్రములుగా నుండిన వారును పరస్పర వేధల నందెదరని భావము.

## ౪౩. స్త్రీదీర్ఘ కూటము.

శ్లో॥ వధూనక్షత్రమారభ్య నవభాదూర్ధ్వసంస్థితం ।
వరణంశుభగంప్రోక్త మిత్రిదైవవిదాంవరైః ॥ ౧౪ ॥

తా॥ వధూ నక్షత్రమునుండి వరుని నక్షత్రమువరకు నెంచిన తొమ్మిది నక్షత్రములు దాటి యుండిన నాపాంతనము శుభకరము.

## ౪౪. మాహేంద్రాదులకు దేశవ్యవస్థ.

శ్లో॥ మాహేంద్రంగౌడదేశేచ మాళవేరజ్జుసంజ్ఞకం ।
వేధావర్గస్తుగాం ధారేస్త్రీదీర్ఘంకేరళేమతం ॥ ౧౫॥

తా॥ దేశాచారముంబట్టి—గౌడదేశమున మాహేంద్రకూటమును, మాళవదేశమున రజ్జుకూటమును, గాంధారదేశమున వేధాకూటమును ; కేరళదేశమున స్త్రీదీర్ఘమును ; ముఖ్యముగా భావించి పాటింతురనుట.

౪౫. ప్రకారాంతరముగా గుణపరిజ్ఞానము.

శ్లో॥ మాహేంద్రవేధావర్ణానాం గుణౌద్వౌదినవశ్యయోః ।
గణస్త్రీదీర్ఘరాశీనాంయోనేశ్చాథత్రయోగుణాః ॥
చత్వారోరజ్జుకూటస్య నాడ్యాఃపంచగుణాఃస్మృతాః ।
షడ్గుణాగ్రహమైత్ర్యాస్తు సప్తత్రింశద్గుణాస్స్మృతాః ॥
సద్భావేముఖ్యకూటస్యత్రి గుణాధిక్యమాప్నుయాత్ ।
తావంతఏవదోషా అప్యశీతిగుణదోషకే ॥ ౧౨౯ ॥
దోషాధిక్యంనకుర్వీతిం గుణాధిక్యంశుభంస్మృతం ।
చతుర్వింశతిసంఖ్యాకా ద్విశ్యం తేయదితద్గుణాః ॥
ఉత్తమంవింశతేనూన్యైనంవివాహంనైవకారయేత్ ।
ఘటితార్థవిచారే స్యాదిత్థందైవజ్ఞసంమతం ॥ ౧౩౦ ॥

తా॥ మాహేంద్రము ౨ ; వేధా ౨ ; వర్ణము ౨ ; దినము ౨ ; వశ్యము ౨; గణము 3 ; స్త్రీదీర్ఘము 3 ; రాశి 3; యోని 3; రజ్జు ౪; నాడీ ౫; గ్రహమైత్రి ౬ ; వెరసి 3౭ గుణంబులు. వీట్లిలో ప్రధానకూటములు పొసగియుండిన 3 గుణములు చేర్పవలయును ; వెరసి ౪౦ గుణములు ; అంత

యే దోషములు ; ఈ గుణదోషములు ౩౬-లో ౧౮ గుణంబులకన్నను అధికముగా గుణములు వచ్చిన పక్షమున వివాహము శుభదంబు. ౧౦ గుణములకన్నను తక్కువగా గుణములు వచ్చిన నావివాహమును చేయరాదు. ఇది జ్యోతిర్వేత్తలకు సంమతంబైనది. అని యీవరకు ప్రాచీనాచార్య సూక్తులు.

## ౧౬. వర్గకూట విచారము.

శ్లో॥ అకచటతపయశవర్గాః। ఖగేశమార్జారసింహశునాం ॥
సర్పాఖుమృగవీనాం। నిజపంచమవైరిణామష్టౌ॥౧౩౧॥

తా॥ నామకరణప్రకరణమున చెప్పియుండు చూ-చే-చో-లా-అశ్వినీ త్యాదిక్రమమున వధూవరులకు నామనక్షత్ర వర్ణములను గ్రహించునది. అందు, అకారాది స్వరములు అవర్గము, కచట తపలు నీ దేని వర్ణములు కవర్గలు, యరలవలు యవర్గ, శషసహలు శవర్గము, ఇట్లు ౮ వర్గలుగా గ్రహించునది. వధూవర నామంబులు ఏవర్గలోనున్నది తెలియును. పిదప, అవర్గ గరుడుడు ; కవర్గ పిల్లి ; చవర్గ సింహము, టవర్గ కుక్క ; తవర్గ సర్పము ; పవర్గ యెలుక ; యవర్గ జింక ; శవర్గ మేక ; అని వర్గయోనుల నెఱుంగవలయును. వీటిలో ఏవర్గమైనను వరుసగా నయిదవ వర్గవైరము, అనగా గరుడ సర్పములకును, మార్జార మూషకంబులకును, సింహమృగంబులకును, కుక్క మేకలకును, పరస్పర శత్రుత్వము. వధూవర నామంబులు వైరివర్గలలో నుండరాదు. ఈ వర్గకూటమును పురగ్రామ గృహమిత్ర సేవక స్వామి ప్రభు గురువులు మొదలగు నన్నిటియందును చూచికొనవచ్చును. ఇది ముహూర్త చింతామణివచనము.

## ౮౭. ప్రాంతనమున నామనక్షత్ర గ్రహణము.

శ్లో॥ అవిజ్ఞాతేతుజన్మర్క్షే నామర్క్షాదపిగణ్యతాం ।
స్త్రియ స్తునామభిః పుంసోజన్మర్క్షం శుభ మేవహి ॥
పుంసోనామస్త్రియోజన్మ నయోగ్యంగణనాదిషు ।
ఉభయోర్నామనక్షత్రంశుభంవయసిచోత్తరే ॥౧౩౩॥

తా॥ జన్మనక్షత్రములు తెలియక పోయినపుడు నామనక్షత్రముల నుండియు ప్రాంతనములను చూచి కొననగును. స్త్రీకి నామనక్షత్రము పురుషునికి జన్మనక్షత్రమైనను శుభదంబే. స్త్రీకి జన్మనక్షత్రము పురుషునికి నామనక్షత్రము గణనకు తగదు. వయస్సుచెల్లిన, వారికి నామ నక్షత్రంబులు సర్వోత్తమంబులు. ఇంక "ఉభయోర్జన్మ నక్షత్రం సర్వోత్తమము దాహృతం" ఇరువురిది జన్మనక్షత్రంబులే అయినచో ఉత్తమోత్తమంబని భావము.

శ్లో॥ కుర్యాత్షోడశకర్మాణి జన్మరాశౌబలాన్వితే ।
సర్వాణ్యన్యానికర్మాణి నామరాశౌబలాన్వితే ॥౧౩౪॥

తా॥ గర్భాధానాది షోడశకర్మలయందును జన్మనక్షత్రముమీద బలా బలంబులు. తక్కిన సమస్త వ్యవహారంబులలోను నామనక్షత్రము మీద బలాబలంబులు గ్రాహ్యంబని వసిష్ఠవచనంబు.

## ౪౮. వధూవరనక్షత్ర రాశ్యైక్యవిచారము.

శ్లో॥ ఏకరాశౌపృథగ్ధిష్ణ్యేదంపత్యోః పాణిపీడనం ।
ఉత్తమంమధ్యమం భిన్నరాశ్యైకర్ క్షగయో స్తయోః॥

తా॥ దంపతుల నక్షత్రములు వేరుగానుండి రాశి యొకటయినను; నక్షత్ర మొకటియై రాశిభేదము గల్గియుండినను, ఆవివాహము కావచ్చునని నారదవచనము. "ఏకర్క్షైక రాశౌచ వివాహః ప్రాణ హానిదః" ఒకేరాశిలో నొకటేనక్షత్రముగా నుండిన నావివాహము ప్రాణహాని నిచ్చుననియు నారదవచనము.

శ్లో॥ ఏకగృహాసంభవానాం ।
భవతివివాహ స్సుతార్థసంపత్త్యై ॥
యద్యుభయోరేకర్క్షం ।
భవతియదాచాంశకోభిన్నః ॥ ౧౩౬ ॥

తా॥ వధూవరనక్షత్రంబులు ఏకరాశిలో నుండినను, ఒకవేళ యిరువురి నక్షత్రంబు నొకటేయైనను వారు జనించిన నక్షత్రపాదంబులైనను వేర్వేరుగానుండినచో నావివాహంబు సుతార్థ సంపత్ప్రదంబుగా నుండునని వసిష్ఠవాక్యము.

శ్లో॥ విశాఖికార్ద్రశ్రవణప్రజేశ ।
తిష్యాంత్యతత్పూర్వమఖాఃప్రశస్తాః ॥

 ముహూర్త రత్నావళియందు.

స్త్రీపుంసతారైక్య పరిగ్రహేతు ।
శేషావివర్జ్యా ఇతిసంగిరంతి ॥ ౧౩౭ ॥

తా॥ విశా, ఆర్ద్ర, శ్రవణ, రోహి, పుష్య, రేవతి, ఉత్తరాభాద్ర, మఖ;—ఈ ౮ నక్షత్రంబులలో జనించిన వధూవరులను ఏకనక్షత్రంబైనను వివాహము శుభదంబు. తక్కినవి పనికి రావు.—అని విధి రత్నవచనము.

## ౪౯. ఏకవింశన్మహా దోషంబులు.

శ్లో॥ ఏకవింశతిదోషాణాం నామరూపఫలానిచ ।
పితామహోక్తం సంవీక్ష్యతానివక్ష్యేసమాసతః ॥
పంచాంగశుద్ధిరహితోదోషస్త్వాద్యఃప్రకీర్తితః ।
ఉదయాస్తశుద్ధి హీనోద్వితీయస్సూర్యసంక్రమః ॥
తృతీయఃపాపషడ్వర్గో భృగుష్షష్ఠఃకుజోష్టమః ।
గండాంతంకర్తరీ రిష్ఫషడష్టేందుశ్చసంగ్రహః ॥
దంపత్యోరష్టమలగ్నంరాశిర్విషఘటీతథా ।
దుర్ముహూర్తోవారదోషః ఖార్జూరికసమాంఘ్రిభం ॥
గ్రహణోత్పాతభంక్రూరవిద్ధర్క్షం క్రూరసంయుతం ।
కునవాంశోమహాపాతోవైధృతిశ్చైకవింశతిః ॥౧౪౨॥

తా॥ ఇరువదియొక మహాదోషంబులు నామంబులకు తగినట్లు ఫలప్రదంబులు. బ్రహ్మప్రోక్తంబులైన వాటి నెఱింగి చెప్పుచున్నాను. ౧ పంచాంగశుద్ధిలేకపోవుట ; ౨ గ్రహోదయాస్త శుద్ధిలేకపోవుట ; ౩ సూర్యసంక్రమణంబు ; ౪ పాపగ్రహ షడ్వర్గగల్గుట ; ౫ భృగుషట్కము ; ౬ కుజాష్టమము ; ౭ గండాంతము ; ౮ కర్తరీయోగము ; ౯ చంద్రుడు లగ్నమునకు ౬-౮-౧౨లో నుండుటయు, సంగ్రహదోషంబును ; ౧౦ దంపతులు జన్మలగ్నమునకు వివాహలగ్నము ఎన్మిదవదగుట ; ౧౧ లగ్నమునకు త్యాజ్యసంపర్కము ; ౧౨ దుర్ముహూర్తము సవారతుల యోగజన్య దుష్కాలము ; ౧౩ వారదోషమనిన కులికాదులు ; ౧౪ ఖార్జూరయోగము ; ౧౫ ఉపగ్రహదోషము ; ౧౬ ఉత్పాత నక్షత్రము ; ౧౭ క్రూరగ్రహ వేధగల్గిన నక్షత్రము ; ౧౮ క్రూరగ్రహయుతలగ్నము ; ౧౯ క్రూరగ్రహయుతనవాంశ ; ౨౦ మహావ్యతీపాత ; ౨౧ మహావైధృతి ; ఇవి ౨౧ యును మహాదోషంబులని నారద వచనంబులు.

## ౫౦. ఏతన్మహాదోషయుక్తకాలమున ఫలవిశేషము.

శ్లో॥ ఏకవింశన్మహాదోషాస్త్వేతేబ్రహ్మముఖోదితాః ।
కదాచిన్నైవసీదంతి గుణానాంకోటికోటిభిః ॥ ౧౪౩ ॥
తస్మాదేతేషుదోషేషుకదా చిన్నాచరేచ్ఛుభం ।
వివాహేవిధవానారీ మరణంవ్రతబంధనే ॥ ౧౪౪ ॥
గ్రామనాశఃప్రతిష్ఠాయాం సీమంతేగర్భనాశనం ।
నవాన్నభోజనేమృత్యుః కృషౌతత్ఫలనాశనం ॥ ౧౪౫ ॥

కర్తుర్నాశోగృహారంభే ప్రవేశేపతినాశనం ।
యాత్రాయాంకర్తునాశస్స్యాద్యుద్ధయానేవిశేషతః ॥

తా॥ వసిష్ఠవచనంబులు వీట్లకు ఫలంబులను చెప్పుచున్నవి:—ఈ దోషంబులు బ్రహ్మముఖోదితంబులు; పరస్సహస్ర గుణంబులున్నను ఇవి తమ దోషఫలము నివ్వకమానవు. (అనిన గుణములేక పోయినను దోషరాహిత్యముగ లగ్నమును కుదుర్చుకొని సాధింపవలయునని సూచనంబు.) కావున ఈ దోషయుక్తకాలంబులలో శుభము నాచరింపరాదు. ఏమనిన ;— వివాహముచేసితే కన్యవిధవయగును ; ఉపనయము చేసిన వటువుకుహాని గ్రామప్రతిష్ఠచేసిన గ్రామముపాడు ; సీమంతముచేసిన గర్భనాశనము ; అన్నప్రాశనమున మృత్యువు; వ్యవసాయమున పంటపాడు; ఇల్లుకట్టినకట్టించినవాడు చచ్చును ; గృహప్రవేశము చేసితే యజమానుడు బ్రతుకడు; ప్రయాణముచేసిన వాడు నాశమునందును ; యుద్ధమున హాని ; కావున నివి తగవు. మఱియును "లభ్యతేసుమహాత్పుణ్యామేషు శ్రాద్ధాదికర్మభిః" =ఇట్టిదోషయుక్త కాలంబులలో శ్రాద్ధాదికర్మలం జేసినచో ననంతపుణ్యఫలదంబుగా నుండును. అనియును వసిష్ఠవచనము.

౫౧. మతాంతరమున దశదోషంబులు.

శ్లో॥ వేధశ్చలత్తాచ తథాచపాతః ।
ఖార్జూరయోగో దశయోగచక్రం ॥
యుతిశ్చజామిత్ర ముపగ్రహశ్చ ।
బాణాఖ్యవజ్రాదశచైవదోషాః ॥ ౧౪౭ ॥

తా॥ క్రూరగ్రహ వేధగల్గిన నక్షత్రము; క్రూరగ్రహాలత్తనందిన నక్షత్రము; ౩ మహాపాతలు; ౪ ఖార్జూరయోగము, అనగానే కార్గళదోషము; ౫ దశయోగచక్రము; ౬ క్రూరగ్రహ సమాయోగము; ౭ జామిత్రమనగా సప్తమ శుద్ధిలేకపోవుట; ౮ ఉపగ్రహాంబులు; ౯ పంచక దోషము; ౧౦ వజ్ర దోషము ఇవి ౧౦ వివాహమున వర్జ్యములని వ్యవహార సముచ్చయ వచనము.

అవతారిక ॥ ఈపైనచెప్పిన ౨౧ మహాదోషంబులలో మొదటి మూడును ఈవరకే వెనుక చెప్పఁబడినవి. ఇఁక వరుసగా నాదోషవిచారము చేయంబడును; ఎట్లనిన ;—

## ౫౨. షడ్వర్గ దోషవిచారము.

శ్లో॥ సింహస్యాధిపతిస్సూర్య శ్చంద్రఃకర్కటకేశ్వరః ।
మేషవృశ్చికయో ర్భౌమఃకన్యామిథునయోర్బుధః ॥
ధనుర్మీనయోర్దేవేజ్యశ్శుక్రో వృషతులేశ్వరః ।
శనిర్మకరకుంభేశః ఇత్యేతేరాశినాయకాః ॥ ౧౪౯ ॥

తా॥ మేషాది ౧౨ రాసులకును, కుజ శుక్ర బుధ చంద్ర రవి బుధ శుక్ర కుజ గురు శని శని గురువులు నాయకులు. అని నారదవచనము. ఇది మొదటి వర్గకావున శుభగ్రహలగ్నమైన శుభము.

శ్లో॥ నవమాంశామేషసింహ చాపమేషాదయఃక్రమాత్ ।
క్రమాద్గోమృగకన్యాసు జ్ఞేయాస్స్యుర్మకరాదయః ॥

తులామిథున కుంభేషు స్యుశ్శ్రక్రమేణతులా దయః ।
అళికర్కటమీనేషు క్రమాత్స్యుఃకర్కటాదయః॥ ౧౪౧ ॥

తా॥ లగ్నమును తొమ్మిదిపాళ్లు చేసికొని ముహూర్త సమయమును శుభగ్రహాధి పత్యమగు భాగమున పెట్టవలయును. అందుకై, నాలుగు త్రికోణంబులనగా మేష సింహ ధనుస్సులు లగ్నమైన మేషాదిగా తొమ్మిదిపాళ్లు, వృష కన్యా మకరంబులయితే మకరమునుండి ౯ పాళ్లు, మిథున తులాకుంభములయితే తులనుండి ౯ పాళ్లు; కర్కీవృశ్చిక మీనంబులుగా నుండిన కర్కాటకమునుండి ౯ పాళ్లుపంచి, శుభగ్రహాధిపత్యనవాంశ వచ్చునట్లు లగ్నమును పెట్టవలయును. అటులేనున్న షడ్వర్గలో నిది రెండవవర్గ దోషమనంబడును, అని నారదవచనము.

శ్లో॥ సమగృహ మధ్యే । శశిరవిహోరా ॥
విషమభ మధ్యే । రవిశశినోస్సా ॥ ౧౪౨॥

తా॥ "హోరార్కేందోర్వోజరాశౌ సమభేచంద్రసూర్యయోః" అను నారదవచనంబుం బట్టి, మేష, మిథున, సింహ, తులా, ధనుః, కుంభంబులను ఓజ రాశిగానుండిన రెండుపాళ్లు చేసి మొదటి పాలుకు సూర్యుడనియును రెండవపాలుకు చంద్రుడనియును హోరానాయకుల నేర్పరచుకొనునది; తక్కిన ౬ రాసులు యుగ్మరాసులుగాన వాటిలో మొదటి సగమునకు చంద్రుడనియును పిదప సగమునకు సూర్యుడనియును తెలియవలయునని చింతామణివచనము. ఇది మూడవవర్గ.

శ్లో॥ కుజార్కిజ్యజ్ఞ శుక్రాణాం బాణేష్వష్టాద్రి మార్గణాః ।
భాగాస్స్యుర్విషమేతేతు సమరాశౌ విపర్యయాత్ ॥

తా॥ లగ్నమును ౩౦ భాగములు చేసికొని వరుసగా-౫కు-౫ శని ౮ గురు, ౭ బుధుడు, ౫ శుక్రుడు; ఇట్లు ఓజరాసులలోను; అట్లే వరుసగా ౫ శుక్రుడు, ౭ బుధుడు, ౮ గురుడు, ౫ శని ౫ కుజుడు; ఇట్లు యుగ్మరాసులలోను పంచివేసి శుభగ్రహత్రింశాంశ్యలో ముహూర్తము గ్రాహ్యమైయుండును. అటుగాకున్న షడ్వర్గదోషమున నిది నాల్గవవర్గ దోషమన బడును. ఇది నారదవచనము,

శ్లో॥ స్యుర్ద్రేక్కాణాలగ్నపంచనవరాశీశ్వరాః క్రమాత్ ।
ఆరభ్యలగ్నరాశేస్తుద్వాదశాంశేశ్వరాఃక్రమాత్ ॥౧౫౪

తా॥ లగ్నమును ౩ పాళ్లుచేసి మొదటిపాలుకు లగ్నేశుడు, రెండవదానికి ౫వ యింటి కధిపతి, మూడవ దానికి ౯ యింటి కధిపతి ద్రేక్కాణనాయకులుగానుందురు. ఇది యైదవవర్గ. లగ్నమును ౧౨ పాళ్లు చేసి వరుసగా లగ్నాదిగా ౧౨ రాసుల కధిపతులే ౧౨ పాళ్లుకును నాయకులని యెఱింగి శుభ ద్వాదశాంశను ముహూర్త సమయమునకు గ్రహించనగును ఇది యారవది. అని నారదవచనము.

## ౫౨. షడ్వర్గ ఫలవిచారము.

శ్లో॥ లగ్నంతదర్ధంచతత్రస్త్రిభాగో ।
నవాంశకశ్చ ద్విదశాంశకశ్చ ॥

త్రింశాంశకశ్చేతి త్రివర్గషట్కం ।
శుభం శుభవ్యోమచరాధిపత్యం ॥ ౧౫౫ ॥
యః పాపషడ్వర్గభవోహి దోషః ।
పంచాంగ సౌమ్య గ్రహలగ్నజాతం ।
గుణౌఘమంభోధి మమోఘబాణః ।
శుష్యత్యశేషం ఖలు రాఘవస్య ॥ ౧౫౬ ॥

తా॥ ఈవరకు చెప్పిన షడ్వర్గలలో శుభగ్రహ వర్గలే శుభఫలదంబులు. ఒకవేళ పాపవర్గలుండినను పంచాంగ సౌమ్యగ్రహ లగ్నశుద్ధి గుణముండినయెడల శ్రీరామ బాణము సముద్రమును శోషించినట్లు ఆషడ్వర్గదోషమును శోషింపుచుండునని వసిష్ఠవచనము. కావున ౬ వర్గలలో 3 వర్గలైనను శుభవర్గలుగా నుండుట చాల మేలని యెఱుంగనగును.

## ౫౩. యోగినీ నక్షత్రంబులు సఫలములు.

శ్లో॥ పౌష్ణేశశాక్రా ద్రససూర్యనందా ।
పూర్వార్ధమధ్యా పరభాగయుగ్మం ॥
భర్తాప్రియః ప్రాగ్యజిభేస్త్రియాఃస్యా ।
న్మధ్యేద్వయోః ప్రేమ పరేప్రియాస్త్రీ ॥ ౧౫౭ ॥

తా॥ రేవతి మొదలు ౬ నక్షత్రంబులు పూర్వార్ధ యోగినీ నక్షత్రంబులు, వీట్లలో పెండ్లి జరిగినయెడల కన్యకకు వరుడు ప్రియుడుగా నుం

డును. ఆర్ద్ర మొదలు ౧౨ నక్షత్రంబులు మధ్యభాగ యోగినీ నక్షత్రంబు లనంబడును. వీట్లిలో పెండ్లి జరిగితే వధూవరులు పరస్పర ప్రీతియుక్తులై యుందురు. జ్యేష్ఠ మొదలు ౯ నక్షత్రంబులు అపరభాగ యోగినీ నక్షత్రంబులనంబడును. వీట్లిలో పెండ్లి జరిగిన వరునికి కన్యప్రియురాలుగా నుండు నని చింతామణి వచనంబు.

## ౫౮. గండాంతదోషవిచారము.

తా॥ గండాంతమనగా సంధివిశేషము. అది యనేక విధములు. నక్షత్రసంధి, తిథిసంధి, లగ్నసంధి, యోగసంధి, కరణసంధి, వర్షసంధి, ఆయనసంధి, ఋతుసంధి, మాససంధి, పక్షసంధి, దినసంధి, రాత్రిసంధి, మధ్యాహ్నసంధి ప్రాతస్సంధి, సాయంసంధి, నిశీథసంధి యనియును:—వీట్లిలో కొన్నిటియిచ్చట చూపంబడుచున్నవి:—

శ్లో॥ సార్పేంద్రపౌష్ణధిష్ణ్యాంతే షోడశాంశాభసంధయః ।
తదగ్రభేష్వాద్యజాతాఃపాపాగండాంతసంజ్ఞకాః॥౧౫౭॥
ఉగ్రం సంధిత్రితయజం గండాంతత్రితయంమహత్ ।
మృత్యుదంజన్మయానాదివివాహ స్థాపనాదిషు ॥౧౫౮॥

తా॥ ఆశ్లేష జ్యేష్ఠ రేవతి యీమూడు నక్షత్రములలో నక్షత్రప్రమాణ ఘటికలలో ౧౬ లో నొకపాలు భసంధియనంబడును మఖ మూల అశ్విని యీమూడు నక్షత్రంబులలో నాది భాగము గండాంత సంజ్ఞగలది. ఈసంధిగండాంతముల నుండి పుట్టిన దోషము ఉగ్రం బనంబడును. జన్మప్ర

యాణ వివాహ ప్రతిష్ఠాదులలో నివి మృత్యుప్రదము. కావున నీఘటికలను వదలి ముహూర్తము గ్రాహ్యమని నారదవచనములు. ఇది నక్షత్రసంధి గండాంతము.

శ్లో॥ కుళీరసింహయోశ్చాపకీటయో ర్మీనమేషయోః ।
గండాంతమంతరాళం తన్నాడికానిధనప్రదా॥ ౧౬౦ ॥

తా॥ మీన కర్కాటక వృశ్చికంబులలో కడపటయును, మేష సింహ ధనూరాసులలో నాదిభాగమునను, చేరి ఒక్కొక గడియ గండాంతకాలంబనబడును. దానిని త్రోసి లగ్నము పెట్టికొనవలయును. ఇది లగ్నగండాంతం బనంబడును. అని కశ్యపవచనము.

శ్లో॥ పూర్ణానందాఖ్యయో స్తిథ్యోస్సంధిర్నాడీద్వయంసదా।
గండాంతంమృత్యుదం జన్మయాత్రోద్వాహవ్రతాదిషు॥

తా॥ పంచమీ దశమీ పూర్ణిమల కడపటను, ప్రతిపత్ షష్ఠి యేకాదశీ తిథులలో నాదిలోను రెండేసి గడియలు తిథిగండాంతం బనంబడును. దీనిని తప్పించి ముహూర్తమునుపనగును. అని నారదవచనము.

శ్లో॥ తథైవతిథిగండాంతం నాస్తీందౌబలశాలిని ।
తథైవలగ్నండాంతం నాస్తిజీవేబలాన్వితే ॥ ౧౬౧ ॥

తా॥ చంద్రుడు బలశాలిగానుండిన తిథిగండాంత దోషపరిహారము. గురుడు బలిష్ఠుడైయుండినచో లగ్నగండాంత దోషపరిహారంబని శాకల్యసంహితా వచనంబు.

# వివాహ ప్రకరణము.

శ్లో॥ పక్షాబ్దసంధి స్త్రీదినంచమాస ।
సంధిస్త్రీనాడ్యః ఖలుసంధ్యయోశ్చ ॥
నాడ్యశ్చతస్రః స్తిథి ఋక్షయోగం ।
సంధి స్తదర్ధం కరణస్యసంధిః ॥ ౧౬౩ ॥

తా॥ ఇట్లే, సంవత్సరసంధి, ౧౫ దినములు; మాససంధి 3 దినములు; సంధ్యాసంది 3 గడియలు; తిథిసంధి ౪ గడియలు; నక్షత్రసంధి ౪ గడియలు; యోగసంథి ౪ గడియలు; కరణసంధి ౨ గడియలనియు వసిష్ఠవచనము.

శ్లో॥ ఋక్షాంతేపుత్రనాశస్స్యా న్మాసాంతేతుధనక్షయః ।
వర్గాంతేవర్గనాశస్స్యా ద్గ్రహాణాత్సర్వనాశనం ॥౧౬౪॥

తా॥ నక్షత్రగండాంతము సంతాన హానినిచ్చును; మాసాంతగండాంతము ధనహానినిచ్చును; వర్గాంతకండాంతము స్వవర్గహానినిచ్చును; గ్రహణగండాంతము సమస్త విధములలో జెరుచును. అని గురువచనము. ఇట్లు సంధిగండాంత విచారమును తత్ఫలవిచారంబును అపారముగానున్నది. ఇంతతో చాలును.

## ౫౫. గండాంత దోషపరిహారము.

శ్లో॥ గండాంతదోష మఖిలంముహూర్తోభిజిదాహ్వయః ।
హంతియద్వన్మృగవ్యాధః పక్షిసంఘమివాఖిలం ॥

తా॥ అభిజన్ముహూర్తము గండాంత దోషమునంతటిని, మృగవ్యాధుడు పక్షుల గుమిని గుమ్ముదులిపి నట్లు పరిహరించి రక్షించునని వసిష్ఠ వచనము. అనిననేమంటే, ఏదోగండాంతం పడెనని బహుగుణ యుక్తమగు అభిజన్ముహూర్తమును వదలరాదని భావము.

## ౫౬. కర్తరీదోష విచారము.

శ్లో॥ వ్యయేమార్గగతిః క్రూరేవక్రీక్రూరో ధనేయది ।
తౌచలగ్నాంశతుల్యౌచ తదాఘోరాఖ్యకర్తరీ ॥ ౧౬౫॥

తా॥ వివాహలగ్నమునకు ౧౨లో ఋజుగతి క్రూరగ్రహము, ౨లో వక్రగతి క్రూరగ్రహము, గల్గియుండిన పక్షమున, మఱివారు లగ్నభాగలకు సమముగా నుండిన ఘోరమగు కర్తరీదోష మనంబడునని గర్గవచనము.

శ్లో॥ లగ్నస్యపృష్ఠాగ్రగయోరసాధ్వీ ।
స్సాకర్తరీస్యా దృజువక్రగత్యోః ।
తౌవేవశీఘ్రోయదివక్రచారో ।
నకర్తరీచేతి పితామహోక్తిః ॥ ౧౬౬ ॥

తా॥ అటుగాక ౧౨లో వక్రుడును, ౨లో ఋజుగతి క్రూరుడు నున్నను ఈకర్తరీదోషములేదు. అనగా క్రూరసంధి మధ్యలగ్నము కర్తరీ దోషముగలది. వారు శీఘ్రగతి గల గ్రహములైనను దోషములేదు. ఇట్లు బ్రహ్మవచనంబని వసిష్ఠ వచనంబుగలదు.

శ్లో॥ క్రూరగ్రహామధ్యగతే ।
లగ్నేచంద్రేథ వాకరగ్రహాణాం ॥
తేయమసద నాభిముఖం ।
గమనంచేచ్ఛంతి కన్యాయాః ॥ ౧౯౭ ॥

తా॥ ఈకర్తరీదోషయుక్త లగ్నంబుననైనను, చంద్రుడు లగ్నమునం దుండునపుడైనను, వివాహము చేసినపక్షమున, నక్కన్యకకు మరణమును నిశ్చయించినట్లగునని వసిష్ఠవచనంబు.

## ౫౭. క్రూరసౌమ్య గ్రహానిర్ణయము.

శ్లో॥ సూర్యభౌమశని రాహుకేతవః ।
పాపసంజ్ఞఖ చరాఃక్షయిచంద్రః ॥
పూర్ణచంద్ర గురుశుక్రసోమజాః ।
సర్వకర్మసుహి సౌమ్యఖచరాః ॥ ౧౬౮ ॥

తా॥ క్షీణచంద్ర రవి కుజ శని రాహు కేతువులు క్రూరులనియు ను; పూర్ణచంద్ర బుధ గురు శుక్రులు సౌమ్యులనియును; సమస్త శుభక ర్మలయందును గ్రహింపనగును. అని వసిష్ఠవచనంబు.

## ౫౮. సంగ్రహాదోష విచారము.

శ్లో॥ శశాంకేగ్రహసంయుక్తే దోషస్సంగ్రహసంజ్ఞకః ।
సూర్యేణసంయుతే చంద్రేదారిద్ర్యంభవతిధ్రువం ॥

కుజేనమరణంవ్యాధి స్సౌమ్యేనత్వనపత్యతా
దౌర్భాగ్యంగురుణాయుక్తె సాపత్న్యంభార్గవేణతు ॥
ప్రవ్రజ్యాసూర్యపుత్రేణ రాహుణాకలహస్సదా ।
కేతునాసంయుతె చంద్రేనిత్యంకష్టందరిద్రతా ॥ ౧౭౧ ॥
తస్మిన్సంగ్రహదోషేతువివాహం నైవకారయేత్ ।
ఇతి నారదవచనాని ॥ ౧౭౨

తా॥ చంద్రునితోడ గ్రహము చేరి యుండుటకు సంగ్రహదోషమని పేరు. ఈసంగ్రహదోషమునందు సూర్యుడు చంద్రునితో చేరియుండిన దరిద్రము ; కుజుడుచేరిన మరణము ; బుధుడుచేరియుండిన సంతానము కలుగదు ; గురుడుచేరియుండిన దౌర్భాగ్యము ; శుక్రుడు చేరియుండిన సవతికలుగును ; శనిచేరియుండిన సన్యాసము ; రాహువుతోచేరియుండిన కలహము ; కేతువుతోనుండిన నిత్యకష్టము ; ఇట్లు ఫలములుండును గాన సంగ్రహదోషముండునపుడు వివాహము చేయరాదు.

శ్లో॥ స్వక్షేత్రగస్స్వోచ్ఛగోవామిత్రక్షేత్రగతోవిధుః ।
యుతిదోషాయన భవేద్దంపత్యోశ్శ్రేయ సేతదా ॥౧౭౩॥

తా॥ చంద్రుడు స్వక్షేత్రమునందుండినను ఉచ్ఛుడైయుండినను మిత్రక్షేత్రమునందుండినను అట్టిసమయమున సంగ్రహదోషము శాంతముగనుండునని యున్ను నారద వచనము.

## ౫౯. అష్టమలగ్న దోషవిచారము.

శ్లో॥ దంపత్యోరష్టమంలగ్నం త్వష్టమోరాశి రేవచ ।
యదిలగ్నగతస్సోపి దంపత్యోర్నిధనప్రదః ॥ ౧౭౪ ॥
సరాశిశ్శుభయుక్తోపి లగ్నంవాశుభసంయుతం ।
లగ్నంవివర్జయేత్త్యక్త్వా త్తదంశాంశ్చతదీశ్వరాన్ ॥

తా॥ దంపతులలో వారివారి జాతకములప్రకారము జన్మలగ్నముల కును జన్మరాసులకును రావ లగ్నము అష్టమలగ్నమనబడును. ఆలగ్నమును గాని ఆరాశిని గాని మరణఫలదం బగుటచేత నది శుభగ్రహాయుక్తంబైయుం డినను పరిత్యజింపనగును. అట్లే తల్లగ్నత్రాశ్యంశలను తదధిపతులను వద లనగును. అని నారదవచనంబులు.

## ౬౦. అష్టమలగ్న దోషాపవాదము.

శ్లో॥ జన్మేశాష్టమలగ్నేశౌమిథోమిత్రేవ్యవస్థితౌ ।
జన్మరాశ్యష్టమక్షేత్ర దోషోనశ్యతిభావతః ॥ ౧౭౬ ॥

తా॥ అయితే, వివాహలగ్న పతికిని వివాహకాల చంద్రాధిష్ఠిత రా శ్యధిపతికిని, జన్మలగ్నపతికిని జన్మరాశ్యధిపతికిని పరస్పరమైత్రియుండి నచో నీయష్టమలగ్నదోషము బాధించదని కశ్యపవచనంబు.

శ్లో॥ లగ్నాదష్టమరాశీశః కేంద్రగశ్శుభవీక్షితః ।
యద్యష్టమగతస్యోక్త దోషమాశువ్యపోహతి ॥ ౧౭౭ ॥

రంధ్రేశస్స్వశుభాంశస్థస్తుం గస్వక్షేత్రమిత్రగః ।
అష్టమస్థానదోషో హివినశ్యతిన సంశయః ॥ ౧౭౮ ॥

తా॥ వివాహలగ్నమునకు అష్టమాధిపతి కేంద్రమందుండి శుభదృష్టి గలవాడైతే అష్టమగతదోషమును పరిహరించును. మఱియు నష్టమాధిపతి శుభాంశయందును స్వాంశయందును ఉచ్చయందును స్వక్షేత్రమునందును మిత్రక్షేత్రమునందు నుండినపక్షమున అష్టమస్థాన దోషంబునుకూడ పరిహరించునని గురువచనంబులు.

## ౭౧. ద్వాదశలగ్నదోషము.

శ్లో॥ తథైవద్వాదశేలగ్నేత దంశేవాతదీశ్వరే ।
వివాహేలగ్నగైస్స్వంనిత్యంస్యాత్కలహోద్వయోః ॥

తా॥ వివాహలగ్నము జన్మలగ్నమునకు ౧౨వ లగ్నమయినను, ౧౨వ అంశమైనను తదీశుడు వివాహ లగ్నమునందున్నను దారిద్ర్యము కలహము దంపతులకు తప్పదని కశ్యపవచనంబు.

## ౭౨. విషఘటీ దోషవిచారము.

శ్లో॥ వియద్బాణావేదదస్రాః ఖరామా వ్యోమసాగరాః ॥
వేదచంద్రాశ్చంద్రదస్రాః ఖరామ్యావ్యోమ్యబాహవః ॥
నేత్రాగ్నయోవ్యో మగుణాః శూన్యదస్రాగజేందవః ॥
ఋష్నబాహవోవియద్దస్రాః శక్రాశ్చంద్రాఃఖభూమయః॥

వేదచంద్రాస్తర్క బాణా వేదదస్రాంఖబాహవః ।
వ్యోమేందవో వ్యోమచంద్రాః ధృతయస్తర్కభూమయః ॥
వేదాశ్వినః ఖరామాః స్యుః దస్రత్ర్యాఙ్గ ఘటికాః క్రమాత్ ॥
అభ్యః పరస్తాత్క్రిమశః చతస్రో విషనాడికాః ।
ఋక్షాద్యంతఘటీనిఘ్నాః షష్టిభక్తాః స్ఫుటాః స్మృతాః ॥
విషనాడీదోషదుష్టం లగ్నం సర్వగుణాన్వితం ।
శుభైస్సర్వైశ్చ సంయుక్తమపి పంచేష్టకం త్యజేత్ ॥

తా॥ నిత్యచంద్రనక్షత్ర ఘటికామానంబునందు, రేవతీ పునర్వసు కృత్తికా మఖా నక్షత్రంబులకు ౩౦ ఘటికలకు పిమ్మటను ; రోహిణికి ౪౦కి పిమ్మటను ; ఆశ్లేషకు ౩౨ఘటికి పిమ్మటను ; అశ్వినికి ౫౦కి పిమ్మటను ; ఉత్తరఫల్గునీ పూర్వాషాఢలకు ౧౮కి పూర్వఫల్గునీ పుష్యమీచిత్రోత్తరాషాఢలకు ౨౦కి పిమ్మటను ; కృత్తికావిశాఖా మృగశీర్ష జ్యేష్ఠలకు ౨౪కు పిమ్మట ; హస్తార్ద్రి పూర్వాభాద్రలకు ౧౬కు పైనను ; ఉత్తరాభాద్ర పూర్వాషాఢ భరణులకు ౨౪కు పిమ్మటను ; శ్రవణ ధనిష్ఠా స్వాతి రాధలకు ౧౦కి పిమ్మటను ; మూలకు ౫౬కి పిమ్మటను ; ౪ ఘటికలు విషకాలమని యెఱుంగనగును. ఆయానక్షత్రముల యాద్యంత ఘటికలను పైనచెప్పిన వాటి ధ్రువకసంఖ్యచే గుణించి ౬౦ చే భాగించగా వచ్చిన ఘటికావిఘటికలు విషకాలమును సూచించుచున్నది. (దీనినే పంచాంగములలో దివి - రావి -అని వేయుచున్నారుగాన నింతతొందరలేక సులభముగాచూచికొనవచ్చును)

భలగ్నమును పెట్టిన నాల్గలగ్నమునకు ఈవిషనాడీ సంపర్కము ఉండరాదు. లగ్నమునకెన్ని శుభయోగంబులున్నను ఈవిషదోషము హరించునని కశ్య పవచనంబులు. (మూలకు ౨౦ ఘడియలకును కూడ విషదోషమని విద్యామాధవీయాదిమతము.)

శ్లో॥ కుర్వంత్యుద్వాహితాంకన్యాంవిధవాంవత్సరత్రయాత్ ।
అన్యస్మిన్మంగలే తాశ్చనిధనంచాథనిర్ధనం ॥ ౧౮౫ ॥

తా॥ వివాహమున, లగ్నమునకు ఈవిషనాడులు చేరియుండిన నావధువు 3 సంవత్సరములలోగా వితంతువ యగును. తక్కిన శుభకార్యంబులలో మరణమును, లేక, నిత్యదారిద్ర్యము నిచ్చునని వసిష్ఠవచనంబులు.

## ౬3. తిథులలో విషఘటికలు.

శ్లో॥ తిథీషునాగాద్రి గిరీషువారిధి ।
ర్గజాద్రిదిక్పావక విశ్వవాసవాః ॥
మునీభసంఖ్యా ప్రథమాతిథేఃక్రమా ।
త్పరంవిషంస్యాద్ఘటికాచతుష్టయం ॥ ౧౮౬ ॥

తా॥ పాడ్యమిలో ౧౫; విదియలో ౫; తదియలో ౮; చవితిలో౭; పంచమిలో ౭; షష్ఠిలో ౫; సప్తమిలో ౪; అష్టమిలో ౮; నవమిలో ౭; దశమిలో ౧౦; ఏకాదశిలో 3; ద్వాదశిలో ౧3; త్రయోదశిలో౧౪; చతుర్దశిలో ౭; పున్నమిలో ౮; ఘటికలకు పిమ్మట ౪ ఘటికలు విషకాలమని తిథి విషఘటికలు దైవజ్ఞమనోహరగ్రంథమున గురువచనములు చెప్పుచున్నవి. కాన నవివర్జ్యములు.

## ౬౪. వారములలో విషఘటికలు.

శ్లో॥ నఖద్వయం ద్వాదశదిక్చ శైలా ।
బాణాశ్చతత్త్వాని యథాక్రమేణ ॥
సూర్యాదివారేషు పంచతస్రో ।
నాడ్యో విషం స్యాత్తలు వర్జనీయం ॥ ౧౮౭ ॥

తా॥ ఆదివారమున ౨౦; సోమవారమున ౨; మంగళవారమున ౧౦; బుధవారమున ౧౦ ; గురువారమున ౭ ; శుక్రవారమున ౫ ; శనివారమున ౨౫ ; ఘటికలకు పిమ్మట ౪ గడియలు వార విషకాలంబు. కావున నాఘటికలు వర్జ్యములనియును గురువచనము.

## ౬౫. విషఘటీదోషాపవాదము.

శ్లో॥ చంద్రోవిషఘటీదోషం హంతికేంద్రత్రికోణగః ।
లగ్నంవినాశుభైర్ద్రష్టః కేంద్రేవాలగ్నప స్తథా ॥

తా॥ వివాహలగ్నమునకు ౪-౫-౭-౯-౧౦లో నుండెడు చంద్రుడు, విషఘటీ దోషమును పరిహరించును. అట్లేలగ్నమును పాపగ్రహములు చేరక చూడకయుండి, లగ్నపతి ౧-౪-౭-౧౦లో నుండినను విషఘటీదోషము బాధించదని గురువచనంబు.

## ౬౬. దుర్ముహూర్తదోష విచారము.

శ్లో॥ అహ్నఃపంచదశో భాగో ముహూర్తోథతథానిశి ।
దివాముహూర్తారుద్రాహి మిత్రాఃపితృవసూదకం ॥

విశ్వే విధాతృబ్రహ్మేంద్రాఇంద్రాగ్న్యసురతోయపాః।
అర్యమాభగసంజ్ఞశ్చ విజ్ఞేయాదశపంచచ ॥ ౯౦ ॥
ఈశాజపాదహిర్బుధ్న్యపూషాశ్వి యమవహ్నయః।
ధాతృచంద్రాదితీజ్యాఖ్య విష్ణ్వర్కత్వష్టృవాయవః॥
యస్మిన్నృక్షేహియత్కర్మ కథితంనిఖిలంచయత్ ।
తద్దైవత్యేతన్ముహూర్తేకార్యంయాత్రాదికంసదా ॥
అర్యమారాక్షసాబ్రాహ్మపిత్ర్యాగ్నేయాతథాభిజిత్ ।
రక్షస్సార్పౌబ్రహ్మపిత్ర్యౌభాజంగేశావినాదిషు ॥ ౯౩ ॥
వారేషువర్జనీయాస్తే ముహూర్తాశ్శుభకర్మణి ।
దుర్ముహూర్తేకృతంవ్యర్థం శుభకర్మనసంశయః ॥

తా॥ పగటిలో ౧౫ ముహూర్తములు ; రాత్రిలో నట్లే ౧౫ ముహూర్తములు ; వరుసగా. ౧ శివ, ౨ సర్ప, ౩ సూర్య, ౪ పితృ, ౫ వసు, ౬ జల, ౭ విశ్వేదేవ, ౮ అభిజిత్తు, ౯ విధాతృ, ౧౦ ఇంద్ర, ౧౧ ఇంద్రాగ్ని, ౧౨ రాక్షస, ౧౩ వరుణ, ౧౪ అర్యమ ౧౫ భగ, సంజ్ఞలుగలవి ౧౫ను పగటిముహూర్తములు. ఇట్లే వరుసగా ౧శివ, ౨ అజైకపాత్, ౩ అహిర్బుధ్న్య, ౪ పూష, ౫ అశ్వినీదేవ, ౬ యమ, ౭ అగ్ని, ౮ బ్రహ్మ, ౯ చంద్ర, ౧౦ అదితి, ౧౧ గురు, ౧౨ విష్ణు, ౧౩ అర్క, ౧౪ విశ్వకర్మ, ౧౫ వాయు, సంజ్ఞలుగలవి ౧౫ను రాత్రిముహూర్తములు. అహోరాత్ర ప్రమాణముంబట్టి మారుచుండినను సామాన్యముగా ముహూర్తమునకు

రెండేసి గడియలని యెఱుంగనగును. ఏకనక్షత్రమునందు చెప్పబడిన కర్మ ఆముహూర్తమునందు చేయుట మేలు; అందులో, ఆదిత్యవారమున అర్యమరాక్షస ముహూర్తంబులు; సోమవారమున బ్రాహ్మముహూర్తములు; మంగళవారమున అగ్ని పితృముహూర్తములు; బుధవారమున అభిజన్ముహూర్తము; గురువారమున రాక్షససర్ప ముహూర్తములు; శుక్రవారమున బ్రహ్మపితృ ముహూర్తములు; శనివారమున రుద్రసర్పముహూర్తములు; వర్జింపబడవలసిన దుర్ముహూర్తంబులనంబడును. వీట్లలో చేసిన శుభకర్మ వ్యర్థంబగునని నారదవచనంబులు.

## ౬౮. వేధదోషవిచారము.

శ్లో॥ చక్రేతస్మిన్నేకరేఖాస్థితేన।
తద్విద్ధర్క్షంఖేచరేణ ప్రదిష్టం ॥
క్రూరైర్విద్ధంసర్వధిష్ణ్యం వివర్జ్యం ।
సౌమ్యైర్విద్ధం నాఖిలంపాదఏవ ॥ ౧౯౫ ॥

తా॥ ఆ చక్రమునందు (అనగా పంచశలాకా సప్తశలాకా చక్రమునందు) ఏకరేఖయందుండు నక్షత్రములుపరస్పర వేధగల నక్షత్రంబులు. క్రూరగ్రహవేధ గల్గిన నక్షత్రమైనచో నానక్షత్రంబులను సమగ్రముగాను, శుభగ్రహవేధగల్గినదైనచో నానక్షత్రపాదమును మాత్రము, వదలవలయుననిగార్గేయ వచనము,

## ౬౯. అభిజిన్నక్షత్రమాన విచారము,

శ్లో॥ అభిజిద్భోగమేతద్వై ।
వైశ్వదేవాంత్య పాద మఖిలం తత్ ॥

ఆద్యచతస్రోనాడ్యో ।
హరిభస్యైతచ్చ రోహిణీ విద్ధం ॥ ౧౯౬ ॥

తా॥ ఉత్తరాషాఢానక్షత్ర నాల్గవపాదంబును శ్రవణనక్షత్రముయొక్క ౧౫వ భాగమనగా మొదటి నాల్గుగడియలును అభిజిన్నక్షత్రమని వ్యవహారముండును. అని వసిష్ఠవచనము.

౬౯. పంచశలాకా వేధచక్రము

శ్లో॥ తిర్యక్పంచోర్ధ్వగాః పంచ రేఖే ద్వేద్వేచ కోణయోః ।
ద్వితీయశంభుకోణేగ్నిధిష్ణ్యంచక్రేచపున్యసేత్ ॥ ౧౯౭ ॥
భాన్యతస్సాభిజిత్యే కేరేఖాకోణే చవిద్ధభం ॥
(ఇట్లు నారదీయ పంచశలాకా చక్రోద్ధారము.)

తా॥ నిడుపు రేఖలనైదును, వాటిమీదనే అడ్డముగా నయిదు రేఖలను వ్రాసి, రెండు రెండు నక్షత్రములను కోణము మీది రేఖలలోను తక్కినవాటిలో నొక్కొక నక్షత్రమును వ్రాయవలయును, రెండవ కోణరేఖమీదను కృత్తికాదిగా నక్షత్రములను అభిజిత్తు సహితముగా ౨౮ టిని వ్రాయనగును. ఒక రేఖమీఁదుగా నిలచిన నక్షత్రములు రెండును పరస్పర వేధగల్గినవి యని యెఱుంగవలయును.

శ్లో॥ రోహిణ్యభిజితోర్మూలాదిత్యయోర్మృగవైశ్వయోః ।
రేవత్యుత్తరఫల్గున్యోర్మఖాశ్రవణయోర్భవేత్ ॥ ౧౯౯ ॥
హస్తోత్తరాభాద్రపదోస్స్వాతీ వారుణ యోర్మిథః ।
అనూరాధాభరణ్యోశ్చ వేధోయంపంచరేఖజః ॥ ౨౦౦ ॥

తా॥ అట్లు రేఖావిన్యాసాది కష్టములేకయే, వాచనికముగా చెప్ప బడియుండు వేధలెట్లనిన:—రోహిణ్యభిజిత్తులును, మూల పునర్వసువులు ను, మృగశిరోత్తరాషాఢలును, రేవత్యుత్తర ఫల్గునీలును, మఖాశ్రవణంబు లును, హస్తోత్తరా భాద్రలును, స్వాతీశతతారలును, అనూరాధా భరణు లును; పరస్పరముగా వేధగల్గినవి. అనిన భరణిలో గ్రహముండినపుడు అనూరాధలో చంద్రుడున్నను, యనూరాధను ఆగ్రహము వేధించును. అనూ రాధలో గ్రహముండినపుడు, భరణీ నక్షత్రమును వేధించును, అని భావ ము. ఇట్లే గ్రహవేధలు నక్షత్రంబులకు గల్గినదాని నెఱింగి వేధగల్గిన నక్ష త్రమున శుభముహూర్తములను చేయరాదు.

## ౭౦. వెవ్వేరుగా గ్రహవేధలకు ఫలములు.

శ్లో॥ రవివేధేచవైధవ్యం పుత్రశోకోథ వేత్కుజే।
బుధవేధేచవంధ్యాస్యాత్ ప్రవ్రజ్యాజీవవేధకే ॥ ౨౦౧ ॥
శుక్రవేధేతు పుత్రీస్యాత్ దాసీస్యాన్మందవేధకే।
రాహువేధేచంద్రవేధేశనివేధవదీరితం ॥ ౨౦౨ ॥

తా॥ రవివేధవైధవ్యము నిచ్చును. కుజవేధచే పుత్రశోకము. బుధ వేధచే గొడ్రాలగును. గురువేధచే మగడుసన్యాసి. శుక్రవేధచే నాడు బిడ్డలు మాత్రముగల్గును. శనివేధచే బానిసయగును. చంద్రవేధచేతను రా హువేధచేతనుకూడ శనివేధవలె నెఱుంగనగును. అని వివాహపటల వచ నంబులు.

## ౭౧. గ్రహవేధలలో విశేష సూచనలు.

శ్లో॥ క్రూరవిద్ధంయుతంధిష్ణ్యం క్రూరాక్రాంతంచకృత్స్నభం ।
మణిహేమమయంహర్మ్యంభూతాక్రాంతమివత్యజేత్ ॥

తా॥ క్రూరగ్రహవేధగల్గిన, క్రూరగ్రహముతో గూడిన, మఱికూర గ్రహంబుండెడు నక్షత్రమును సంపూర్ణముగా పిశాచావిష్టంబైన బంగారురత్నముల మేడను వదలినట్లు విడువనగునని కశ్యపవచనంబు.

శ్లో॥ అతోంత్యపాదమాదిగో ద్వితీయగస్తృతీయకం ।
తృతీయగోద్వితీయకం చతుర్థగస్తుచాదిమం ॥
భినత్తివేధకృద్గ్రహోన చాన్యపాదమాదరాత్ ।
శుభగ్రహేతుపాదమేవ సమస్తమేవపాపగే ॥ ౨౦౪ ॥

తా॥ గ్రహము మొదటిపాదంబుననుండిన నక్షత్రముయొక్క నాల్గవపాదమును రెండవపాదమందుండిన మూడవపాదమును, మూడవపాదంబుననుండిన రెండవపాదంబును, నాల్గవపాదంబుననుండిన మొదటిపాదంబును వేధించును. కావున వేధించుగ్రహము శుభగ్రహమైతే ఆపాదమును మాత్రమును వదలియును; వేధించుగ్రహము పాపగ్రహమైతే ఆనక్షత్రము నంతయును వదలియును సుముహూర్తమును నిర్ణయించనగును. అని వసిష్ఠవచనంబు.

శ్లో॥ పంచశలాకాచక్రే ।
పాణిగ్రహణే భవేధ విధిస్తత్ర ॥

## వివాహ ప్రకరణము.

శస్తశ్శుభనిత్రకృతేః ।
సప్తశలాకాజ ఇతరత్ర ॥ ౨౦౫ ॥

తా॥ పెండ్లిలో పంచశలాకా వేధ గ్రాహ్యంబు. తక్కిన శుభకర్మ లలో సప్తశలాకా వేధ గ్రాహ్యంబుగానుండునని వసిష్ఠవచనంబు. అయి నను, సప్తశలాకా చక్రవేధను అనేకులు వదలినందున నదియు నిచ్చట చెప్పంబడుచున్నది ;—

### ౭౨. సప్తశలాకావేధనిర్ణయము.

శ్లో॥ సప్తసప్తవినిపాత్యరేఖికా ।
స్తిర్యగూర్ధ్వమథకృత్తికాదికం ।
లేఖయేదభిజితా సమన్వితం ।
చైకరేఖ ఖగమేన విధ్యతే ॥ ౨౦౬ ॥

తా॥ నిడురేఖలనేడును, వాటిమీఁదుగా నడ్డరేఖలనేడును వ్రాసి, మొదటికోణమునుండి వరుసగా అభిజిత్తుతో కూడ ౨౮ నక్షత్రంబులను వ్రాసి నసేక రేఖాగ నక్షత్రంబులు పరస్పర వేధగల్గినవియని యెఱుంగవలయును, అని వ్యవహార సముచ్చయ వచనము.

శ్లో॥ శక్రేజ్యేశతభానిలేజలశివే పౌష్ణార్యమర్క్షేవసు ।
ద్వీశేవైశ్వసుధాంశుభే హయభగేసార్పానురాధేతథా॥
హస్తోపాంతిమభే విధాతృవిధిభే మూలాదితీత్వాష్ట్రభా ।
జాంఘ్రీయామ్యమఖే కృశానుహరిభేవిద్ధేద్రిరేఖేమిథః ॥

తా॥ సప్తశలాకా చక్రమునంధు పుష్యమీ జ్యేష్ఠలును, స్వాతీ శతతారలును, ఆర్ద్రి పూర్వాషాఢలును, ఉత్తర ఫల్గునీ రేవతులును, విశాఖ ధనిష్ఠలును, మృగశిరోత్తరాషాఢలును, పూర్వఫల్గున్యశ్వినీలును, అనూరాధా శ్రేషలును, హస్తోత్తరాభాద్రలును, రోహిణ్యభిజిత్తులును, మూల పునర్వసువులును, మఖా భరణులును, కృత్తికా శ్రవణంబులును, చిత్ర పూర్వాభాద్రలును; పరస్పర వేధగల్గినవిగా నుండునని పైరేఖా విన్యాసముచేసి యేర్పరచ బడినవి.

శ్లో॥ యస్యాశ్శశీ సప్తశలాకభిన్నః ।
పాపైరపాపైర థవావివాహే ।
ఉద్వాహవస్త్రేణతు సంవృతాంగీ ।
శ్మశానభూమిం రుదతీప్రయాతి ॥ ౭౦౮ ॥

తా॥ ఏకన్యా వివాహసమయమునందు చంద్రుడు పాపగ్రహముల చేతనైనను శుభగ్రహములచేతనైనను వేధగల్గినవాడైన పక్షమున నకన్యక వివాహవస్త్రిముతోడనే యేడ్చుచు శ్మశానభూమిని త్రొక్కును. అని దీపికావచనము.

శ్లో॥ నక్షత్రజముద్వాహే ।
ఫలమబ్దైస్తారకామితైస్సదసత్ ॥ ౭౦౯ ॥

తా॥ వివాహమున నక్షత్రఫలము మంచిదికాని చెడ్డదికాని నక్షత్రసంఖ్యా సంవత్సరంబులకు ఫలించునని వరాహ వచనము.

## 23. క్రూరాక్రాంతదోష విచారము.

శ్లో॥ భుక్తంభోగ్యంతథాక్రాంతం విద్ధంపాపగ్రహేణభం।
మంగళేషుచకార్యేషు యత్నతఃపరివర్జయేత్ ॥ ౨౧౦॥

తా॥ క్రూరగ్రహముండి విడిచిన నక్షత్రమును, క్రూరగ్రహముండెడు నక్షత్రమును, క్రూరగ్రహము ప్రవేశించబోవు నక్షత్రమును, క్రూరగ్రహవేధగల్గిన నక్షత్రమునుకూడ, ప్రయత్న పురస్సరముగా విడువవలయునని వాత్స్యవచనము,

శ్లో॥ ఉత్పాతభంగ్రహణభంక్రూరవిద్ధస్థితంచయత్।
దహత్యేవశుభంకర్మరాఘు వాగ్నిశరోంబుధిం ॥ ౨౧౧॥

తా॥ ఉత్పాత నక్షత్రము, గ్రహణనక్షత్రము, క్రూరాక్రాంత నక్షత్రము, క్రూరవిద్ధ నక్షత్రముకూడ, రామబాణము సముద్రమును శోషించినట్లు శుభకర్మను దహించుచుండునని వసిష్ఠవచనము ఫలమునుచెప్పుచున్నది.

శ్లో ఉత్పాతపాప గ్రహదూషితంభం।
యదీందురాక్రమ్యపునర్భునక్తి ॥
తదాతదర్హంకిల మంగళేషు।
త్యజేత్సమాక్రాంత ధనూరవీందోః ॥ ౨౧౨ ॥

తా॥ అట్టిదోష దూషితంబనబడు క్రూరాక్రాంత నక్షత్రమున చంద్రుడుండిన నానక్షత్రము శుభకర్మకు యోగ్యంబని కేశవార్క మతము.

అయితే, అది భుక్తభోగ్య విషయముగాని, ఆక్రాంతవిషయముకాదని వేరు వచనములు గలవు. ఎట్లనిన:—

శ్లో॥ యద్ధిష్ణ్యందోషసంయుక్తం స్యాత్తథాపీందుసంయుతం।
శుభకార్యేషుతత్త్యాజ్యమన్యకర్మసుసిద్ధిదం ॥ ౧౧౩ ॥

శ్లో॥ యథాహిచాండాల ధృత్వైకవ్యాస్తో ।
మజ్జన్నగాధేపి సరిత్ప్రవాహే ॥
భవేన్నపూత శ్శశిభోగతోపి ।
తథానుశుద్ధ్యేదుడు పాపయుక్తం ॥ ౧౧౪ ॥

శ్లో॥ స్పృష్టా వ్యగతేతు చాండాలేశుద్ధిరాప్లవనాద్యథా ।
తథాభుక్త్వా వ్యగతే క్రూరేచంద్రభోగాద్విశోధనం ॥౧౧౫॥

తా॥ ఏనక్షత్రము పాపాక్రాంతంబై యుండునో ఆనక్షత్రమును చంద్రుడను భవించుచుండినను అది శుభకర్మలలో వర్జ్యమనబడును తక్కిన కర్మలకు సిద్ధిప్రదంబు. ఎటులనిన:— జలప్రవాహము అగాధంబై యుండినను చండాలుడు స్నానము చేయుచుండగా నదియెట్లు పరిశుద్ధము కాదో; అట్లే చంద్రుడుండినను పాపాక్రాంత నక్షత్రము శుద్ధము కాదు. మాలవాడు స్నానముచేసి వెడలిన పిదప నది యెట్లు స్నానార్హమో అట్లు పాపగ్రహము ముందుకు వెడలిన పిదప నానక్షత్రమున చంద్రుడున్న నది పరిగ్రాహ్యంబై యుండునని శార్ఙీయ వచనము.

## ౭౮. లత్తాదోష విచారము.

శ్లో॥ సూర్యాద్ద్వాదశమృక్షం ।
షష్ఠం గురు రవనిజ స్తృతీయంతు ॥
సంలత్తయతి దివాకర ।
పుత్రోఽష్టమ మ్యగతః పాదైః ॥ ౨౧౬ ॥
పశ్చాద్ద్వావింశతిభం ।
పౌర్ణిమచంద్రస్తు పంచమం శుక్రః ॥
స్వర్భానురపిచ నవమం ॥
సప్తమమృక్షం శశాంకసుతః ॥ ౨౧౭ ॥

తా॥ రవి కుజ గురు శనులు అగ్రతః యనగా ముందుకు వరుసగా ౧౨-౩-౬-౮వ- నక్షత్రంబులను లత్తజేయుచున్నారు. పూర్ణ చంద్ర బుధ శుక్ర రాహువులు పృష్ఠతః అనగా వెనుకకు, వరుసగా ౨౨-౭-౫-౯- వ- నక్షత్రంబులను లత్తజేయుచున్నారు. అనగా నశ్వినికి ఏయేగ్రహ మెందెందుండిన లత్తలని విచారింతము. అనూరాధలో సూర్యుడుండిన నశ్వినికి రవి లత్త; ఉత్తరాభాద్రలో కుజుడుండిన నశ్వినికి కుజలత్త; ధనిష్ఠలో గురుడుండిన నశ్వినికి గురులత్త; ఉత్తరాషాఢలో శనియుండిన నశ్వినికి శనిలత్త; ఇవి నాల్గును పురోలత్తలనబడును। శ్రవణమున చంద్రుడుండిన నశ్వినికి చంద్రలత్త; పునర్వసువులో బుధుడుండిన నశ్వినికి బుధలత్త; మృగశిరలో శుక్రుడుండిన నశ్వినికి బుధలత్త; పుష్యమిలో రాహువుండిన నశ్వినికి

రాహులత్త; ఇవి రను పశ్చాల్లత్త లనబడును; ఇట్లే ౨౭ నక్షత్రంబులకు ను లత్తాకాలంబులను ఎఱుంగనగును. అని వరాహ వచనము

## ౭౫. లత్తాదోష ఫలంబులు.

శ్లో॥ రవిలత్తా ధనహానిం।
నిత్యం కౌజీ తునిర్దిశే న్మరణం।
చాంద్రీ నాశం కుర్యా।
ద్బౌధీ నాశం వదత్యేవ॥ ౨౧౮॥
సౌరీ మరణం కథయతి।
బంధువినాశం బృహస్పతే ర్లత్తా॥
మరణం లత్తా రాహోః।
కార్యవినాశం భృగో ర్వదంతీతి॥ ౨౧౯॥

తా॥ వివాహకాల నక్షత్రమునకు ఏగ్రహలత్తయైనను తగదు. ఎందువల్లననిన;—రవిలత్తగల్గియుండిన మరణము; చంద్రలత్త నాశము చేయును; కుజలత్త మరణప్రదము; బుధలత్త నాశప్రదము; గురులత్త బంధువినాశముంజేయును; శుక్రలత్త కార్యహానిం గలుగజేయును; శనిలత్త మృతినిచ్చును; రాహులత్త మరణప్రదము; కావున నీలత్తగల్గిన నక్షత్రంబులు తగవని వరాహవచనంబు.

శ్లో॥ ఇశనతిమ్యసదామభిలత్తనే।
యదనులత్తన ముక్తమృషిప్రజైః॥

తదుడుపశ్చిమపూర్వ విభాగయో ।
రనధికాధిక దోషవివక్షయా ॥ ౨౬౦ ॥

తా॥ ఇట్లుమునీంద్రులచే చెప్పంబడిన లత్తలలో పూర్వపశ్చిమలత్తా పరికల్పన స్వారస్యం బేమియనిన లత్తగల్గిన నక్షత్రంబులలో పూర్వలత్తగల్గియున్నపుడు నక్షత్రముయొక్క ప్రథమార్థము అధికానిష్ట ఫలదంబనియును, పశ్చాల్లత్తగల్గినపుడు ద్వితీయార్ధము అల్పానిష్ఠ ఫలదంబనియును పశ్చాల్లత్త గల్గియున్నప్పుడు పూర్వార్ధము అల్పానిష్ఠ ఫలదంబనియును, ఉత్తరార్థము ప్రబలారిష్ట ఫలదంబనియును చూపుటకై యిట్లు చెప్పియున్నారని కేశవార్కవచనంబు.

## ౭౫. పాతదోష విచారము.

శ్లో॥ సాధ్యహర్షణశూలాని వైధృతివ్యతిపాతయోః ।
షడ్భంగండస్యచాం తేస్యాత్తత్పాతేనసిపాతితం ॥

తా॥ సాధ్యయోగము, హర్షణయోగము, శూలయోగము, వైధృతి యోగము, వ్యతీపాతయోగము, గండయోగము ;—అనునీ ౬ యోగంబుల చివరభాగములలో చంద్రసూర్యక్రాంతి సామ్యముగల్గుట చేత పాతదోషము పుట్టుచున్నదని త్రివిక్రమాచార్య వచనము.

శ్లో॥ అయమపి పాతోదోష ।
శ్చండీశచండాయు ధాహ్వయోజ్ఞేయః ॥
అఖిలేషుమంగళేష్వపి ।
వర్జ్యోయస్మాద్వినాశదః కర్తుః ॥ ౨౬౧॥

తా॥ చండీశంబను చండాయుధంబును పేళ్లుగల యీపాతదోషంబు సమస్తమంగళ కార్యంబులలోను వర్జింపబడ తగినవి. ఎందువల్లననిన కర్తకు హానింగలుగజేయును అని వసిష్ఠవచనంబు.

[సూచన—ఇంక దీని గణితంబును ఇచ్చట వివరించుట గ్రంథవిస్తరంబును, మఱియుహూర్తికులకు దురూహంబు నగును. కావున విస్తరముగా నెఱుగవలసినవారు సిద్ధాంత శాస్త్రంబులలో నెఱుంగనగును. ఈ దోషంబులనే మహావైధృతి ప్రవేశః, నిర్గమః; మహావ్యతీపాతప్రవేశః, నిర్గమః; అని పంచాంగంబులలో గణించి ఆయాదినంబులలో వ్రాసియున్నారు, వ్రాయుచున్నారు. తత్కాలంబులలో శుభకార్యంబులను చేయరాదని ఫలితాంశము.]

## ౭౬. ఖార్జూర దోషవిచారము.

శ్లో॥ వ్యాఘాతశూలపరిఘ పాతపూర్వేషుసత్స్వపి ।
గండాతిగండకులిశ వైధృత్యాసహి తేషుచ ॥ ౧౧౩ ॥
అదితీందుమఖాహ్యైద్య మూలమైత్రేజ్యభానిచ ।
జ్ఞేయానిసహచిత్రా భిర్యాన్యధిష్ణ్యభానియథాక్రమం ॥
లిఖేదూర్ధ్వగతామేకాంతిర్యగ్రేఖాస్త్రయోదశ ।
తత్రఖార్జూరికే చక్రేకథితంమూర్ధ్నిభంన్యసేత్ ॥
భాన్యేకరేఖాగతయోస్సూర్యాచంద్రమసోర్మిథః ।
ఏకార్గళోదృష్టిపాతా చ్చాభిజిద్వర్జితానివై ॥ ౧౧౪ ॥

తా॥ ఖర్జూరపత్రమువలె నూర్ధ్వరేఖ నొకటిని వ్రాసి, ఆరేఖమీఁద ౧౩ అడ్డగీతలను గీచినట్లు యితే సప్తవింశతి రేఖాత్మకమగునది ఖర్జూర చక్రమనంబడును. అందు శిరస్సున విష్కంభ యోగముగల్గిన నాడు అశ్వి నిని శూలయోగము నాడు మృగశిరను, వ్యాఘాత యోగమునాడు పునర్వ సువును, వజ్రయోగమునాడు పుష్యమిని, వ్యతీపాతనాడు ఆశ్రేషను, పరిఘయోగమునాడు మఖను, వైధృతియోగమునాడు చిత్రను, అతి గండ యోగమునాడు అనూరాధను, గండయోగమునాడు మూలను; వ్రాసి కొని - అది మొదలు ప్రదక్షిణముగా తక్కిన నక్షత్రములను వ్రాయవలయు ను. పిమ్మట నాడు సూర్యచంద్రు లిరువురువురు ఏకరేఖాగతులై యున్నా రని తెలిసిననే కార్గళదోషము సంభవించెనని గ్రహింపనగును. అని నారదవ చనంబులు. ఇందులో సూర్యచంద్రులకు ఏకరేఖాగత నక్షత్రములయందున్న మాత్రమున నేపరస్పర వీక్షణము కలుగదు. మఱియేమనిన, వీరిలో నాల్గ వపాదమున నొకగ్రహమును మొదటిపాదమున నొకగ్రహమును ఉండినను; రెండవపాదమున నొకగ్రహము మూడవ పాదమున నొకగ్రహ మున్నప్పు డును, ఈయేకార్గళ దోషముగల్గినదని యెఱుంగనగును. అట్లులేకున్న లేదు, అని ఈవరకే వెనుక చెప్పంబడియుండు వేధదోషవిచార ప్రకరణ సంగతి యిచ్చుటను సంగ్రాహ్యము.

౨౭. ఏకార్గళదోష జ్ఞానమున సులభోపాయము.

శ్లో॥ విరుద్ధనామయోగేషు సాభిజిద్భసమక్షగః ।
అర్కాదిందుస్తదాయోగోనింద్య ఏకార్గళాభిధః ॥

తా॥ పైనచెప్పిన విష్కంభాదిగా వివాహమునకు నిషిద్ధయోగముల నాడు సూర్యుడుండెడు నక్షత్రమునుండి చంద్రుడుండెడు నక్షత్రమువరకు అభిజిన్నక్షత్రమును చేర్చుకొని లెక్కించగా సూర్యునినుండి చంద్రుడు బేసినక్షత్రమునయుండిన నీఖార్జూర దోషము గల్గినదని యక్కాలమున మంగళకార్యముల నాచరించ కూడదని త్రివిక్రమవచనము. సమసంఖ్యయైన దోషము లేదని భావము.

## ౭౮. ఉపగ్రహ దోషవిచారము.

శ్లో॥ భూకంపస్సూర్యభాత్సప్త మక్షే౽విద్యుచ్చపంచమే ।
శూలోష్టమేచనవమే౽ శనిరష్టాదశేతతః ॥ ౨౨౮ ॥
కేతుఃపంచదశే దండశ్చోల్కా ఏకోనవింశతిః ।
నిర్ఘాతపాతసంజ్ఞశ్చజ్ఞె యస్సనవపంచమే ॥ ౨౨౯ ॥
మోహానిర్ఘాతకంపాశ్చకులిశంపరివేషకం ।
విజ్ఞెయాశ్చైకవింశాఖ్యా దారభ్యచయథాక్రమం ॥
చంద్రయుక్తేషుభేష్వేషు శుభకర్మనకారయేత్ ।
(బాహ్లీకేకురుదేశేచవర్జయేద్భముపగ్రహం) ॥

తా॥ సూర్యుడుండెడు నక్షత్రమునుండి చంద్రుడుండెడు నక్షత్రంబు ౭ వది భూకంపము ; ౫ వది విద్యుత్తు ; ౮ వది శూలము ; ౯ వది అశని ; ౧౮ వది కేతువు ; ౧౫ వది దండము , ౧౯ వది ఉల్క ; ౧౪ నిర్ఘాతపాతము; ౨౧ వది మోహము ; ౨౨ వది నిఘూతకంబు ; ౨౩ వది కంపము ;

౨౮వది కులిశము ; ౨౯ వది పరివేషము ; ఈ ౧౩ తారలును ఉపగ్రహం బను దోషసంయుక్తంబులు గాన శుభకర్మలకు తగవని నారదవచనంబులు. బాహ్లీక దేశంబునను కురుదేశంబునను ఇవి వర్జ్యాంబులు, తక్కిన దేశంబులలో శుభంబులని కశ్యపవచనము.

## ౭౯. ఉపగ్రహ దోషఫలము.

శ్లో॥ గృహప్రవేశేదారిద్ర్యం వివాహేమరణంభవేత్ ।
ప్రస్థానేఽపదఃప్రోక్తా ఉపగ్రహదినేయది ॥ ౨౩౧ ॥

తా॥ ఉపగ్రహ దోషయుక్త దినమున గృహప్రవేశముచేసితే దారిద్ర్యము ; వివాహముచేసితే మరణము ; ప్రయాణముచేసిన నాపదలును గల్గునని తత్ఫలంబు చెప్పంబడియున్నవి.

## ౮౦. వారదుర్ముహూర్తవిచారము.

శ్లో॥ అహని నిశి గజాంశైః స్వేదినేశాదికానాం ।
భవతితుగురు భౌమజ్ఞార్కి కాలక్రమేణ ॥
ప్రభవతియమఘంటః కంటకఃకాలవేలా ।
కులికఇతివిరుద్ధ స్తత్పరార్థం నిషిద్ధం ॥ ౨౩౩ ॥

తా॥ పగలు ౮ అంశలు, రాత్రి ౮ అంశలు ; గురు కుజ బుధ శని కాలక్రమము ననుసరించి వరుసగా యమఘంట కంటక కాలవేలా గుళిక కాలంబు లేర్పడుచునున్నవి. అరజాము కాలము అవి దోషంబులు. తత్సమయం

బున శుభకర్మలుతగవు. అవి దైవజ్ఞ మనోహర వచనము. అనగా నేడువారంబులలో నడచెడు వారమెదియో దానికి శనివార మెన్నియవదో ఆసంఖ్యను రెట్టించినదన్నియవ ముహూర్తము గుళికకాలము. ఇట్లే వర్తమాన వారమునకు బుధవారని మెన్నియవదో దానిని రెట్టించిన నాముహూర్తమే అర్ధప్రహరమను కాలవేళయగును. ఇట్లే గురువెన్నియవదో దానిని రెట్టించిన యమఘంటకకాలమగును. అట్లే కుజవారమెన్నియవదో దానిని రెట్టించిన నన్నియవ ముహూర్తమే కంటకమను దుర్ముహూర్తమనబడును అనగా భానువారమునాడు శనివార మేడవదిగాన ౭ను రెట్టించి ౧౪ వది గుళికమను దుర్ముహూర్తం బనబడెను. ఈ క్రమమున ముహూర్తమనగా పగలుగాని రాత్రిగాని, ౧౫ పాళ్లలో నొక్కొయంశయని యెఱుంగనగును. ఇట్లే చూచికొనుడు.

శ్లో॥ నవారదోషాః ప్రభవంతిరాత్రౌ ।
దేవేజ్యదైత్యేజ్య దివాకరాణాం ।
దివాశశాంకార్కి జభూసురాణాం।
సర్వత్ర నింద్యో బుధవారదోషః ॥ ౨౩౪ ॥

తా॥ వారదుర్ముహూర్త దోషంబులు - గురు శుక్ర భానువారంబులలో రాత్రియును; శని చంద్రాంగారక వారంబులలో పగలును లేవు. బుధవార దోషంబు మాత్రము పగలును రాత్రియును గలదు. అని జ్యోతిర్నిబంధ వచనము.

శ్లో॥ మన్వర్క దిగ్వ స్వృతు వేదపక్షైః।
రకాన్ముహూర్తైః కులికాభవంతి ॥
దివా నిశ్శైకై రథ యామినీషు।
తే గర్హితాః కర్మసు శోభనేషు ॥ ౨౩౫ ॥

తా॥ భానువారాదిగా పగలు ర ౧౪, చ ౧౨, కు ౧౦, బు ౮, గు ౬, శు ౪, శ ౨; రాత్రి ర ౧౩, చ ౧౧, కు ౯, బు ౭, గు ౫, శు ౩, శ ౧; ముహూర్తము కులిక కాలంబుగానుండునని సులభముగా శ్రీపత్యాచార్యుల వారు నిరూపించియున్నారు. (ఇట్లు దీని ఫలంబును కొంతవివరణంబు నీవరకే శుభాశుభ ప్రకరణంబున చెప్పంబడియున్నది.)

౮౧. పంచాగదోష విశేషము,

శ్లో॥ ఏకాంతరా దినపతౌదివసేద్వితీయా।
పూర్వాంత్య చాపధరయోర్ఘటగోక్షయోశ్చ ॥
కర్కాజయోర్మిథున కన్యకయోశ్చ కీట।
హర్యో స్తులామకరయోః ఖలుమాసదగ్ధాః ॥ ౨౩౬ ॥

తా॥ కృష్ణ శుక్ల పక్షంబులలో రెంటిలోను ధనుర్మీనంబులలో రవియుండగా విదియయును; వృషకుంభములలో రవియుండగా చవితియును; మేషకర్కాటకములలో రవియుండగా షష్ఠియును; కన్యామిథునములలో రవియుండగా సప్తమియును; సింహవృశ్చికములలో రవియుండగా దశమియును; తులామకరంబులలో రవియుండగా ద్వాదశియును; దగ్ధతిథియనంబడును.

౨౯౬  ముహూర్త రత్నావళియందు.

శ్లో॥ మాసదగ్ధాసు తిథిషు కృతంయన్మంగళాదికం ।
తత్సర్వంనాశమాయాతి గ్రీష్మే కుసరితోయథా ॥

తా॥ ఈ మాసదగ్ధంబులనబడు తిథులయందు చేయబడు మంగళకార్యంబులు గ్రీష్మఋతువు నందలి యేళ్లవలె సర్వనాశమైపోవునని వసిష్ఠవచనంబులు.

౮౨. జామిత్ర దోషవిచారము.

శ్లో॥ జామిత్రంద్వివిధంప్రోక్తం గర్గగాలవగౌతమైః ।
తస్మాల్లగ్నాచ్చచంద్రాచ్చ జామిత్రంపరివర్జయేత్ ॥

తా॥ జామిత్రమనగా నేడవయిల్లు. అది రెండు తెఱంగులగును. లగ్నమునుండియు చంద్రునినుండియు చూడనగునని గర్గగాల వాదిముని మతము కావున, లగ్నసప్తమము చంద్రసప్తమము వివాహముహూర్తమున శుద్ధముగా నుండవలయును.

శ్లో॥ పాపాత్సప్తమగశ్శశీ యదిభవేత్పాపేనయుక్తోథవా ।
యత్నేనాపివివర్జయేన్మునిమతేదోషోపిసంకథ్యతే ॥
ఉద్వాహేవిధవావ్రతేతుమరణం శూలంచపుంస్కర్మణా।
యాత్రాయాంవిపదోగృహేషుదహనఃక్షౌరేపిరోగోమహాన్ ॥

తా॥ చంద్రుడు పాపగ్రహమునకు ఏడింటనుండినను పాపగ్రహముతో కూడియున్నను, అక్కాలమును వర్జింపనగును. ఎందువల్లననిన—

పెండ్లిలో విధవయగును ; ఉపనయనమున మరణము ; పుంసవనమున శూల రోగము ; ప్రయాణమున విపత్తులు ; గృహప్రవేశమున నగ్నిభాధ ; క్షౌరంబున రోగము ; గల్గునని దోషము చెప్పంబడినది. అని లల్లవచనము.

శ్లో॥ చంద్రాత్సప్తమరాశిగేదినకరేత్యక్తాధనైఃకన్యకా॥
భౌమేచప్రమదాప్రయాతివిలయం సౌరేణవంధ్యాసరుక్॥
జీవజ్ఞభృగుశశాంకజౌశుభకరాః కేచిద్వదంతిక్రమా ।
ద్భర్తృప్రేష్సితదీక్షితా స్తభవనేనిత్యంప్రవాసాన్వితా ॥

తా॥ వివాహముహూర్తములో చంద్రునికేడింట రవియున్న నా పెండ్లి కూతురు దట్టదరిద్రురాలగును ; కుజుడున్న నాపిల్ల దీర్ఘకాలము బ్రతుకదు ; శనియున్న రోగము గలదియును గొడ్రాలునగును. గురు బుధ శుక్రులుండిన శుభకరులని కొందఱందురుగాని, గురుడున్న పతిహితయగును ; శుక్రుడున్న దీక్షాబద్ధయగును ; బుధుడున్న నిత్యప్రయాణము గలదగును. అని భుజబల వచనము. ఇది యాలోచించితే జామిత్రదోషమను నది పెండ్లికూతురికనిష్టకరమైనది.

౮౩. జామిత్ర దోషాపవాదము.

శ్లో॥ తుంగత్రికోణభవనే భవనే నిజేవా ।
సౌమ్యాధిమిత్రగృహ గోపితదీక్షితోవా ।
జామిత్రవేధజనితా నపహృత్య దోషా ।
న్దోషాకర స్సుఖ మనేకవిధం విధత్తే ॥౨౮౧॥

తా॥ పైన చెప్పిన జామిత్రదోషమున్నను, ఆచంద్రుడు తనయింటిలో గాని తన యుచ్చలోగాని మిత్రశుభగ్రహ గృహమునగాని అట్టి గ్రహము చేత చూడబడియున్నను, సమస్తదోషంబులను పరిహరించి పలుతెఱంగు లుగా సౌఖ్యమునిచ్చు వాడగునని రాజమార్తాండ వచనము.

శ్లో॥ ఏకార్గలోపగ్రహపాతలత్తా ।
జామిత్రకర్తర్యుదయాస్తదోషాః ॥
నశ్యంతిచంద్రార్క బలోపపన్నే ।
లగ్నేయథార్కాభ్యుదయేతు దోషా ॥ ౨౫౨ ॥

తా॥ వివాహలగ్నమున సూర్యచంద్రులు బలవంతులైయున్నయెడల సూర్యోదయమున రాత్రిదోషము తెల్లవారినట్లు ; ఏకార్గళము, ఉపగ్రహము, పాత, లత్త, జామిత్రము, కర్తరి, ఉదయాస్తదోషము ; అంతయును పారిపోవునని వసిష్ఠవచనంబు.

శ్లో॥ గురుశ్చంద్రశ్చ జామిత్రేతిష్ఠేద్యదిబలాన్వితః ।
ధనసౌభాగ్యపుత్రాంశ్చ లభతేనాత్రసంశయః ॥౨౫౩॥
శోభితాతుసదాతిష్ఠే ద్గురుణాపి నిరీక్షితే ।
సాతుభర్తుఃప్రియానిత్యం బుధేచంద్రస్యసప్తమే ॥

తా॥ వివాహలగ్నమునకు ౭లో గురుచంద్రులున్నయెడల వారు బలాన్వితులైయుండిన నిస్సందేహముగా నాదంపతులు ధన భాగ్యవంతులై

పుత్రులను కనిసుఖించెదరు. చంద్రుడు గురువుచే చూడబడియున్నను పెండ్లికూతురు భాగ్యముచేప్రకాశించును. చంద్రునికొండములో బుధుడున్న పతికి హితురాలై యొప్పుచుండునని వాత్స్యాయన వచనంబులు.

## ౮౪. దశయోగచక్ర దోషవిచారము.

శ్లో॥ యస్మిన్నృక్షేరవిస్తిష్ఠేద్యస్మిన్నృక్షేశశీతథా ।
ద్వయోర్యోగహృతేధిష్ణ్యశేషస్స్యాత్సాపదితోదశ ॥
శూన్యవేదర్తురూపాణి దిగ్రుద్రతిథయో ధృతిః ।
ఊనవింశానఖాశ్చైతిదశయోగాఃప్రకీర్తితాః ॥ ౨౮౬ ॥

తా॥ ఏనక్షత్రమున సూర్యుడుండునో ఆనక్షత్రసంఖ్యను, చేర్చి ౨౭ ట భాగించగా వచ్చినశేషము ౦-౧-౪-౬-౧౦-౧౧-౧౫-౧౮-౧౯-౨౦ వచ్చినయెడల ఈ ౧౦ టికిని దశయోగసంజ్ఞ గల్గియున్నట్లు చెప్పంబడినవి.

శ్లో॥ మరున్మేఘాగ్ని భూపాలచోరమృత్యురుజో శనిః ।
కలిర్హానిర్దశోద్వాహేదోషాస్త్వజ్యాస్సదాబుధైః ॥
వివాహేదౌ ప్రతిష్ఠాయాం వ్రతేపుంసవనేతథా ।
కర్ణవేధేచచూడాయాందశయోగంవివర్జయేత్ ॥ ౨౮౭ ॥

తా॥ పైదశయోగములలో, ౦ కు వాతదోషమనియు; ౧కి అభ్ర దోషమనియు; ౪కి అగ్నిదోషమనియు; ౬కి రాజదోషమనియు; ౧౦కి చోరదోషమనియు; ౧౧కి మృతిదోషమనియు; ౧౫కి రోగదోషమనియు;

 ముహూర్త రత్నావళియందు.

౧౫కి వజ్రదోషమనియు; ౧౯కి కలహదోషమనియు ; ౨౦కి హానిదోషమనియు ; ౧౦కిని దోషనాశంబులు. పండితులు వీటిని వివాహమునందు త్యజింపనగును. పెండ్లిలోను, ప్రతిష్ఠలోను, ఉపనయనమునను, పుంసవనమునను కర్ణవేధలోను, చౌలమునను కూడవర్జింప నగునని లల్లాచార్య వచనములు.

శ్లో॥ యోగాంకేవిషమేసైకే సమే సవసులోచనే ।
దళీకృతేశ్వినీపూర్వ్యం దశయోగముదాహృతం ॥౨౪॥
దశయోగే మహాచక్రే ప్రమాదాద్యది విధ్యతే ।
క్రూరైస్సౌమ్యగ్రహైర్వాపిదంపత్యోః రేకనాశనం ॥

తా॥ ఇట్లు ఏర్పడిన పైయోగసంఖ్యలలో బేసిసంఖ్య వచ్చినప్పుడు ఒకటినిచేర్చి యర్ధించి నక్షత్రము నెఱుంగునది. సమసంఖ్య వచ్చినప్పుడు దానినర్ధించి దానికి ౧౪ను చేర్చి నక్షత్రము నెఱుంగవలయును. అనగా, దశయోగసంఖ్య ౧౦ అయితే, అర్ధించగా ౫ నిలచె, దీనికి ౧౪ను చేర్చిన ౧౯ అయ్యె, ౧౯వది మూలనక్షత్రము ; దశయోగసంఖ్య ౧౫ గానుండిన దానికొకటిచేర్చగా ౧౬ అయ్యె, దాని నర్ధించగా ౮ నిలచెను, ౮వది పుష్యనక్షత్రము ; ఇట్లు వచ్చిన నక్షత్రము మొదలుకొని అభిజిత్తుతో కూడ ౨౮ నక్షత్రంబులను ౧౪ గీతలుగీచి వాటి చివరలో వ్రాయునది ఇదియె దశయోగ చక్రమనబడును. ఈచక్రమున క్రూరగ్రహ మైనను సౌమ్యగ్రహ మైనను సరియె చంద్రుడును మఱియొక గ్రహమును ఏకరేఖలోనుండిన నది పరస్పరావలోకన వేధయను దోషము గలదగును. ఈ వేధశుభఫల దాయకంబుకాదు. అని జ్యోతిస్సాగర వచనము.

## ౮౫. దశయోగ చక్రదోషాపవాదము.

శ్లో॥ గురౌలగ్నాధిపే శుక్రే సవీర్యే లగ్నకేంద్రగే ।
దశదోషావినశ్యంతియథాగ్నౌ తూలరాశయః ॥ ౨౫౧॥

తా॥ గురుడుగాని లగ్నాధిపతిగాని శుక్రుడుగాని బలవంతులై వివాహలగ్నమునకు కేంద్రంబులలోనుండిన నీదోషంబులును పరిహారమగును. అని భరద్వాజవచనము.

శ్లో॥ శుక్రేణగురుణావాపిసంయుతందృష్టమేవచ ।
దశయోగసమాయుక్తమపిలగ్నంశుభావహం ॥ ౨౫౨ ॥

తా॥ శుక్రుడుగాని గురుడుగాని చేరియో చూచియో లగ్నము బలయుతమైయుండిన దశయోగచక్రదోషము శుభఫలదంబగునని వ్యాసవచనముగలదు.

## ౮౬ పంచకంబనుబాణ దోషవిచారము.

శ్లో॥ గతతిథియుతలగ్నంపంచధాస్థాపనీయం ।
తిథిరవిదశనాగై ర్వేదయుక్తంక్రమేణ ॥
నవహృత శరశేషే బాణసంజ్ఞాక్రమేణ ।
రుగనలనృపచోరాః పంచమోమృత్యుసంజ్ఞః ॥ ౨౫౩ ॥

తా॥ ఏనాడు లగ్నముపెట్టవలయునో, నాటి తిథిసంఖ్యను లగ్నసంఖ్యను కలిపి, ౫ స్థలములలో వ్రాసి వాటిక్రిందవరుసగా ౧౯-౧౭-౧౦-౮-

౫- సంఖ్యలను వ్రాసి, వేర్వేరుగానే ౯చే భాగించగా నైదుస్థలములలోను శేషములు నిలుచును. వాటిలో నెచ్చట ౧ శేషములు నిలుచునో దానికి బాణమని పేరు. మొదటిస్థానమున ౧ శేషించిన రోగబాణము; రెండవ స్థానమున శేషించిన ౨కు అగ్నిబాణమని పేరు; ౩వ స్థానమున శేషించిన ౪కి రాజబాణమని పేరు; ౪వ స్థానమున శేషించిన ౬కి చోరబాణమని పేరు; ౫వ స్థానమున శేషించిన ౮కి మృత్యుబాణమని పేరు; ఈబాణము గల్గిన లగ్నము నామానుగుణంబుగా దోషయుక్తమని పరిత్యజించ వలయును. (ఇట్లు పంచకదోషము చూచెడు పద్ధతి మహారాష్ట్రదేశస్థులలో సంప్రదాయముగానున్నదని తెలియనగును.) ఈవచనము వివాహపటలమున సప్తర్షిమతమని చూపంబడినది.

శ్లో॥ సంక్రాంతియాతాంశకనందశేష ।
స్తర్కాగ్నిరూపాష్టయుగైస్సమేతః ॥
తష్టోగ్రహైః రోగవహ్నితాశభూప ।
స్తేనోమృతిశ్చేతిచపంచబాణాః ॥ ౨౫౪ ॥

తా॥ సూర్యుడుండెడు రాసులలో నెన్నిభాగములు కడచినవో ఆ భాగసంఖ్యను మాత్రము తీసికొని (సుమారు పంచాంగమున వ్రాయబడు అయన తేదులను ఉద్దిష్టలగ్న సంఖ్యతో కలిపి ౫ స్థానములలో వ్రాసి వేర్వేరుగా ౯చే భాగించిన నిలిచెడు శేషములలో నెచ్చట ౧ నిలుచునో అది దోషపంచకము. వరుసగా నాస్థానములే రోగవహ్నిరాజ చోరమృత్యుపంచకంబు లనబడునని కశ్యపవచనము. ఈ సంప్రదాయము బంగాళా ప్రాంత ప్రాచ్యదేశమున వాడుకలోనున్నది.

శ్లో॥ తిథివారభలగ్నాంకోర సాగ్న్యంబ్వష్టవేదయుక్ ।
నందాప్తపంచశేషేరుగ్వహ్నిరాట్చోరమృత్యుకృత్ ॥

తా॥ ముహూర్తకాలములోని తిథిసంఖ్యను వారసంఖ్యను నక్షత్ర సంఖ్యను లగ్నసంఖ్యను కలిపిన మొత్తమును ౫ స్థానములలో వ్రాసి, వాటిక్రింద వరుసగా ౬-౩-౧-౮-౪ను వ్రాసి సంకలనముచేసి, వెవ్వేరుగా (౯) చే భాగించగా నైదుస్థానంబులలోను శేషములు నిలుచును. వాటిలో ౫వున్నస్థానము దోషపంచకంబని యెఱుంగనగును. వరుసగా నాయైదుస్థానములకును రోగపంచకము అగ్నిపంచకము రాజపంచకము చోరపంచకము మృత్యుపంచకము అని పేళ్లు. అని జ్యోతిశ్చింతామణి వచనము. అయిదు శేషించుటవలన దోషముగల్గునుగాన దీనికి పంచకదోషమని పేరుగల్గినది. ఈక్రమము ననుసరించియే కర్ణాటాంధ్ర ద్రావిడదేశంబులలో పంచకదోషమును పాటించుట సత్సంప్రదాయంబైయున్నది. ఈఫలితాంశమునే లోకులలో నిప్పుడు అందఱుచూచుచుండెడు క్రమమెట్టిదనిన ;—

శ్లో॥ తిథివారర్క్షలగ్నానాంరాశిం నవభిరాహరేత్ ।
త్రిపంచసప్తనవకశేషే నిష్పంచకంస్మృతం ॥
ఏకేమృత్యుర్ద్వికేవహ్నిశ్చతుష్కేరాజపంచకం ।
షట్కేచోరోష్టకేరోగఃపంచకాఖ్యాం వివర్జయేత్ ॥

తా॥ తిథివారనక్షత్ర లగ్నసంఖ్యలను కలిపిన మొత్తమును ౯చే భాగించగా నిలిచిన శేషము ౩.౫.౭.౯ (౦) గానుండిన నిష్పంచకమని చె

ప్పెదరు. దీనినే రహితంబైనదియని యాంధ్రదేశమున వాడెదరు. ౧ శేషించిన మృత్యుపంచకము; ౨ వహ్నిపంచకము; ౪ శేషించిన రాజపంచకము; ౬ శేషించిన చోరపంచకము; ౮ శేషించిన రోగపంచకమని తెలిసి వీటిని ముహూర్తములలో దోషములని గ్రహించవలయును.

## ౮౭. పంచకాపవాదము.

శ్లో॥ రోగంచోరంత్యజేద్రాత్రౌ దివారాజాగ్నిపంచకం ।
ఉభయోస్సంధ్యయోర్మృత్యుమన్యకాలేననిందితః ॥

తా॥ రాత్రిలో రోగచోర పంచకమును, పగటిలో రాజాగ్నిపంచకంబులును, రెండుసంధ్యలలోను మృత్యుపంచకమును, దోషప్రదములే గాని; చెప్పిన కాలనియమము నతిక్రమించిన కాలంబులలో వాటి దోషమును లేవనియును; జ్యోతిః ప్రకాశవచనము.

శ్లో॥ రవౌరోగంకుజేవహ్నిం శనౌచనృపపంచకం ।
వర్జ్యంపునఃకుజేచోరంబుధవారేచమృత్యుదం ॥

తా॥ ఆదిత్యవారము రోగపంచకంబు, మంగళవారమున చోరాగ్ని పంచకంబులు, శనివారమున రాజపంచకంబు, బుధవారమున మృత్యుపంచకంబును వర్జ్యంబులు. తక్కిన వారంబులలో పంచకదోషమే పరిగ్రాహ్యముకాదని దైవజ్ఞ మనోహరవచనము.

శ్లో॥ వేదాగ్నిశాస్త్రశాస్త్రర్తుషట్కసప్తకవహ్నయః ।
యోజ్యాద్విపంచవస్వశ్వామేషాద్యాపంచకేధ్రువం ॥

తా॥ లగ్నము పెట్టునపుడు పంచకము చూచుటలో మేషాదులకు వరుసగా ౮-౩-౬-౯-౬-౫-౭-౩-౨-౪-౧-౭ ఈసంఖ్యలు ధ్రువకంబులని, ఆయాలగ్న సంఖ్యతోడ నీసంఖ్యను చేర్చికొని పంచకరహితంబయ్యె నను కొనుచు కొందఱు చూచెదరు. ఈధ్రువకపద్ధతికి మూలాధారము లేదు.

శ్లో॥ నృపాఖ్యంరాజసేవాయాంగృహ గోప్యగ్నిపంచకం।
యానేచౌరం వ్రతేరోగంత్యజేన్మృత్యుంకరగ్రహే॥

తా॥ రాజదర్శనంబున రాజపంచకంబును, గృహప్రవేశమున అగ్ని పంచకంబును, ప్రయాణసమయమున చౌరపంచకంబును ఉపనయనమున రోగపంచకంబును, వివాహమున మృత్యుపంచకంబును పరిత్యాజ్యంబులు, అని జ్యోతిః ప్రకాశవచనము.

౮౮. ఉదయాస్తశుద్ధికై గ్రహదృష్టివిచారము.

శ్లో॥ పూర్ణం పశ్యతి రవిజః।
తృతీయదశమే త్రికోణమపి జీవః।
చతురశ్రం భూమిసుతః।
సితార్కబుధహిమకరాః కళత్రంచ ॥ ౧౬-౨ !

తా॥ ఉదయమనగా వివాహలగ్నము. అస్తమనగా దానికి సప్తమ లగ్నము. ఇవి రెండును శుద్ధినంది యుండవలయును. దానివిషయము ముందు చెప్పబడుచున్నది. దానికై మొదట గ్రహముల దృష్టివిచార మెట్లనిన— శని పూర్ణదృష్టితో ౩వ యిల్లును, ౧౦వ యిల్లును, చూచుచున్నాడు; గు

రుడు 6వ యింటిని 8వ యింటిని పూర్ణదృష్టితో చూచుచున్నాడు ; అం గారకుండు 4వ యింటిని 8వ యింటిని పూర్ణదృష్టితో చూచుచున్నాడు. రవి చంద్ర బుధ శుక్రులు 7వ యింటిని పూర్ణదృష్టితో చూచుచుందురు. సామాన్యముగా 7వ యింటికి కుజ గురు శని దృష్టియును గలదుగాని పూర్ణదృష్టిగాదని ఫలితాంశము. ఇది వరాహావచనము. శని దృష్టికిపాదదృష్టి యనియు, గురుదృష్టికి అర్ధదృష్టియనియు, కుజదృష్టికి త్రిపాదదృష్టియని యు, సప్తమదృష్టికి పూర్ణదృష్టియనియు సంకేతము.

## ౮౯. ఉదయాస్తలగ్న శుద్ధివిచారము.

శ్లో॥ యదాలగ్నాంశేశోలవమథ తనుంపశ్యతియుతో ।
భవేద్వాయంవోఢుశ్శుభ ఫలమనల్పంరచయతి ॥
లవద్యూనస్వామీలవమదనభంలగ్నమదనం ।
ప్రపశ్యేద్వావధ్వాశ్శు భమితరథాజ్ఞేయమశుభం ॥

తా॥ వివాహలగ్నముయొక్క నవాంశను నవాంశాధిపతి చూచినను ఆనవాంశయందే ఉన్నను ; లగ్నమును చూచినను లగ్నమునందే ఉండినను ; వరునికి మిక్కిలి శుభము, అట్లె ఆనవాంశకు 7 వయింటిని తదధిపతి చూచినను 7వ యింటిలోనున్నను లగ్నసప్తమమును జూచినను లగ్న సప్తమమునందున్నను ; పెండ్లికూతురికి మిక్కిలి శుభము. అట్లులేకపోయిన అశుభము. అనగా—ఉదాహరణము. మేషలగ్నము మిథునాంశలో ము హూర్తము పెట్టినారను కొందుము. అప్పుడు మిథునాధిపతి బుధుడు ధను

స్సునందుండి మిథునమును చూచుచుండినను మిథునమునందే ఉండినను; ఇది యొక యుదయశుద్ధియని గ్రహింపవలయును. ఆబుధుడు తులయందుండి మేషలగ్నమును చూచుచుండినను మేషమునందే ఉండినను ; ఇదియొక యుదయశుద్ధియని గ్రహించవలయును. ఇట్లె సప్తమశుద్ధియనగా మిథునాంశకు సప్తమము ధనుస్సు, తదధిపతి గురుడు, ఆగురుడు ధనుస్సునందే ఉండినను మేషమునందుండేగాని సింహమునందుండిగాని మిథునమునందుండిగాని ధనుస్సును చూచుచుండినను ; ఇదియొక అస్తశుద్ధియని గ్రహింపవలయును. ఆగురుడు లగ్నసప్తమమగు తులను చూచుచుండినను తులయందే ఉన్నను ; ఇదియొక అస్తశుద్ధియని గ్రహింపవలయును. అస్తశుద్ధిలేకపోయిన వధువుకు హానియనియును, ఉదయశుద్ధి లేకపోయిన వరునికిహాని యనినను వశిష్ఠ వచనము " ఇష్టోదయాంశేనిజపత్యదృష్టె । వరస్యమృత్యుస్తను సంయుతే చే ॥ అస్తాంశకెప్యేవమదృష్టయుక్తె స్వస్వామినానాశముపైతికన్యా " అని ముహూర్త చింతామణిలో చెప్పంబడియున్నది.

శ్లో॥ లగ్ననవాంశకౌస్వస్వపతినావీక్షితౌయుతౌ ।
నచేద్వాన్యోన్యపతినాశుభమిత్రేణవాథవా ॥౨౬౪॥
వరస్యమృత్యుస్సాస్తాభ్యాం సప్తసప్తాదశాంశకౌ ।
ఏవంతావీక్షితౌయుక్తౌమృత్యుర్వధ్వాశ్చేకరగ్రహే ॥

తా॥ లగ్ననవాంశాధిపతులు లగ్ననవాంశలను చూచుచుండినను చేరియుండినను ; లేక, నవాంశపతి లగ్నమును, లగ్నపతినవాంశను చూచుచుండినను ; అప్పుడు వరునికి మిక్కిలి శుభము. అట్లుగాకున్న, శుభగ్రహ

మయిన మిత్రగ్రహముయొక్క దృష్టిగల్గియున్నను సరియె. అటుగాకుండిన వరునికిహాని. ఇట్లే; లగ్నసప్తమాధీశుండు లగ్నసప్తమమును, అంశసప్తమాధీశుండు అంశసప్తమమును చూచుచుండినను సరియే; వానిని వీడును వీనిని వాడును చూచుచుండినను సరియే; లేక, లగ్నసప్తమాధీశుడు అంశసప్తమమును అంశసప్తమాధీశుడు లగ్నసప్తమమును చూచినను చేరినను సరియె; శుభమిత్రదృష్టియయినను; వధువుకు మిక్కిలిశుభము లేనియెడల హానిగల్గునని నారదవచనంబులు.

శ్లో॥ ఉదయాంశస్వనాథేనమిత్ర సౌమ్యేనవాయుతః ।
ప్రేక్షితోవాతథాస్తాంశో దంపత్యోఃపుత్రపౌత్రదః ॥

తా॥ పైనారదవచనంబులలో చెప్పినట్లు ఉదయాస్త లగ్నశుద్ధి యనురియుండిన పక్షమున నాదంపతులకు పుత్రపౌత్ర సంపద బాగుగానుండునని వసిష్ఠవచనము,

## ౯౦. వజ్రయోగ విచారము,

శ్లో॥ తిథివారంచనక్షత్రం నవభిశ్చసమన్వితం ।
సప్తభిస్తుహరేద్భాగంశేషాంకే ఫలమాదిశేత్ ॥ ౬౬౭॥
త్రిశేషేతుజలంవింద్యాత్పంచ శేషేప్రభంజనః ।
సప్తశేషేవజ్రపాతోజ్ఞేయం వజ్రస్యలక్షణం ॥ ౬౬౮ ॥

తా॥ తిథిసంఖ్యను వారసంఖ్యను నక్షత్రసంఖ్యను కలిపి దానికి ౯ చేర్చి; ౭ట భాగించగా ౩ శేషమునిలిచితే జలంబనియును, ౫ మిగిలిన వా

తంబనియును, ౭ నిలచితే వజ్రపాతంబనియును; వజ్రయోగలక్షణమును గ్రహించవలయునని టోడరానందమను గ్రంథమునందు చెప్పంబడినది. ఈయోగమును వివాహముహూర్తదినమునకు కొందఱు చూచుచున్నారు.

## ౯౧. సంక్రాంతిదోష విచారము.

శ్లో॥ విషువతోరయనయోర్దినత్రయం ।
హరిపదేషు షడశీతిముఖేషు చ ॥
పూర్వతోపి పరతోపి సంక్రమా ।
న్నాడికాశ్చ ఖలు షోడశ త్యజేత్ ॥ ౨౬౯
సంక్రాంతిదోషేత్వ చిరాత్కృతంయ ।
దుద్వాహపూర్వా ఖిలమంగళాద్యం ॥
లాక్షాసమూహోజ్వలితాగ్నిమధ్యే ।
విలీయతేతద్వద శేషమేతత్ ॥ ౨౭౦ ॥

తా॥ విషువత్కాలంబులనగా మేషసంక్రమణము తులాసంక్రమణంబులలోను, అయనంబులనగా మకరసంక్రమణము కర్కాటక సంక్రమణంబులలోను, మూడు దినములనగా సంక్రమణమునాడు మఱిముందు వెనక దినంబులను; తక్కిన వృషభ మిథున సింహకన్యా వృశ్చికధనుః కుంభమీన సంక్రమణంబు లెనిమిదింటను, షడశీతిముఖమని పంచాంగములలో వ్రాసెడు నాల్గురోజులలోను, ఆప్రవేశఘటికలకు ముందు వెనుక ౧౬-౧౬ ఘడి

యుల కాలమును ; వివాహ వ్రతాదులలో పరిత్యజింప వలయును. ఎందువల్లననగా నాసంక్రమణాది కాలంబులలో చేయబడిన వివాహాది మంగళకార్యంబులు అన్నియును మండుచుండు నిప్పుయొక్క నడుమ లక్కకరగి పోవునట్లు నశించుచుండునని వసిష్ఠవచనంబులు.

### ౯౨. సంక్రాంత్యాదులలో ఫలవిశేషము.

శ్లో॥ అయనద్వయేసమూఢా। భర్తారంనాభినందతేనారీ ॥
విషువద్వయేపివిధవా। షడశీతిముఖేషుసామ్రియతే ॥
విష్ణుపదేషువిగీతా। కన్యావికలేంద్రియావ్యతీపాతే ॥
వైధృతివిష్ట్యోర్భ్రష్టా।సుభగాశేషేషుకరణేషు॥౨౭౨॥

తా॥ అయనములలో పెండ్లియైనవధువు పెనిమిటిని సంతోషపరచ చాలనిదగును. విషువత్కాలంబులలో విధవయగును. షడశీతి ముఖంబులలో నైతే తానే చచ్చును. తక్కిన సంక్రమణంబులలో పుంశ్చలియగును. వైధృతిలో నంగవైకల్యమునందును. వైధృతిలోను విష్టియను భద్రకరణంబులో నుభ్రష్టయగును తక్కిన బవాదికరణంబులు మంగళప్రదంబులు, అని శౌనకవచనంబులు.

### ౯౩. నవాంశలగ్నదోషఫలవిచారము.

శ్లో॥ లగ్నేహి సర్వే శుభరాశయశ్చ।
శుభేక్షితా వాథయుతా శ్శుభాస్స్యుః ॥

నవాంశకాస్తా విన్నృయుగ్మవత్యః ।
శ్చాపాద్యభాగస్య్సభదో నచాన్యే ॥ ౨౭౩ ॥

శ్లో॥ ద్విభర్తృకా మేషనవాంశకే స్యా ।
ద్వృషాంశకే సా పశుశీలయుక్తా ॥
ధనాన్వితా పుత్రవతీ తృతీయే ।
కులీరకాంశే కులటా హ్యజస్రం ॥ ౨౭౪ ॥

శ్లో॥ సింహాంశకే సా పితృమందిరస్థా ।
కన్యాంశకే విత్తయుతా సుశీలా ॥
తులాంశకే సర్వగుణా సదా సా ।
కీటాంశకే నిస్స్వతరా విశీలా ॥ ౨౭౫ ॥

శ్లో॥ చాపాంశకాద్యే ధనినీ ద్వితీయే ।
భాగేన్యసక్తా మలినా గదాఢ్యా ॥
నిస్స్వ ఋంగాంశే విగుణా ఘటాంశే ।
విభర్తృకా యోగరతా విశీర్ణా ॥ ౨౭౬ ॥

శ్లో॥ మీనాంశకే భర్తృయుతాఽర్థహీనా ।
శుభగ్రహైః యుక్తనిరీక్షితేవా ॥
తస్మాత్సదైవోక్తనవాంశకేషు ।
కుర్యాద్వివాహం గుణసంప్రవృద్ధ్యై ॥ ౨౭౭ ॥

శ్లో॥ నవాంశదోష స్సకలం గుణౌఘం ।
లగ్నస్థసౌమ్యగ్రహసంభవంచ ॥
ధ్రువం నిహంతీవ వృకోఽజ సంఘం ।
షడ్వర్గజం సౌమ్యవియచ్చరాణాం ॥ ౨౭౮ ॥

తా॥ లగ్నవిషయమునందు అన్నిరాసుల్లును శుభరాసులే, మఱియు శుభగ్రహములు చూచియున్నను శుభగ్రహముతో నవి చేరియున్నను శుభకరంబులగును, అయితే, తులాకన్యామిథున నవాంశలును ధనుర్నవాంశలో నాదిభాగంబును శుభకరంబులు. తక్కిన నవాంశలన్నియును శుభకరంబులు కావు, ఎందువల్లననిన, అయ్యంశఫలంబుల నిట్లెఱుంగ వలయుననిన—మేషనవాంశయందు పెండ్లికూతురు రెండుమగండ్లు గలదగును. వృషాంశయందు పసలమువలె వర్తించునది యగును. మిథునాంశమున ధనపుత్రవతియగును. కర్కాటకాంశమున జారిణియగును. సింహాంశయైన పుట్టినింటయుండును. కన్యాంశయైన మంచిస్వభావము గలదియును బిడ్డలు గలదియునగును. తులాంశయైనచో సమస్తసుగుణంబులును గలదగును. వృశ్చికాంశలో భీదరాలును దుస్స్వభావయునగును. ధనురంశలో మొదటి యర్థభాగమున ధనవంతురాలగును ; రెండవ అర్థభాగమున రోగిణియు మలినయు పరాసక్తయునగును. మకరాంశమున దరిద్రురాలు. కుంభాంశమున గుణహీనురాలును పతిని విడనాడినదియు విచ్చలవిడిగా పోవునదియు యోగయుక్తయునగును. మీనాంశయందు పతితోడ దరిద్రురాలై యుండును. ఈఫలంబులు శుభగ్రహములు చూచియున్నను కూడియున్నను తప్పవు. కావున

చెప్పిన నవాంశఫలంబుల నెఱింగి మంచి నవాంశలలో గుణాభివృద్ధి కొఱకై వివాహమును చేయనగును. తోడేలు మేకలగుంపును భక్షించునట్లు ఈనవాంశలగ్న దోషంబు షడ్వర్గలలో శుభగ్రహ బలమున్నను లగ్నమునందలి శుభగ్రహబలంబును కూడ నాశము చేయునని వసిష్ఠవచనంబులు.

## ౫౪. వర్గోత్తమాంశవిచారము.

శ్లో॥ వర్గోత్తమంవినాంత్యాంశో వివాహే నశుభప్రదః ।
వర్గోత్తమశ్చేదంత్యాంశః పుత్రపౌత్రాదివృద్ధిదః ॥

తా॥ ఏలగ్నమునందైనను ఆయంశకు వర్గోత్తమాంశయని పేరు. మిథునమున కడపటి మిథున నవాంశయే వర్గోత్తమాంశ. తులలో మొదటి తులయే వర్గోత్తమాంశ. కుంభమున నడిమికుంభ నవాంశయే వర్గోత్తమాంశ. ఇట్లేయుండవలయును. ఏలగ్నమునందైనను కడపటి నవాంశశుభమునివ్వదు. ఆకడపటి యంశవర్గోత్తమంబై యున్నయెడల పుత్రపౌత్రాభివృద్ధినిచ్చునని వసిష్ఠవచనము.

## ౫౫. పంగ్వాదిలగ్నదోషవిచారము.

శ్లో॥ మేషోవృషోమృగేంద్రశ్చ దివసేంధాః ప్రకీర్తితాః ।
నృయుక్కర్కటకన్యాశ్చ రాత్రావంధాః ప్రకీర్తితాః ॥
తులాచవృశ్చికశ్చైవ దివసెబధిరాతథా ॥
ధనుశ్చమకరశ్చైవ బధిరౌనిశికీర్తితా ॥ ౨౮౧ ॥
కుంభమీనౌ చపంగూద్వౌ దివారాత్రౌయథాక్రమం ॥

అంధేవై ధవ్యమాప్నోతి దారిద్ర్యంబధిరేతథా ॥
అర్థనాశోభవేత్పంగౌ వితి ధాత్రాపినిశ్చితం ।
(ఇతి వసిష్ఠమునివచనాని) ॥ ౭౮౩ ॥

తా॥ మేషము వృషభము సింహము ఇవి మూడును పగలు అంధ సంజ్ఞగలవి. మిథునము కర్కాటకము కన్య ఇవిమూడును రాత్రిలో నంధ సంజ్ఞగలవి. తుల వృశ్చికము పగలు బధిరసంజ్ఞగలవి. ధనుస్సు మకరము రాత్రి బధిరసంజ్ఞ గలవి.కుంభము పగలును, మీనము రాత్రియును పంగుసంజ్ఞగలది. అంధలగ్నములలో వివాహమైన వధువువితంతువ యగును. బధిరమున దారిద్ర్యము సంభవించును. పంగులగ్నమున ద్రవ్యనాశన మగును ఇట్లు బ్రహ్మవిధి గలదు.

౯౬. లగ్నభంగయోగ విచారము.

శ్లో॥ లగ్నస్థేర్కే-కన్యా । విధవాసంవత్సరేష్టమేభవతి ॥ లగ్న
స్థోహిమరశ్మిః । మృత్యుంకుర్యాత్త్రియోదశేమాసే ॥
భౌమస్సద్యోవిధవాం।లగ్నస్థోబ్రాన్న సౌమ్యదృష్యోగాత్
కామమతినీచవర్గా।ల్లగ్నేస్థేరవిసుతేబహూనాన్పురుషాన్
శనివద్విధుంతుదస్యతు । విజ్ఞేయంసదసదితివిజ్ఞైః ॥
సోమకులేపిహిజాతాం।ద్వాదశగేమధ్యపాంశనౌకురుతే।
మాసత్రయేణవిధవాం । నిధనస్థశ్చంద్రమాఃకురుతే ।

మాసత్రయేణకన్యా । బుధేష్టమేయాతిపంచత్వం ॥
అబ్దచతుష్కాన్మృత్యు । ర్దంపత్యోరష్టమగేచంద్రే ।
లగ్నేశ్వరేపిచతథా । భృగుషట్కేతాదృశంఫలంశీఘ్రం ॥
ధన్యాధనగేశుక్రే । కృపణత్వంప్రాప్నుయాన్నారీ ।
దుశ్చిక్యగతేకన్యా । త్ర్యబ్దాద్భర్తుఃవియోగతాంభజతే ॥
దంపత్యోర్నిధనస్థః । సప్తదశాబ్దాద్వియోగదోజీవః ।
పంచత్వంనయతి భృగు । ర్నిధనస్థస్సప్తభిర్వర్షైః ॥
దశమస్థేభూమిసుతే । మరణంచైకస్యదంపత్యోః ।
అష్టమగేత్వవనిసుతే । మృత్యుస్సన్నిహితపవనిశ్శంకం ॥

తా॥ ఈ చెప్పబోవు యోగములచేత, శుభదిన ముహూర్తమును వదలవలయును గాన వీటికి లగ్నభంగయోగంబులని పేరు. అవియేవియనిన :—లగ్నమున రవియున్నప్పుడు వివాహమైతే కన్య ౮వ యేట విధవయగును. లగ్నమున చంద్రుడుండినచో ౧౩వ నెలలో నామగువచచ్చును. కుజుడు లగ్నమునందుండిన పెండ్లింటిలో విధవయగును; అయిన శుభదృగ్యోగముండిన కొంతనెమ్మది. లగ్నమున శనియుండిన నావధు నీచుల ననేకులను కామించిచెడును. శనివలెనే రాహువునకును ఫలము తెలియనగును. ౧౨వ యింటిలో శనియున్నచో నావధువు మద్యపానము చేయును. ఆరింట చంద్రుడుండిన దంపతులు నాలుగేండ్లకు మృతినందెదరు. లగ్నే

శుడారింట నున్ననల్లో, శుక్రుడారింటనుండిన నాఫలము మఱియును శీఘ్రముగానగు. రెండింట శుక్రుడున్ననాపిల్ల ధన్యురాలైనను మిక్కిలి కృపణయగును. మూడింట శుక్రుడున్న మూడేండ్లకు పతినివిడనాడి దుఃఖించును. ఎనిమిదవయింటిలో చంద్రుడు 3 నెలలో వైధవ్యమునిచ్చును ; బుధుడుండిన మూడు నెలలలో కన్యమృతినందును ; గురుడుండిన ౧౭ సంవత్సరములకు పిదప దంపతులకు వియోగము గల్గును ; శుక్రుడుండిన ౭ సంవత్సరములకు మరణముగల్గును ; అంగారకుడుండిన నిస్సందేహముగా నప్పుడే మృత్యువెదుట బడినట్లు. ౧౦వ యింటిలో నంగారకుండు దంపతులలో నొకరికి హానింజేయును. అని శౌనకవచనంబులు. ॥ ౨౯౧ ॥

శ్లో॥ సప్తమస్థానగాస్సర్వే గ్రహాఃకుర్వంతిశీఘ్రతః ।
దంపత్యోర్మరణం యత్నాస్యదేకస్యచనసంశయః ॥

తా॥ ౭వ యింటిలో నేగ్రహమున్నను సరియే దంపతులలో నొకరికి తప్పక మరణముగాన నది పనికిరాదు. అని కశ్యపవచనము. కావున, ఈ పైన చెప్పంబడిన వివాహలగ్న భంగయోగంబుల నెఱింగి సుముహూర్తము నాలోచింపవలయును. ఈగ్రహస్థితులుపత్వ, తక్కిన స్థానంబులలో నాయాగ్రహములు శుభులని భావము. ఈవరకును దోషనిరూపణంబయ్యె; ఇంక గుణవిచారం బెట్లనిన:—

౯౭. తృతీయైకాదశాష్టమషష్ఠరవిగుణము.

శ్లో॥ బంధుజనేభ్యఃపూజాం। త్రింశద్వర్షాణిసహజగేత్వర్కే ॥
ప్రాప్నోతిధనంషష్ఠే। త్ర్యబ్దాదూర్ధ్వంసుతాశ్చైవ ॥

దంపత్యోస్సహామరణం। నిధనస్థేర్కే౽ష్టసప్తత్యా ।
కారయతిధనవివృద్ధిం। త్ర్యబ్దాదూర్ధ్వంతథాయగస్సవితా॥

తా॥ వివాహలగ్నకాలమున, లగ్నమునకు ౮టిలో నుండెడు రవి యద్దంపతులకు ౭౦ యేండ్లు బంధు సంమానమునిచ్చును. ఆరవి ౭టిలో నుండిన, ధనమును మూండేండ్లపిదప సంతానంబునగును. ౮లో నుండిన ౭౫ సంవత్సరములు కాపురముచేయుదురు. ౧౧లో నుండిన మూడేండ్లపిదప ధనాభివృద్ధి గల్గునని శౌనకవచనంబులు.

౯౨. తృతీయైకాదశాష్ట మసప్తమస్థితశనిగుణము.

శ్లో॥ ధనధాన్యపుత్రయుక్తాం। పంచమసంవత్సరాత్తృతీయస్థః।
షణ్మాసైస్సప్తమగో। రసపత్నీం కన్యకాంకురుతే ॥ ౨౫౫॥
నిధనగతార్కిః కుర్యా। దామరణాదామయవియుక్తాం ।
ఆయగతోర్కిః కన్యాం। త్రివర్గయోగ్యాంకరోతిషణ్మాసాత్ ॥

తా॥ లగ్నమునకు ౩లో నుండెడు శనివధువును ధనధాన్యపుత్ర సంపదగల దానింజేయును; ౭లో నుండెడు శని ౬ మాసంబులలోగా మంచి నడతగల మగడుగల దానింజేయును; ౮లో నున్న శని యావజ్జీవము రోగములేని దానింజేయును; ౧౧లో నుండెడు శని ౬ మాసంబులలోగా ధర్మార్థకామయుక్త రాలింజేయును; అని శౌనకవచనంబులు. రాహు కేతువులకును శనివలెనే ఫలంబులను చింతింపవలయును. “శనివద్విధుంతు దస్యతు” ఇత్యాది వచనముచేత (శ్లో॥ ౨౫౬) గ్రాహ్యము.

౯౯. త్ర్యాయారిగతకుజగుణము. షష్ఠగురుఫలంబును.

శ్లో॥ సహజస్థోభూమిసుత। స్సౌభాగ్యకరస్తుయావదాయుష్యం।
సంవత్సరేణవిపులంధనాగ మంశత్రుసంస్థస్తు ॥ ౯౯౭ ॥
మణికాంచనరత్నాఢ్యా మేకాదశగఃకుజోబ్దషట్కేన ।
ఉభయకులానందకరీం కరోతిసచిరాద్గురుష్షష్ఠే ॥

తా॥ ౩వయింటిలో కుజుడున్న యావజ్జీవము సౌభాగ్యముగల్గును. ౬వ యింటిలోనున్న ౧ సంవత్సరమునకు విశేష ధనలాభము. ౧౧లో నుండిన నారేండ్లలో పల సువర్ణరత్నాభరణంబులనిచ్చును. ౬లో గురుడుండిన పుట్టినింటికిని అత్తవారింటికిని సంతసమిచ్చునట్టి దగును అని శౌనకవచనము. ఈచెప్పబడిన స్థానంబులుతప్ప తక్కిన వాట్లలో రవి శని కుజులు శుభులు కారని తానుగా నెఱుంగవలయును.

౧౦౦. వివాహలగ్నద్వాదశ భావస్థరవిఫలము.

శ్లో॥ మృత్యుర్దైన్యంస్వంబహువిధధనంభ్రాతృహానిఃప్రజానాం।
వ్యాధిస్సౌఖ్యంబహు విధమథోభర్తృహానిశ్చిరాయుః ॥
శ్రేయోహానిర్భవతిహృదయ వ్యాధిరర్థాగమశ్చ ।
బ్రధ్నాస్త్రీణామతిశయరుజోలగ్నభావాదిసంస్థే ॥

తా॥ వివాహలగ్నమునకు వరుసగా ౧లో మరణము; ౨లో దారిద్ర్యము; ౩లో బహువిధ ధనము; ౪లో అన్నదమ్ములకు చేటు; ౫లో

బిడ్డలరోగము ; ౬లో సౌఖ్యము ; ౭లో పతికిహాని ; ౮లో దీర్ఘాయుష్యము ; ౯లో శ్రేయోహాని ; ౧౦లో హృద్రోగము ; ౧౧లో ధనలాభము ; ౧౨లో రోగబాధలు ;—ఇట్లు పెండ్లికూతురికి ఫలంబులను రవియిచ్చుచుండునని వసిష్ఠవచనము.

## ౧౦౧. వివాహలగ్నద్వాదశ భావస్థితచంద్రఫలము.

శ్లో॥ నాశస్సంపద్బహువిధయశో బంధువృద్ధిః ప్రజాప్తిః ।
శస్త్రాన్మృత్యుర్భవతినచిరాద్దీర్ఘసాపత్న్యబాధః ॥
ప్రవ్రజ్యాత్వందుహితృజననం వర్ధనంభోగభాక్త్వం ।
దాస్యంస్త్రీణాంతుహిమకిరణే లగ్నభావాదిసంస్థే ॥ ౩౦౦॥

తా॥ చంద్రుడు—౧లో నాశమును ; ౨లో సంపదను ; ౩లో పలుతెఱంగులకీర్తి ; ౪లో బంధువృద్ధిని ; ౫లో సంతాన లాభమును ; ౬లో శస్త్రమరణమును ; ౭లో చిరకాలము సవతిపోరును ; ౮లో సన్యాసమును ; ౯లో ఆడుబిడ్డలను ; ౧౦లో వృద్ధిని ; ౧౧లో భోగభాగ్యములను ; ౧౨లో స్త్రీసేవను ; ఇట్లు ఫలంబుల నిచ్చునని వచనము.

## ౧౦౨. వివాహలగ్నద్వాదశ భావస్థితకుజఫలము.

శ్లో॥ మృత్యుశ్శోకోబహువిధ ధనంభ్రాతృవైరంకుబుద్ధిః ।
లక్ష్మీప్రాప్తిర్భవతిమరణం చోభయోర్వంశనాశః ॥
స్త్రీణాంద్వేషోవ్యసననిరతిః పుత్రపౌత్రాదిసిద్ధిః ।
భీతిర్భూమేర్బాలినితనయే లగ్నభావాదిసంస్థే ॥ ౩౦౧ ॥

తా॥ అంగారకుండు వరుసగా—౧ మృత్యువును; ౨ శోకమును; ౩ నానాధనంబులను; ౪ భ్రాతృవైరమును; ౫ దుర్బుద్ధిని; ౬ లక్ష్మీప్రాప్తిని; ౭ మరణమును; ౮ ఉభయకులహానిని; ౯ స్త్రీద్వేషమును; ౧౦ వ్యసనమును; ౧౧ పుత్రపౌత్రలాభమును; ౧౨ భయమును; ఈఫలంబులను ఇచ్చుచుండును. అనివసిష్ఠవచనము.

౧౦౩. వివాహలగ్నద్వాదశభావస్థితబుధఫలము.

శ్లో॥ ప్రీతిర్వృద్ధిస్సుగుణనిరతిర్బంధుపూజాసుతాప్తిః ।
స్సద్యోపత్యంతనయరహితంత్వన్యథాభర్తృనాశః ॥
ధర్మేబుద్ధిర్భవతిధరణీలబ్ధిరత్యేచబుద్ధిః ।
హానిఃస్త్రీణాంహిమకరసుతే లగ్నభావాదిసంస్థే ॥

తా॥ బుధుండు వరుసగా లగ్నాదిభావంబులలో నిచ్చెడు ఫలంబులు--౧ ప్రీతి; ౨ అభివృద్ధి; ౩ సుగుణసంపద; ౪ బంధుగౌరవము; ౫ పుత్రలాభము; ౬ నిష్ఫత్నుపాతము; ౭ బిడ్డలులేకపోవుట; ౮ పతికిహాని; ౯ ధర్మబుద్ధి; ౧౦ భూలాభము; ౧౧ సూక్ష్మబుద్ధి; ౧౨ స్త్రీహాని; అని వసిష్ఠవచనము.

౧౦౪. వివాహలగ్నద్వాదశభావస్థితగురుఫలము.

శ్లో॥ లక్ష్మీప్రాప్తిర్భవతిసుయశః ప్రీతిరన్యోన్యవృద్ధిః ।
ఇష్టప్రాప్తిర్బహువిధమయంచాశ్రమాణాంవిరక్తిః ॥

పాపాసక్తిస్సుకృతనిరతిః భూరిలాభస్సురేజ్యే ।
స్త్రీణాంసౌఖ్యంరిపుకృతభయంలగ్నభావాదిసంస్థే ॥

తా॥ గురుండు వరుసగా లగ్నాది ౧౨ భావంబులలో నీఫలంబుల నిచ్చుచుండును;—౧ సంపల్లాభము; ౨ మంచికీర్తి; ౩ ప్రీతి; ౪ పరస్పరవృద్ధి; ౫ ఇష్టార్థలాభము; ౬ నానావిధమిశ్ర ఫలము; ౭ ఆశ్రమవిరక్తి ౮ పాపాసక్తి; ౯ పుణ్యాసక్తి; ౧౦ విశేషలాభము; ౧౧ స్త్రీసౌఖ్యము; ౧౨ శత్రుభయము;—అని వసిష్ఠవచనము.

౧౦౫. వివాహలగ్న ద్వాదశభావస్థితశుక్రఫలము.

శ్లో॥ భోగప్రాప్తిర్వివిధవిభవం స్వైరవృత్తిర్మహత్త్వం ।
ద్రవ్యాధిక్యంభవతినిధనంసర్వనాశోవసుత్వం ॥
తథ్యప్రీతిర్బహువిధగుణాః సర్వసంపత్సమృద్ధి ।
శ్చాస్వంస్త్రీణాముశనసితథాలగ్నభావాదిసంస్థే ॥౩౦౪॥

తా॥ లగ్నాది ౧౨ భావంబులలో శుక్రుడుండగా వరుసగా నీఫలంబులు గల్గును;—౧ సుఖలాభము; ౨ నానావిభవము; ౩ స్వేచ్ఛా విహారము; ౪ పూజ్యత; ౫ ద్రవిణసంపద; ౬ మరణము; ౭ సర్వనాశము; ౮ సువర్ణవృద్ధి; ౯ సత్యాసక్తి; ౧౦ సుగుణసంపద; ౧౧ సమస్తసంపదలు; ౧౨ దారిద్ర్యము;—అని వసిష్ఠవచనము.

## ౧౦౬. వివాహలగ్నద్వాదశభావస్థశనిరాహుకేతుఫలం.

శ్లో॥ స్వచ్ఛందత్వంకదశనరతిర్వాల్లభత్వంవిశీలం।
వ్యాధిస్స్త్రీశీమృతిరథసుఖంగర్భపాతప్రవృత్తిః॥
ద్యూతాసక్తిర్భవతిరవిజే వైభవంవక్త్రరోగం।
స్వర్భానౌవాప్యథశిఖిని వాలగ్నభావాదిసంస్థే ॥౩౦౫॥

తా॥ లగ్నాది ౧౨ భావంబులలో శని రాహు కేతువులుండగా కల్గుఫలంబుల నిట్లు వరుసగా నెఱుంగనగును—౧ స్వేచ్ఛాచారము; ౨ కుత్సితాహారము; ౩ వాల్లభ్యము; ౪ దుశ్శీలత; ౫ రోగము; ౬ మంచిసంపద; ౭ మరణము; ౮ సౌఖ్యము; ౯ గర్భస్రావము; ౧౦ జూదము లోప్రీతి; ౧౧ విభవము; ౧౨ ముఖరోగము;—అని వసిష్ఠవచనంబు. కావున:—సత్ఫలప్రదంబులైన స్థానంబులలో నాయాగ్రహము లుండునపుడు వివాహముహూర్తమును నిశ్చయింప వలయునని ఫలితాంశము.

## ౧౦౭. కర్తరీదోషాపవాదము.

శ్లో॥ పాపయోఃకర్తరీకర్త్రోః శత్రునీచగృహస్థయోః।
యదాచాస్తగయోర్వాపి కర్తరీనైవదోషదా ॥౩౦౬॥

తా॥ వివాహలగ్నమునకు ౨-౧౨లో క్రూరగ్రహములుండి కర్తరీ యోగమనుచు దోషమున్నప్పుడు, ఆగ్రహములు అస్తంగతులైనను నీచస్థానస్థితులైనను, శత్రుక్షేత్రగతులైనను; ఈదోషము లేదని వసిష్ఠవచనము.

శ్లో॥ క్రూరకర్తరిసంయుక్తం లగ్నంచంద్రంచనత్యజేత్ ।
కేంద్రత్రికోణసంస్థేషు గురుభార్గవవిత్సుచేత్ ॥ ౩౦౭ ॥

తా॥ ౧-౪-౧౦-౯-౫ ఈయిండ్లలో బుధ గురు శుక్రులుండిన పక్షమున ; లగ్నమునకు కర్తరీదోషము గల్గియున్నను ; చంద్రునికి కర్తరీదోషముగల్గియున్నను ; ఆలగ్నమును వదలనక్కరలేదు. మేలుగల్గునని గురువచనము.

శ్లో॥ క్రూరగ్రహస్యాంతరగం విలగ్నం ।
మృతిప్రదం చంద్రమసం చరోగదం ॥
శుభైర్ధనస్థైరథ వాంత్యగే గురౌ ।
న కర్తరీ స్యాదిహ భార్గవా విదుః ॥ ౩౦౮ ॥

తా॥ చంద్రునికి కర్తరియున్న రోగము; లగ్నమునకు కర్తరియున్న మరణము ; ఇట్లు భయంకర దోషమైనను ౨వ యింట్లో శుభగ్రహములుండి ౧౨లో గురుండుండినచో భయమక్కరలేదు. అని భార్గవవచనము.

౧౦౮. భృగుషట్కదోషాపవాదము.

శ్లో॥ నీచరాశిగతేశుక్రే శత్రుక్షేత్రగతేపివా ।
భృగుషట్కోత్థితోదోషో నాస్తితత్రనసంశయః ॥౩౦౯॥

తా॥ ఆరింట చంద్రుడు మహాదోషప్రదుడైనను, ఆశుక్రుడు నీచుండైనను శత్రుక్షేత్రమునందున్నను ఆదోషములేదని కశ్యపవచనము.

## ౧౦౯. కుజాష్టమదోషాపవాదము.

శ్లో॥ అస్తగే నీచగే భౌమే శత్రుక్షేత్రగతే పివా ।
కుజాష్టమోద్భవోదోషో నకించిదపివిద్యతే ॥ ౩౧౦ ॥

తా॥ ౮లోనుండెడు కుజుడు మహాదోషము నిచ్చువాడైనను, ఆకుజుండు అస్తంగంతుడుగానున్నను, నీచక్షేత్రగతుడైయున్నను, శత్రుక్షేత్రగతుడైనను; దోషమిసుమంతయయినను లేదని కశ్యపవచనము.

## ౧౧౦. చంద్రదోషాపవాదము.

శ్లో॥ నీచరాశిగతే చంద్రే నీచాంశకగతే పివా ।
చంద్రే షష్ఠాష్టరిష్ఫస్థే దోషో నాస్తి న సంశయః ॥

తా॥ చంద్రుడు ౩-౬-౮లో నుండిన మహాదోషప్రదుడు, అయినను ఆచంద్రుడు నీచరాశిగతుడైయున్నను నీచాంశలో పడియున్నను ఆదోషము లేదు. అని కశ్యపవచనము.

## ౧౧౧. అష్టదోషాద్యనేక దోషాపవాదము.

శ్లో॥ అబ్దాయనర్తుమాసోత్థాః పక్షతిథ్యృక్షసంభవం ।
తేసర్వేనాశమాయాంతి కేంద్రసంస్థేశుభగ్రహే ॥
కాణాంధబధిరోద్భూతా దగ్ధలగ్నతిథేర్భవాః ।
తేదోషానాశమాయాంతి కేంద్రసంస్థేశుభగ్రహే ॥

శ్లో॥ అకాలజాశ్చనీహారావిద్యుత్పాంసవ్రభసంభవాః ।
పరివేషప్రతిసూర్యశక్రచాపధ్వజాదయః ॥ ౩౧౪ ॥
దోషప్రదామంగలేషు కాలజాశ్చైన్నదోషదాః ।
గురురేకోపికేంద్రస్థః శుక్రోవాయదివాబుధః ॥ ౩౧౫ ॥
హారేన్నుతిర్యథాహంతితద్వద్దోషానకాలజాన్ ।
లత్తోపగ్రహచండీశ చంద్రజామిత్రసంభవాన్ ॥
తత్కేంద్రగోగురుర్హంతి సుపర్ణఃపన్నగానివ ।
(ఇతి కశ్యపమహర్షివచనాని.) ॥ ౩౧౭ ॥

తా॥ అబ్దదోషము, అయనదోషము, ఋతుదోషము, మాసదోషము, పక్షదోషము, తిథిదోషము, నక్షత్రదోషము, దగ్ధయోగాదిదోషము:— ఈ అష్టదోషంబులును వివాహలగ్నమునకు కేంద్రములోననగా ౧-౪-౧౦లో శుభగ్రహము లుండినట్లయితే పరిహారమై మేలుగల్గును. ఇట్లే కాలదోషంబులును అకాలవృష్ట్యాది సర్వదోషంబులును లత్తాదిదోషంబులుకూడ కేంద్రమునందు గురుడుండినచో, నాగురుంశుగరుడుండు సర్పంబులను హరించునట్లు పోగొట్టి కాచుననుట.

౧౧౨. సర్వదోషపరిహారక శుభబలములు.

శ్లో॥ కావ్యేగురౌవాసౌమ్యేవా యదాకేంద్రత్రికోణగే ।
నాశంయాంత్యఖిలాదోషాః పాపానివ హరిస్మృతేః ॥

 ముహూర్త రత్నావళియందు.

తా॥ శుక్రుడుగాని, బుధుడుగాని, గురుడుగాని, ౧-౪-౭-౯-౧౦ ఈయిండ్లలోనున్న పక్షమున హరినామస్మరణచే పాపంబులు పరిహరించునట్లు సమస్త దోషంబులును పరిహరించునని కశ్యపవచనము.

శ్లో॥ యత్రైకాదశగేసూర్యే దోషానాశంయయుస్తదా ।
స్మరణాదేవరుద్రస్య పాపంజన్మశతోద్భవం ॥ ౩౧౯ ॥

తా॥ పదునొకండవయింటిలో సూర్యుడుండిన వాడయితే జన్మజన్మాంతర పాపసమూహంబును శివస్మరణంబు పరిహరించునట్లు సమస్త దోషంబులను పరిహరించి రక్షించునని వసిష్ఠవచనము.

శ్లో॥ వర్గోత్తమగతేలగ్నేవర్గ దోషాలయంయయుః ।
చంద్రేవోపచయేవాపి గ్రీష్మేకుసరితోయథా ॥ ౩౨౦ ॥

తా॥ లగ్నము వర్గోత్తమాంశలగ్నముగానున్నను, ౩లో చంద్రుడున్నను, వేసవికాలములలో నదులు ప్రవాహములేక యెండిపోవునట్లు దోషంబులు నశించుచుండునని కశ్యపవచనము,

శ్లో॥ ముహూర్తలగ్నషడ్వర్గ కునవాంశగ్రహోద్భవాః ।
యేదోషాస్తాన్నిహంత్యేవ యత్రైకాదశగశ్శశీ ॥

తా॥ ముహూర్తదోషమును, లగ్నదోషమును, షడ్వర్గదోషమును, నవాంశదోషమును, అన్నిటిని ౧౧వ యింటిలో నుండెడు చంద్రుడు బలిష్ఠుడుగా నుండిన పరిహరించుచుండునని కశ్యపవచనము.

శ్లో॥ లగ్నాద్దుస్థానగవ్యోమచరోత్థం దోషసంచయం ।
శుభాఃకేంద్రగతాహంతి దావాగ్నిర్విపినంయథా ॥

తా॥ లగ్నమునకు చెడుగుస్థానంబులలో నుండెడు గ్రహదోషంబులను, శుభకేంద్రములలోనుండెడు శుభగ్రహము, దవాగ్ని అడవిని కాల్చునట్లుధ్వంసము చేయు ననియును కశ్యపవచనంబు.

## ౧౧౩. లగ్నాధిపతిబలము. ప్రధానము.

శ్లో॥ లగ్నేడ్లగ్నాంశనాథోవా చాయగః కేంద్రగోపివా ।
రాశింనిహంతిద్దోషాణా మింధనానీవపావకః ॥ ౩౨౩ ॥

తా॥ లగ్నపతిగాని లగ్ననవాంశపతిగాని లాభమందో ౧-౪-౧౦ లోనో ఉండినపక్షమున అగ్ని కట్టెలను కాల్చినట్లు సమస్తదోషములను పరిహరించును. కావున లగ్నేశస్థితి నెఱింగి లగ్నముపెట్టవలయునని నారదవచనము.

## ౧౧౪. బుధశుక్ర గురుబలాధిక్యత.

శ్లో॥ బలవాన్కేంద్రగ స్సౌమ్యోహంతిదోషశతత్రయం ।
ద్వ్యూనంవిహాయదైత్యేజ్యస్సహస్రంలక్షమంగిరాః ॥

తా॥ బలవంతుడైన బుధుడు ౧-౪-౧౦లో నుండిన ౩౦౦ దోషంబులను పరిహరింపగలడు. ౧-౪లోనుండు బలవంతుడైన శుక్రుండు ౧౦౦౦ దోషములను పరిహరించును. అట్లే ౧-౪-౧౦ లో నుండు గురుండు లక్షదోషములనైనను పరిహరించునని కశ్యపవచనము.

## ౧౧౫. వింశోపక యోగవిచారము.

శ్లో॥ రవౌసార్ధత్రయోభాగా శ్చంద్రేపంచగురౌత్రయః ।
ద్వౌశుక్రేద్వౌబుధేచైవ ప్రోక్తాహ్యేతేవిశోపకాః ॥

మందేభో మేతథారా హూసార్ధం ప్రత్యేకముచ్యతే ।
బలాబలవశో దేవం విజ్ఞాతవ్యం విశోపకాః ॥ ౩౬ ॥

తా॥ వివాహలగ్నమును పెట్టునపుడు, గ్రహబలము నెటెంగి పెట్టవల యును. దాని నెట్లు తెలియవలెననిన—స్వోచ్చమిత్రక్షేత్ర గతుండును పైనచెప్పంబడిన సుస్థానంబులలో నుండువాడును అగుగ్రహము శుభుడుమఱి బలిష్ఠుడనియును,నీచశత్రుక్షేత్ర గతుడును దుఃస్థానంబులలో నుండెడువాడు దుర్బలుండు మఱిపాపియనియును తెలియనగును. బలిష్ఠగ్రహంబులకు చెప్ప బోవుభాగలను వేసికొని మొత్తముచేసి అందులో ౫భాగములకు మీద౧౦ లోగా నుండిన కనిష్ఠ ముహూర్తము, వేరేలగ్నము దొరకకపోయినం దానిం జేయందగును. ౫టికికి తగ్గిన నది పనికిరాదు. ౧౦కి పైన ౧౫లోగా నున్న నది మధ్యమము. ౧౫ పైన ౨౧౪లోగా నుండునది ఉత్తమము. సంపూర్ణబలకరంబు అనగా ౨౧౪ భాగము రాగల ముహూర్త ముత్తమో త్తమంబైనను, అది అసంభవము. ఎందువల్ల ననిన కేతువుకువచ్చిన రా హువుకు రాదు, రాహువుకువచ్చిన కేతువుకురాదు. అది యట్లుండని ;— రవికి ౩౪ ; చంద్రునికి ౫ ; కుజునికి ౧౪ ; బుధునికి ౨ ; గురువునకు ౩ ; శు క్రునికి ౨ ; శనికి ౧౪ ; రాహువునకు ౧౪ ; కేతువునకు ౧౪ ;— అని వరా హ వచనంబులు.

౧౧౬. శ్వశురాది విభాగజ్ఞానము.

శ్లో॥ శ్వశ్రూస్సితోర్కః శ్వశుర స్తను స్తను ।
జామిత్రపస్యాన్నద్ధయితో మనశ్శశీ ॥

ఏతద్బలం సంప్రతిభావ్య తాంత్రిక-
స్తేషాంసుఖం సంప్రవదేద్వివాహతః ॥ ౩౨౭ ॥

తా॥ పెండ్లికూతురికి— అత్తయే శుక్రుడు; మామయేరవి; లగ్నమే తనదేహము; ౭ వ- యింటి కధిపతియే మగడు; చంద్రుడే మనస్సు; వీట్ల యొక్క బలములను సిద్ధాంతవేత్త యెఱింగినవాడై, వివాహానంతరము పెండ్లికూతురికి గల్గు శుభాశుభ ఫలంబులను నిరూపింపనగును. అని శౌనకముని సూక్తులను సంగ్రహించి ముహూర్త చింతామణికారులు చెప్పియున్నారు.

## ౧౧౭. సంకీర్ణజాతి వివాహనియమము.

శ్లో॥ కృష్ణేపక్షే భానుభౌమార్కజానాం।
వారేయోగేచాపధిష్ణ్యేపిషిద్ధే॥
సంకీర్ణానాం దారకర్మప్రశస్తం।
ప్రీత్యర్థాయుఃప్రాప్తయే శౌనకాద్యాః ॥ ౩౨౮ ॥

తా॥ ఇఁక నను లోమవిలోమ జాతులకందఱికిని, కృష్ణపక్షము, శని మంగళ రవివారంబులు, నిషిద్ధ నక్షత్రంబులు, నిషిద్ధయోగంబులు, ఇవన్నియును ప్రశస్తంబులై వారికి ప్రీతిని ఆయుస్సును ధనమును, కలుగించునని శౌనకాది మునులు సమ్మతించినట్లు శార్ఙ్గీయవచనము. (కావున వర్ణాశ్రమ ధర్మకర్మ నియమముగల యుత్తమ వర్ణస్థులకే ఈ ముహూర్తపరిశోధనం బావశ్యకముగాని విధిబద్ధులుగాని సంకరజాతికి అక్కఱలేదని ఫలితాంశము, ఈవచనము నెఱింగి, “మనకీ కర్మ మేల? ఏమియును చూడక చేసి

కొనువారెంత భాగుగానున్నారు ? " అని ఆక్షేపించు క్రొవ్వుమాటలాడు వారు సదుత్తరమును గ్రహింపనగును. గనుక ; దురాచార పరులకేదియు పనిలేదు. వారికి పారత్రిక గతియునట్లేకదా ? )

౧౧౭. ప్రాక్కర్తవ్యావశ్యకకర్మకు దినశుద్ధి.

శ్లో॥ విధోర్బలమవేక్ష్యైవా దళనకండనంవారకం ।
గృహాంగణవిభూషణాన్యథచవేదికామండపాత్ ॥
వివాహవిహితోడుభిర్విరచయేత్తథోద్వాహతో ।
నపూర్వమిదమాచరేత్త్రినవషణ్మితేవాసరే ॥3౨౯॥

తా॥ వివాహమునకు మునుపు పసపు, కుంకుమ తీసుకొనిరావడము గోధుమాది ధాన్యముల పిండివిసరడమను దళనకర్మ, బియ్యం దంచడము మొదలగు కండనకర్మ, మంగళకలశములను పెట్టడమును వారకకర్మ, అలుకు ముగ్గులు మొదలగు గృహాంగణ విభూషణకర్మ, వేదికాస్థాపనము, మంటపనిర్మాణము, వీట్లకన్నిటికిని చంద్రబలంబును చూచికొని వివాహోక్త నక్షత్రంబులలో మంచిది. అయిన వివాహలగ్నమునకు 3-౬-౯ ఈ మునుపటి దినములు పనికిరావు. అని ముహూర్తచింతామణి వచనము.

౧౧౮. వేదికాలక్షణంబును, మంటపోద్వాసనాది దిన నియమంబును.

శ్లో॥ హస్తోచ్ఛ్రితాంచతుర్హస్తైశ్చతురస్రాం సమంతతః ।
స్తంభైశ్చతుర్భిస్సుశ్లక్ష్ణైఃవామభాగేస్వసద్మనః ॥33౦॥

సమంటపాంచతుర్ద్వికు సోపానైరుపశోభితాం ।
ప్రాగుదక్ప్రవణారంభాం స్తంభైర్హంసశుకాదిభిః ॥33౧॥
విచిత్రితాంచిత్రకుంభై ర్విచిత్రైస్తోరణాంకురైః ।
ఏవంవిధాంసమారోహే న్మిథునంసాగ్నివేదికాం ॥33౨॥
సమేతుదివసేకుర్యా ద్దేవకోత్థాపనంబుధః ।
షష్ఠంచవిషమంనేష్టం ముక్త్వాపంచమసప్తమౌ ॥333॥

తా॥ పురుషప్రమాణము మీఁద చేతియెత్తున చచ్చౌకముగ నుండున ట్లును నాల్గు ప్రక్కలలోను ద్వారంబులును పడికట్లును గల్గియుండునట్లు మంగళ మంటపంబును ఇంటికి నెడమప్రకఁలో నిర్మించి, దానిలో కదళీ స్తంభ తోరణంబులచేతను పూర్ణకుంభంబుల చేతను హంసశుకాది చిత్రపు పనులచేతను సింగరించి, యజ్ఞేశ్వరునితోడ విలసిల్లు నామంటపమును వధూ వరులు ప్రవేశింప నగును. ఇట్లు వివాహమయిన పిదప మంటపాద్యుద్వాస నము సమదినంబులలో ౬ వ దినంబును విషమ దినంబులలో ౫-౭ వ దినం బులునుతప్ప తక్కినవి యోగ్యము కాదు. అనినారద వచనము.

౧౨౦. గోధూళి లగ్న విచారము.

శ్లో॥ యావద్దినాంతే దిశిపశ్చిమాయాం ।
పశ్యేత్తృతీయం రవిబింబభాగం ॥
తస్మాత్పరం నాడికాయుగ్మమేకే ।
గోధూళికాలం మునయోవదంతి ॥ 33౪ ॥

 ముహూర్త రత్నావళియందు.

తా॥ పగటి కడపటిభాగమున పశ్చిమదిక్కులో సూర్యబింబము మూడవవంతు కనుబడుచుండగా పిమ్మట ౨ గడియలప్రొద్దు గోధూళిలగ్న మని మునులచే చెప్పంబడినది. అని ప్రాచీనాచార్య సూక్తిగలదు.

శ్లో॥ ప్రాచ్యానాంచకలింగానాం ముఖ్యంగోధూళికంస్మృతం।
గాంధర్వాదివివాహేషు వైశ్యోద్వాహేచయోజయేత్
చతుర్థమభిజల్లగ్న ముదంయర్త్యాత్తుసప్తమం ।
గోధూళికంహిభవతి సంపత్పుత్రాది సౌఖ్యదం ॥

తా॥ బంగాళాప్రాంతమువారికిని, కళింగదేశస్థులకును, గోధూళిలగ్నము ముఖ్యమని చెప్పబడినది. మఱియును గాంధర్వాది వివాహంబులలో వైశ్యుల వివాహంబునను దీనినుపయోగింప నగును. ఉదయలగ్నమునకు ౪వలగ్నము అభిజిత్తనంబడును. ౭ వ లగ్నము గోధూళిలగ్నమనబడును. ఈ గోధూళిలగ్నము పుత్రపౌత్రాది సౌఖ్యప్రదముగానుండును. అని నారద వచనంబులు.

శ్లో॥ లగ్నశుద్ధిర్యదానాస్తి కన్యాయౌవనశాలినీ ।
తదావై సర్వవర్ణానాంలగ్నం గోధూళికంశుభం ॥౩౩౭॥

తా॥ దోషరహితమయిన శుభలగ్నము దొరకపోయినపుడు, కన్యకకు ఈడువచ్చి కాలాతిక్రమమగునట్టి సందర్భము తటస్థించినప్పుడును, సమస్త వర్ణంబుల వారికిని ఈగోధూళిలగ్నము శుభకరంబుగానుండునని దైవజ్ఞమనోహర వచనము.

శ్లో॥ యత్రైకాదశగశ్చంద్రో ద్వితీయేవాతృతీయగః ।
గోధూళికాతువిజ్ఞేయా శేషాధూళిరితిస్మృతా ॥3౩౮॥

తా॥ వివాహలగ్నమునకు ౧౧ లోగాని ; ౨ లోగాని ; 3 లోగాని చంద్రుడుండిన పక్షమున నది గోధూళియనబడును. అంతేగాని తక్కిన గోధూళి లగ్నము ధూళియైయుండును, అని సంహితాచారవచనంబు.

## ౧౨౧. వివాహసల్లగ్న సాధనము.

## ఘటికాజల యంత్రము.

శ్లో॥ ఏవంగుణగణాస్వీత్యలగ్నం నిశ్చిత్యయత్నతః ।
సిద్ధాంతోక్తేన మార్గేణలగ్నకాలం ప్రసాధయేత్ ॥
జలయంత్రేణ తల్లగ్నం దద్యాత్తేనార్చితోద్విజః ।
ముఖం వృత్తం ద్వాదశభిరంగులైశ్చషడున్నతం ॥
ఘటార్ధవత్తామ్ర పాత్రం కుర్యాత్తద్దశభిః పలైః ।
షష్టిభిర్మజ్జేదహోరాత్రే ఘటికాపాత్ర ముత్తమం ॥
మాషత్రయత్ర్యంశ యుతస్వర్ణ వృత్తశలాకయా ।
చతుర్భిరంగులైరాయతయావిద్ధం స్ఫుటంన్యసేత్ ॥
రవేరర్ధోదయం దృష్ట్వావాప్యర్ధాస్తమయం తథా ।
పూర్వోక్తలక్షణం యంత్రం మంత్రేణానేన నిక్షిపేత్ ॥

"యంత్రాణాంముఖ్యయంత్రంత్వ మితిధాత్రా పురాకృతం ।
దంపత్యోరాయుర్వృద్ధ్యర్థం పుత్రాదిధన హేతవే ॥
జలయంత్రక మేతస్మా దిష్టసిద్ధిప్రదోభవ"—
ఇతికశ్యప సంహితాయాం ఘటికాయంత్రవిధిః ॥ 384

తా. ఇట్లు గుణముల సమూహము గల్గియుండునట్లు చక్కగా పరిశీలించి. సిద్ధాంతశాస్త్రోక్త మార్గము ననుసరించి, లగ్నకాలమును సాధించవలయును. (ఇచట-సిద్ధాంత శాస్త్ర ప్రకారముగా లగ్నసాధనాది క్రమమును నిరూపింప వచ్చునుగాని తత్ప్రక్రియను జిజ్ఞాసువులు; జ్యోతిస్సిద్ధాంతాది గ్రంథంబులనుండి సులభంబుగా నెఱుంగవచ్చును. దానికి నాంధ్రభాషా వివరణంబును ఉదాహరణంబును గలదు. ఈ ముహూర్త గ్రంథమున నావిషయమును కూడ వివరింపుటకు గ్రంథ విస్తరంబగునని విరమింపబడినది.) ఇంక ఘటికా మానమును తెలియుటకు సాధనంబుగా ఆర్షేయముగా నచ్చిన జలయంత్రాది క్రమము పై శ్లోకంబుల లోకశ్యపుల చేత చూపంబడినది. తత్తద్గ్రామంబులలో మౌహూర్తికులు అట్లే సాధించుచునుండిరి గాని యిక్కాలమున జేబులలో చేతులమీద తోలు కడియముల మీద గూడ గడియారంబులు రాజించు చుండుట చేత నానిరూపణంబనవసరంబైనది. మన ప్రాచీన ప్రక్రియ లిట్లుండినవి యని చూపుటకై శ్లోకములు వ్రాయంబడినవి. అయిన నిక్కాలపు ఘంటామానము మీద ఘటికలను తెచ్చునపుడు; తత్తద్గ్రామస్థులు ఆయా గ్రామమునందలి యహఃప్రమాణమును సూర్యోదయాస్త కాలములను చూచికొని, సవరించు కొననగు. ఎందువల్లననిన, కాశీ రామేశ్వరంబులలోను, బొంబాయి మదరాసుల

# వివాహ ప్రకరణము.

లోను సర్వత్ర ౬ ఘంటలన్నపుడు దానింబట్టి ౪ ఘంటలకు ఉదయమై ౫౬ గడియలైనది అనుకొనిన లగ్నములే మారిపోవును, కావున బుద్ధిశాలురు కాల సంస్కారములను జాగ్రత్తతో చూచికొననగును. మౌహూర్తికులకు ఇదియొక ముఖ్యమైన సూచనగా నున్నది.

## ౧౨. వివాహ ముహూర్త స్వరూపము.

శ్లో॥ శాస్త్రోక్తమార్గేణసులగ్నకాలం ।
స్ఫుటంసమానీయ జలాదియంత్రైః ॥
సంలభ్యతం మంగళ సూక్ష్మకాలం ।
సంలోకయేత్త్రమిథోర్ధ్వ దృష్టిః ॥ ౩౮౬.

తా॥ వివాహ ముహూర్తమనగా ననేకులు మాంగల్య ధారణమని యును, కన్యాదానం బనియును, ఇట్లు పలుతెఱంగులుగా భావించెదరు. ఇతఁడు భర్తయని వధువును ఈమెనా యిల్లాలని వరుండును దృఢముగా పరస్పరము నిరీక్షించి కొనుటయే వివాహ ముహూర్తము. దానికే పెట్టబడినది లగ్నము. ఆలగ్నము షడ్వర్గబలాదియుక్తమై సూక్ష్మముగా నుండును, ఆసూక్ష్మ కాలంబుననే ఆవధూవరనిరీక్షణమును జరుగనగునని వసిష్ఠవచనంబు. అంతేకాని లగ్నము ౫గడియలున్నది, దానిలో కన్యాదానముతేసరి, మాంగల్య ధారణమయితే సరి, అనియోచించుచు, సాకులు పెట్టి ముహూర్తకాలమును అతిక్రమించరాదు. సదాచార సత్సంప్రదాయ శాస్త్ర పద్ధతియందు విశ్వాసంబును భయ భక్తులుగల సదాస్తికులిట్లు తాత్త్వికవిషయంబులను పరికింతురుగాత.

ఇట్లు ముహూర్త రత్నావళియను గ్రంథమున
౬-వ వివాహ ప్రకరణము సంపూర్ణము.

---

# ముహూర్తరత్నావళిలో.

## ౭ వ - వధూప్రవేశ ప్రకరణము.

### ౧౨౩. వధూప్రవేశ కాలనియమము.

శ్లో॥ వధూప్రవేశనం కార్యంపంచమే సప్తమేదినే ।
నవమేచ శుభేవారే సులగ్నే శశినోబలే ॥ ౧.

తా. వివాహమైన పిదపవధువు అత్తవారింటికి ప్రవేశించుట వధూప్రవేశమనబడును. దానిని వివాహదినము మొదలు ౫-౭-౯ ఈదినంబులలో శుభవారమున శుభలగ్నమున చంద్రుఁడు బలిష్టుడై యుండఁగా చేయనగునని జ్యోతిర్నిబంధ వచనము.

శ్లో॥ ఆరభ్యోద్వాహదివసాత్షష్ఠే వాప్యష్టమేదినే ।
వధూప్రవేశస్సం పత్త్యైదశమేథ సమేదినే ॥ ౨.

తా. వివాహదినము మొదలు ౬-౮-౧౦ ఈ మొదలగు సమదినంబులలో సంపదభివృద్ధికొఱకై వధూప్రవేశమును ఆచరింపనగునని నారద వచనము. పైవచనమున విషమదినంబులు చెప్పంబడె, ఈ వచనమున సమదినంబులు చెప్పంబడెనని సందేహించవలదు. ఎందు వల్లననిన ;—

శ్లో॥ వివాహమారభ్య వధూప్రవేశో ।
యుగ్మేదినే షోడశవాసరాంతః ॥

ఊర్ధ్వంతతోబ్దేఽ యుజిపంచమాఖ్యాంతం ।
పునః పరస్తాన్నియమోన చాస్తి ॥ 3.

తా. వివాహమైన పదునారు దినంబులా వరకును, సమదినంబుల లోను; పిమ్మట ౫ ఏండ్లవరకును బేసి సంవత్సర మాలలోను, వధూప్రవేశము చేయనగును. ౫ఏండ్లమునపిదప సరిబేసి నియమము లేకనే ఎప్పుడైనను సరియె, అని సంగ్రహ వచనము. కావున ౧౬ దినంబులోగా పైనచెప్పిన వచనంబులంబట్టి యథాను కూలముగా జరుపనగునని భావము.

శ్లో॥ వధూప్రవేశః ప్రథమేత్రవర్షే ।
తథాతృతీయే ప్యథపంచమేవా ॥
సూర్యేందు దేవేజ్యబలేన కుర్యా ।
త్పుంసో మునిర్గౌతమ ఆహ సత్యం ॥ ౪॥

తా. వధూప్రవేశమును ౧౬ దినము లతిక్రమించిన పిదప, మొదటి సంవత్సరమునను, అదితప్పిన మూడవయేటను, అదితప్పిన ఐదవయేటను చేయనగును. ఎప్పుడుచేసినను పురుషునికి రవిచంద్ర గురుబలముగల కాలము ప్రశస్తము అని గౌతమముని చెప్పియుండును. అని వివాహపటల వచనము.

శ్లో॥ సమేవర్షే సమేమాసే యదినారీగృహం వ్రజేత్ ।
ఆయుష్యంహరతే భర్తుస్సానారీమరణం వ్రజేత్ ॥ ౫.

తా. ౧౬ దినము లతిక్రమించిన పిదప సరినెలలలో నైనను, సంవత్సర మతిక్రమించిన పిదప సరియేండ్లలోను వధువు మగనియింటికి ప్రథమ

ప్రవేశముం జేసినేని, పతికిని ఆయుస్సుక్షయించును. తనకును హానిగల్గు నని నారద వచనము.

౧౨౪. వధూప్రవేశోచిత తిథివార నక్షత్రంబులు.

శ్లో॥ పౌష్ణాత్కభాచ్చ శ్రవణాచ్చయుగ్మే ।
హస్తత్రయే మూలమఘోత్తరాసు ॥
పుష్యేచమైత్రేచ వధూప్రవేశో ।
రిక్తేతరేవ్యర్కకుజేచశస్తః ॥ ౬॥

తా. రోహిణి, ఉత్తర, ఉత్తరాషాఢా, ఉత్తరాభాద్ర, అశ్విని, పుష్యమి, హస్తచిత్ర, అనూరాధ, రేవతి, మృగశిర, శ్రవణ, ధనిష్ఠ, మూల —ఈ నక్షత్రంబులును; చవితి, నవమి, చతుర్దశి, తప్పతక్కిన తిథులును; ఆదిత్యాంగారక వారంబులు తప్పతక్కిన వారంబులును; వధూప్రవేశమునకు ప్రశస్తంబులయినవి.

౧౨౫. వివాహానంతరమునందు వధువు
యొక్క పిత్రాదిగృహనివేశఫలంబులు.

శ్లో॥ ఉద్వాహాత్ప్రథమే శుచౌయదివసేద్భర్తుర్గృహేకన్యకా।
హన్యాత్తజ్జననీంక్షయేనిజతనుం జ్యేష్ఠేపతిజ్యేష్ఠకం ॥
పౌషేచశ్వశురం పతించమలినే చైత్రేస్వపిత్రాలయే।
తిష్ఠంతీపితరం నిహంతి నభయంతేషామభావేభవేత్ ॥

తా, పెండ్లియైన పిదప—తొలియాషాఢమాసమున మగనింట నివసించిన నామగువ అత్తనుచంపును. మొదటిక్షయ మాసమున మగనింటనుండిన తానేచచ్చును. తొలిజ్యేష్ఠమున మగనింట నుండిన భావగారిని చంపును. తొలిపౌషమునందు మగనియింటనుండిన మామగారిని చంపును. తొలియధిక మాసమున మగని యింటనుండిన పతినిచంపును. తొలిచైత్రమున పుట్టినింట నుండిన తండ్రిని చంపును. (ఆయాఫలంబులు మరల నామాసము వచ్చునంతలోనని యెఱుంగనగు.) కావున నానెలలు తక్కిన కాలంబు నిర్భయంబుగానుండును. అని ముహూర్త మార్తాండ వచనము.

౧౨౬. ద్విరాగమ విచారము.

శ్లో॥ చరేదథోజహాయనే ఘటాళిమేషగే రవౌ ।
రవీజ్య శుద్ధియోగతశ్శు భగ్రహస్య వాసరే ॥
నృయుగ్మమీనకన్యకా తులావృషే విలగ్నకే ।
ద్విరాగమం లఘుధ్రువేచరే స్రపేమృదూడుభిః ॥ ౮॥

తా. మొదట నవ వధూప్రవేశమయిన పిదప, మరల పుట్టినింట పోయి యథేష్టముగా చిరకాలము నిలచి నమగువ రెండవతూరి పెనిమిటింటికి వచ్చుట ద్విరాగమం బనబడును. బేసి సంవత్సరమున కుంభవృశ్చిక మేషంబులలో రవియుండగా, పురుషునికి రవిగురు బలముగల్గి యుండగా, శుభవారములలో, మిథునమీన కన్యాతులా వృషభలగ్నంబులలో, శుభదృష్టిగాని శుభయోగముగాని గల్గియుండగా, చరమృదు ధ్రువలఘునక్షత్రంబులలోను మూలలోను, మగనియింటికి వచ్చి చేరవలయును.

## ౧౨౭. వధూప్రవేశమున లగ్నశుద్ధి.

శ్లో॥ ఉపచయగతే జీవే భృగౌ కేంద్రము పాగతే ।
శుద్ధేలగ్నే శుభాక్రాంతే గంతవ్యంభర్తృ మందిరం ॥

తా. 3 లో గురుడు, కేంద్రమున శుక్రుడు, నుండగా శుద్ధలగ్నమున శుభగ్రహ యోగమున్నప్పుడు వధూప్రవేశము తగునని బాదరాయణ వచనము.

## ౧౨౮. గురుశుక్రాస్త సంముఖ శుక్రదోషములు.

శ్లో॥ అస్తంగతేభృగోః పుత్రేతథా సంముఖమాగతే ।
నష్టేజీవేనిరంశౌవానైవ సంచాలయేద్వధూం ॥ ౧౦॥
గర్భిణ్యాబాలకే నాపి నవ వధ్వాద్విరాగమే ।
పదమేకంనగంతవ్యం శుక్రేసంముఖ దక్షిణే ॥ ౧౧॥
గుర్విణీస్రవతే గర్భంబాలో వామరణంవ్రజేత్ ।
నవావధూర్భవేద్వంధ్యా శుక్రేసంముఖ దక్షిణే॥ ౧౨.

తా. శుక్రుడస్తంగతుడై యుండగా, శుక్రుడు సంముఖుడై యుండగాను, గురుడస్తంగతుడై యుండగాను, వధూప్రవేశము తగదు; గర్భిణీయును వెడలరాదు; చంటిబిడ్డతల్లియును వెడలదగదు ; ద్విరాగమంబు కూడదు; గర్భిణి వెడలిన గర్భస్రావమగును ; బిడ్డతల్లి వెడలిన బిడ్డకు హాని; నవవధు గొడ్రాలగును ; కావున సంముఖ శుక్రుడుతగదు. అనిన శుక్రుడు పశ్చిమదిక్కులో నుదయించి యున్నప్పుడు పూర్వోత్తర దిక్కులకును; తూర్పు

ననుదయించి యుండిన దక్షిణ పశ్చిమ దిక్కులకును వెడలి వచ్చునని ఫలితాంశము. అని నారదవచనంబులు.

## ౧౨౯. ప్రతిశుక్ర దోషాపవాదము.

శ్లో॥ ఏకగ్రామేపురేవాపి దుర్భిక్షే రాష్ట్రవిప్లవే ।
వివాహేతీర్థయాత్రాయాం ప్రతిశుక్రో నదుష్యతి॥ ౧౩ ॥

తా. ఒక గ్రామమునను, పురమునను, దుర్భిక్షము వచ్చియున్నప్పుడును, రాజకీయబాధగల్గినప్పుడును, వివాహోద్దేశ యాత్రయందును, తీర్థయాత్రలలోను, సమ్ముఖ శుక్రదోషములేదని బాదరాయణ వచనము.

## ౧౩౦. ప్రౌఢస్త్రీకి గోత్రబలముచే సంముఖశుక్రదోషము లేదు.

శ్లో॥ పిత్ర్యేగృహే చేత్కుల పుష్పసంభవః ।
స్త్రీణాంనదోషః ప్రతిశుక్ర సంభవః ॥
భృగ్వంగిరోవత్స వసిష్ఠకశ్యపా ।
త్రీణాంభరద్వాజమునేః కులేతథా ॥ ౧౪ ॥

తా. తండ్రియింటిలోపిల్ల ప్రౌఢయైనపిదప వధూ ప్రవేశమగునట్లయిన, భృగ్వంగిరోవత్సాది గోత్రముల వారికి సమ్ముఖ శుక్రదోషములేదని ముహూర్తచింతామణి వచనము.

ఇట్లు ముహూర్త రత్నావళీ గ్రంథమునందు
౭వ-వధూప్రవేశ ప్రకరణముపూర్ణము.

---

# ముహూర్తరత్నావళిలో
# ౨౭- అగ్న్యాధాన ప్రకరణము.

అవతారిక—“శ్లో॥ అగ్న్యాధానం దారకాలేవిధేయం।
కైశ్చిత్ప్రోక్తం తచ్ఛదాయాద్యకాలే ”=పెండ్లిచేసి

కొనినప్పుడే అగ్న్యాధానమును చేయవలెను. కొందఱు దాయభాగవిభాగ కాలమున నారంభించెదరు అని మహేశ్వర వచనము చెప్పుచున్నది. “యావజ్జీవం హోష్యామి” =బ్రతికియున్నంతవరకు అగ్నినారాధించెదనని పెండ్లిచేసి కొందురుగాని, ఆప్రతిజ్ఞను నాఁడేమరచి, అగ్న్యాధానస్వరూపమునే విచారించక జీవితకాలమును కొల్లబెట్టుచుండెడు ఇకాలపు బ్రాహ్మణులగతియేమో; ఏమిమతములో, ఎట్టిభక్తులో, ఎవ్విధ భజనలో అరచేతిలోని వైకుంఠమువలె తామె ముక్తి సోపానము నెక్కినట్లు విఱ్ఱవీగుచుండుట డాంభిక లోకవ్యవహారమై జరగుచున్నది. ఇదియే కలివైభవము. కావున దానివిషయమై విచారంబే అనవసరంబైనను, శాస్త్రమర్యాద నుల్లంఘించచాలక యిచ్చట తత్ప్రకరణము సంగ్రహముగా నిరూపింపఁబడును.

శ్రుతి—యదహరేవైనంశ్రద్ధోపరమేత్తదహరేవావ దధ్యాత్॥

సూత్రము—సోమేనయక్ష్యమాణోనర్త్తుం ప్రతీక్షేన్ననక్షత్రం.

తా॥ శ్రద్ధగల్గినప్పుడే ఆధానాదులను ఆచరింపనగును. అను శ్రుతి స్మృతులచేత ముహూర్త నిబంధమే లేదు. అనిన సూక్తకాలమయిన వివాహము దాయభాగము వసంతశరదాదికాలములు వీట్లలో నక్కఱలేదు. అటుగాక వైదికకాల నియమమును అతిక్రమించి, ఇచ్ఛవచ్చినప్పుడు అగ్న్యాధానమును చేయవలయునన్న మునులు చెప్పిన సంహితలలోని జ్యోతిశ్శాస్త్రీ ముహూర్తవిధి ననుసరింపనగును.

౧౩౧. ఉత్తరాయణ ప్రాశస్త్యము.

శ్లో॥ గృహప్రవేశవైవాహ ప్రతిష్ఠామౌంజి బంధనం ।
మఖాదిమంగళం కర్మవిధేయం చోత్తరాయణే ॥ ౧ ॥

తా॥ ఉపనయనము, గృహప్రవేశము, వివాహము, దేవప్రతిష్ఠ, అగ్న్యాధానాదులు, ఈమంగళ కర్మలకన్నిటికిని ఉత్తరాయణము ప్రశస్తంబని నారదవచనము.

౧౩౨. అగ్న్యాధానోచిత నక్షత్రంబులు.

శ్లో॥ ప్రాజాపత్యే పూషభేసద్విదైవే ।
పుష్యేజ్యేష్ఠాస్వైందవే కృత్తికాసు ॥
అగ్న్యాధానం హ్యుత్తరాణాం త్రయేపి ।
శ్రేష్ఠం ప్రోక్తం ప్రాగ్జనైః విప్రముఖ్యైః ॥ ౨ ॥

తా॥ విశాఖ, రేవతి, రోహిణి, పుష్యమి, జ్యేష్ఠ, మృగశిర, కృత్తిక ఉత్తర, ఉత్తరాషాఢ, ఉత్తరాభాద్ర, వీట్లలో అగ్న్యాధానాదులు కర్తవ్యంబులని ప్రాచీనాచార్యులు సంమతించినట్లు శ్రీపత్యాచార్యవచనము.

## ౧౩౩. అగ్న్యాధానమునందు వర్జ్యదోషములు.

శ్లో॥ కుజేందుజీవైరిపురాశిసంస్థైః ।
పరాజితైర్నీచ గృహోపగైర్వా ॥
అస్తంగతైర్వాపి పరిగ్రహాంయః ।
కరోతిహాస్యం విదుషాం సయాతి ॥ ౩ ॥

తా॥ చంద్ర కుజగురువులు శత్రుక్షేత్ర గతులుగా నుండరాదు; సమాగమ యుద్ధంబులలో నోడియుండరాదు; నీచక్షేత్ర గతులుగానుండరాదు; అస్తంగతులుకాకూడదు; అట్టికాలంబున అగ్న్యాధానమును చేసినవాడు పండిత హాస్యమునకు పాత్రుడగును, అనిన భ్రష్టుండగును. కావున కుజచంద్ర గురువులు బలిష్ఠులై యుండవలయునని రత్నమాలావచనము.

## ౧౩౪. అగ్న్యాధాన లగ్నశుద్ధి.

శ్లో॥ నక్రేవిలగ్నేంబుచరే ఘటేవా ।
తదంశకేవా ప్యథవా శశాంకే ॥
ఆధానకాలే ద్విజ పుంగవానాం ।
జాతేపి నిర్వాణము పైతిసిద్ధిం ॥ ౪ ॥

తా॥ మకర మీన కుంభలగ్నములు, తన్నవాంశలు, వాట్లలో చంద్రుడుండుటయును, ఆధానకాలమునకు ప్రశస్తముకాదు. అట్టి సమయంబున నారంభించిన నగ్ని చల్లారిపోవును. అని శ్రీపతి వచనము.

శ్లో॥ త్రికోణకేంద్రోపచయేషు సూర్యే।
బృహస్పతౌ శీతకరే కుజేవా ॥
శేషగ్రహేషూపచయే స్థితేషు ।
ధూమధ్వజోత్పాదన మామనంతి ॥ ౫ ॥

తా॥ రవి కుజ చంద్ర గురువులు ౧-౪-౫-౭-౯-౧౦ స్థానంబుల లోను, తక్కినవారు ౩-౬-౧౧ లో నుండగా నగ్న్యాధానమునకు ప్రశస్తమని శ్రీపతివచనము.

శ్లో। యస్యాధానలగ్నస్థం చంద్రేవాభృగునందనే ।
ఉషై తితస్యజాతోగ్నిర్నిర్వాణం సతతంజ్వలేత్ ॥ ౬ ॥
పంచాంగశుద్ధిదివసే చంద్రతారాబలాన్వితే ।
చంద్రేశుద్ధియుతేలగ్నే చాష్టమోదయవర్జితే ॥ ౭ ॥

తా॥ ఆధానలగ్నమున చంద్రుడునుండరాదు. శుక్రుడు నుండరాదు. చంద్రతారాబలయుక్తమయిన పంచాంగ శుద్ధి దినంబున శుద్ధిగల లగ్నమున ౮ లో గ్రహమును లేనపుడు ఆధానమునకు మంచిదని కశ్యప వచనంబులు.

౧౩౫. ఆధానలగ్నమునుండియాగయోగములు.

శ్లో॥ లగ్నస్థేచాపగేజీవే మేషేవాసప్తకర్మగే ।
కుజేర్కేత్రిషడాయస్థే చంద్రేవాగ్ని జ్వలత్యలం ॥౮॥

తా॥ ఆధానసమయమున—౧ గురుడు ధనుర్లగ్నమయి, ఆలగ్నమందుండుట; ౨ మేషము లగ్నమైదానియందు కుజుడుండుట; ౩ లగ్నమునకు ౭ లో కుజుడుండుట; ౪ లగ్నమునకు ౧౨ లో కుజుడుండుట; ౫ చంద్రుడు ౩ ట నుండుట; ౬ చంద్రు డారింటనుండుట; ౭ చంద్రుడు ౧౧ లో నుండుట; ౮ రవి ౩ లో నుండుట; ౯ రవి ౬ లో నుండుట; ౧౦ రవి ౧౧ లో నుండుట;— ఇట్లు ౧౦ యోగంబులు, వీట్లలో నాధానము చేసినవారు, యజ్ఞయాగాది క్రతువుల నాచరించెదరని కశ్యప వచనము తెలుపుచున్నది.

ఇట్లు ముహూర్తరత్నావళి గ్రంథమునందు.

౮౯ - అగ్న్యాధాన ప్రకరణము.

---

# ముహూర్తరత్నావళిలో
# ౯౦ - రాజాభిషేక ప్రకరణము.



## ౧౩౬. రాజాభిషేకోచిత సమయవిచారము.

శ్లో॥ అథాతస్సం ప్రవక్ష్యామి భూపానామభి షేచనం ।
సౌమ్యాయనేసితేజీవే నాస్తగేనచవృద్ధగే ॥ ౧ ॥

తా॥ ఉత్తరాయణంబునను, గురుశుక్రుల స్తంగతులు కానప్పుడును, వార్ధక్యము నందనప్పుడును రాజాభిషేకము తగునని కశ్యపవచనము.

శ్లో॥ మృతేరాజ్ఞి నకాలస్యనియమోౕత్ర విధీయతే ।
నృపాభిషేకః కర్తవ్యోదైవజ్ఞేన పురోధసా ॥ ౨ ॥

తా॥ ముసలిరాజు పోయినపుడు పుష్కరాదులను కాలాంతర ప్రతీక్ష లో దోషములు సంభవించుపక్షమున, ఏగుణ దోషంబులను విచారించక వెంటనే పట్టాభిషేకము కర్తవ్యమై యుండునని దైవజ్ఞమనోహరవచనము

౧౩౭. పట్టాభిషేకసమయగ్రహ స్థితివిచారము.

శ్లో॥ మూలత్రికోణ స్వగృహోచ్చమిత్ర ।
గృహస్థితైర్వాపితదంశసంస్థైః ॥
శుభేవిలగ్నేసతతం గ్రహేంద్రాః ।
దిశంతిలక్ష్మీం విపులాంచకీర్తిం ॥ ३ ॥
స్వనీచగైశ్శత్రుగృహస్థితైశ్చ ।
తదంశసంస్థైః స్వగృహోపగైర్వా ॥
పాపోదయేశోకభయంత్వకీర్తిం ।
దిశంతిరాజ్ఞాం భృశమంతరాయం ॥ ४ ॥

తా॥ శుభలగ్నమునందు మూలత్రికోణంబులలోనో మిత్రక్షేత్రంబుల లోనో స్వక్షేత్రంబులలోనో ఉచ్ఛక్షేత్రంబులలోనో తుదకు తత్తదంశ లలోనో గ్రహములందఱును బలిష్ఠులై యుండగా పట్టాభిషేకము జరిగితే గ్రహంబులు మహాసామ్రాజ్యమును విస్తారమయిన కీర్తిని కాపాడుచుందు

రు. అట్లు, లేక దానికి వ్యతిరిక్తముగా నీచ శత్రుక్షేత్ర గతులో తదంశ స్థితులో అయ్యుండినను; లగ్నమున పాపగ్రహమున్నను; రాజులకు విఘ్నంబును అపకీర్తిని దుఃఖభయంబును కలుగజేయుదురని వసిష్ఠ వచనంబులు పలుకుచున్నవి.

శ్లో॥ అథానజన్మేశదశాధినాథ ।
రవీందుభౌమేజ్యసితైర్బలిష్ఠైః॥
ఉత్పాతదోషాది వివర్జితేషు ।
పదంస్థిరం స్యాచ్చనరాధిపానాం ॥ ౫ ॥

తా॥ పట్టాభిషేక లగ్న జన్మలగ్నముల కధిపతులును, జాతకమున నుసరించి తత్కాల దశావిదశాధిపతులును, రవి చంద్రాంగారక గురువులును, బలవంతులై యుండగా; ఉత్పాతాది దోషంబులు లేని సమయమునందు; పట్టాభిషేకము జరిగి నారాజ్యపదవి స్థిరముగా నుండుననియును వసిష్ఠ వచనము.

శ్లో॥ త్రికోణకేంద్రద్రత్రిధనేషు సౌమ్యైః ।
త్రిషష్ఠలాభత్రుంగతైశ్చ పాపైః ॥
షష్ఠాష్టలగ్న వ్యయవర్జితేన ।
చంద్రేణరాజ్ఞాం శుభదోభిషేకః ॥ ౬ ॥

తా॥ లగ్నమునకు ౧-౨-౩-౪-౫-౭-౯-౧౦ లో శుభగ్రహంబులును, ౬-౩-౧౧-లో పాపగ్రహంబులును; ౬-౮-౧-౧౨లో చంద్రుడులేకయుం

డుట యనగా తక్కిన స్థానములలో నుండునప్పుడును, రాజులకభిషేకము శుభప్రదంబనియును వసిష్ఠ వచనము.

## ౧౩౮. రాజాభిషేకోచిత నక్షత్రంబులు.

శ్లో॥ ఉత్తరాత్రయమైత్రేంద్ర ధాతృచంద్రకరోడుషు ।
సశ్రుత్యశ్వీజ్యపౌష్ణేషు కుర్యాద్రాజాభిషేచనం ॥ ౭ ॥

తా॥ అశ్విని, పుష్యమి, హస్త, శ్రవణము, ధనిష్ఠ, మృగశిర, చిత్ర అనూరాధ, రేవతి, రోహిణి, ఉత్తర, ఉత్తరాభాద్ర, ఉత్తరాషాఢలు;- ఇవి రాజాభిషేకమునకు సముచితంబులయినవని వసిష్ఠవచనంబు.

## ౧౩౯. దోషగ్రహస్థితిఫలములు.

శ్లో॥ పాపగ్రహైః స్వాంత్యగతైశ్చనిస్వో ।
రోగీ విలగ్నోపగతై ర్భవేత్సః ॥
పదచ్యుతస్స్యాచ్చతుర్థగైస్తు ।
పుత్రస్థితై స్సర్వసుతై ర్విహీనః ॥ ౮ ॥

తా॥ పాపగ్రహములు పట్టాభిషేకసమయమున లగ్నమునకు ౧౨ లో నుండిన దరిద్రుండగును. లగ్నమందుండిన రోగముగలవాడగును. ౪-౨ లో నుండిన రాజ్య పద భ్రష్టుండగును. ౫లో నుండిన పుత్రులు లేకయో పుత్రులచే చెడ నాడ బడియో దుఃఖించు ననియును వసిష్ఠవచనము.

## ౧౪౦. సంపత్ స్థైర్యకర యోగములు.

శ్లో॥ యస్యాభిషేకే ఘృరుహూతమంత్రీ ।
లగ్నేత్రికోణేయది వా భవేత్సః ॥
షష్ఠేకుజఃకర్మగతశ్చ శుక్రః ।
సమోద తేవిక్ర మలాజ్యలక్ష్మ్యా ॥ ౯ ॥

తా॥ గురుడు ౧-౫-౯ లోనుండి, ౬ లో కుజుండు నుండి ౧౦ లో శుక్రుడునుండి ఆలగ్నమున పట్టాభిషేకమునందిన మహారాజు అఖండ సామ్రాజ్యముతో మహాపరాక్రమశాలియై యొప్పుచుండును. అని వసిష్ఠ ప్రోక్త యోగమిదియొకటి.

శ్లో॥ త్రిలాభస్థశ్శనిస్సూర్య శ్చతుర్థేవాంబరే గురుః ।
యస్యాభిషేకః క్రియతేతత్రతస్య మహీస్థిరా ॥ ౧౦ ॥

తా॥ ౩ లోనూ ౧౧లోనో సూర్యుడును శనియును; ౪ లోనూ ౧౦లోనోగురుండును; ఉండగా పట్టాభిషేకము జరిగిన నారాజునకు సామ్రాజ్యముస్థిరము గానుండునని కశ్యపప్రోక్తయోగమిదియొకటి.

ఇట్లు, ముహూర్త రత్నావళిలో.

౯ వ - రాజాభిషేక ప్రకరణంబు.

---

# ముహూర్తరత్న వల్లిలో.

## ౧౦వ. యాత్రా ప్రకరణము.

### ౧౮౧. యాత్రాస్వరూప విచారము.

శ్లో॥ పరవిషయే విజయార్థం ।
గంతు ర్యాత్రాతు సమరవిజయాఖ్యా ॥
నిఖిలాపరయాత్రాయా ।
స్సామాన్యాసా భవేద్ద్వివిధా ॥ ౧ ॥
కథితతిథివాసరర్క్షే ।
ష్వభిమతఫలదా భవేచ్చ సామాన్యా ॥
సమరాహ్వాయాచ యాత్రా ।
యోగవిలగ్నక్షితి శయోగేషు ॥ ౨ ॥

తా. శత్రుదేశమునందు జయముకొఱకై పోవువాని యాత్రకు విజయయాత్రయని పేరు. తక్కిన సమస్తయాత్రలకును సామాన్యయాత్రయని పేరు. ఇట్లు యాత్రయనగా ప్రయాణమనునది రెండు తెఱంగులుగానున్నది. ఇందు సామాన్యయాత్రయనునది ప్రయాణవిషయమై సంహితలలో చెప్పంబడిన తిథివార నక్షత్రంబులలో నిష్టఫలప్రాప్తి గల్గును. ఇంక విజ-

యయాత్రయనుది నృపుని యోగంబులంబట్టియు, ప్రయాణవిషయకంబగు సంహితలలో చెప్పంబడిన విశేష యోగంబులం బట్టియును తత్కాలలగ్నబలంబు ననుసరించియును గ్రాహ్యముగానున్నది. అని వసిష్ఠవచనంబులు.

## ౧౮౨. రాజప్రయాణ ముఖ్యత్వము.

శ్లో॥ సుగుణయుతానాంరాజ్ఞాం ।
కథయామి విధాన మత్రయాత్రాయాం ।
జాతక మవలోక్య వదే ।
త్ఫలసిద్ధిస్తవన్యథా మృషా భవతి ॥ ౩ ॥

తా. శత్రువులు తప్ప తక్కిన సమస్తప్రాణులకును రాజు హితుడగుటచేత నృపునికి చెప్పబోవు సమస్త శుభాశుభ సముదాయంబు సకల శిష్ట సంమతంబగుటవలన తద్విధానము ఈయాత్రాప్రకరణంబున చెప్పంబడుచున్నది, అయిన జాతకము నవలోకించి, ప్రయాణ కాలౌచిత్య ఫలంబులను చెప్పందగును. లేనిచో సంతయు దుర్బలమగుననియు వసిష్ఠవచనము.

## ౧౮౩. ప్రబలయాత్రలలో విశేషము.

శ్లో॥ తస్మాన్నృపః కుసుమపుష్పఫలాగ్రహస్తః ।
ప్రాప్తః ప్రణమ్య రవయే హరిదిఙ్ముఖస్థః ॥
హోరాంగశాస్త్రకుశలాన్హితరిణశ్చ ।
సంగృహ్యదైవగణ కాన్సకృ దేవపృచ్ఛేత్ ॥ ౪ ॥

శ్లో॥ అథనృపతిసమీపే దైవవి త్పృష్టయాత్రః ।
ఫలముదయనిమిత్తై స్తర్కయేచ్ఛాస్త్రదృష్ట్యా ॥
సదసిసదితివాచ్యం యద్యపిస్యాదనిష్టం ।
స్ఫుటమపికథనీయం మంత్రిణేభూభుజేవా ॥ ౫ ॥

తా. అందువల్లననిన, రాజకీయ దుష్టాదుష్ట ఫలంబులు ప్రాణులకంటకీకిని పట్టునుగాన, సందర్భము వచ్చినప్పుడు రాజైనవాడు తూర్పుగా కూర్చుండి ఫలపుష్పంబులను చేతబూని సూర్యునికి నమస్కరించి, ఆప్తలును గణితజ్ఞులును హోరాశాస్త్రము నందు నేర్పరులును అగు వారిని పిలుపించి, ఒకేమారు ప్రశ్నజేయనగును. పిమ్మట దైవజ్ఞుండైనవాడు యాత్రము రాజసన్నిధిలో శాస్త్రలక్ష్యముచేత లగ్నాది నిమిత్తంబులలో ఫలమును చక్కగా నూహింపవలయును. అయితే ఒకవేళ అనిష్టఫలమున్నను సభలోనంతయు బాగుగా నున్నదని పలుకనగును. రాజుతోనైనను మంత్రితోనైనను యథార్థవిషయము రహస్యముగా నెఱుకజేయ వలయును. అనివరాహ మిహిరవచనము. (ఇప్పటికి నిట్టిపద్ధతులు గ్రంథములలో నెఱుంగవలసివచ్చె. ఎచ్చటనైనను దైవజ్ఞులున్నను రాజులు నవరాగరికులై, కలివైభవమున చిక్కిపోవుటచేత జీర్ణమంగే సుభాషితంబన్నట్లు విద్యలు నశించుచువచ్చె. కావున నివిమొదలగు విశేష విచారముజూపు శాస్త్రవచన సముదాయంబును ఇప్పుస్తకమున విపులంబుగా వ్రాయుట మాని; లోకుల కుపయోగించుటకు తగినంత సంగ్రహింపంబడి యున్నది.)

## ౧౮౮. జాతకానుగుణ ముహూర్తము ఫలకారి.

శ్లో॥ జన్మరాశౌ లగ్నగతే తదీశేవాపిలగ్నగే ।
అభీష్టఫలదా యాత్రా రాశీశశ్చేచ్ఛుభగ్రహః ॥ ౬ ॥

జన్మలగ్నే లగ్నగతే తదీశేవాపిలగ్నగే ।
అర్థలాభప్రదాయాత్రా లగ్నేశశ్చేచ్ఛుభగ్రహః ॥ ౭ ॥

జన్మరాశివిలగ్నాభ్యాం లగ్నేవోపచయేగృహే ।
సంపూర్ణఫలదాయాత్రా తదైవవిజయప్రదా ॥ ౮ ।

తా. ఎవఁడు ప్రయాణము చేయవలయునో, వాని జననకాలమున చంద్రుడుండెడు రాశిజన్మ రాశియనఁబడును ; ఆజన్మరాశియే ప్రయాణలగ్నమైనను ; ఆజన్మరాశ్యధిపతి ప్రయాణలగ్నమునందున్నను ; ఆగ్రహము శుభుఁడుగానుండిన నయ్యాత్ర యిష్టార్థము నిచ్చునదియగును. మఱియును; జన్మకాలమునందలి లగ్నమే ప్రయాణలగ్నమైనను; ఆలగ్నేశుఁడు ప్రయాణలగ్నమునందున్నను; ఆలగ్నపతిశుభగ్రహముగా నుండినయెడల ఆప్రయాణము లాభమునిచ్చును. మఱియును ; జన్మరాశికిగాని జన్మలగ్నమునకుగాని ప్రయాణలగ్నము ఉపచయమనగా మూడవ రాశిగానుండిన నాప్రయాణము విజయప్రదంబుగా సంపూర్ణఫలము నిచ్చుననియును వసిష్ఠవచనంబులు. (జన్మకాలకుండలి లేనప్పుడు ప్రశ్నకాలముమీఁద శుభాశుభ పరిజ్ఞానము చెప్పఁబడినది) అది ప్రశ్నరత్నావళిలో గ్రాహ్యము.

౧౭౫. రవినిఁబట్టి ప్రయాణోత్తమ మధ్యమాధమంబులు.

శ్లో॥ యాత్రాజసింహాతు రగోపగతేవరిష్ఠా ।
మధ్యాళనైశ్చరబుధోశన సాంగ్ర్యషేషు ॥
భానాకులీరఝష వృశ్చికగేతిదీర్ఘా ।
శస్తస్తుదేవలమతేఽధ్వనిపృష్ఠగోఽర్కః ॥ ౯ ॥

తా. సూర్యుడు మేష సింహ ధనుస్సులలోనుండగా చేయుప్రయాణంబు శ్రేష్ఠమైనది; అనగా శుభఫలప్రదంబు. మిథునకన్యా వృషభ తులా మకర కుంభంబులలో రవియుండగా ప్రయాణము మధ్యమంబు; అశుభఫల ప్రదంబుకాదని భావము. కర్కాటక వృశ్చిక మీనంబులలో రవియుండగా నగు ప్రయాణము అతి దీర్ఘంబు; అనిన హీనఫలదాయకంబని భావము. ప్రయాణమున సూర్యుండు పృష్ఠమునందుండుట శుభమని దేవలమతము, అని లల్లాచార్య వచనము.

౧౭౬. పృష్ఠగార్క నిర్ణయము.

శ్లో॥ లగ్నస్థేవరుణాశాం ।
హిబుకస్థేదక్షిణాం రవౌ యాయాత్ ।
సప్తమగే పూర్వాశాం ॥
మేషూరణసంస్థితే సౌమ్యాత్ ॥ ౧౦ ॥

తా. ప్రయాణలగ్నమునందు రవియుండగా పడమటకును; ౪లో సూర్యుడుండిన దక్షిణదిక్కునకును; ౭లో రవియున్న తూర్పునకును;

౧౧లో రవియుంటే ఉత్తరంబునకును; ప్రయాణముం జేయనగునని దేవల వచనము. (ఇచ్చట—౨-౩లోనున్న నైరుత్యమునకును; ౪-౬-లోనున్న ఆగ్నేయంబునకును; ౭-౯లోనున్న ఈశాన్యంబునకును; ౧౧-౧౨లోనున్న వాయవ్యమునకును జననగునని భావంబు.)

౧౩౭. వసిష్ఠోక్త ప్రయాణ తిథిఫలంబు.

శ్లో॥ వళక్షపక్షే ప్రతిపత్ప్రియాణే ।
భంగప్రదా వా నిధనప్రదావా ।
యశస్కరీ భూరిధన ప్రదాచ ।
యా పంచమీ మృత్యుకరీ చ షష్ఠీ ॥ ౧౧ ॥

శ్లో॥ సప్తమీ విజయదా హ్యథాష్టమీ ।
శోకదుఃఖ భయదా మయప్రదా ॥
సర్వదుఃఖ శమనీ యశస్కరీ ।
లాభదాచ దశమీ నిరంతరం ॥ ౧౨ ॥

శ్లో॥ పశుప్రదా మానకరీసుగంధ ।
రక్తాంబరానేక శుభప్రదాస్యాత్ ॥
ఏకాదశీ చిత్ర మృగప్రభూతా ।
ధాన్యాకరాహ్యుత్త మవస్తుదా స్యాత్ ॥ ౧౩ ॥

శ్లో॥ భూరి భూతి నాశినీ । భూరి కర్మ హారిణీ ॥
భూరిభీతి దాయినీ । ద్వాదశీ ప్రభంగదా ॥ ౧౪ ॥

శ్లో॥ త్రయోదశీసు భోగదా । విపక్ష పక్ష నాశినీ ॥
వినాశదాథ పూర్ణిమా । యశః క్షయం కరోత్యమా ॥

తా. శుక్లపక్షమున పాడ్యమిలో ప్రయాణము చంద్రుడతిక్షీణంబుగాన భంగమునిచ్చును ; ఒకవేళ చంద్రుండుదయించకయుండిన మరణమునేఇచ్చును. (“ ప్రతిపత్సు ప్రయాతానాం సిద్ధిరేవ నసంశయః—” పాడ్యమిలో ప్రయాణముచేయువారికి ఉద్దేశములు నెరవేరుచుండును. అనువచనము కృష్ణప్రతిపత్తె నిగ్రహింపనగును విదియ తదియలు మేలనియును చవితిచేటనియును “ షష్ఠ్యష్టమీద్వాదశికా రిక్తామావర్జితాసుచ । యాత్రా శుక్లప్రతిపది నిధనాయభవేదితి ” అనునారద వచనంబు ననుసరించి గ్రాహ్యము.) ఇంక పంచమి ధనకీర్తులనిచ్చును. షష్ఠి మృత్యుప్రదంబు. సప్తమి విజయమునిచ్చును. అష్టమి భయరోగ దుఃఖములనిచ్చును. చవతివలె నవమియును చేటు. దశమి యెప్పుడును దుఃఖములనణచి కీర్తిలాభంబులనిచ్చును. ఏకాదశి పశులాభమును మానరక్షణమును పరిమళవస్త్రంబులను ఇష్టపలుతెఱంగులలో మంచిది. అది చిత్ర మృగశిర నక్షత్రంబులలో నారంభించిన యేకాదశియైనచో మేలయిన వస్తువులనిచ్చును. ఇంక ద్వాదశిలో-పనులుచెడును, సంపదపోవును, అధిక భయమగును, అవమానముగల్గును. త్రయోదశి సుఖ ప్రదమయినది. చతుర్దశి శత్రుపక్షమును ధ్వంసముచేయునట్టిది. పున్నమ నాశకరము. అమావాస్య కీర్తిని నాశముచేయుచుండును.

౧౪౭. ప్రయాణోత్తమాధమమధ్యమ నక్షత్రంబులు.

శ్లో॥ పౌష్ణద్వయాదిత్య కరేజ్యమిత్ర ।
మిందుర్హరి వాసవభాని యాని ॥
శ్రేష్ఠాని యాత్రాసు న వైవభాని ।
ముక్త్వాత్రి పంచాదిమ సప్తమ్యాని ॥ ౧౬ ॥
త్రిస్త్రోత్తరా వారుణనైఋత తేంద్ర ।
పూర్వాత్రయం బ్రహ్మాభయుగ్దశైవం ॥
మధ్యాని నేష్టాన్య నలానిలేశ ।
ద్విదైవచిత్రాహి మఖాంతకాని ॥ ౧౭ ॥

తా. అశ్విని, పునర్వసు, మృగశిర, అనురాధ, పుష్య రేవతి, హస్త, ధనిష్ఠ, శ్రవణము ;—ఈ ౯ నక్షత్రంబులు ప్రయాణమునకు మిక్కిలి ప్రశస్తంబులైనవి ఉత్తర, ఉషా, ఉభా, పూఫ, పూషా, పూభా, మూల శతతార జ్యేష్ఠ, రోహిణి;— ఈ ౧౦ నక్షత్రంబులు మధ్యమంబులు, కృత్తిక, స్వాతి, ఆర్ద్ర, విశాఖ, చిత్ర, ఆశ్రేష, మఖ, భరణి;—ఈ ౮ యును అనిష్టంబులైనవి. ౧-౩-౫-౭ తారలు పనికిరావు. అనివసిష్ఠవచనము.

౧౪౮. వారశూలలు

శ్లో॥ నమందేందుది నేప్రాచీం నవ్రజేద్దక్షిణాం గురౌ ।
సితార్కయోర్న ప్రతీచీంనోదీచీం జ్ఞారయోఽపి ॥౧౮॥

తా. సోమశని వారములలో పూర్వనక్షను; గురువారమున దక్షిణమునకును; భానుశుక్ర వారములలో పడమటకును; మంగళ బుధవారంబులలో నుత్తరమునకును ; శూలవారలు గాన ప్రయాణము తగదని నారదవచనంబు.

## ౧౫౦. నక్షత్ర శూలలు.

శ్లో॥ పురుహూతదిశం పురందరక్షే ।
నైయాద్యామ్యదిశం త్వజాంఘ్రిధిష్ణ్యే ॥
జ్వలనాఖ్యదిశం పితామహర్క్షే ।
శూలాఖ్యాన్యథ సౌమ్యమర్యమర్క్షే ॥ ౧౯ ॥

తా. తూర్పుకు జ్యేష్ఠా నక్షత్రమునాడును ; దక్షిణమునకు పూర్వాభాద్ర నాడును ; రోహిణినాడు పశ్చిమమునకును ; ఉత్తర ఫల్గుని నాడు ఉత్తరంబునకును; నక్షత్ర శూలలు గావున ప్రయాణము తగదని వసిష్ఠవచనము.

## ౧౫౧. శూలఫలములు.

శ్లో॥ శూలసంజ్ఞానిధిష్ణ్యాని శూలసంజ్ఞాశ్చ వాసరాః ।
యాయినాంమృత్యుదా శ్శీఘ్రమథవాచార్థహానిదాః ॥

తా. పైశూల నక్షత్రములనాడును వారములనాడును ప్రయాణము చేసితే మరణముతప్పదు ; ఒకవేళ ప్రబల శుభయోగముండి తప్పినను ధననష్టము తప్పదని వసిష్ఠవచనంబు.

## ౧౫౨. వారశూల పరిహారంబు.

శ్లో॥ సూర్యవారేఘృతం ప్రాశ్యంసోమవారే పయస్తథా ।
గుడమంగారకేవారే బుధవారే తిలానపి ॥ ౭౧ ।
గురువారేదధి ప్రాశ్యం శుక్రవారేయవాగపి ।
మాషాన్ భుక్త్వాశనేర్వారే గచ్ఛన్ శూలేనదోష భాక్॥
తాంబూలం చందనం మృచ్ఛపుష్పం దధిఘృతంతిలాః ।
వారశూల హరాణ్యర్కా ద్దానాద్ధారణతోఽదనాత్ ॥

తా. భానువారమున నెయ్యిని, సోమవారమున పాలును, మంగళవారమున బెల్లమును, బుధవారమున నూగులను, గురువారమున పెరుగును, శుక్రవారమున గంజిని, శనివారమున మినుములను. భుజించిపోవుటలో శూలదోషము భాధించదు. మఱియు భానువారాదిగా, తాంబూలము చందనము మృత్తిక పుష్పము పెరుగు నెయ్యి తిలలు ; వారశూల పీడా పరిహారముగా దానంబులంజేసి, దేహమున ధరించియును తినియునుదోష పరిహారంబగునని గురువచనంబు.

## ౧౫౩. నక్షత్రంబులకు పూర్వాహ్ణాది కాల విశేషము.

శ్లో॥ స్థిరసాధారణదిష్ణైః పూర్వాహ్ణేనైవగమనం సత్ ॥
గమనంనదారుణక్షైః । దినదళసమయే నకార్యమశుభంస్యాత్ ॥ ౭౨ ॥ క్షిప్రైర్నాపరవాసర । సమయే

మృదుభిర్న రాత్రిముఖే । ఉగ్రైర్నిశిసమయే ।
చరధిష్ణ్యైరుషసి నశ్రేష్ఠం ॥ ౨౫॥

తా. పూర్వాహ్ణమున ధ్రువనక్షత్రంబులలోను మిశ్రనక్షత్రంబుల లోను; మధ్యాహ్నమున తీక్ష్ణనక్షత్రంబులలోను; అపరాహ్ణంబున క్షిప్రనక్షత్రంబులలోను; రాత్రిలో నుగ్రనక్షత్రంబులలోను; ఉషఃకాలమున చరనక్షత్రంబులలోను; రాజప్రయాణము తగదని వసిష్ఠవచనములు.

౧౫౮. ఆవశ్యకమున నక్షత్ర త్యాజ్య ఘటికలు.

శ్లో॥ నిషిద్ధేష్వపిభుక్షేషు త్యక్త్వాదుష్టఘటీః క్రమాత్ ।
తదన్యాఘటికాగ్రాహ్యా అవశ్యగమనేసతి ॥ ౨౬ ॥
భరణ్యాంసప్తఘటికా వహ్నిభేచైక వింశతిః ।
ఏకాదశఘటీః పిత్ర్యే త్రిపూర్వాసుచ షోడశ ॥ ౨౭ ॥
స్వాతీసార్పవిశాఖాసు జ్యేష్ఠాయాంచచతుర్దశ ।
వర్జయేచ్ఛేషఘటికాయాతు శ్శుభఫలప్రదాః ॥ ౨౮ ॥

తా॥ ప్రయాణమునకుతగని నక్షత్రంబులలో నావశ్యకముగాచేయవలసిన ప్రయాణము తటస్థించినపుడు, ఆనక్షత్ర ప్రమాణఘటికలలో ఈచెప్పబోవు ఘటికలనువదలి తక్కిన ఘటికలలో ప్రయాణముచేసిన నదిశుభఫలప్రదంబుగానుండును. ఎట్లనిన;— భరణిలో ౭ గడియలు; కృత్తికలో ౨౧ గడియలు; మఖలో ౧౧ గడియలు; పుబ్బపూర్వాషాఢ పూర్వాభాద్ర

లలో ౧౬ గడియలు; స్వాతిఆశ్లేషవిశాఖజ్యేష్ఠ వీట్లలో ౧౪ గడియలు, మొదటినుండిత్యాజ్యంబులు. తక్కినవిమంచివి.

౧౫౫. రాహుస్థితిచే మృతజీవ పక్షఫలము.

శ్లో॥ రాహుస్థితర్క్షంతస్యాస్యం పుచ్ఛంపంచదశంతతః ।
తదేవ కేతుర్విజ్ఞేయం సదారాహుః ప్రతీపగః ॥ ౨౯ ॥
త్రయోదశచదేయాని ధిష్ణ్యాన్యుభయ పార్శ్వయోః।
ముఖభాగామ్మృతేగ పక్షో జీవపక్షస్తు పృష్ఠగః ॥ 30 ॥

తా॥ రాహువేనక్షత్రమున నుండునో ఆనక్షత్రము రాహుముఖనక్షత్రమనంబడును. దానికి ౧౫వ నక్షత్రము పుచ్ఛనక్షత్రంబు. అదియే కేతువనంబడును. ఎప్పుడునురాహువు వెనుకకుసంచరించువాఁడు. ఇరుగెలంకులలోను ౧౩ దేసినక్షత్రంబులు, అనగాముఖ భాగంబున ౧౩ మృతపక్షంబనియును. పుచ్ఛభాగంబున ౧౩ జీవపక్షంబనియును గ్రహింపవలయునని వసిష్ఠవచనంబులు. ఇఁకవీటిఫలమును స్వరోదయగ్రంథము తెలుపుచున్నది. ఎట్లనిన;—

శ్లో॥ జీవపక్షేక్షపానాథే మృతపక్షేరవౌతథా ।
తస్మిన్ కాలేశుభాయాత్రా విపరీతాతు హానిదా ॥ 3౧ ॥
చంద్రాదిత్యౌయదాహ్యాక్తౌ జీవపక్షేవ్యవస్థితౌ ।
తత్రపక్షే మంజయోలాభోయాత్రాకాలేనసంశయః॥ 3౨॥

మృతపక్షేయథాకాలే సంస్థితౌ చంద్రభాస్కరౌ ।
తదాహానిర్భయంభంగంమృత్యుర్యాత్రాఫలంమతం ॥

తా॥ జీవపక్షమునందు చంద్రుండున్న, మృతపక్షంబున రవియున్నం డగాచేసెడు ప్రయాణము శుభకరము. జీవపక్షమునరవియును, మృతపక్షమునచంద్రుండునుండగాచేయుప్రయాణము హానినిచ్చును. మఱియు; చంద్రసూర్యులిరువురును జీవపక్షమునసే ఉండినయప్పటి ప్రయాణంబు క్షేమప్రదము, లాభమునిచ్చును, జయకరంబునగును. అట్లే ఇరువురును మృతపక్షంబుననుండినచో నప్పటి ప్రయాణము భయాపజయమృత్యు ప్రదంబై యుండునని ఫలంబు.

## ౧౫౬. అకులకులాకుల చక్రము.

శ్లో॥ ద్వితీయాదశమీషష్ఠీకులాకులముదాహృతాః ।
విషమాఅకులాస్సర్వాః శేషాశ్చతిథయః కులాః ॥ ౩౪॥
రవిశ్చంద్రోగురుస్సౌరిశ్చత్వారోప్యకులామతాః ।
భౌమశుక్రాకులాఖ్యాచబుధవారః కులాకులః ॥ ౩౫ ॥

శ్లో॥ వారుణార్ద్రాభిజిన్మూలం కులాకులముదీరితం ।
కులానిమాసధిష్ణ్యాని శేషభాన్యకులానితు ॥ ౩౬ ॥
తిథావారేచనక్షత్రే అకులే యాయినోజయః ।
కులంక్షేస్థాయినో జ్ఞేయస్సంధిశ్చైవ కులాకులే ॥ ౩౭ ॥

తా. విదియ-దశమి-షష్ఠి-ఇవి ३ను కులాకులంబులు. १-३-५-७-९-११-१३-१५ ఇవియున్ను అకులంబులు. తక్కిన ४-८-१२-१४-३० ఇవికు లంబులు. ఇట్లే, రవిచంద్రగురు శనివారంబులునాల్గును అకులంబులు. అం గారకశుక్రవారంబులు కులంబులు. బుధవారము కులాకులంబు. ఇట్లే, శత తార, ఆర్ద్ర, అభిజిత్తు, మూలము, ఇవినాల్గును కులాకులంబులు, చిత్ర విశాఖ జ్యేష్ఠ ఉత్తరాషాఢ శ్రవణము ఉత్తరాభాద్ర అశ్విని. కృత్తిక మృ గశిర పుష్యమి మఖ ఉత్తరఫల్గుని- ఇవి१०ను కులంబులు. తక్కినవిఅకులం బులు. అనిసంకేతము నెఱుంగనగును. వీటికిఫలంబేమనిన— అకుల తిథి యందును అకుల వారమునను అకులనక్షత్రమునందును ప్రయాణముచేయు వారికి జయము. కులతిథివారక్షణంబులలో ప్రయాణము యథాస్థితంబు- కులాకులంబులలో సంధిగల్గునని యిదిరాజ ప్రయాణవిషయము.

१५८. పథిరాహు చక్రము.

శ్లో॥ తిష్యాశ్వాహివిశాఖాశ్చమైత్రం శతభిషగ్వసుః ।
ఏతానినక్షత్రబుక్షాణి ధర్మమార్గేని యోజయేత్ ॥ ३८ ॥
అజపాదమఘాస్వాతీ యామ్యజ్యేష్ఠాః పునర్వసుః ।
శ్రవణంసప్త తారాశ్చధనమార్గే ప్రకీర్తితాః ॥ ३९ ॥
అహిర్బుధ్న్యభిజిన్మూల భగత్వాష్ట్రార్ద్రకృత్తికాః ।
ఏతావత్యస్సప్తతారాః కామమార్గేవ్యవస్థితాః ॥४०॥

విధీందువిశ్వ హస్తాశ్చఉత్తరావారి పౌష్ణకాః ।
సప్తసంఖ్యాకబుక్షాణిముక్తి మార్గేవ్యవస్థితాః ॥ ४१ ॥
సూర్యేధర్మగతేచంద్రోధనే మోక్షేశుభప్రదః ।
సూర్యేధనగతే విత్తమోక్షమార్గే శుభశ్శశీ ॥ ४२ ॥
కామేర్కే ధర్మమోక్షార్థేసంస్థశ్చంద్రో జయప్రదః ।
మోక్షేరౌ ధర్మగశ్చంద్రః శుభోన్యత్రనశోభనః ॥ ४३॥

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| ధర్మమార్గం | అశ్వి | పుష్య | ఆశ్లే | విశా | అనూ | ధని | శత |
| అర్థమార్గం | భర | పున | మఖ | స్వా | జ్యే | శ్రవ | పూభా |
| కామమార్గం | కృకా | ఆర్ద్రా | పూఫ | చిత్ర | మూ | అభి | ఉభా |
| మోక్షమార్గం | రో | మృగ | ఉఫ | హస్త | పూషా | ఉషా | రేవ |

తా॥ ఈపైనచక్రమునందుదానోరించియుండునట్లు నక్షత్ర స్థితినిసెతింగి, వాటిలో సూర్యుడు ధర్మమార్గనక్షత్రంబులలలో నుండగా, చంద్రుడు అర్థమోక్షమార్గంబులలో నుండినను; రవిఅర్థమార్గమునందుండగా, చంద్రుడు అర్థమోక్షమార్గంబులలో నుండినను ; రవి కామమార్గంబున నుండగా. చంద్రుడు ధర్మమోక్షార్థ మార్గంబులలో నుండినను, రవిమోక్షమార్గంబుననుండగా, చంద్రుడుధర్మ మార్గంబుననుండినను ; జయమునుశుభమును ప్రయాణముచేసిన వారందగలరు. దీనికివ్యతిరేకముగా నుండిన శుభఫలదంబుగానుండదని పథిరాహుచక్రఫలము ఆదియామళప్రోక్తంబు.

౧౫౭. ప్రయాణమునకు తిథిచక్రము.

శ్లో॥ మాసేశుక్లాదికేపాషే తిథిఃప్రతిపదాదితః ।
ద్వితీయాద్యాస్తుమాఘేస్యుః తృతీయాద్యాస్తుఫాల్గునే ॥
ఏవంచాన్యేషుమాసేషు తిథ్యోద్వాదశసంజ్ఞకాః ।
లేఖ్యాశ్చక్రేత్రయోదశ్యాంసంవిహాయతిథిత్రయం ॥౪౫॥
తృతీయాదిత్రయేతత్ర త్రయోదశ్యాదికేఫలం ।
యానేప్రాచ్యాదికాష్ఠాసు వక్ష్యేద్వాదశధాక్రమాత్
సౌఖ్యంశూన్యంధనార్తిశ్చలాభోఽలాభోభయంధనం ।
కష్టంసౌఖ్యంకలిర్మృత్యుఃశూన్యఃప్రాచ్యాంఫలంక్రమా
త్ ॥ ౪౬ ॥క్లేశోనైస్వ్యంవ్యథాసౌఖ్యం ద్రవ్యాప్తిర్గా
భపీడనం । సౌఖ్యంలాభఃకష్టసిద్ధిఃలాభస్సౌఖ్యంతుదక్షి
ణే ॥ ౪౭ ॥ భయంనైస్వ్యంప్రియార్తిశ్చభయంద్ర
వ్యంమృతిర్ధనం । క్లేశాల్లాభోర్థసిద్ధిఃస్వం లాభోమృత్యు
శ్చపశ్చిమే ॥ ౪౮ ॥ ధనంమిశ్రంధనంలాభః సౌఖ్యంలా
భః సుఖంసుఖం । కష్టంద్రవ్యత్వశూన్యత్వ కష్టముత్త
రదిక్ఫలం ॥ ౫౦ ॥ *

---

*ప్రక్క పుటలోని చక్రమే వీటికర్థమును తెలుపు చున్నది.

# ప్రయాణ తిథిచక్రము.

| సౌష | మాఘ | ఫా | చై | వై | జ్యే | ఆషా | శ్రా | భా | ఆశ్వ | కా | మార్గ | పూర్వం | దక్షిణం | పశ్చిమం | ఉత్తరం |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| ౧ | ౨ | ౩ | ౪ | ౫ | ౬ | ౭ | ౮ | ౯ | ౧౦ | ౧౧ | ౧౨ | సౌఖ్యం | క్లేశం | భీతిః | లాభః |
| ౨ | ౩ | ౪ | ౫ | ౬ | ౭ | ౮ | ౯ | ౧౦ | ౧౧ | ౧౨ | ౧ | శూన్యం | నిస్వం | నిస్వం | మిశ్రఫలం |
| ౩ | ౪ | ౫ | ౬ | ౭ | ౮ | ౯ | ౧౦ | ౧౧ | ౧౨ | ౧ | ౨ | నష్టం | దుఃఖం | లాభః | అర్థః |
| ౪ | ౫ | ౬ | ౭ | ౮ | ౯ | ౧౦ | ౧౧ | ౧౨ | ౧ | ౨ | ౩ | లాభః | సౌఖ్యం | భయం | లాభః |
| ౫ | ౬ | ౭ | ౮ | ౯ | ౧౦ | ౧౧ | ౧౨ | ౧ | ౨ | ౩ | ౪ | అలాభః | లాభః | ధనలాభః | సౌఖ్యం |
| ౬ | ౭ | ౮ | ౯ | ౧౦ | ౧౧ | ౧౨ | ౧ | ౨ | ౩ | ౪ | ౫ | భయం | లాభః | మృత్యుః | లాభః |
| ౭ | ౮ | ౯ | ౧౦ | ౧౧ | ౧౨ | ౧ | ౨ | ౩ | ౪ | ౫ | ౬ | ధనం | కష్టం | లాభః | సుఖం |
| ౮ | ౯ | ౧౦ | ౧౧ | ౧౨ | ౧ | ౨ | ౩ | ౪ | ౫ | ౬ | ౭ | కష్టం | సౌఖ్యం | లాభః | సుఖం |
| ౯ | ౧౦ | ౧౧ | ౧౨ | ౧ | ౨ | ౩ | ౪ | ౫ | ౬ | ౭ | ౮ | సౌఖ్యం | లాభః | అర్థసిద్ధిః | కష్టం |
| ౧౦ | ౧౧ | ౧౨ | ౧ | ౨ | ౩ | ౪ | ౫ | ౬ | ౭ | ౮ | ౯ | క్లేశం | సిద్ధిః | ధనం | ద్రవ్యం |
| ౧౧ | ౧౨ | ౧ | ౨ | ౩ | ౪ | ౫ | ౬ | ౭ | ౮ | ౯ | ౧౦ | మృత్యుః | లాభః | లాభః | శూన్యం |
| ౧౨ | ౧ | ౨ | ౩ | ౪ | ౫ | ౬ | ౭ | ౮ | ౯ | ౧౦ | ౧౧ | శూన్యం | సౌఖ్యం | మృత్యు | కష్టం |

తా॥ ప్రక్కలోనిచక్రమునందు మొదటిబంతిలో మాసనామంబులు. మతిదిగువ — లు, పిదప క్రిందనుండెడు సంఖ్యలు పాడ్యమిమొదలు ద్వాదశిపర్యంత తిథులను తెలుపును. దిక్కులక్రిందివి వాటిఫలంబులు. ౧౩ త్రయోదశి, ౧౪ చతుర్దశి, ౧౫ పున్నములకు-౩ తృతీయ, ౪ చవితి, ౫ పంచమికిచెప్పిన ఫలములనే గ్రహించునది. ప్రయాణసమయమున మాసమును తిథిని పోవుదిక్కును ఎఱింగి దానికి వీనిలో చూపియుండెడు ఫలంబులను తెలియవచ్చును. ఇదిగోరక్షసిద్ధుని కాలఫలవిచారముగానున్నది. గౌరీపంచాగమువలెనిదియునొక్కటి. దేనిని నమ్మినవానికి దాని ఫలముతప్పక గల్గుచుండును. (ఆవశ్యకసమయం బుననిద్రిగాహ్యంబని ముహూర్తచింతామణి.)

## ౧౫౯. సర్వాంకజ్ఞానము.

శ్లో॥ తిథివారంచ నక్షత్రం సంయుక్తం స్థాపయే త్త్రిధా।
ద్వాభ్యాంరామై స్తథా వేదైర్గుణయిత్వాథతద్భవైః॥
భాజితంచాష్టమునిభి స్తథాద్విగుణ పావకైః।
ఆదిశూన్యే భవేత్పీడా మధ్యశూన్యే మహద్భయం॥
అంత్యశూన్యే మహద్ధాని స్సర్వశూన్యే నజీవతి।
సర్వాంకే విజయోరాజ్ఞో ధనలాభో రిపోర్వధః ॥ ౫౩ ॥

తా॥ అత్యావశ్యకంబుగా రాజప్రయాణము సంఘటించినపుడు తిథిసంఖ్యను వారసంఖ్యను నక్షత్రసంఖ్యను ఈ మూడింటినికలిపి; మూడు ప్రతులుగావ్రాసి మొదటివానిని రెంటిచేతను, రెండవదానిని మూటిచేతను,

మూడవదానిని ౪ చేతనుగుణించి; మొదటిదానిని ౮ చేతను, రెండవదానిని ౭ చేతను, మూడవదానిని ౬ చేతను, భాగించితే: మొదటిదానిలో శేషముశూన్యమైనచో పీడగల్గును. రెండవది శూన్యశేషమైనచో మహాభయము, మూడవదిశూన్యశేషమైనచో మహత్తైనహానిగల్గును. మూడును శూన్యశేషంబులైనచో బ్రతుకడు. మూడింటిలోను శేషాంకములున్నట్లయిన శత్రుజయముధనలాభముగల్గును. అని దైవజ్ఞమనోహరమున చండేశ్వరవచనంబులు. (ఇది యాకస్మికరాజ ప్రయాణావసరంబునగల్గిన రాజ ప్రయాణాదికశుభాశుభసూచకంబని యెఱుంగనగును.)

## ౧౬౦. అడల భ్రమణఫలములు.

శ్లో॥ చంద్రాధిష్ఠితభాంతమేవ గణయేదర్కాన్వితర్క్షాదితో।
నక్షత్రాణ్యపిసప్త సప్తగమనేదద్యుః ఫలంసాభిజిత్ ॥
క్షేమంతాడనమార్తిమాయురభయం దేశభ్రమంతాడనం।
యాతుశ్చాడలదోష ఏవసకలేకార్యేచచింత్యోథవా ॥

తా॥ సూర్యుడున్న నక్షత్రము మొదలు అభిజిన్నక్షత్రముతో గూడియుండునటుల చంద్రుడుండెడు నక్షత్రమువరకు నేడేసినక్షత్రములుగణింపవలయును; ౨౮ నక్షత్రంబులకును ౭ వంతున నాల్గుఖండములగును. ఏఖండములోనైననుసరియె వరుసగా నేడింటికిని అడలభ్రమణఫలంబులు చెప్పంబడినవి, ౧ క్షేమము; ౨ ప్రహారము; ౩ మనఃపీడ; ౪ ఆయుర్వృద్ధి; ౫ భయరాహిత్యము; ౬ దేశసంచారము; ౭ తాడనము; ఇట్లు ప్ర

యాణకాలంబున చూచికొనవలయునని కాలామృతవచనము, అన్ని సంగతులలోను చూడవచ్చుననియు సూచింపంబడినది.

## ౧౬౧, యాత్రాలలాట ఫలము.

శ్లో॥ ప్రాచ్యాది ప్రభవోర్క శుక్ర కుజరాహ్వార్కేందు విట్సూరయో । యద్దిగ్రాజిహితద్దిగుక్తగృహగే తాం తాం దిశం న వ్రజేత్ ॥ ప్రాగాదిక్రమశోఽ ప్రదక్షిణవిధా భానుప్రవిష్టాలయా । ద్విత్ర్యేకం ద్వితయం విదిక్షు మృతికృద్యాత్రాలలాటంత్విదం ॥ ౫౫ ॥

తా॥ తూర్పుదిక్కు మొదలు వరుసగా ప్రదక్షిణక్రమంబున రవి శుక్ర కుజ రాహు శని చంద్ర బుధ గురువులు అధిపతులు. కావుననే దిక్కునకు నెవడు రాజో వాఁడు ఆదిక్కుననుండగా నాదిక్కుకు ప్రయాణముచేయరాదు. దాని నెఱుంగుట యెట్లనిన— సూర్యుఁడుండెడురాశినితూర్పునందు భావింపనది. అదిమొదలు ఈశాన్యమున ౨రాసులు; ఉత్తరమున ౧, వాయవ్యమున౨, పశ్చిమమున ౧, నైఋత్యము౨, దక్షిణమున ౧౨ ఆగ్నేయమున ౨; ఇట్లు ౧౨ రాసులను స్థాపించికొననగును. ఈరాశిసంస్థ అప్రదక్షిణముగా చెప్పంబడినది. పిదప, తూర్పుకు సూర్యుడధిపతిగాన నాదిక్కునకు ఆరాశిలో ప్రయాణముచేయరాదు. పిదప ౨ రాసులలో గురుడుండిన పక్షమున నారాసులలో నీశాన్యమునకు పోరాదు. పిదప ౪ వ రాసి ఉత్తరముగాన నారాశిలో బుధుడుండిన నా దిక్కునకు

ప్రయాణముతగదు. పిదప ౫-౬ రాసులు వాయవ్యమగాన వాటిలో చంద్రుండుండిన నాదిక్కునకు పోరాదు. పిదప ౭ వ రాశి పశ్చిమము గాననందు శనియుండిన నాదిక్కునకుం జనదగదు. పిదప ౮-౯ రాసులు నైరుత్యముగాననందు రాహువున్న నాదిశంజనందగదు. పిదప ౧౦ వరాశి దక్షిణముగాన నందుకుజుండుండిన నాదిక్కునకు ప్రయాణము చేయరాదు. పిదప ౧౧-౧౨ వరాసులు ఈశాన్యముగాన నీశాన్యాధిపతి శుక్రుడచ్చట నుండగా నీశాన్యదిక్ప్రయాణము మంచిదికాదు. అనిభావము. దీనికియాత్రా లలాటంబనిపేరు.

ఈవిషయమున — "శ్లో॥ లగ్నస్థోభాస్కరః ప్రాచ్యాం దిశియాతుర్లలాటగః । ద్వాదశైకాదశే శుక్ర ఆగ్నేయ్యాంతులలాటగః ॥ దశమస్థః కుజోలగ్నా ద్యామ్యాయాంతులలాటగః । నవమాష్టగతో రాహు ర్నైరుత్యాంతు లలాటగః ॥ లగ్నాత్సప్తరుగస్సౌరిః ప్రతీచ్యాంతులలాటగః । షష్ఠపంచమగశ్చంద్రో వాయవ్యాంచలలాటగః ॥ చతుర్థస్థానగస్సౌమ్యఉత్తరస్యాంలలాటగః । ద్విత్రిస్థానగతో జీవఐశాన్యాంతులలాటగః । లాలాటిదిక్ప్రతింత్యక్త్వా జీవితేప్సుర్వ్రజేన్నృపః ॥" — అనునారదసంహితావచనంబులంబట్టి లగ్నమునసూర్యుడుండగా తూర్పునకును, ౧౨-౧౧లో శుక్రుండిన నాగ్నేయమునకును, ౧౦లో కుజుడుండిన దక్షిణమునకును, ౮-౯లో రాహువుండిన నైరుత్యముకును, ౭లో శనియుండిన పడమరకును, ౬-౫లో చంద్రుడుండిన వాయవ్యమునకును, ౪లో బుధుడుండినను త్తరంబునకును, ౩-౨లో గురుడుండిన నీశాన్యమునకును జీవితాశగల

నృపుడు ప్రయాణము చేయరాదని యర్థము చక్కగానున్నది. ఇచ్చట కాలామృతవచనము "శీతుర్థభవనే సూర్యాత్ క్షమిసితౌ భవతః కథం" అను వరాహవచన ప్రకారముగా దోషయుక్తమగును. కావున నీనారదముని వచనములయర్థము సమాదరణీయంబై యుండును.

## ౧౬౨. యాత్రాఫణి చక్రఫలము.

శ్లో॥ త్రీణిత్రీణిశశిస్థభాంతగణనా కాద్యార్కసంస్థోడుతః ।
పంచస్వర్వివమాణిరోగభయదాన్యన్యానిచత్వారితు॥
యుగ్మాన్యేవసదిష్టదాని తదిదం యాత్రాఫణేర్యత్ఫలం ।
కిం చక్రేణఫణిస్వరూపమశుభం త్యాజ్యంశుభేకర్మణి ॥

తా॥ ప్రయాణముచేయువారు సూర్యుడుండెడు నక్షత్రము మొదలు చంద్రుడుండెడు నక్షత్రమువరకు మూడేసివంతున గణనము చేయవలయును. ఇట్లుచేయుటలో ౨౭ నక్షత్రంబులకును ౯ త్రికంబులగును. వాటిలో దేనిలో నైనను చంద్రుడుండునుగదా? ఈత్రికంబులలో ౧-౩-౫-౭-౯ ఈఐదు మత్రికంబులలో చంద్రుడున్నపుడు ప్రయాణముచేసిన రోగభయముగల్గునని యును; ౨-౪-౬-౮ ఈత్రికంబులలో చేరిన నక్షత్రంబులలో చంద్రుడున్నపుడు చేసినప్రయాణము ఆరోగ్యసుఖకరంబనియును యాత్రాఫణి చక్రఫలంబుస్పష్టముగా కాలామృతకారులచే చూపంబడినది.

## ౧౬౩. చంద్రగర్భఫలము.

శ్లో॥ ఆగ్నేయ ఋక్షమఘానురాధవసుభేష్వేకైకభాత్స్వాభిజి ।
న్నక్షత్రాణిచసప్తసప్తగమనేదద్యుః ప్రయాతుఃఫలం ॥

మృత్యువ్యాధిభయార్థరాశివసుధాభీత్యామయాఖ్యం క్ర
మాత్ । కించర్క్షేణతు చంద్రగర్భఫణితం త్వేతన్మయా
నిశ్చితం ॥ ౫౭ ॥

తా॥ కృత్తికమొదలు ఆశ్లేషవరకును, మఖమొదలు విశాఖవరకును, అనూరాధమొదలు అభిజిత్తుతోఁకూడ శ్రవణమువరకును, ధనిష్ఠమొదలు భరణివరకును. ఏడేసినక్షత్రంబులు వరుసగానీఫలంబులను ప్రయాణకాలమున నివ్వదగియున్నవని చంద్రగర్భఫలము తెలియజెప్పంబడినది. ౧ మృత్యువును; ౨ వ్యాధిని ; ౩ భయమును ; ౪ ధనరాశిని ; ౫ భూమిని; ౬ భీతిని ; ౭ రోగమును ; కలుగజేయునని భావము.

## ౧౬౪. చంద్రగర్భ విశేషసూచనము.

శ్లో॥ రోగేకుజస్థనక్షత్రాద్యుద్ధేచ పురుషర్క్షతః ।
యాత్రాయాంకృత్తికాదిస్స్యా దర్కస్థాచ్ఛుభకర్మణి ॥

తా॥ పైనచెప్పినట్లే యాత్రాకాలమునందు కృత్తికాదిగాచంద్రుడుండెడునక్షత్రమునననుసరించి ఏడుఫలంబులు చెప్పంబడినవి. రోగమువచ్చియున్నప్పుడు చంద్రగర్భమును చూడవలయుననిన కుజుడుండెడు నక్షత్రము మొదలు చంద్రుడుండెడు నక్షత్రమువరకు నెంచి వరుసగానాయేడేసి ఫలంబుల నెఱుంగనగును. యుద్ధకాలమున స్వజన్మనక్షత్రమునుండి చంద్రుడున్ననక్షత్రమువరకు నెంచవలయు. అట్లే తక్కిన సకలశుభకర్మలయందును సూర్యుడుండెడు నక్షత్రమునుండి చంద్రాధిష్ఠితనక్షత్రమువరకు గణనంబని యెఱుంగనగును. అని మునివచనసంమతిగలదు.

## ౧౬౫. ఘాతచంద్రవిచారము.

శ్లో॥ భూపంచనందా యమషడ్దిశశ్చ ।
వహ్న్యద్రివేధావసురుద్రసూర్యాః ॥
మేషాదికానాం క్రమశోభవంతి ।
యాత్రాసుయుద్ధేషు చఘాతచంద్రః ॥ ౫౯ ॥

శ్లో॥ యుద్ధేచైవవివాదేచ కుమారీపూజనేతథా ।
రాజసేవావాహనాదౌ ఘాతచంద్రంవివర్జయేత్ ॥౬౦॥
తీర్థయాత్రావివాహాన్న ప్రాశనోపనయాదిషు ।
మాంగల్యసర్వకార్యేషు ఘాతచంద్రంనచింతయేత్ ॥

తా. ప్రయాణలగ్నము మేషమైన లగ్న చంద్రుడును, వృషభమైన మకర చంద్రుఁడును, మిథునమైన కుంభ చంద్రుఁడును, కరాటకమైన సింహ చంద్రుఁడును, సింహమైన మకర చంద్రుఁడును, కన్యయైన మిథున చంద్రుఁడును, తులయైన ధనుశ్చంద్రుఁడును, వృశ్చికమైన వృషభ చంద్రుఁడును, ధనుస్సయితే మీన చంద్రుఁడును, మకరమయితే సింహ చంద్రుఁడును, కుంభమయితే ధనుశ్చంద్రుఁడును, మీనమైతే కుంభ చంద్రుఁడును, ఘాత చంద్రుఁ డనంబడును. అట్లుండగా యుద్ధము వివాదము కుమారీ పూజనము రాజసేవనము వాహనారోహణము మొదలయినవి ప్రయాణంబుతగదని భావము. తీర్థయాత్ర వివాహము అన్నప్రాశనము ఉపనయనము తక్కిన మంగళ కార్యంబులు వీట్లలో ఘాత చంద్రదోషము గణనీయంబు కాదనియును పీయూష సుధాకరోదాహృత వచనంబులు,

౧౬౬. ఘాతతిథి విచారము.

శ్లో॥ గోస్త్రీర్ఝషే ఘాత తిథిస్తుపూర్ణా।
భద్రానృయుక్కర్కటకేథ నందా॥
కౌర్పేష్యజయోర్న్మక్రఘటేచరిక్తా।
జయాధనుః కుంభహరా నశస్తాః॥ ౬౨॥

తా. వృషకన్యా మకరంబులలో పంచమీ దశమీ పూర్ణిమలును; మిథున కర్కాటకంబులలో ద్వితీయా సప్తమీ ద్వాదశీలును; మేషవృశ్చికంబులలో ప్రతిపత్ షష్ఠ్యేకాదశీ తిథులును; మకరతులలలో చతుర్థీ నవమీ చతుర్దశీ తిథులును; ధనుః కుంభ సింహములలో తృతీయాష్టమీ త్రయోదశీ తిథులును; ఘాత తిథులనంబడును. అనగా నాతిథులయందా లగ్నంబులలో ప్రయాణము అమంగళ ప్రదంబు. అని రామపండితోక్తి.

౧౬౭. ఘాతవారంబులు.

శ్లో॥ నక్రేభౌమోగోహరిస్త్రీషుమంద।
శ్చంద్రోద్వంద్వే రోకజభేజ్ఞశ్చకర్కే॥
శుక్రశ్చకోదండాళి మీనేషుకుంభే।
జీకేజీవ్రోఘాత వారానశస్తాః॥ ౬౩॥

తా. మకరమునకు మంగళవారము, వృషసింహ కన్యలకు శనివారము, మిథునమునకు సోమవారము, మేషమున కాదిత్యవారము, కర్కాటకమునకు బుధవారము, ధనవృశ్చిక మీనంబులకు శుక్రవారము, కుంభ

తులలకు గురువారంబు ఘాత వారంబులుగాన నావారంబులలో నా లగ్నంబులు హానినిచ్చునని ముహూర్త చింతామణి.

౧౬౪. ఘాతనక్షత్రంబులు.

శ్లో॥ మఘాకరస్వాతిమైత్ర మూలశ్రుత్యంబుపాంత్యభం ।
యామ్యబ్రాహ్మేశ సార్పంచమేషాదేర్ఘాతభం నసత్ ॥

తా. మేషమునకు మఖ, వృషభమునకు హస్త, మిథునమునకు స్వాతి, కర్కాటకమునకు అనూరాధ, సింహమునకు మూల, కన్యకు శ్రవణము, తులకు శతతార, వృశ్చికమునకు రేవతి, ధనస్సుకు భరణి, మకరమునకు రోహిణి, కుంభమునకు ఆర్ద్ర, మీనమునకు ఆశ్లేష ;— ఇవి ఘాతనక్షత్రంబులనిన నీ నక్షత్రంబులనాడు ఈ లగ్నంబులలో ననిష్టఫలదంబుకావున ప్రయాణము తగదనియు నచ్చటనే చెప్పంబడినది.

౧౬౫. యోగినీ విచారము.

శ్లో॥ పూర్వస్యాముదయే బ్రాహ్మీప్రథమేనవమేతిథౌ ।
మాహేశీచోత్తరస్యాంతు ద్వితీయాదశమీతిథౌ ॥ ౬౫॥
ఏకాదశ్యాంతృతీయాయాం కౌమారీవహ్నికోణగా ।
చతుర్థీద్వాదశీప్రోక్తా వైష్ణవీనైఋతేతథా ॥ ౬౬ ॥
వారాహీదక్షిణేభాగే పంచమీచత్రయోదశీ ।
షష్ఠీచతుర్దశీచైవ ఇంద్రాణీ పశ్చిమేతథా ॥ ౬౭ ॥

పూర్ణిమాయాం చ సప్తమ్యాం వాయవ్యే చండికోదయః।
నష్టచంద్రదినాష్టమ్యా మఐ హాలక్ష్మీశ్శివాలయే ॥ ౧౮ ॥
పృష్ఠతో దక్షిణే వాసి యోగినీగమనే హితా।
వామసంముఖయోర్నేష్టా వాయుమేవం విచింతయేత్ ॥
యత్రోదయగతా దేవీ తతో యామార్ధభుక్తిగా।
భ్రమంతీ తేన మార్గేణ భవేత్తత్కాలయోగినీ ॥ ౨౦ ॥

తా. పాడ్యమి నవమిలలో తూర్పున బ్రాహ్మీ యోగిని యుదయించును. దశమీ ద్వితీయలలో నుత్తరంబున మాహేశ్వరీయోగిని యుదయించును. తృతీయైకాదశీ తిథులలో నాగ్నేయమున కౌమారీ యోగిని యుదయించును. చతుర్థీ ద్వాదశీలలో నైరుత్యమున వైష్ణవీయోగిని యుదయించుచున్నది. పంచమీ త్రయోదశీలలో దక్షిణంబున వారాహీ యోగిని యుదయించును. షష్ఠీ చతుర్దశీలలో పశ్చిమంబున నింద్రాణీ యోగిని యుదయించును. సప్తమీ పూర్ణిమలలో వాయవ్యంబున చండికాయోగిని యుదయించును. అమాష్టమీలలో నీశాన్యంబున మహాలక్ష్మీ యోగిని యుదయించును. ప్రయాణము చేయువాఁడు వెనుకప్రక్కను కుడిప్రక్కను యోగిని యుండగా నేదిక్కుకు ప్రయాణము చేసినను శుభము ఘటిల్లును. యోగిని యుండెడు దిక్కునకును యోగిని నెడమప్రక్క నిల్పియును. ప్రయాణము చేసిన ననిష్టమగును. మఱియు; ఈయోగినీదేవి ఏనాఁడు ఎచ్చట నుదయించునో నాఁడు పైనచెప్పిన మార్గము ననుసరించియే ౧½ జామువంతున క్రమముగా దిక్కులలో సంచరించుచుండును. దీనికి కాలయోగిని యని నామము. అనిస్వరోదయమున చెప్పంబడి యున్నది.

౧౭౭. వారయోగినీఫలంబు.

శ్లో॥ ఇంద్రచంద్రేఽగ్నినైరుత్య యామ్యతోయానిలేహరా ।
సూర్యాదిషుచవారేషు వర్జయేద్వారయోగినీం ॥ ౭౧ ॥
జయదాపృష్ఠదక్షస్థా భంగదావామసంముఖీ ।
త్రివిధం యోగినీచక్రమిత్యుక్తం బ్రహ్మయామళే ॥ ౭౨॥

తా. తూర్పునకు రవివారమునందు, ఉత్తరమునకు సోమవారము నందు, ఆగ్నేయమునకు మంగళవారము నందు, నైరుత్యమునకు బుధవారము నందు, దక్షిణమునకు గురువారమునందు, పశ్చిమునకు శుక్రవారమునందు, వాయువ్యంబునకును ఈశాన్యంబునకు శనివారము నందును, ప్రయాణము తగదని వారయోగినీ నిర్ణయమని స్వరోదయమున చెప్పంబడినది. బ్రహ్మయామళోక్తమయిన అర్థయామయోగిని వారయోగిని తిథియోగిని యనుత్రివిధయోగినీలును ప్రయాణమునకు ముఖ్యము.

౧౭౧ కాలపాశ యోగము.

శ్లో॥ రవావుత్తరతఃకాలస్సోమేవాయవ్యభాగకే ।
భౌమేతుపశ్చిమేభాగే బుధేనైరుత్యకోణకే ॥ 23 ॥
జీవేచయామ్యదిగ్భాగే శుక్రేచాగ్నేయకోణకే ।
శనౌతుపూర్వదిగ్భాగే కాలచక్రంప్రకీర్తితం ॥ ౭౪ ॥

తా॥ ర. ఉత్తరమునందు; చం. యవ్వాయమున; కు. పశ్చిమమున; బు. నైరుత్యమున; గు. దక్షిణమున; శు. ఆగ్నేయమున; శ. తూర్పున; వారక్రమమునననుసరించి కాలచక్రగతి రత్నసారమున చెప్పంబడినది.

శ్లో॥ వారోత్థఃపూర్వదిగ్భాగే సతస్సవ్యేనమందగః ।
యత్రస్థస్తత్రకాలస్స్యా త్పాశ స్తస్యైతుసంముఖః ॥
దక్షిణస్థశ్శుభః కాలః పాశోవామదిగాశ్రయః ।
యాత్రాయాంసమరే శ్రేష్ఠ స్తతోన్యత్రనశోభనః ॥

తా॥ కాలచక్రమునకు నేరుగాసంముఖమయ్యుండునది పాశచక్రము అనగా, ర. దక్షిణమున ; సో, ఆగ్నేయమున ; కు. పూర్వున; బు. ఈశాన్యమున ; గు. ఉత్తరమున ; శు వాయవ్యమున ; శ. పశ్చిమమున ; పాశచక్రమనిభావము, అనగా కాలదిక్కునకు శివదిశకు పాశదిక్కునియెఱుంగనగును, ప్రయాణముచేయువారు కాలపాశంబులను సంముఖముగా పెట్టికొని యాదిక్కునకు వెడలరాదు. కాలపాశంబులు ప్రక్కలలోనుండిన బాధకము లేదు. అందులోను కాలముకుడిప్రక్కను పాశము ఎడమప్రక్కను ఉండగాచేయు ప్రయాణము శుభప్రదమని స్వరోదయనిర్ణయము. ఈకాలపాశంబులు "రాత్రౌజ్ఞేయావిలోమతః" అనిచెప్పంబడినందున రాత్రికాలమున నాయావారంబులలో, పాశదిశకు నకాలమును, కాలదిక్కునపాశమును, గ్రహింపనగును.

## ౧౭౨. పరిఘాదండ చక్ర స్వరూపము.

శ్లో॥ అగ్నిధిష్ణ్యాత్సప్తసప్త క్రమాద్ధిష్ణ్యానిపూర్వతః ।
వాయ్వగ్నిదిగ్గతందండంపారిఘంతునలంఘయేత్ ॥ ౭౭॥

తా॥ కృత్తికమొదలు ౭ నక్షత్రములు తూర్పున, మఖమొదలు ౭ దక్షిణమున, అనూరాధమొదలు ౭ నక్షత్రములు పశ్చిమమున, ధనిష్ఠమొద

లు ౭ నక్షత్రములు ఉత్తరమున వ్రాసిన వీటికి పారిఘంబులని పేరు. ఆగ్నేయమునుండి వాయవ్యమువరకు నొకరేఖ ఈశాన్యమునుండి నైరుత్యమువరకు నొకరేఖ వ్రాసినవీటికి దండములని పేరు. ఏదిక్కుననేనక్షత్రములుగలవో ఆనక్షత్రములలో నాదిక్కునకుపోరాదు. ఇది ప్రయాణమున పరిఘాలంఘనమని పేరు. అనికశ్యపవచనము.

## ౧౭౩. విదిగ్గమనవిధి.

శ్లో॥ ప్రాగ్ద్వారికైశ్చనక్షత్రై రాగ్నేయ్యాంశోభనాగతిః ।
దక్షిణస్థైశ్చనైఋత్యాం వాయవ్యాంవారుణైరపి ॥
ఐశాన్యాందిశ్యుదక్సంస్థైః యాత్రాతీవశుభప్రదా ।

తా॥ ఇక నాగ్నేయమూలకు పూర్వపారిఘంబులును, నైఋత్యమునకు దక్షిణపారిఘంబులును, వాయవ్యమునకు పశ్చిమపారిఘంబులును, ఈశాన్యంబునకు నుత్తరపారిఘంబులును యోగ్యనక్షత్రంబులుగాన వాటిలో ప్రయాణము శుభకరమని గురువచనంబుగలదు.

## ౧౭౪. సర్వదిగ్యోగ్య నక్షత్రంబులు.

శ్లో॥ పుష్యార్కాశ్వినమైత్రాణి సర్వదిగ్ద్వారభానిచ ।
సర్వదిక్ష్వపియాత్రాయాం సర్వకామార్థదానిచ ॥౭౯॥

తా॥ పుష్య, అశ్విని, అనూరాధ, హస్త ఈనాల్గునక్షత్రంబులును సర్వదిఙ్నక్షత్రంబులుగాన; వీటిలో నన్నిదిక్కులకును ప్రయాణము ప్రశస్తంబని వసిష్ఠవచనంబుగలదు.

శ్లో॥ పుష్యాశ్విహస్తమైత్రాణి పౌష్ణవైష్ణవసౌమ్యభం ।
వాసవంసర్వదిక్ష్వేషు యాత్రాయాంశోభనానిహి ॥

తా॥ పైనాల్గుగాక, రేవతిశ్రవణ మృగశిరధనిష్ఠలుగూడ అన్నిదిశలకును ప్రశస్తంబులని గురువచనంబు.

౧౭౫. యాత్రకు ఏకార్గళాదులుతగవు.

శ్లో॥ ఏకార్గళహతంధిష్ణ్యం క్రూరాక్రాంతంచవిద్ధభం ।
ఉత్పాతదూషితంయత్తద్యాత్రాయాంభంగదంసదా ॥

తా॥ ఏకార్గళహతనక్షత్రము, క్రూరగ్రహావిద్ధనక్షత్రము, క్రూరగ్రహాక్రాంతనక్షత్రము ఉత్పాతదూషితము;— ఇవి ప్రయాణమునకు తగవనివసిష్ఠవచనము.

౧౭౬. గ్రహవక్రత్వ దోషము.

శ్లో॥ ఏకోపివక్రగఃఖేటోలగ్నస్థోవారిరాశిగః ।
నీచస్థోవాతదంశస్థో యాత్రాఫలవినాశదః ॥ ౮ ॥

తా॥ వక్రగ్రహమొక్కటైనను లగ్నమునందుగాని, ౬వ ఇంటిలోగాని, నీచుండైయున్నను, నీచాంశలోనున్నను, ప్రయాణ ఫలమును నాశముచేయును.

౧౭౭. బలిష్ఠవార వర్గలుశుభము.

శ్లో॥ బలప్రదస్యఖేటస్య వారవర్గశ్శుభప్రదః ।
ఇతరగ్రహవారాది యాత్రాయామశుభప్రదం ॥ ౮ ౩॥

తా॥ బలిష్ఠుడైన గ్రహముయొక్క వారము లగ్నము హోరద్రేక్కాణము నవాంశ ద్వాదశాంశ త్రింశాంశలు ప్రయాణమున శుభఫలదంబులు. దుర్బలగ్రహవారవర్గలు అశుభదంబులని వసిష్ఠవచనము.

## ౧౭౮. యాత్రకు అయనశుద్ధిముఖ్యము.

శ్లో॥ చంద్రార్కౌదక్షిణగతౌయాయాద్యామ్యాంపరాన్ప్రతి।
సౌమ్యాయనగతౌయాయాత్ప్రాచీంసౌమ్యాందిశంప్రతి॥

తా॥ సూర్యచంద్రులుదక్షిణముననుండగా శత్రువులనుద్దేశించి దక్షిణంబునకును, ఉత్తరంబుననుండగా నుత్తరంబులకును, ప్రయాణమునృపులకుతగునని పరాశరవచనంబు.

## ౧౭౯. యాత్రకుసంముఖ శుక్రదోషము.

శ్లో॥ పశ్చాదభ్యుదితేశుక్రే యాయాత్ప్రాచీంతథోత్తరాం ॥
ప్రాచ్యామభ్యుదితే శుక్రేప్రతీచీం దక్షిణాందిశం ॥ ౮౫॥

తా॥ శుక్రుడుపశ్చిమమున నుదయించియుండిన పూర్వమునకునుత్తరంబునకును; పూర్వముననుదయించియుండిన పశ్చిమంబునకును దక్షిణంబునకును ప్రయాణము తగునని వసిష్ఠవచనము.

## ౧౮౦. శుక్రమూఢ సంముఖఫలము.

శ్లో॥ మూఢేశుక్రేకార్యహానిః ప్రతిశుక్రేపరాజయః ॥ ౮౬ ॥

తా॥ శుక్రుడస్తమించియుండగా ప్రయాణము హానినిచ్చును. సంముఖముగా శుక్రునినునచిచేయు ప్రయాణము పరాజయమునిచ్చును. అనినార

దవచనము. అత్యావశ్యకమైనపుడు శాంతివిధి వసిష్ఠసంహితయందు విస్తారముగా గలదు. మఱియు; శుక్రవక్రత్వాదులుకూడతగవనియు, ఇవన్నియు నూతన ప్రయాణమునకును రాజదిగ్విజయ ప్రయాణాదులకు తగినవనియును; విశేషవిషయంబులు మిగులగలవు. గ్రంథవిస్తరమగునని ఇక్కాలమునకు సంగ్రహింపఁబడినది.

### ౧౮౧. ప్రయాణలగ్నశుద్ధి.

శ్లో॥ జన్మరాశౌలగ్నగతే తదీశేవావిలగ్నగే ।
అభీష్టఫలదాయాత్రా రాశీశశ్చేచ్ఛుభగ్రహః ॥ ౮౭ ॥

తా॥ ఎవఁడు ప్రయాణముచేయునో, వానిజాతకమున చంద్రుఁడెక్కినరాశికి అధిపతియైనగ్రహము ప్రయాణలగ్నమునందున్నను. ఆరాశియే ప్రయాణలగ్నమైనను, ఆరాశ్యధిపతి శుభగ్రహంబుగానుండినను, యాత్ర యిష్టఫలము నిచ్చునని వసిష్ఠవచనము.

శ్లో॥ స్వాష్టలగ్నేలగ్నగతే రాశౌవాలగ్నగేసతి ।
యాతుర్భంగోభవేత్తత్ర ద్వాదశేవాథలగ్నగే ॥ ౮౮ ॥

తా. తాను జనించినలగ్నమునకు ౮ వ లగ్నముగాని, జన్మరాశికి ౮ వ రాశిగాని, ౧౨ వ లగ్నముగాని, ౧౨ వ రాశిగాని, ప్రయాణ లగ్నమైన పక్షమున నాప్రయాణము అపజయము నిచ్చునని వసిష్ఠవచనము.

శ్లో॥ పూర్వాదిదిక్షుమేషాద్యాః క్రమాద్దిగ్ద్వారరాశయః ।
దిగ్ద్వారరాశయస్సర్వేతద్దిగ్యాతుశ్శుభప్రదాః ॥ ౮౯ ।

తా. మేషసింహధనస్సులు తూర్పునకును, వృషకన్యా మకరములు దక్షిణమునకును, మిథునతులా కుంభములు పశ్చిమంబునకును, కర్కటవృశ్చిక మీనములు ఉత్తరంబునకును, ఇట్లు తత్తద్దిగ్రాసులు ఆయా దిక్ప్రయాణ యోగ్యలగ్నంబులని వసిష్ఠవచనము.

శ్లో॥ యోగ్రహోజన్మని శుభోయోరాశిర్వేశిసంజ్ఞికః ।
తావుభౌజన్మలగ్నంచయాత్రాయాంశుభదంత్రయం ॥

తా. జన్మకాలములో శుభగ్రహము, వేశిరాశియును, జన్మలగ్నం బును, ఈమూడును ప్రయాణ సమయంబున శుభఫల దంబులని నారదవచ నంబుగలదు.

## ౧౮౨. యాత్రకు సమయబలము.

శ్లో॥ పూర్వాహ్ణేహ్యుత్తరాంగచ్ఛేత్ప్రాచీంమధ్యందినేతథా।
దక్షిణాంచాపరాహ్ణేతు పశ్చిమామర్ధరాత్రికే ॥ ౯౧ ॥
నతత్రాంగారకోవిష్టిః వ్యతీపాతోనవైధృతిః ।
సిద్ధ్యంతిసర్వకార్యాణి యాత్రాయాందక్షిణేరవిః ॥౯౨॥

తా. రవిదక్షిణంబున నుండగా, ఉత్తరమున ప్రొద్దున ౧౦ ఘంట లకు లోపలను, తూర్పునకు మధ్యాహ్నంబునను, దక్షిణమునకు పగలు ౨ ఘంటల పిమ్మటను, పశ్చిమమునకు అర్ధరాత్రిలోను, ప్రయాణము చేసిన సకల కార్యంబులును సిద్ధించును. అపుడు వైధృతివ్యతీపాతవిష్టి మొదలగు దోషంబులును ఏమియును చేయచాలవని వసిష్ఠవచనము.

## ౧౮౩. యాత్రాభిజిత్ప్రాశస్త్యము.

శ్లో॥ అష్టమోహ్న్యభిజి దాహ్వయక్షణో ।
దక్షిణాభిముఖ యానమంతరా ॥
కీర్తితోఽపరకకుప్సుసూరిభి ।
ర్యాయినా మభిమతార్థసాధనే ॥ ౯౩ ॥

తా. ప్రయాణ సమయమున దక్షిణదిక్కు తప్ప తక్కిన దిక్కులకు పగలు ౧౪ గడియల పిదప ౧౬ గడియలవరకు నభిజిన్ముహూర్తము మిక్కిలి ప్రశస్తంబై యిష్టసిద్ధినిచ్చునని శ్రీపతి వచనంబు.

## ౧౮౪. సామాన్యలగ్న గ్రహబలము.

శ్లో॥ కేంద్రత్రికోణగైస్సౌమ్యైస్త్రిభవారిగతైః పరైః ।
అలగ్నరిష్ఫచంద్రేణ యాత్రాభీష్టఫలప్రదా ॥ ౯౪ ॥

తా. ౧-౪-౫-౭-౯-౧౦ ఇండ్లలో శుభగ్రహంబులును, ౨-౩-౬-౧౧ ఇండ్లలో పాపగ్రహంబులునుండగా; లగ్నమునందును పండ్రెండవ యింటిలోను చంద్రుడు లేకయుండగా; ప్రయాణము మంగళప్రదంబని సర్వమునిసంమతంబయినది.

## ౧౮౫. ద్వాదశభావ గ్రహఫలములు.

శ్లో॥ మూర్తిః కోశోధన్వినశ్చ వాహనంమంత్రసంజ్ఞకః ।
శత్రుర్మార్గస్తథాయుశ్చ మనోవ్యాపారసంజ్ఞకః ॥౯౫॥
ప్రాప్తిరప్రాప్తిరుదయా ద్భావాస్స్యుర్ద్వాదశైవ తే ॥

తా॥ ౧ దేహము, (ఇదియే ప్రయాణలగ్నము); ౨ ధన సంచయము; 3 విలుగాండ్రు; ౪ వాహనము; ౫ ఆలోచన; ౬ శత్రు; ౭ మార్గము; ౮ ఆయుస్సు; ౯ మనస్సు; ౧౦ వ్యాపారములు; ౧౧ లాభము; ౧౨ వ్యయము;—ఇట్లు రాజప్రయాణసమయమున భావ వివరణము నెఱుంగవలయునని నారద వచనము. వీటిని సామాన్యముగా నంతటప్రయాణసమయమున తత్తదుచితవిషయ ప్రాబల్యతంబట్టి గ్రహబలము నెఱింగి ముహూర్తము పరికల్పనీయంబై యుండును. ఇక బాదరాయణమునిప్రోక్తలగ్నాది భావస్థితగ్రహఫలంబు లెట్లనిన.

శ్లో॥ రాహ్వర్కాభౌమ దివాకరేందురవిజాః ప్రస్థానలగ్నేగతాః।
క్షుత్తృష్ణాగ్ని విషాయుధజ్వరభవా రోగాశ్చనానావిధాః ॥ జీవస్సోమసుతస్తథైవభృగుజో యాత్రోదయ
స్థోన్నృణాం। సాయాత్రాధనధాన్యభోగ సుఖదాపుణ్యైః
కృతైర్లభ్యతే ॥ ౯౬ ॥

తా॥ ప్రయాణలగ్నమునందు రవి చంద్ర కుజ శని రాహువులున్న పక్షమున ఆకలి దాహము అగ్ని విషము ఆయుధము జ్వరము వీట్లవలన పుట్టెడు నానావిధరోగంబులుగల్గును. మఱి నరులకు నాప్రయాణసమయమున బుధ గురు శుక్రులు లగ్నమునందుండిన నాయాత్రలో ధనము ధాన్యములు భోగములు సుఖములుకలుగును. పుణ్యవంతులగువారికి అట్టి శుభలగ్నంబు లబ్బును.

శ్లో॥ కోశస్థానేనరాణామ సురగురుబుధైశ్శుక్రైర్ధర్మకామార్థలాభం।
పుత్రోత్పత్తించజీవో ధనసుఖమతులం శత్రుపక్షక్ష
యంచ ॥ మందోబంధంసుదీర్ఘం మృతిమవని సుతఃకో
శహానించభాస్వాం । శ్చంద్రఃకుర్యాన్నరేంద్రం ప్రియ
జనసహితంరాహురుత్పాతరూపం ॥ ౯౭ ॥

తా॥ కోశస్థానమనగా లగ్నమునకు రెండవయింటిలోనుండెడే బుధ శుక్రులు నరులకు ధర్మార్థ కామలాభంబుల నిచ్చెదరు. గురుడుండిన పుత్రలాభమును శత్రునాశమును అసమానమైన ధనసుఖలాభమును ఇచ్చును. శనియుండిన దీర్ఘకాలము బంధనమునిచ్చును. అంగారకుండు మృత్యువునిచ్చును. రవి కోశమునుహరించును. చంద్రుడు ప్రియజనుల సహవాసమునిచ్చును. రాహువు కష్టములస్వరూపుడైయుండును.

శ్లో॥ ప్రష్ఠానేభూమిపస్యాక్షితిసుతరవిజౌ తిగ్మభానుశ్చరా
హుః । శుక్రశ్చంద్రాత్మజోవా సురగురురథవాశీత ర
శ్మిర్ధనాయుః ॥ దుశ్చిక్యస్థానసంస్థోగజతురగ రథాన్ప్రా
ప్య సర్వార్థసిద్ధిః । జిత్వాశత్రూనశేషా న్విచరతివసు
ధాగోకులే గోపవేషః ॥ ౯౮ ॥

తా॥ ప్రయాణలగ్నమునకు 3 వ యింటిలో రవి కుజ బుధ శనులుండినను రాహువుండినను శుక్రుడున్నను చంద్రుడున్నను గురుడున్న అప్పుడు యాత్రవెడలిన నప్పుడు శత్రువులనుజయించి సమస్తలాభంబుల

నంది గజరథతురకంబుల్తోడ భూమియందంతట గోవులతోడ శ్రీకృష్ణుఁడు విహరించినట్లు వినోదించును.

శ్లో॥ బంధుస్థాన గతోదదాతివిపులా న్భోగాన్భృగో రాత్మజో । జీవశ్శత్రు వినాశమిచ్ఛతిమహా లాభంకరోతీందు జః ॥ హానింబంధుగతఃకరోతిరవిజో వృద్ధింక్షయంచం ద్రమా । రాహుస్స్వామి సుత స్తథోష్ణకిరణః కుర్వంతి దుఃఖంమహత్ ॥ ౯౯ ॥

తా॥ ప్రయాణలగ్నమునకు నాల్గవయింటిలో శుక్రుడు విస్తారభోగం బులనిచ్చును. గురుఁడు శత్రువినాశనమునిచ్చును. బుధుఁడు అమితలాభము నిచ్చును. శనిహానినిచ్చును. చంద్రుఁడు అభివృద్ధినిక్షయమునుకూడ కలుగ చేయును. రవి కుజ రాహువులు దుఃఖమును కలుగజేయుదురు.

శ్లో॥ కుర్యాదర్థస్య సిద్ధింసుతభవనగతో వాక్పతిశ్శత్రునాశం। శుక్రశ్శీతాంశుపుత్ర స్సురగురుసదృశం యుద్ధకాలేకరోతి॥ సూర్యశ్చంద్రశ్చ భౌమోదినకర తనయ స్సింహికానం దనోఽస్తా । సర్వేతేపంచమస్థా వివిధభయకరాః పార్థి వానాం రణోర్వ్యాం ॥ ౧౦౦ ॥

తా॥ ప్రయాణలగ్నమునకు ౫వ యింటిలో బుధ గురువులు ధనలా భమును అర్థసిద్ధినిచ్చెదరు. శుక్రుఁడు శత్రుజయమునిచ్చును. రవి చంద్ర కుజ శని రాహువులు రాజులకు రణాంగణమున వివిధభయంబుల నొదవిం చెదరు.

శ్లో॥ శత్రుస్థానేనరాణాందినకరతనయోభూమిపుత్ర స్తథార్కః।
శీతాంశుర్దైత్యమంత్రీ రజనికరసుతస్సింహికేయోథజీవః॥
కుర్వంత్యే వార్థలాభం పరబలమథనం సిద్ధిమాప్నోతి
కార్యం। శత్రుఘ్నం భూమిపానాంభవతి హిగమనే
ధర్మ కామార్థసిద్ధిః ॥ ౧౦౧ ॥

తా॥ ఆరవయింటిలో ప్రయాణసమయమున రవ్యాదిసప్తగ్రహంబులును శత్రుజయంబును ధనలాభమును కార్యసిద్ధిని శత్రుహానిని ధర్మకామార్థసిద్ధిని కలుగజేయుదుదు.

శ్లో॥ నాశంశుక్రదివాకరార్కతనయారాహుస్తథాభూమిజః।
క్షిప్రంశత్రు వశంనయంతి పథికం స్థానేస్థితాస్సప్తమే॥
సౌమ్యోమిత్రసమాగమం సురగురుస్త్రీ విత్తలాభం
నృణాం। చంద్రోభీష్టసుఖం దదాతిచధనం యాత్రాసు
జామిత్రగః॥

తా॥ ప్రయాణలగ్నమునకు ఏడవయింటిలోనుండెడు శుక్రుడు రవి రాహు కుజులును త్వరగా ప్రయాణము చేసినవానిని శత్రువశునింజేసి నాశము చేయును. బుధుడుండిన స్నేహితులతోఁజేర్చును, గురుడుండిన స్త్రీ ధనలాభమునిచ్చును. చంద్రుఁడు అభీష్టసుఖమును ధనముల నిచ్చును.

శ్లో॥ ఆరోగ్యంచంద్ర పుత్రో జనయతి భృగుజస్సర్వకామార్థ
సిద్ధిం । జీవోరక్షత్య శేషంసుతమివ జననీ యాత్రికం
నైధనస్థః। చంద్రార్కౌ చేత్తమో వా జనయతి నియతం
శత్రుపక్షస్య వృద్ధిం । భౌమశ్చార్కాత్మజో వా జనయతి
సతతంతస్కరేభ్యో భయంచ ॥ ౧౦౩ ॥

తా॥ ప్రయాణలగ్నమునకు ౮ లోనుండిన బుధుఁడు ఆరోగ్యమును, శుక్రుఁడు సమస్తేష్టలాభమును, గురుఁడు తల్లివలెరక్షణమును, చంద్రసూర్యులుగాని రాహువైనను శత్రుపక్షమున కభివృద్ధిని, కుజశనులు దొంగలచే భయమును, కలుగజేయుదురు.

శ్లో॥ శుక్రోతి సౌఖ్యం నవమో బుధశ్చ ।
జీవోజయశ్రీ ధనధాన్యలాభం ॥
చంద్రార్కసౌరా నవమాస్సభౌమాః ।
కుర్వంత్యనేకా న్పురుషస్య దోషాః ॥ ౧౦౪ ॥

తా॥ ప్రయాణలగ్నమునకు తొమ్మిదింటనుండెడు శుక్రుఁడును బుధుఁడును సౌఖ్యమునిచ్చెదరు. గురుఁడు సంపదను ధనధాన్యలాభమునిచ్చును. చంద్రుఁడు రవి శని కుజుఁడును అనేకదోషంబులను కలుగజేయుదురు.

శ్లో॥ కర్మస్థానస్థితోర్కః ప్రచురజయకరః పుష్టిదశ్శీతరశ్మిః ।
జీవస్సంగ్రామకాలే భవతిశుభకరస్సర్వకార్యప్రదోజ్ఞః ।

శుక్రస్సామ్రాజ్యలక్ష్మీం వితరతిచమహీనందనః ప్రాజ్య
కీర్తిం । రాహుశ్శైవారాపనుత్తిం జనయతిసతతం దీ
ర్ఘరోగంతథార్కిః ॥ ౧౦౫ ॥

తా॥ ప్రయాణలగ్నమునకు ౧౦ లోనుండెడు రవి విశేషజయమును, చంద్రుఁడును గురుఁడును మిక్కిలిశుభమును, బుధుఁడు సకలకార్యలాభమును, శుక్రుఁడు ప్రభుత్వసంపదను, అంగారకుండు గొప్పకీర్తిని, రాహువు శత్రుజయమును, శని దీర్ఘరోగమును, ఇచ్చుచుందురు.

శ్లో॥ శశిబుధగురుశుక్రా స్సూర్యరాహ్వార్కిభౌమాః ।
ప్రజతిహీనరనాథః క్షిప్రమేకాదశస్థాః ।
ద్రుతమిహారిపువర్గం ఘ్నంతినూనంప్రయాతుః ।
విచరతిగజరాజోయుద్ధమధ్యస్థితోవా ॥ ౧౦౬ ॥

తా॥ ప్రయాణలగ్నమునకు ౧౧ లోనుండెడు రవి చంద్ర కుజ బుధ గురు శుక్ర శని రాహువులు, ప్రయాణముచేసినరాజును యుద్ధమధ్యమందున్నవానినైనను గజరాజువలె క్రీడించువానింజేసి జయమునిచ్చుచుందురనిన ౧౧ లో నన్నిగ్రహంబులును మంచిదనిభావము.

శ్లో॥ క్షితిజరవిసుతార్కాస్సైంహికేయోనరాణాం ।
జనయతిరజనీశః క్షేమభృత్యేషుభేదం ॥
రిపుజయధననాశం భృత్యనాశంచకుర్యుః ।
యదబుధగురుశుక్రా ద్వాదశస్థాభవంతి ॥ ౧౦౭ ॥

తా॥ ప్రయాణలగ్నమునకు ౧౨లోనుండెడు కుజ రవి శని రాహువులును చంద్రుడును తనమేలైన సేవకులలో మిత్రభేదమును కలుగజేయుదురు. బుధ గురు శుక్రులు అపజయమును ధననాశమును భృత్యనాశమును చేయుదురు.

## ౧౮౬. త్రివిధనవమీ నిషేధము.

శ్లో॥ ప్రవేశాన్నిర్గమశ్చైవ నిర్గమాచ్చప్రవేశనం ।
నవమేజాతునోకుర్యా ద్దినేవారేతిథావితి ॥ ౧౦౮ ॥

తా॥ ప్రయాణముచేసిన ౯వ దినమునగాని ౯వ తిథిలోగాని ప్రవేశముచేయరాదు. ప్రవేశముచేసిన తొమ్మిదవనాడు మరలనచ్చటనుండి వెడలరాదు. ఎప్పటికినిది నష్టకష్టములనిచ్చునది. దీనికేప్రయాణనవమిప్రవేశనవమిప్రత్యక్షనవమి యని వాడుచుందురు. నవమీప్రయాణము నిషిద్ధము.

## ౧౮౭. నక్షత్ర దోహదము.

శ్లో॥ అలభ్యలభ్యభక్ష్యాన్వాస్మృత్వాస్పృష్ట్వాథతాన్వ్రజేత్
దత్వావాసిద్ధిమాప్నోతి దుష్టభాదీషుభూపతిః ॥ ౧౦౯ ॥

తా॥ రాజు ఆవశ్యకప్రయాణసమయమున నక్షత్రదోషము గల్గియున్నచో నప్పుడు, తన్నక్షత్రోక్తశాంతికర భక్ష్యంబులను భుజించి వెడలిననాదోషములేదు. ఒకవేళ అవి లభించనిచో స్మరించిగాని, స్పర్శజేసిగాని, దానముచేసిగాని వెడలనగునని గురువచనము. కుల్మాషాన్నాది తద్విషయమును నారదసంహితలో నెఱుంగనగును. వీటిని పాటించు నృపులుగదా పరికింపనగును.

## ౧౮౮. వారదోహదము.

శ్లో॥ సూర్యవారేఘృతంప్రాశ్యం చంద్రవారేపయస్తథా ।
గుడమంగారకేవారే బుధవారేతిలానపి ॥ ౧౧౦ ॥
గురువారేదధిప్రాశ్యం శుక్రవారేయవానపి ।
మాషాన్భుక్త్వాశనేర్వారే శూలేగచ్ఛేన్నదోషభాక్ ॥

తా॥ వారశూలలలో ప్రయాణము చేయవలసివచ్చినప్పుడు వరుసగా రవ్యాదివారంబులకు శాంతిగా నెయ్యి పాలు బెల్లము తిలలు పెరుగు యవలు ఉద్దులు వీటిని ఆహారముచేసికొని వెడలిన నాదోషము హరించునని వసిష్ఠవచనము. ఈవిషయము ౧౦౨వ విషయముగా వ్రాయబడియున్నది. అయిన, మునుల సహింతలు ఏకరూపంబులనుటకైకె చూపఁబడె.

## ౧౮౯. దిగ్దోహదము.

శ్లో॥ ఘృతాన్నం కృసరాన్నంచమత్స్యాన్నం ఘృతపాయసం।
పూర్వాదిషుక్రమాద్భుక్త్వాయాతి రాజాజయత్యరీన్ ॥

తా॥ దిగ్దోషము తటస్థించినపుడు నృపుడు, తూర్పుకు నెయ్యివంటకమును, దక్షిణమునకు తులతిలాన్నమును, పశ్చిమమునకు మత్స్యాన్నమును, ఉత్తరమునకు ఘృతపాయసమును, భుజించివెడలిన జయకరంబని భావము. అని వసిష్ఠవచనము.

## ౧౯౦. తిథిదోహదము.

శ్లో॥ అర్కపత్రంభవేద్యాతుః ప్రథమాయాంతుభక్షణం ।
ద్వితీయాయాంభవేద్యాతుః భక్ష్యంసత్తాంధులోదకం ॥

తృతీయాయాంయథాసర్పిః యవాగూస్స్యాత్తతఃపరం।
పంచమ్యాంతద్ధ విష్యంచషష్ఠ్యాం వాకాంచనోదకం ॥
అపూపభుక్తిస్సప్తమ్యా మష్టమ్యాంబీజపూరకం ।
నవమ్యాంతోయపానంస్యా ద్గోమూత్రంతుతతః పరం॥
ఏకాదశ్యాంయవానద్యా ద్ద్వాదశ్యాంపాయసంభవేత్ ।
త్రయోదశ్యాంగుడంలేహ్యం రుధిరంస్యాచ్చతుర్దశే ॥
ముద్గాదనంభవేద్భోజ్యం పంచదశ్యాంయియాసతః ।
పక్షయోరుభయోరేవంయాత్రాయోగేవిధిస్స్మృతః॥

తా. రెండు పక్షంబులలోను ౧౫ తిథులకు వరుసగా తిథిశాంతికంబుగా భక్షణంబులు చెప్పంబడినవి, ౧ అర్కపత్రము; ౨ తండులోదకము; 3 ఆజ్యము ; ౪ గంజి ; ౫ ఘృతాము ; ౬ కాంచనోదకమనిన బంగారు పాత్రలోని నీళ్లనో, గోరోచనోదకమునో ; హారిద్రోదకమునో ; ౭ అపూపములు ; ౮ మాదీఫలము ; ౯ జలప్రాశనము ; ౧౦ పంచితము ; ౧౧ గోధుమలు ; ౧౨ పాయసము ; ౧3 బెల్లము ; ౧౪ రక్తము ; ౧౫-30 లలో పులగము ; అని బృహస్పతి వచనము.

## ౧౯౧. శుభ శకునములు.

శ్లో॥ ప్రజ్వలాగ్నిశ్చతురగ నృపాసనపురాంగనాః ।
గంధపుష్పాక్షతచ్ఛత్ర చామరాందోళికాగజాః ॥౧౧౮.
భక్ష్యేక్ష్వంకుశమృష్టాన్న మధ్వాజ్యదధిగోవృషాః ।
మత్స్యమాంససురాధౌత వస్త్రిశంఖరవధ్వజాః॥౧౧౯

పణ్యాస్త్రీపూర్ణకలశ రత్నభృంగారదర్పణం ।
భేరీమృదంగపటహాశంఖ వీణాదినిస్వనాః ॥ ౧౨౦.
వేదమంగళఘోషాస్సుస్య ర్యానేవై కార్యసిద్ధిదాః ।
కార్యసిద్ధిర్భవేద్ద్రష్ట్యే శవేరోదనవర్జితే ॥ ౧౨౧.

తా. మండెడు నిప్పు, గుఱ్ఱము, సింహాసనము, ఊరినారులు, గంధము, పుష్పములు, అక్షతలు, ఛత్రము, చామరములు, పల్లకి, ఏనుగ, భక్ష్యములు, చెఱుకు, అంకుశము, అన్నము; తేనె, నెయ్యి, పెఱుగు, ఎద్దు, మత్స్యము, మాంసము, మద్యము, చలవబట్టలు, శంఖధ్వని, ధ్వజములు, లంజలు, పూర్ణకుంభము, రత్నములు, అద్దములు, మంగళ వాద్యములు, వేదఘోషణము, ఏడ్పులేనిశవము; ఇవి ప్రయాణ సమయమున కార్యసిద్ధి కరంబులగు వస్తువులు అని నారద వచనములు.

## ౧౯౨. అశుభ శకునములు.

శ్లో॥ ఔషధక్లీబబధిరై ర్జటిలోన్మత్తపావకైః ।
అభ్యక్తాంగారకాష్ఠాస్థి చర్మాంధచిరరోగిభిః ॥ ౧౨౨.
తైలకార్పాసలవణగుడ తక్రత్రృణోరగైః ।
పంకకుబ్జైకపదకముక్త కేశబుభుక్షితైః ॥ ౧౨౩.
సనగ్నముండై ర్ద్రష్టస్తు యాత్రానైవఫలప్రదా ।
ప్రవేశేరోదనయుతశ్శవ స్స్యాత్తుశవప్రదః ॥ ౧౨౪.
శాఖామృగోలూకకానాం దర్శనంశబ్దితంతథా ।
శశసూకరగోధానాం యాంతుఃకార్య వినాశనం ॥ ౧౨౫.

 ముహూర్త రత్నావళియందు.

తా. మూలికలు, చెవిటి వాఁడు, కుంటివాఁడు, జడలు దాల్చిన వాఁడు, వెఱ్ఱివాఁడు, నిప్పు, నూనంటు కొన్న వాఁడు, రగులు చుండు కట్టెలు, ఎముకలు, చర్మములు, గ్రుడ్డి, దీర్ఘరోగి, నూనె, ప్రత్తి, ఉప్పు, బెల్లము, మజ్జిగ, కసవు పాము, బురద, పొట్టి తలవిరియ బోసినవాఁడు, ఆకలిగొన్న వాఁడు, దిగంబరుఁడు, క్షౌరము చేసికొన్నవాఁడు, ఇవి కను పడెనేని ప్రయాణమున ఫలముకాదు. ప్రవేశమున పీనుగపడి యేడ్చు చుం డుటను చూచినయట్లే శవలాభము నిచ్చును, కోతిగూబలు కనుపడినను కూసి నను కార్యహాని. కుందేలుపంది ఉడత ఇవిగూడ కార్యహాని నిచ్చును. అని కశ్యపవసిష్ఠవచనంబులు ఇట్లే, ఇంకయును ప్రయాణలగ్నము ననుసరించిగల్గు శుభాశుభ శకునంబులు మొదలగునవి విస్తారముగా శకున శాస్త్రంబున సుప్రసిద్ధంబులు; గ్రంథ విస్తరముచే నిచట సంక్షేపింపంబడి యున్నది.

"యదాహిశకునంపశ్యే ద్విపరీత ముపస్థితం । సఘృతం కాంచనం దత్వానిర్విశంకస్సుఖం వ్రజేత్" అపశకునమయినపుడు, అత్యావశ్యక ముగా వెడలవలసి యున్నచో హిరణ్యముతోఁడ ఘృతదానముంజేసి నిర్భయ ముగా వెడలవచ్చునని రత్నమాలలోను; "జాతేవిరుద్ధేశకునే ఝ్వనీనో । వ్యావృత్యకృత్వాకర పాదశౌచం ॥ ఆచమ్యచ క్షీరతరోరధస్తాత్। తిష్ఠే త్ప్రపశ్యేచ్ఛకునాంతరాణి" అపశకునమైన వెనుకకుతిరిగి చేతులుకాళ్లు కడిగి ఆచమనంబుజేసి, పాలచెట్టుక్రింద శుభశకునమును నిరీక్షింపుచు నివసిం తనరాజవచనము. ఇట్లు సంగ్రాహ్య విషయంబులు అపారంబులు.

## ౧౯౭. కార్యనిర్ణయము.

శ్లో॥ సమస్తగుణసంపదాం నఖిలులబ్ధిరల్పైర్గుణైః ।
గుణప్రచురతా తతో బహుమతాచదోషాల్పతా ॥

నభూరిగుణసంచయే ప్రభవతీహ దోషోల్పకో ।
హ్యుదర్చిషిహుతాశనే సలిలబిందురేకో యథా ॥౧౬౬

తా. క్రొద్ది దినంబులలో సకలగుణ సంపూర్ణంబగు సుముహూర్తము దుర్లభముగదా ? కావున గుణబాహుళ్యముగల్గి దోషము అల్పముగానుండెడు ముహూర్తము గ్రాహ్యము. ఎక్కువ గుణములున్నపుడు అల్ప దోషములు ఏమియును చేయవు. ఎట్లనిన జ్వలించుచుండెడు అగ్నియందు నీటి చుక్కలవలె పోవును. అని శ్రీపత్యాచార్య వచనము.

మంగళము.

శ్లో॥ యశ్శివో నామరూపాభ్యాం యాదేవీసర్వమంగళా ।
తయోస్స్మరణమాత్రేణ సర్వదాజయమంగళం ॥ * ॥

తా. ఏభగవంతుండు రూప నామంబులతో మంగళాత్మకుండో, ఏదేవత సర్వమంగళాంబయని సుప్రసిద్ధురాలో ; ఆదంపతుల స్మరణమాత్రము చేత జయంబును మంగళంబును గల్గుచుండును.

సమస్త సన్మంగళానిభవంతు, సర్వేజనా స్సుఖినోభవంతు. ధర్మోవర్ధతు.

ఇట్లు శ్రీమత్సిద్ధాంతి శివశంకరశాస్త్రి పుత్రుండైన శ్రీ సుబ్రహ్మణ్య శర్మచే సంగ్రహించి వ్రాయంబడిన ఆంధ్రతాత్పర్య వివరణముతో సమేతంబయిన ముహూర్త రత్నావళిలో ౧౦ వ యాత్రా ప్రకరణము, సర్వంబును సమాప్తము.

శ్రీకాలాత్మకుండగు లోకాక్షుండు ప్రసన్నుడగు గాత.